# కాశీమజిలీ కథలు

| | | |
|---|---|---|
| 1 వ భాగము | వరప్రసాదుల కథ | 20_0 |
| 2 వ భాగము | అదృష్టదీపుని కథ | 20_0 |
| 3 వ భాగము | మందారవతి కథ | 20_0 |
| 4 వ భాగము | విజయభాస్కరుని కథ | 20_0 |
| 5 వ భాగము | శంకరుని కథ<br>కాదంబరీ మహాశ్వేతల కథ | 20_0 |
| 6 వ భాగము | భోజుని కథ | 20_0 |
| 7 వ భాగము | విభీషణుని కథ | 20_0 |
| 8 వ భాగము | దత్తకాదుల కథ | 20_0 |
| 9 వ భాగము | విక్రమార్కుని కథ | 20_0 |
| 10 వ భాగము | నారదుని కథ | 20_0 |
| 11 వ భాగము | ప్రహ్లాదుని కథ | 20_0 |
| 12 వ భాగము | పుండరీకుని కథ | 20_0 |

శ్రీ ర స్తు

శ్రీ విశ్వేశ్వరాయనమః

# కాశీమజిలీకథలు

## రెండవభాగము

ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే

రచింపబడినది

పుట్టగుంట వీరయ్యా చౌదరి
అరండల్ పేట : : విజయవాడ - 2
చే ప్రచురింపబడినది

 1983 [వెల : రూ. 20-00



# కాశీమజిలీ కథలు
## రెండవ భాగము

అదృష్టదీపుని కథ

రచన :

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

ముఖచిత్రం :

బాపు

ప్రచురణ :

జనవరి : 1988

ముద్రణ :

విజయశ్రీ ప్రింటర్సు,

విజయవాడ - 8.

ప్రతులకు :

డీలక్స్ పబ్లికేషన్స్

విజయవాడ-2

వెల : రూ. 20-00

నా సహాధ్యాయి మధిర సుబ్బన్న దీక్షితకవి సర్వవిధముల ధన్యుఁడని వ్రాయుటకు మిగుల సంతసించుచున్నాను. అతఁడు నాతో మును మున్ను కొన్ని గ్రంథములు గౌతమీ మాహాత్మ్యము లోనగునవి. వ్రాసియుండియు నిపుడు కాలాను సారముగాఁ గథలు వ్రాయుటకుఁ బ్రారంభించినాఁడు. చిన్నతనములో నబ్బురపోకకుఁ జెప్పుకొను కథలను బుచ్చుకొని "కాశీమజిలీలు" అను పేరుతోఁ జమత్కరించి కథా సంవిధానముం జతపఱచి మొదటి భాగమచ్చొత్తించి ప్రకటించినాఁడు. అది ప్రజల మదులనాకర్షించినది. ద్వితీయ తృతీయాది భాగములు వ్రాయుటకు బ్రోత్సాహము గలిగించినది. ఇప్పటికి పన్నెండు భాగములైనవి. నేనీ కథలను పూర్ణముగఁ జదువ లేదు గాని యే భాగములోనో యొకటి రెండు కథలు మాత్రము చదివితిని. అది చదివినప్పుడు నాలో నాకే పరమాశ్చర్యము గలిగినది. నా సహాధ్యాయి విషయము నేను జెప్పుట కొంతవరకు దగదేమోకాని పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ కథకుం బోలె మనోహరత్వముం గలిగించినది. ఇట్లు నాబోట్లు వ్రాయుటకుం బూని కృత కృత్యులుగా లేరనియే నా నిశ్చయాభిప్రాయము. ఒక్కొక్క పురుషున కొక్కొక్క దానిలోఁ బ్రావీణ్యము గలుగుననుట నిశ్చయము. వాని కథ లుపకథలతోఁగూడి యొక పెద్దగొలుసువలె మనోహరములై యుండును. ఆ కథలలో ననేక నీతులు, ధర్మములు, ఆచారములు, శృంగారాదిరసములు, అధ్యాత్మావబోధక ప్రదర్శనములెన్నో యుండును. ఇవి సర్వజనాదర పాత్రములగుటయే నా చెప్పిన మాటలు సత్యములను టకుఁ దార్కాణమగుచున్నవి. గద్యశైలియు సుబోధమై పండితపామర హృద్యంబగు చున్నయది. ఈ కథలు బృహత్కథాదులవలె జగద్విఖ్యాతి గాంచుఁగాకయని కోరు చున్నాను.

ఇట్లు,

**శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి**

బ్రహ్మశ్రీ పండిత మధిర సుబ్బన్న దీక్షిత కవిగారిచే రచియింపబడిన కాశీమజిలీ కథలు చదివి యానందించితిని. మృదుమధుర శైలిగలిగి నీతిబోధకములగు పద్యములతో నొప్పుచు బండితపామరజన మనోహరమై తగు నీ కథల విషయమై యభిప్రాయమీయ మే మనస్థలమయ్యు దత్కథాపఠన సంజాత హర్షాతిశయమే యిట్లు వ్రాయుటకుఁ బ్రోత్సాహపరచినది.

ఈ కథలు ప్రారంభించిన తరువాత నెంత పనిలోనున్నను చివరవరకు చదివినంగాని విడువకపోవుటయే యిందలి రసాధిక్యము ప్రఖ్యాతమగు చున్నది. ఇందులకు లోకమే ప్రమాణము. వీని కథలని సామాన్యముగాఁ దలంపరాదు. శంకరాచార్యాది మహాపురుషుల చరిత్రములిందు వర్ణింపబడుటచే నిదియొక పురాణగాథా కోశమని చెప్పుట సమంజసము. ఈ కథ లాంధ్రయోషకు నూత్నభూషా విశేషములై యొప్పుచున్నవని రూఢిగా చెప్పుచున్నాను.

ఇట్లు,

**కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారావు**

కొలఁది దినములనాఁడు దయాపూర్వకముగ నొసంగిన కాశీమజిలీలు అను పేరుగల భవద్విరచిత గ్రంథము నాకొసఁగుచు దీనిని జదివి యభిప్రాయమును దెలుపవలసినదియని సెలవిచ్చియున్నారు. తదేకదృష్టితో దమగ్రంథము నందలి కొన్ని కథలను జదివితిని. అవి కేవలము కథలవంటివేకాక వ్యాకరణాదిశాస్త్ర సాంప్రదాయము నందేమి యలంకారాదుల యందేమి మన ప్రాచీనకావ్యముల కించుకయుఁ దీసిపోక పాఠకులకు మంచి సాహిత్యజ్ఞాన మలవఱచుటకుఁ గడుంగడుఁ దగియున్నట్లు గ్రహింపఁగల్గితిని.

ఇట్లు,
**శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి**

“కథావినోదమేయని మహర్షులు దాని జతుష్షష్టి విద్యలలో బరిగణించి యనుశాసించి అభివృద్ధి పరచిరి. ఇట్టి కథావినోదము వినోదమాత్ర ఫలజనకముగాఁ ధర్మాదిసాధనోపాయ మహత్తరంబగుట సర్వజనవేద్యమే.

కాశీమజిలీకథా నిబంధనము సర్వజన చిత్తాకర్షకంబగుటకును సందియము లేదు దీనిలో రసాభావ పుష్టియు గథాసంధాన కౌశల మట్లుండ జతుర్విధ పురుషార్థ తంబులగు మహాకవి వాఙ్మయములోని నవరత్నముల సాధారణ కథా కథనధోరణిలో వెదజల్లబడి యుండుటచే నివి పండితులకును, గావ్యకర్తలకును గూడ బ్రతిభోన్వేషణ క్షమంబులని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇందు బారమార్థికులకు దప్ప సామాన్యులకు రుచింపని శంకరాచార్య చరిత్రము లతిరమంతిములుగా బరమార్థబోధకంబు లగు కథాధోరణిగా గూర్పబడినవి.”

విశ్రాంతి చింతావినోదులకు జన్మజీవన తరణోపాయంబగు తీయనియౌషధంబువలె నుండు నీ గ్రంథరాజమెంత పెద్దదిగానున్నను విసుగులేక యుత్తరోత్తర సంపుటముల కెల్లరును వేచియుందురని నిశ్శంసయముగా జెప్పవచ్చును.

ఇట్లు,
**మానవల్లి రామకృష్ణకవి** *M.A.*

"శ్రీమత్పండిత మధిర సుబ్బన్న దీక్షితుల వారిచే రచింపఁబడిన "కాశీ
మజిలీకథ" లను పేర నొప్పు కథాసమూహ మింత కాంధ్రదేశమంతయుఁ జక్కఁగా
నెఱింగినదే కావున నేను ప్రశంసింపవలసిన యావశ్యకత లేదు. ఆ గ్రంథముల కిడిన
కేవలనామము సహితము మనకుఁ బవిత్రమైన భావమును హృదయమున నుత్పాదింపఁ
జేయుటయేకాక పూర్వకాలమున రాకపోకలకు మనకువలె సౌలభ్యములు లేకుండియుఁ
గ్లేశపడియైన మన పెద్దలు కాలినడకతో పుణ్యపట్టణమైన కాశిని దర్శించి రాఁగలంత
భక్తిశ్రద్ధలు వహించి యుండిరను నాశ్చర్యము గలిగించుచున్నవి. జనసమూహముల
నాహ్లాదింపఁజేయుటకుఁ గథాకథనము మన హిందూదేశములో నతిప్రాచీన విద్యయే.
దానికి రెండువిధముల ప్రయోజనము గలదు. ఈ కథలు ధర్మపరాక్రమముల తత్త్వ
ప్రభావముల నుపదేశించుటయేకాక అప్పటి దీర్ఘకాల మార్గాయాసమును యాత్రికసంక్లే
శమును దొలఁగించుచుండును. మతవిషయమునను ఆధ్యాత్మిక విషయమునను విశ్వా
సములేక శంకాకళంకితమగు నేఁటికాలమున స్వభాషలో సులభశైలి వ్రాయఁబడిన
యీ కథలు హిందూదేశమున నాదియగు వేదశాస్త్ర పురాణాది విద్యాప్రపంచమున
నేడియేది శ్రేష్ఠమో శాశ్వత స్మరణీయమో దానినెల్లఁ దప్పక పునరుజ్జీవనము చేయు
చున్నవి. ఇవి యవనయామినీ వినోదకథలలోని చమత్కృతి ప్రభావము చూపుచున్నను
శబ్దరచనయందును, భావముల యందును అశ్లీలధర్మసాంకర్యాది దోషములు లేక
భాసిల్లుచున్నవి. కథలకిచ్చిన పేరును, సంవిధాన ధోరణియు సమస్తవిషయ సంగ్రా
హకమగుటచే యద్దే కొనసాగుచుండిన యెడల నిది తప్పక హిందూపురాణ గాథా
కోశమై సర్వవాఙ్మయమున కాదర్శమై యొప్పుననుట యసాధ్యముగాదు.

ఇట్లు,

బ్రహ్మశ్రీ శ్రీమాన్ **యమ్. కృష్ణమాచారి**

*M. A. M. L. P. H. D.*

# విషయసూచిక

శ్రీరస్తు

శుభమస్తు – అవిఘ్నమస్తు

# కాశీమజిలీకథలు

## రెండవభాగము

---

### 1 వ మజిలీ

శ్లో॥ యాకుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రావృతా॥
యావీణావరదండమండితకరా యాశ్వేతపద్మాసనా।
యాబ్రహ్మాచ్యుతశంకర ప్రభృతిభిర్దేవైస్సదాపూజితా।
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

వ॥ అట్లుమణిసిద్ధుండు శౌనకుండను నామాంతరముగల యగ్గోపాలుఁ తోఁగూడ జగన్నాథంబు ప్రవేశించి యందొక మఠంబున వసించి భక్తజనపరాధీనుండగు సుభద్రానాథునారాధించునుత్సుకంబు మనంబున నగ్గలంబగుచుండ వానితో నిట్లనియె.

వత్సా ! సకలజగన్నాయకుండగు జగన్నాయకుండిందు సుభద్రాభిధాన లక్ష్మీసమేతుండై నివసించియున్నవాడు. ఇమ్మహానుభావుని ప్రభావము మిగుల నద్భుతమైనది. తన ప్రసాదము నందించిన వారి నాశ్రమమె యిడుములంగుడిపించును. వేగమె యాగమోక్తవిధానంబున నాస్వామి నర్చింపవలయును. నేను స్నానముజేసివచ్చెదనంతదనుక భద్రముగా నిందుండుమని పలికినవిని వాఁడయ్యతితిలకున కిట్లనియె.

ఆర్యా ! భవదీయ పదోధావిశేషంబున నాకు వెనుకటికన్న లౌకికజ్ఞానం బభివృద్ధియగుచున్నది. శ్రుతంబుకాదే యెట్టివానినేని పండితుఁజేయుననుట. నాకును దేవతాదర్శనము జేయ వేడుక యగుచున్నది. స్నానముచేయ మీ వెంటవత్తు మనసొత్తుకొనువారెవ్వరు నిందు లేరు. అనుజ్ఞ యిండని వేడుకొనిన నయ్యతి సంతసించి వాని రాక కియ్యకొని చయ్యన వానితోఁగూడ నింద్రద్యుమ్న సరస్సునకుం జని యథావిధిస దీర్ఘోపకృత్యములు నిర్వర్తించి మించిన భక్తివిశేషంబున నారాయణమంత్రంబు

జపించుకొనుచు నాలయమునకుంబోయి ప్రదక్షిణ పూర్వకముగా గర్భాలయమున ప్రవేశించి సుభద్రాబలభద్రసహితుండై యున్న జగన్నాయకునిజూచి మేను గరుపార నానందబాష్పములతో ఫాలతలంబున నంజలి ఘటియించి గద్గదస్వరంబున నిట్లని వినుతించెను.

ఉ. సాధుమనీషచేఁబురని • శాచరుఁజెల్లగ బుద్ధధర్మముల్
బోధనఁజేసి తత్సతుల • పుణ్యమతుల్ చెడఁబాపి నీలధా
త్రీధరకూటమం దవత • రించి జగంబులనేపుటో జగ
న్నాధ ! వధూసనాథ ! కరు • ణన్ బరికింపుము నీకు మ్రొక్కెదన్.

అని మరియుం బెక్కు తెఱంగుల సంతరంగమ్మున నారథాంగపాణి సన్నిధానంబు గల్పించుకొని పెద్దతడవు ధ్యానించి కొండొకవడికి కడనుండి కదలి యావరణ దేవతల నర్చించు తాత్పర్యంబున నాలయ ప్రాంగణంబు జేరునంత నందించుక యలుక మొగంబునం బొడగట్ట నచ్చో నిలుచుండి తన రాకకై వేచియున్న శిష్యుని గాంచి వానికిట్లనియె. గోపా ! ఇంతదనుక నెందుంటివి ? దేవునిఁగంటివా ? సేవావశం వమందనె నీమాట మరచితినిసుమీ ! కోపము సేయకుము. లోనికిరమ్ము పోదము. నీ కులదేవతయగు వెన్నదొంగం గందువుగాని యని సానునయముగాఁ బలికిన నజ్ఞత దారికి వాఁ డిట్లనియె.

స్వామీ ! నేను మీకుఁ గావలసినప్పుడుగాక యిప్పుడు జ్ఞాపకము వత్తునా ? కానిండు. మీదయ నాకింత సంతమాత్రమే యున్నది ఏమి చేయుదును ? స్నానము చేసినది మొదలు నామాటయే మీకు జ్ఞాపకము లేకపోయినది. నేను మాత్రము విడువక మీ వెంట దిరుగుచుంటిని, మీరు గుడిలోనికిఁ బోవునప్పుడు నేనుఁగూడ రాఁబోవుదునచ్చటఁ గావున్న బెత్తములవారడ్డుఁబెట్టిరి. అప్పుడు నేను పెద్దయెలుంగున స్వామీ ! స్వామీ ! యని యరచుచు మిమ్ము బిలచితిని. మీరు నా మొఱ వినిపించుకొనక లోపలకుఁ బోయితిరి. నారొద వారించుచు లోపలనుండి యొక పండా బైటికివచ్చి నన్నుఁజూచి యోరీ ! యెవ్వడవు నీవు ? ఇట్లూరక యరచెదవేల ? యెవ్వరంజీరెదవని యడిగిన నే నిట్లంటిని.

అయ్యా ! నేను గొల్లవారి చిన్నవాడను. మాయయ్యవారు లోపలనున్నవారు. వారితోఁగూడ నేను దేవునిఁజూడ దేవళములోనికిఁ బోవుచుండ మీరు వారించిరి. దానికై యరచుచున్నానని చెప్పితిని. అప్పుడా స్వామికి నా మీద దయవచ్చినది. అల్పులవలె నున్నతులాపన్నుల మొఱాలకింపకుందురా ! లోపల మిగుల సమ్మర్దముగా నున్నది. కొంచెముసేపు తాళుము. వారు వెలుపలకు వచ్చిన తోడనే నిన్నుఁ బంపెదనని చెప్పి యప్పుడె యందున్నవారినెల్ల మెల్లమెల్లన వెళ్ళఁగొట్టించి పిమ్మట నన్ను లోపలకుఁ బంపెను.

నేను లోపలకు వచ్చి మిమ్ము వెదకితినిగాని మీరు గర్భాలయములో నుండుట చేతఁ బల్కరించుట తటస్థించినది కాదు, తర్వాత నేను దేవునింజూచితిని. మొదట నాకేమియుందెలిసినదికాదు, చూడఁజూడఁ గన్నులు, మొగము మాత్రము గలిగియున్న మూఁడు మొండివిగ్రహములు గనఁబడినవి. వానినే దేవతలఁగా భావించి మ్రొక్కుచున్న నాతోడివారినిజూచి నేను మ్రొక్కితిని. ఇంతలో జనబాధ యెక్కుడగుటు నన్నందు నిలువనీయక నేత్రహస్తులు వెలుపలకుఁ ద్రోసివేసిరి. ఆ విపరీతంబులఁ బెక్కుగతుల మతించలంచుచు మీరాకవేచియుండున్నవాఁడ. ఇంతలో మీరిచ్చటికి వచ్చితిరి. ఇదియే నా వృత్తాంతము. నేనును లోకంబున ననేక దేవాలయంబులం జూచితిని. పెక్కెంత వేల్పులగంటిని గాని యెందు నిట్టి వింత వేల్పులం జూచియుండలేదు. దీనికెద్దియేని కారణముండకపోనదు. నాయందు దయయుంచి ముందు నాకీ సందియముదీర దీని వృత్తాంతము వక్కాణింపుడు. తరువాత జపముఁ జేసుకొందురుగాక యని నిర్బంధించిన, సంతసించి యాసిద్ధుండిట్లనియె.

పుత్రా ! నీవీప్రశ్న వేయుదువని యిదివరకే యనుకొంటిని. పుణ్యప్రదమైన యిక్కథ వక్కాణింప నాకునుఁ గుతూహలము గలిగి యున్నది. సావధానచిత్తుడవై యాకర్ణింపుమని యమ్ముఖమంటపంబునం గూర్చుండి మణిప్రబోధచేతదృత్తాంత మిట్లని చెప్పందొడంగెను.

# ఇంద్రద్యుమ్నుని కథ

వత్సా! వినుము. పూర్వకాలంబున సిరావతియను పట్టణంబున నింద్రద్యుమ్నుఁడను రాజు గలడు. అతఁడు చంద్రసేనయను భార్యం గూడి ధర్మంబున రాజ్యంబు సేయుచు స్వల్పకాలములో నెక్కుడు కీర్తిని సంపాదించెను. ఒకనాఁడమ్మహారాజు సభామంటపంబున సింహాసన మలంకరించియున్న సమయంబున ద్వారపాలకుడువచ్చి నమ్రతతో, దేవా ! వింధ్యారణ్యమునుండి కిరాతులు కొందరువచ్చి దేవరదర్శనము కొఱకు వేచియున్నారు ప్రవేశమున కవసరమేయని విన్నవించి తదీయమస్తక చలనంబున ననుమతివడసి యవ్వారల నాస్థానమున బ్రవేశపెట్టెను.

పిమ్మట నయ్యేఱుకలు, పులిగోరులు, చామరములు, నెమలి పింఛములు, కస్తూరి మొదలగు నడవి వస్తువులు కానుకలుపెట్టి కట్టెదుట నిలువంబడి మ్రొక్కుచు నాగమనకారణం బడుగ నన్నరనాథున కిట్లని విన్నవించిరి.

ఏలికా ! మేము వింధ్యాటవిలో నుండు దేవరదాసులము. మాకు పిన్ననాఁటి నుండియు సూచలనేయు పాటవము గలిగియుండుటను, దానం బట్టియే నట్టడవులలో నెట్టి యెరివు వెరవునులేక నేకలము కాపురము సేయుచున్నవారము. ఇప్పుడెప్పుడును

జూచితిని పెద్దమోము మెకంబొకటి మాయడవిం దిరుగుచున్నది. దానింబరనేయ నేయు మాతూపులా పెనుసింగంపు దేహముపనోపక పోవుటయేకాక సైకపువేకి యేనిం బుట్టింపక లేకపోయినవి. అమ్మకచెల్లా ! అట్టిది మేటిమెకంబు నీక చూడలేము. దాని యఱపు వినినంత నేజంతువైన వెరపున సమయకమానదు. మానిసులంబేర్కొననేల ? ఏయడలు వెలుంగని మాపల్లెంవారెల్ల నుల్లములుపగుల రేయిం బగలు గన్నుమూయక నాలుబిడ్డల కెడమై పెన్మానులెక్కి పొక్కుచున్నవారు. సామీ ! మాయావడి యుడిగింప దేవర చెచ్చెరనచ్చటికి విచ్చేయవలయును. భవదీయబాహుబలంబునంగాక యామెకంబు సమయదని విన్నవించిన నాలించి యారాజచంద్రుండు మందహాసము చేయుచు నిట్లనియె.

శబరులారా ! వెరవకుడు. రేపకడవచ్చి యక్కృపలకేసరిం బరిమార్చి మిమ్ము నయ్యడవి వెల్లెడలపిచ్చలవిడిం గ్రుమ్మరంజేసెద. మాకును దడవులంబట్టి యడవులం డిఱుగు వేడుకగలిగియున్నయది. దైవకృపచే నేటికది యొనగూడినది. తెఱువెఱింగింప నిరువురుమాత్రము నిలిచి తక్కినవారు పొండని యమ్మన్నెగాండ్ర కాజ్ఞయిచ్చి యప్పు డప్పుడమిఱేఁడు అఖేటనయాత్రాప్రకారంబు పురంబెల్లఁ జాటంబంచి తత్పరికరంబు సమకూర్ప నమాత్యవర్గమునకు నియమించి యంతఃపురమునకుఁ బోయెను.

చంద్రసేనయు నందుచిత సఖీపరివృతయై మనోగతంబు వక్కాణింపుచు బతి రాకవిని సంతోషముతో దిగ్గునలేచి దగ్గర నెదురేగి కైదండమయిచ్చి తోడియిచ్చి మచ్చిక దోప గద్దియంగూర్చుండఁబెట్టి ప్రాంతమున నిలువంబడి యింపుగులుకు పలుకుల సతనిమతి కుతుక పరుచుచుండ నప్పుడొక యొప్పులకుప్ప తెప్పున నప్పూబోఁడి కిట్లనియె.

బోఁటి ! మనమేటికి సందియమందవలయును ? మనమనుకొనిన కల తెఱంగి మహారాజున కెఱింగింపుము. సకల కళానిపుణుండగు నితండందలి శుభాశుభ ఫలంబుల వివరింపఁ గలఁడని నుడివిన విని సంతసించుచు నారాజపత్ని ఔనౌను మంచిసంగతి జ్ఞాపకము చేసితివి. నేనిమ్మనవనాధుని సేవావసరములో మరచిపోయితిని యడిగి తెలుసుకొని యెదంగాక యని యతని మొగమునం జూట్కులు నిగుడింపుచు మెల్లన నిట్లనియె.

నాథా ! నిన్నటిరాత్రి వేకువజామున నాకొక కలవచ్చినది. కాని మంచి చెడ్డల నాప్రాణసఖులనడిగిన వారు నిరూపింపలేకపోయిరి. అది దేవరనడిగి తెలిసికొనవలయునని నిశ్చయించి తత్ప్రకారంబంతయుంజెప్ప మరతునని యీపత్రంబున వ్రాయించితిని. ఇదిగో చూడుఁడని చేటికచే నాపత్రికం దెప్పించి నృపతికిచ్చినం బుచ్చుకొని యమ్మానవపతి పలుమారు పఠించి శిరఃకంపము చేయుచు నిట్లనియె.

అబలా ! నీకల తెఱంగరయ నాయంతరంగము కలంకఁజెందుచున్నయది.

శీఘ్రకాలములో మనము వియోగము జెంది పెక్కుదుఃఖములం గుడిచి చివర జగద్విఖ్యాత మగు కీర్తియుం బడయునట్లు దాసం బొడగట్టెకి నింతకు దైవమేమి వ్రాసెనో తెలియదు. కర్మసూత్రంబు దాట నెవ్వనితరము ? ఇప్పుడు తదనుగుణ్యముగ నరణ్యగమనము నాకుఁ దటస్థించినది. ఇదియు దైవప్రేరితము కావచ్చును. లేకున్న నిత్యము పెక్కు మృగంబులను జంపి తినుచున్న యక్రూరాతు లొక్క మేకమునకుఁ జిక్కి యిక్కడకు రావలయునా ? కానిమ్ము. కానిమ్ము. అని దీర్ఘనిశ్వాసములు నిగుడ్చుచు దీనవదనుండై పలికిన యన్నరనాథుని జూచి వెఱగందుచు నాచంద్రసేన యిట్లనియె.

ఏమేమీ ? నా కలలో సంభవంత యున్నదా ? కటకటా ? యెఱుంగకపోతినే. మీ యంతరంగంబు కలంకపెట్టి యెంత యపరాధినైతిని. అయ్యో ! మనకు వియోగము కలుగునంటిరి. ఆమాట విన్నంత నాగుండెలు కొట్టుకొనుచున్నవి. యెట్లు సైరింతునని యతనికంఠము బిగ్గరగాఁ గౌగలించుకొని వెక్కి వెక్కి యేడువఁదొడంగినది. అప్పుడా రాజపుంగవుండు తెరవా ! వెరవకుము. కలలు నిజమగునా ? యూరక నిన్ను వెరపించుట కట్లంటిఁగాని యదార్థముకాదు. నేను రేపటియుదయంబున వేటకుఁబోయి యస్త్రపాటవంబు దేటపడ నా సింహమును సంహరించి చెచ్చెర వచ్చెద నంతదనుక భద్రముగా నుండుమని యాదార్చిన నక్కలకంటి కంఠంబు విడువకయే గద్గదకంఠముతో మరల నిట్లనియె.

ప్రాణేశ్వరా ! మిమ్ము విడిచి యొంటియై యుండఁజాలను నాకును మీతోడరా ననుజ్ఞయిందు లేకున్న నెప్పుడేనిఁ బోవచ్చు నిప్పటికప్పయనంబు మానిపింపుఁడని వగచుచున్న యమ్మత్తకాశిని గ్రుచ్చి యెత్తి కౌఁగలించుకొనుచుఁ జెక్కుముద్దాడి తద్దయుం బ్రీతినానేత ముద్దుగుమ్మా ? ఇప్పుడు వనంబునకుఁ బోవకతప్పదు. అట్టి యల కథయప్రధానమిచ్చితి. కావున నాతోడరమ్ము. ఉద్యానవనంబునం బోలె మనమందు విహరింపవచ్చునని మచ్చిక నమ్మచ్చెకంటి యిచ్చగింపఁబలికి తత్కాలోచిత కృత్యముల నిర్వర్తించి యారేయి గడపెను.

అంత మరునాఁ డరుణోదయంబున వేఁటపాటవంబుగల మృగయులు పెక్కండ్రు తత్సాధనంబులంబూని పరివేష్టింప సముచిత పరివార సహితుండై యయ్యింద్రద్యుమ్నుండు యౌవనరాజ్యపట్టభద్రుఁడగు విజయుండను కుమారు నింటికడ భద్రముగానుండ నియమించి మంచి ముహూర్తమ్మునవెడలి భార్యయెక్కిన శిబిక వెంటఁ దన గుఱ్ఱమును నడిపించుచుఁ గతిపయ ప్రయాణముల శబరనిర్దిష్టమార్గంబున నవ్వింధ్యారణ్యమున కరిగెను. అంతనున్న యందు నుపవనసౌధములభాతి నతి విచిత్రముగాఁ జిత్రకారకులచే నమర్పఁబడిన పటకుటీరమునందు విడిచి చుట్టునుం దన వాహినుల వ్యూహంబున నిలఁబెట్టి కొంతవట్టు పట్టమహిషికండుఁ గన్పట్టు మెట్టలం జెట్టు లుసిరిపట్టుగా నిట్టు ల్గ్రుమ్మరుచు వింతపిట్టలచేష్టలఁ జూపుచు పరమేష్ఠి సృష్టి ప్రభావల బగ్గింపుచుండెను.

అంత సాయంకాలమున నమ్మనుజపతి వేటకాండ్రను చుట్టునుం బరివేష్టించి వేటకనుజ్ఞ యెప్పుడెప్పుడని తొందరపెట్టుచుండ నయ్యాటవికులంజేరి ఓరీ! యా సింహ మెక్కడనున్నది? యెప్పుడువచ్చును? దాని చిహ్నములెట్టివి యెఱింగింపుఁడని యడిగిన వాండ్రు మొక్కు చేతులతో నిట్లనిరి. దేవా! దేవరతో మనవి చేసికొని వచ్చినది మొదలు మాకామెకము గనంబడుటలేదు, మీ రాకవిని వెరపున పారిపోయె నని యూహించుచున్నారము. అది యదిగో కనంబడుచున్న గొందిలో నెప్పుడును గద్దెవైచుకొని కూర్చుండునది. యా వేళకు సింధుఁజేరుచు యమునిచేయవారేయగు చుండిరి. కటకటా! మేము పడిన యిడుములేమని వక్కాణింతుము. నేఁడుగదా మా యాలుబిడ్డలం గూడికొంటిమి. మాయింటికిందియదర నియ్యడవియంతయు దడవి దానిని గడతేర్పుఁడు. ఎక్కడనో యడఁగియున్నదని వేడుకొనిన వారిమాటలువిని నవ్వుచు రాజశేఖరుండు వేటకాండ్ర కిట్లనియె.

ఓరీ! యా కేసరి మనరాయిడికోడి యెందేనిసణఁగి యుండవచ్చును. విచ్చలవిడి నీరేయియంతయు నడవినెల్లడలఁగలచి యలజడి సేయుఁడు ఉదులఁ బన్నుఁడు. వలలనొడ్డుఁడు, మఱియుం గ్రూరసత్వంబుల సత్వరంబునం బరిమార్పుఁడు. కుక్కల నుసిగొల్పుఁడని యానతిచ్చినంత సంతోషముతో వాండ్రందరు గాండ్రుమని యఱచుచు నొక్కుమ్మడి నయ్యడవియంతయుం జెలరేగి హల్లకల్లోలము చేయఁదొడఁగిరి.

అప్పుడా చప్పుడులకు వెఱచి యఱచుచుఁ బరచు మృగమ్ముల యెలుంగులు విని బెదురుఁగదురఁ దన్నుఁ గౌఁగలించుకొనిన చంద్రసేనను బిగియంబట్టి స్వయంగ్రాహ సుఖసారవశ్యంబేపార నా రాజశేఖరుండారమణీమణికఁ దుటుఁగఁ జపుచు నాశిబిరంబునఁ దదీయలీలావిశేషంబులతో నారాత్రియంతయుం దృటిగా వెళ్ళించెను. అంత నిశావసానంబగుటయు భార్యయుం దానును వందిమాగధ సంస్తవరవంబుల మేల్కాంచి సమయకరణీయములందీర్చి రమణీయంబగు ప్రదేశంబున బాలాతపకాల మందమారుతమ్ములు మేనికిహాయిసేయ నుచితాసనంబులంగూర్చుండియల్లాపన సౌభాగ్యంబరయుచున్న సమయంబు సంగవాయి యరుదెంచి ఫాలంబునంగరయుగంబు గీలుకొల్పుచు నిట్లు విన్నవించెను.

దేవా! దేవర యనుమతి రాత్రియంతయు నీయరణ్యంబున గల మృగముల నరసి వేటాడితిమి. పెక్కు మృగంబులం జంపితిమి. పెక్కు జంతువులంబట్టితిమి. పెక్కు మెకంబులం దోలితిమి. మాయిచ్చవచ్చినట్లెల్ల నీయడవి నల్లరిఁజేసితిమి. కాని యెందును వాండ్రనిన సింగము చిక్కినదికాదు. అది నిక్కముగా నెక్కడికో పోయినది లేకున్న మాకు దొరకకపోదు. పెక్కేల నిక్కాననములోనున్న సత్వరంబు మాసత్వంబునకు దాటినది యొక్కటియులేదు. దేవర తలంపూపువాడకుండ నశ్రమం

బునం బురంబునకుఁ బోవచ్చునని పలుకుచు వలలచేఁ బొలియసందఁబట్టిన వింతమృగం బులం దెప్పించి యెదుర పెట్టించెను.

వానిని జూచి యారాచమన్నీఁడు పేడుకపడుచుఁ దద్విశేషంబుల భార్య కెఱిం గింపుము నప్పటికిఁదగిన కానుకఁ బామృగయుల కిచ్చి మఱలఁ బురంబునకుఁబోవ సేనలు సన్నాహపరచుఁడని యాన తిచ్చుచున్న సమయంబున ననతిదూరములో, "హా! ప్రాణ నాధ ! హా ! జీవితేశ్వరా ! యేమైపోయితివో గదా ? కటకటా ! యూరక నీకు మృత్యుదేవతనై తోడ్కొనివచ్చితిని. అయ్యయో ! ఎంత పాపాత్మురాలను ? పరి శీలింపక నేలపాలు సేసితినే" అని యేడ్చుచున్న యార్తధ్వని యొండు వినంబడినది.

దానికందరును వెరగుపడుచు దలలుపైకెత్తి యాదీనారవంబు ఏతెంచిన దెసకు గర్ణములం జొనిపిరి, మరల నారీతినే వినంబడుటయు నపరిపడి యప్పుడమి యొడయుండు వడిగలవారల నిలిచి యదియేమియో సరగున నరసిరండని పనిచిన వారునంటబోయి తద్వృత్తాంతంబంతయు దెలిసికొనివచ్చి యిట్లని విన్నవించిరి, దేవా ! దేవరయానతి మేము రొదజాడబట్టి వేగమెపోవ నా[?]తోవదాపున చెట్టునీడ నొకచేడియ కనబడినది. అతొయ్యలి తనపయ్యెద చెరంగు మెడకు బెనివైచికొని చెట్టుకొమ్మకు తగిలించి ప్రాణనాధునిదలంచుచు ప్రాణముల బోగొట్టుకొన నుద్యోగింపుచున్నయది. అట్టితెగువకు వెరగందుచు మేము సత్వరంబున నా చేలము గంటము విగియకుండ జిక్కఁ బట్టుకొని యబలా ! నీ వెవ్వతెవు ! ఇట్టి ఘోరసాహసమేల జేసెదవు. నీ[?]తియే మయ్యె నెఱింగింపుమనిమేమెంత బ్రతిమాలి యడిగినను మాకు బ్రత్యుత్తరము చెప్పినది కాదు. ఆమె ప్రక్కనొక్క చక్క నిగుఱ్ఱము పెక్కుదూరము నడిచివచ్చినట్లు మేనెల్లం జెమ్మటలుగ్రమ్మ నొగర్చుచు నలుపబడియున్నది. అయ్యారే! అయ్యెలనాగసోయగం బేమని వక్కాణింతుము. దివ్యాంగన యని తోచుచున్నయది. దానిమాట పిదప విమ ర్శించుకొనవచ్చును, వేగమె యా మగువ సమయకుండ దేవర విచ్చేయవలయునని పలికిరి. దీనజనుల రక్షింప గంకణము గట్టుకొన్న యన్నరనాయక శిరోమణి వారిమాట విని సత్వరము తురగ మెక్కి చంద్రసేన వలదు వలదు, నన్ను గూడ గొనిపొమ్ము. కొనిపొమ్మని బ్రతిమాలు కొనుచుండ వినిపించుకొనక వడిగా నప్పడతియున్న పిట పినికటమునకు బోయెను. అట్లా భూషుండరుగునప్పటి కత్తలిచుబోడి నా చేలముविడు వుడు. విడువుడు పాపాత్మురాలిని ముట్టకుడని పెనుగులాడుచుండ నాదండకు బోయి మెల్లన మెడయురి దప్పించి చల్లని పలుకుల నిట్లనియె.

తల్లీ ! నీ తల్లిదండ్రు లెవ్వరు ? ఎవ్వనియిల్లాలవు ? నీ పేరెయ్యది ? అనన్య సామాన్య రూపలావణ్యములుగల నీ వంతఃపురములఁ జేటిక లూడిగములు సేయ నివసింపక యొంటియై నీయరణ్యమునకుఁ రాఁగతంబేమి ? నీ కాపురమెచ్చట ? నీ చందమరయఁ బతివియోగంబున శోకింపుచున్నట్లు కనంబడుచున్నది. నేనింద్రద్యు మ్నుండనువాఁడ. క్షత్రియకులుండ. వేటకారణంబునఁ నీ విపినంబు జేరితి. భవదీయ

శోకాలాపంబులు మదీయ కర్ణపుటంబులఁగటువులై చొచ్చుటయు నొచ్చినడెందముతోఁ గారణంబరయ నిందు వచ్చితిని. సన్నసన్నగాఁ దలంపకుము. నీ తండ్రివంటివాఁడ. నాయోపినంత యుపకారము సేసెద. నీ వృత్తాంత మాద్యంత మెఱింగింపుమని పలు దెఱంగులఁ బ్రతిపాలించన్న యన్నరపతి యనునయవచనంబులఁ దనహృదయశోకం బించుక శాంతింప నవ్వేఁదుమోష్టి తన యుద్యమంబుడిగి కన్నీరుఁదుడుచుకొనుచు దదీయ విఖ్యాతిసంతకుఁబున్న నినియున్నది కావున నతండట్టివాఁడుగా నిశ్చయించి చూపులఁ దైన్యంబుఁతోప లేచి మ్రొక్కుచుఁ దనవృత్తాంతం బిట్లని చెప్పందొడంగెను.

# విశాలాక్షి కథ

ఆర్యా! మందభాగ్యురాలనగు నా వృత్తాంతము వినుటచే నేపరచిత్తము దుఃఖభాజనము కాకమానదు అయినను దీనుల నెఱబాలించుట యుత్తమ ధర్మము గదా. నాకీసమయములో మరణమే శరణమైయున్నది. బలవన్మరణము నిరయకారణ మని వినియుండియు నిట్టిలెగువునకుఁ బూనుకొంటిని. చింతాసాగరంబు మునింగియున్న జనులకు బంధుదర్శనము తెప్పయగునని యూహ్యంబు చెప్పుదురు. మీ మాటలచేతనే నా సంతాపము కొంతచల్లారినది.నాయుదుముల తెఱంగెఱింగించెదనాలింపుము.నేను హేమాంగదుఁడని ప్రసిద్ధి వహించిన కాశీరాజుకూతురను. నా పేరు విశాలాక్షి యందురు. మా తల్లి యొక్కనాఁడు సంతతిలేమిఁ జింతింపుచుఁ న్నంతరంగమున ధ్యానించి నిదురించినంత జగత్ప్రసిద్ధియగు విశాలాక్షి కలలోఁ బ్రత్యక్షమై నన్నిచ్చుటచే నాకద్దేవిపేరు పెట్టిరి. కటకటా! అఘటనాఘటన సమర్థురాలగునట్టి దేవి వరంబునం బుట్టియు నిట్టి బాధలంబడుచుంటిని. ప్రారబ్ధంబెట్టివారికిని దాటశక్యముగాదను మాట యదార్థము. లేక లేక కలిగిన దాననగుట నా తల్లిదండ్రులు నన్ను గారాబముగా బెంచిరి. కాశీపురము విద్యామందిరమనుమాట జగత్ప్రసిద్ధమైనదేకద! పూవునకుఁ దావింబోలె నారూపము నీకనురూపముగా విద్యయుండినచో నలంకారముగా నుండు నని యూహించి మా తండ్రి మాటలు వచ్చిన నాటఁగోలె నవ్వీటగల మేటిపండితులఁ బిలిపించి నాకువిద్యఁ జెప్పింప దొడంగెను. దానంబట్టి ప్రాయముతోఁగూడ విద్యయు నభివృద్ధిఁబొందెను. విద్వాంసులు మదీయ గ్రహణధారణ సామర్థ్యమునకు వెఱఁగందుచుండిరి. పదియారేఁడుల ప్రాయమువచ్చువరకు నాకు విద్యలన్నియు బూర్తియైనవి.

అప్పుడు మా తండ్రి మిగుల సంతసించుచు గురువులకు దగిన పారితోషికము లిప్పించి నాకనురూపుండగు వరుఁడెవ్వఁడో యని విచారింప దొడంగెను. ఒక్కొక్క రాజకుమారునియం దొక్కొక్క గుణమేకాని యన్నిగుణములఁ గలిగిన వాఁడెందునుఁ గానఁగట్టలేదు. మా తండ్రి యొకనాఁడు దూతికాముఖంబున నీకెట్టివాఁడు పతికావలయునో చెప్పుమని యడిగిన నేనిట్లుత్తరముఁ వ్రాసితిని.

తండ్రీ ! వరునియందు విద్యాశీలరూప సంపదలు ముఖ్యముగా నరయఁదగి నవిగదా అందు మొదటిది విద్య ! శాస్త్రపాటవము లేని వాని మనంబెంతవిన్నాణ మైనను అగ్నిశోధితముగాని బంగారు చందమునఁ బ్రకాశింపనేరదు. బుద్ధిహీనుండగు వాఁడు మిగుల సంపదఁగలవాఁడైననుఁ జెడిపోవును. శాస్త్రచక్షుస్సు దివ్యమైనది. భూత భవిష్యద్వర్తమాన విశేషములఁ జూడనోపును. విశాలనేత్రములు గలవాఁడయ్యును శాస్త్ర ప్రజ్ఞ లేనివాఁడు అర్థదర్శనముల యందు సామర్థ్యము లేకపోవుటచేత గ్రుడ్డివాఁడే యగును. కావున విద్యాబలసంపన్నంబగు బుద్ధిచే నొప్పువాఁ డుత్తముఁడనంబరగును. రెండవది శీలము – శీలములేనివాఁడెంత విద్వాంసుఁడయ్యును పన్నగ శిరోమణియుం బోలె వాసి కెక్కనేరడు. మూఁడవది రూపము "యత్రాకృతిస్తత్రగుణాభవంతి" యను నార్యోక్తి చొప్పున సాముద్రికశాస్త్రస్పష్టంబైన రూపముగలవాని కన్నిగుణములు పుష్పపరిమళముభాతి సహజంబులై యుండును నాలుగవది సంపద. త్యాగభోగము కది యావశ్యకము. ఇందు రెండవది లేక తక్కినవిగల్గియున్నను గర్వహేతుకములై యపయశము గలుగఁజేయును. మొదటిమూఁడునుం గలిగి నాలుగవది లేకున్నను నెప్పటికేని వీనిచేఁ దానినిబడయ వచ్చును. లౌకిక మర్యాదాభిజ్ఞులకు మీకు నేను జెప్ప దాననా. అయినను నాకుఁదోచినది వక్కాణించితిని. పిమ్మట మీ యిష్టమని వ్రాసి పంపితిని. ఆజాబు చదువుకొని యతండెంతేని సంతసము జెందుచు నీభూమి నంతయుం బరిశీలించియైన దీనికిఁదగినమగనిఁ బెండ్లి చేయుదుఁగాని నిశ్చయించి నానాదేశము లకుం దగిన దూతలఁబంపెను. నే నొక్కనాడు సాయంకాలమున ప్రాణతుల్యులగు చెడియలు తోడరాఁ బల్లకినెక్కి కేదారేశ్వరు నారాధింపబోవుచుండ నా ఘట్టంబున గంగా తీరంబున సోపానంబులం గూర్చుండి కొందరు విద్వాంసులు భాగీరథీనీర జాగ చోరకంబులగు మలయమారుత కిశోరకములు మేనులకుహాయి సేయ శాస్త్రవాదంబులు చేయుచుండఁ దన్నాదంబులు మదీయ కర్ణగోళములకుబంధువులగుటయు నాందోళికము నించుకయాపి తదీయగవాక్ష వివరములనుండి తొంగిచూచితిని. అప్పుడా విద్వన్మండ లమునడుమ జుక్కలలో చంద్రునివలె నొక్క బ్రాహ్మణకుమారుడు నాకు నేత్ర పర్వమై తటాలున నామానసమాకర్షించెను. ఈశ్వరునివరము జేసికొన గంగాతటంబు నకు దపము సేయ నరుదెంచిన కంచువిల్తుఁడోయన మనోహరవేషంబున నొప్పు నక్కు మారశేఖరుని జూచి స్వాంతమున నేనిట్లని తలంచితిని కంతువసంత జయంతాదుల సుందరులని చెప్పుటయేకాని వారినిజూచినవారలేరు. వారువీనివలె సర్వాంగసౌష్ఠవము గలవారని తోచదు. అయ్యారే ! వీనియవయవములన్నియు లావణ్య భూయిష్టములై మొలచినయట్లున్నవి. కలకలనవ్వు మొగంబును సొగసైన కన్నులు సుందరఫాలము, చక్కనిచెక్కులు, విశాలమైన వక్షము, దీర్ఘములైన బాహువులుంగలిగి సాముద్రిక శాస్త్రలక్షణంబుల సార్వభౌముండుగా నుండదగు నీతం డిట్టిదైన్యంబు నొంది

యుండుటకు గతంబేమియో గదా ? ఔనౌను తెలిసికొంటి వీనియోష్ఠంబులు పరిశీలింప పెక్కు శాస్త్రంబులు చదివినట్లు తోచుచున్నది. బ్రాహ్మణునికి విద్వత్తు గలుగుటయే రాజయోగమందురు. ఇట్టిసుందరుడీ యూరనేయుండ నా తండ్రి పెక్కుదూరము వెదుకనేల ? వీనియునికి దెలియకగాబోలు వీనిని జూచినది మొదలు నిర్దుష్టమగు నా మనంబు మదనావేశము జెందుచున్నది. భక్తజన పరాయణుడగు కేదారేశ్వరస్వామియే వీనినాకొరకు దెచ్చెనని తలంతు. విద్యారూపంబులుగల వీనియందు సంవద్విచారము చేయనేల ? నేనువరించినచో మా తండ్రి రాజ్యంబున కితడే యధికారియగును గదా, కావున నేను వీనిని త్రికరణంబులచే బతిగావరించితి. ఈతడే నాకు బతియని నిర్దేశించుకొని వానికులశీలనామంబులం దెలిసికొనిరమ్మని ప్రచ్ఛన్నముగా మదీయప్రాణసఖి నొకదానినంపి కేదారేశ్వరు నారాధించి యింటికి బోయితిని.

రాజేంద్రా ! స్త్రీజనస్వభావం బెంతచాంచల్యమైనదో చూచితివా ! ఎంత చదివినను వివేకములేక నేనతనిజూచినంతనే వరించితిని. కులశీలంబులు దెలియునంత దనుక తాళలేకపోతిని. అట్లు నేనింటికి బోయి చెలికై నాక వేచుచున్నంత నంతలోనది వచ్చినది దానిని జూచి నేనత్యాతురముగా చెలీ ! నీవాయనతో మాట్లాడితివా ? ఏమి ప్రసంగము జరిగినది ? నీకతండేమియుత్తరము చెప్పెను ? పండితుండౌనా ? అ సుముఖుని ముఖమునుండి వెడలిన వర్ణముల గ్రమము దప్పకుండ నుడువుము. నీ ముఖవిలాసముజూడ వేఱొకలాగు దోచుచున్నదేమి ? వేగమె యచ్చటి విశేషముల దెలుపుమని తొందరపెట్టిన నది నాకిట్లనియె.

బోటీ ! నీవేమిటికూరక తొందరపడియెదవు ? క్రొత్తవానియంత స్వైరం బెసంగక వరింపవచ్చునా ? మనమెంత ప్రౌఢలమైనను పెద్దవారల యనుమతిలేక స్వతంత్రింపరాదు అచ్చటిచర్యల జెప్పెద వినుము. నేను పండితమండనులందరకు బోయి దండప్రణామంబులు చేయుచు వారిచే మన్ననలవడసి కొంతసేపు వారివాదముల నాకర్ణింపుచు బ్రాంతమున నిలువబడితిని. నీవు కోరిన చిన్నవాడెద్దియేని బ్రసంగించునేమో యని యెంతసేపు నిలిచినను వానినోటినుండి యొకమాటయైనను వచ్చినది కాదు. వారివాదములన్నియు వాడెఱింగినట్లు నేను తలంపను. వారు ప్రసంగమ్ముల ముగించిన పిమ్మట నందఱులేచి నివాసములకు బోయెడితఱి నేనా బ్రాహ్మణకుమారుని నించుక చాటుగాబిలిచి, అయ్యా ! తమ నివాసస్థలమెచ్చట ! మీపేరేమి ! యేమిటికై యీపట్టణమునకు వచ్చితిరి ? ఏమి చదువుకొంటిరని యడిగితిని. అప్పుడాయన నాతో జెప్పిన దేమనగా, "నాగ్రామముపేరు నాపేరు నాకు దెలియదు. నేనేమిచదుకొన్నది యెఱుంగను. ఇప్పుడు శబ్దాలు చదువుకొనుచున్నాను. మాగురువుగారు కింశుకశాస్త్రి యని మాత్రము నన్ను బిలుతురు." అని యుత్తరము జెప్పెను.

ఆమాటలకు నేను వెఱగుపడుచు అయ్యో ! గ్రామముపేరు తనపేరు మరచి పోదగునా ? మీమాటలుచూడ బరిహాసముగా దోచుచున్నవి. నేను మీతో నవ్వ

లాటకు రాలేదు. కార్యముగలిగి వచ్చితిని. యదార్థము చెప్పుదని నేనెంతివేడినను మారు
మాట జెప్పక పిలుచుచుండగనే లక్ష్యముఁజేయక యతఁడు లేచిపోయెను.

అంతట నేనేమియు జేయునది లేక వాని మాటలనే మాటిమాటికి స్మరించు
కొనుచు నీయొద్దకు వచ్చితిని. వాని చర్యల జూడ వెఱ్ఱివాడువలె దోచుచున్నవాడు.
అతండు నీవు దగవనినుడివినది. దాని మాటల విని నేను ఓహోహో! బుద్ధిమంతు
రాలా! నేటితో నీబుద్ధిబలంబంతయు దేటమైనది. నిన్ను మిగుల చతురవనుకొంటిని.
చాలులే అతండు గంభీరహృదయుండును, ధీరుండును నీబోటి బోటులకు దనహృద
యంబు దేటపడనిచ్చునా? వానిశ్లేషవచనంబులు నీవు గ్రహింపలేకపోయితివి. వాని
యర్థము నేను జెప్పెదనువినుము. విద్వాంసుల కొకదేశము, ఒకనామము స్థిరముగా
నుండదు. సర్వదేశములు సర్వనామములు నావేయనియర్థము. శబ్దములు చదువు
చున్నాననగా సకలశాస్త్రములు శబ్దజాలమే కావున నట్లనెను. మఱియుం గింశుకశాస్త్రి
యనగా మోదుగపూవు వంటివాడనని స్వాతిశయశూన్యోక్తి గొప్పవారు ఆత్మస్తుతి
జేయనొల్లరు. అభిజ్ఞులు సమానులతో గాని మనసిచ్చి మాట్లాడరు. నీవది గ్రహింప
లేక వెఱ్ఱివాడని సులభముగానంటివి. హోహోమ్మని దానిని దిరస్కరించి వానిని నేను
బెండ్లియాడక మాననని తదాయత్త చిత్తురాలనై మన్మథావస్థలకు బాల్పడితిని.

పిమ్మట నొకనాఁడు దాసీముఖంబున నాయవస్థయంతయు విని మాతల్లి నా
యొద్దకు వచ్చి మదీయమనోగతంబడిగి తెలిసికొని మా తండ్రితోఁజెప్పెను. అతండు
మిగుల సంతసించుచుఁ దక్షణము ఆ విప్రకుమారునింటోడ్కొని రండని దూతలం
బుచ్చిన వారేఁగి తోడ్కొని వచ్చిరి. మా తండ్రి యంగణసీటోలియున్న యా చిన్న
వానిని జూచి నెరగందుచు నోహో! యీ మోహనాంగుఁ డీయూర నెంతకాలము
నుండి యుండెనో. యిట్టి సుందరుఁ డింత చేరువనుండఁ దెలిసికొనలేక యూరక శ్రమ
పడితిని. నాయందు మక్కువఁగల విశ్వనాథుండే యిక్కుమారునిం దెచ్చియిచ్చెను.
నాకూఁతునకుఁ దగినవరుడు లభించెనేఁడుగా కృతార్థుండనైతినని పెక్కురీతులఁ గౌతుక
మందుచు విద్యా విషయమింతయేనిం పరీక్షింపక వానికి నన్నిచ్చుటకు నిశ్చయించి
తగు పరిచారకులతో వానినొక విడిదికింబంపెను

పిమ్మట సిద్ధాంతులచే నిర్ణీతమగు సుముహూర్తమున మిగుల వైభవముతో
నా తండ్రి మాకు వివాహము గావించెను. అతని నా యూరిలోని వారెవ్వరుఁ గింశుక
శాస్త్రియని గురుతెఱుంగరు. ఎచ్చోటనుండియో చక్కని రాజకుమారుఁ డొక్క
గండు రాజపుత్రికకుఁ దగినఁవాడు దొరికెనని సంతసింపుచు నతని సౌందర్యమును
పే తెరంగుల స్తుతిఁజేయ దొడగిరి.

అంత వివాహదీక్షావసానదివసంబున విలాసనౌధంబు చక్కగా నలంక
రించిరి. పవడపుఁగోళ్ళను బంగారుపందిరి ముత్తెముల జాలరు పట్టుదోమతెరయుఁ
దంతపుపంతసగిన్నియుం గలిగి హంసతూలికాతల్పముచే నింపుగాంచిన మంచము

చుట్టును విచిత్రవస్తువులు పెక్కుగాజు దీపపుకాంతులు వింతలుగుల్కుచుండ నమర్చిరి. పెక్కేల నాగదియలంకారమంతయుంజూచి తీరవలయుగాని చెప్పశక్యము గాదు.

రాజా! నీవు నాకు దండ్రివంటివాఁడవు. ఇది యాపత్కాలమగుటచే నిటుమీద జరిగిన చర్యలను సిగువిడిచి చెప్పుచుంటిని. గాని మీబోటివారికి జెప్పవలసినదిగాదు. మనంబునఁ బెక్కురీతులఁ గోరిక లువ్విళ్ళూర నాదివసంబున సాయంకాలమగుటకు నాకు గడియ యుగముగాఁ దోచినది. నావయస్య లాదినంబున నాకుఁ జేసిన యలంకార ప్రకారమంతయుఁ జెప్పుటకొక సంవత్సరము పట్టును. నిత్యము చూచుచున్నవారే నాసోయగమునకు గ్రొత్తవింత పడజొచ్చిరి. అంత నారాత్రి మా తండ్రి యాజ్ఞచొప్పున నా గదిలో దాంబూల చర్వణ చందనానులేపనాది స్త్రీజనకృత్యము లన్నియు లఘువుగా జరుగుటచే జిరకాలమునుండి తలంచుకొనుచున్న నావయస్యల కోరికలేమియు దీరినవికావు.

పిమ్మట దమవెంట వచ్చుచున్న నన్ను లోనికి ద్రోసి బలాత్కారముగా దలుపు బిగియించి నా చెలికత్తె లరిగినవెనుక నేనును దలుపు దాపున దలవంచుకొని నిలువబడితిని. ఎంతసేపట్లు నిలిచినను నన్ను బల్కరించినవారు లేరు. కొంతసేపునకు నేనే మెల్లనతలయెత్తి చూడ నా మహాపురుషుండు దుప్పటము ముసుంగుదన్ని యాతల్పముపై గుఱ్ఱుపెట్టి నిదురించుచుండెను.

ఆ గుఱ్ఱువిని నేను వెరగుపడుచు మంచము దాపునకు బోయి యోహో! యీతండు నన్ను బరామర్శింపక యిట్లు గాఢనిద్ర జెందుటకు గారణమేమియోగదా? నాయందు వీనికి మక్కువ లేదా? లేక యలసటచేత నిట్లు నిద్రించుచున్నవాడాయని యాలోచించుచు కానిమ్ము. నేనుమాత్రమంత తేలికపడనేల. నేటికూరకొని రేపు చూచెదంగాక అని యారాత్రి వేరొక మంచముమీద బరుండి నిద్రబోయితిని.

అతండును తెల్లవారకుండలేచి పరిచారకులు సేవింప విడిదికింబోయెను. ఆరాత్రియంతయు వృథయయ్యెనని వగచుచుండ నా సఖులు నన్ను జుట్టుకొని నా యంగములన్నియు బరీక్షింపుచు బెదవులు విరిచిరి.

శ్లో॥ కస్తూరీ వరపత్ర భంగనికరో భ్రష్టో న గండస్థలే
నోలుప్తం సఖి చందనం స్తనతటే ధౌతం ననేత్రాంజనం
రాగో నస్ఖలిత స్తవాధరపుటే తాంబూల సంవర్థితో
కింరుష్టోసి గజేంద్రమత్తగమనే! కింవా శిశు స్సైపతిః

ఓహో, చెలీ! పెక్కువిద్యలం జదువంబట్టియా యిట్టివిలాసముల జూపితివి. మేని అలంకారములేమియు గలుగక పెట్టినవి పెట్టినట్లే యున్నవి. పుష్పములు వాడలేదే, నఖదంతచిహ్నము లెంచుకొనంగానరావు ఇది నీ చమత్కృతియా? నీమగని పాటవమా? తేటపరుపుము. లజ్జావతీ? అని పరిహాసము సేయుచుండ పోపొండు

మీరు సిగ్గుమాలినవారలు మీకుత్తరము చెప్పనని అప్పటికి దగినట్లు మాట్లాడుచు
వారెంత గ్రుచ్చి గ్రుచ్చి అడిగినను నాగుట్టు చెప్పితిని గాను.

అంత మరునాడు రాత్రి యెప్పటివలెనే నన్నలంకరింపుచు దాచినం దాగ
వని కేళీచిహ్నంబులం గురుతుపట్టుటకై నాడు కేవలము పుష్పాలంకారములే నామేన
నుంచిరి పూర్వపురీతి నాతలిరిబోండ్లు తలుపు మూసి పోయిన వెనుక నేనును
తలుపుదాపుననిలువంబడి యోరజూపుల జూచుచుండు నంతలో నమ్మానుభావుని గుఱ్ఱు
వినంబడినది.

అప్పుడు నేను వెక్కుతరంగుల దేలపోసితిని. అన్నన్నా! ఈ విజ్ఞాని
శుకాది మహర్షులకన్న నధికుడువలె దోచుచున్నవాడు. ఎట్టివారైనను నావంటి వాల్గంటు
లెదురనిలిచినపుడు మనంబాపగలరా? విశ్వామిత్రుండంతటివాడు తపముచెడి స్త్రీలోలు
డయ్యెను. వీనిధైర్యము కొనియాడదగినదే. ఇకనేనూరకొనిన నతడు మాటాడడు.
సిగ్గుపడిన లాభములేదు. పురుషుల పంతము చెల్లును గాని స్త్రీలపంతము లెప్పుడైనను
చెల్లునా? నేనే పల్కరించెదంగాక యని దాపునకు బోయి నిద్రాభంగము సేయవెరచి
రేపుతప్పక నితడు నిద్రింపక పూర్వమే పల్కరించెద నీరేయి నెట్లకే గడపెదనని
నిశ్చయించి నాయలంకారమంతయు మంచము పాలు చేసి యారాత్రి వెళ్ళించితిని.

మూడవనాటి యుదయమున నతండు విడిదికి బోయిన వెనుక నా ప్రాణ
సఖులందరు నుత్తరముతో నన్ను జుట్టుకొని పూవుదండల బరీక్షించి యెప్పటియట్ల
నుండుటకు ముక్కుమీద వేళ్ళు వైచుచు నొకరిమొగమొకరు చూచుకొన దొడంగిరి.

అప్పుడు నా ప్రాణసఖులలో ప్రౌఢురాలు చిత్రావతి అనునది నాకిట్లనియె
చెలీ! నీమేనుజూడ నేపోడిమియుం గనంబడకున్నది. ఇట్టిదంపతుల నెందునుం జూడ
లేదు. నీవు నవరసరసికురాలవు. సకల కళా ప్రవీణురాలవు. చిన్నదానవు కావుకదా?
నీకు దెలిసిన సంగతులు పండితులైనను దెలిసికొనజాలరు. ఇట్టి నీవే లజ్జావతివై
యూరకుండినచో మేమేమి చెప్పగలము. మగవాడు సిగ్గుగలవాడైనప్పుడు మగువయు
లజ్జావతియైన నెట్లు పొసంగును! నీకు మేము బుద్ధులు సెప్పువారమా? ఇది నీ
లోపమా? యతని లోపమా! తెలుపుమని పెక్కుగతుల బుజ్జగించి అడిగిరి.
నేనేమియు నుత్తరము చెప్పక వేరొకరీతి మాటలచే దాటవైచితిని.

అంత మూడవనాటి సాయంతనమున సఖులునన్ను జక్కగా నలంక
రింపుచు పుత్రీ! నీవీరాత్రి పూర్వమువలెనే గడిపితివేని మేము మీయమ్మకు జెప్పక
మానము. అయినను నీవు పూర్వమువలె మాతో మనసిచ్చి మాట్లాడకుంటివి.
చక్కని మగడు దొరకెనని గర్వమువచ్చినది. నీవిట్టిదానవగుదువని యెన్నడు నను
కొనలేదు. కానిమ్ము రేపుగూడ బరీక్షించి తర్వాత నాలోచించెదములే యని పల్కి
యారాత్రి గదిలోనికిసంపి కవాటము తటాలునమూసిరి. నేను పూర్వమువలె తలుపుదరి

నిలఁబడక వెంటనే యతని మంచము చెంతకఁ బోయితిని. అంతలో నతఁడు దుప్పటము సవరించుకొనుచుండెను. నేనఁబోయి వాని బట్టపట్టుకొని సిగ్గున మాటాడలేక దాపున నిలువంబడితిని.

దానికతండు భయపడుచు లేచి కూర్చుండెను. నేనును మెల్లన గాళ్ళకడ గూర్చుండి పాదము లొత్తఁబోయిన ముడిచికొనియెను. పిమ్మట నేను గంధము మేనికి నలందఁబోయిన ముడిచికొనియెను. అప్పుడు నేను ఓహో! మోసమువచ్చినది. మొదటి దినంబున బల్కరించితిని కానని యీతండు కోపమువహించెను. తెలిసికొంటిని. తలంచి కొన నాదేతప్పు. మగవారితో సమముగా నాడునాండ్రు పంతము పట్టవచ్చునా? అని పశ్చాత్తాపము జెందుచు నతని మనంబునంగల కోపముదీర్ప నుపాయంబెద్దియో అని యూహింపుచు గొంతసేపు పూసురటిం బుచ్చుకొని వీచితిని. మఱికొంతసేపు వీణం బూని పాడితిని. కొంతసేపు శాస్త్రచర్చలందు విశేషముల వెలయించితిని. దేనిచేత నైనను వాని మనస్సు రంజించినట్లు కనఁబడలేదు.

పిమ్మట బసిడిపళ్ళెరములోని భక్ష్యములెత్తి చేతికందిచ్చిన నవి యందుకొని తినదొడఁగెను. దాన గోపముదీరెనని సంతోషముజెందుచు వలదనుదాక నందిచ్చితిని. తృప్తుడైన వెనుక మాట్లాడింపం జాలుదునని పాలొకచేతను నీరొకచేతనుబూని పాలుకావల యునా? నీరు కావలయునా! అని యడుగగా బాలున్న చేతిదెస గన్నులు త్రిప్పుచు సైగజేసెను. దానం బక్కున నవ్వుకొనుచు బాలు దాహమిచ్చి వెనుక కప్పురతాంబూలము మడుపుల నోటికందియ్య నందుకొనక చేతితో బుచ్చుకొని నోటిలో వైచి కొనియెను.

అదిచూచినంత నాస్వాంతమున గొంతవింత యంకురించినది. కానిమ్ము విచారించెదగాక అని మంచముమీఁద గూరుచుండఁ బోయిన నతండు భయపడువానివలె నొకప్రక్కకు నొదిగెను. అంత నేను తెగువంబూని ప్రాణేశ్వరా! పెక్కుదినంబుల నుండి మిమ్ము వరించి పెద్దయాసతో దరికిరా బల్కరింపక నలుకమై ముసుంగు బిగించి యుండుట న్యాయమేనా? ఒకవేళ నాయందు తప్పున్నను సైపవలయునుగాని బింకము వహించి యుండఁదగునా? మీరు కోపము బూనిన నేనేమి సేయుదాన నెవ్వరితోఁ జెప్పు కొందును. మన్మథబాణ పీడితనై మిమ్ము శరణము వేడెద రక్షింపుడు రక్షింపుడని పాదములంబడిన నా బుద్ధిమంతుడు నాచేతులం బట్టికొనుచు నిట్లనియె.

ఏమమ్మా! కోపమువచ్చినఁ గదా కోపము సేయకుమని పలుమారు తర్కింపుచు నాపాదములం బడుచున్నావు నాకోపపు పనలేమికతనంగాని యిట్లంటివి. నీవుపెట్టిన యప్పములం దింటిని తాంబూలము నమిలితిని పాలు త్రాగితిని యింకేమి సేయవల యును. నీవు గొప్పదానవు నాకిష్టముపుట్టిన పదనట తప్పా! పెండ్లి చేసెదమని తీసి కొనివచ్చిన వచ్చితిని కాని నీవిట్లు నిందింతువని తెలిసిన మొదటనే రాకపోవుదును.

ఇప్పుడైనను పొమ్మనిన బోవుదునని యతిమూర్ఖముగా బలుకుచున్న వానిమాటలాలించిన నాకు కొంతసేపేమియు దెలిసినదికాదు.

ఇది స్వప్నమా ? నిక్కువమా ఇంద్రజాలమా ? విభ్రమమా ? యని కొంతసేపు బ్రమసువలె నట్లే నిలువంబడి క్రమంబున ధైర్యము గరపుకొని హృదయమా తొందరపడకుము. ప్రారబ్ధ మీరీతినుండ మరియొకలాగెట్లగును. నేటితో వీని తెలివియంతయు బేటపడినది. ఈతడు ప్రపంచపుధోరణి యేమియు నెఱుంగడు. దాననే వీని గురువు కింకరశాస్త్రియని పేరుపెట్టెను. అది గ్రహింపలేక లేనిపోని యర్థములుచేసి గోతిలో బడితిని. నా చెలికత్తె మొదటనే చెప్పినది. దాని మాట యింతయైనను విమర్శించనైతిని. "బుద్ధిః కర్మానుసారిణి" అను వచనంబేమిటికిఁదప్పును. కాకున్న మాతండ్రియైనను బరీక్షింపరాదా! యెరకై కమపడి బకిళముసం దగులుకొనిన మత్స్యములాగున వీని యందమునుజూచి మోసపోయితిని. పీడించుకయైనను లోకధర్మములను గురుతెఱుంగఁడు. కటకటా! కేదారేశ్వరస్వామీ! పెక్కు దినంబులనుండి నిన్నాశ్రయించుచుదానికి మంచి యుపకారమే చేసితివి. అయ్యో విశాలాక్షీ! నీవరంబునం బుట్టిన నాకిట్టి వెట్టిమగనిం గట్టిపెట్టితివా? అన్నన్నా! విశ్వనాథా! నీ పేరుని కిప్పు రాలనని నీవైననుగొంచము దయయుంచవైతివి. నాకింతవిద్యయు రూపమేటికిఁ గలుగవలయును. స్త్రీల సౌందర్యమును బతిసౌఖ్యమే ఫలముగాఁగలదిగదా? ఇంక నా తెలివితేటల నెవ్వరిముందర వినియోగపరచుదాన. నెవ్వరు సంతోషించిన నేమిలాభము. సంతోషింపఁదగిన వాఁడిట్టివాడైయుండ నేనెట్లు సలుగురలోఁ దలయెత్తుకొని తిరుగుదును. ఈ రెండుపాళ్ళకే నాసఖులు నన్నుఁ బెక్కుగతుల నిందింపుచున్నారు. వారితో నేమని చెప్పుదును. ఏమిచేయుదును. అని పరిపరి గతులఁ దలపోయుచు నాకునేన యుపశాంతింపరచుకొని కన్నుల నేకధారగా నీరుగారుచుండ నాకవదలక మగలనతనితో నిట్లంటిని.

బ్రాహ్మణుడా! నీతో పరిహాసమున కట్లంటినికాని నీవేమియుఁ గోపము సేయలేదు. నీవెవ్వనికుమారుఁడవు. నీ దేశమెద్ది! నీ పేరేమి? ఈ గ్రామ మేమిటికి వచ్చితివి? ఇంతకుపూర్వ మేమిచదువుకొంటివి? ఇప్పుడేమి చదువుకొనుచున్నావో యదార్థముగా జెప్పగలవా? అని అడిగిన నతండిట్లనియె. అమ్మా! అవి యేమియు నాకు దెలియవు. మాగురువుగారు కింకరశాస్త్రి యని పిలుచుట మాత్ర మెఱుంగుదును. రామశబ్దము చదువుచున్నాను. అది మొదలుపెట్టి యారుమాసములయినది యింకను రాలేదు. ఏదినమున కాదినమే మరచిపోవుచుందునని యుత్తరము సెప్పిన మనస్సు రాయిచేసుకొని నేను వానితో నిట్లంటిని. బ్రాహ్మణుడా! నీవు నన్ను అమ్మ అని పిలువరాదు. నీకు నేను భార్యను. భార్యయన నెట్టిదో యెఱుంగుదువాయన నెఱుంగనని తల్లదిప్పెను. అప్పుడు నేను గుండెలుబాదుకొనుచు ఛీ ఛీ, దైవమా! నన్నెంత బాగు సేసితివి? నావిలాసములన్నియు నడవిగాసిన వెన్నెలం జేసితివిగదా? నాపూర్వకర్మ

మంత యుగ్రమైనదా అని తలయూచుచు దరంగముల తెరంగున మనంబునం బొరము శోక పరంపరల నణగ్రదోయుచు మరల వానితో బ్రాహ్మణుడా! భార్య యనగా నెప్పుడును విడువఁదగనిది. కావున నీ వెన్నడును నన్ను విడిచి యుండకుము. మరియు నీవు కొన్నిపనుల చేయవలసి యున్నవి. నేను జెప్పినట్లు నడిచెదవా అని అడిగిన దాని కొడంబడినట్లు తల్రదిప్పెను.

పిమ్మట నేను బూవులన్నియు నలఁపుకొని మేననెల్ల నఖదంత చిహ్నముల జొదమజేసి పురుషక్రియలన్నియు మేనగనబడ మనంబునం బెక్కు తెరంగుల జింతించుచు స్వయంకృతాపరాధమునకు వగచుచు నీగుట్టుబయలైనదో పదుగురు నవ్వుటయేకాని లాభమేమియు లేదనుచు నైదువతనంబు బాగున్నంజాలునని విరక్తి బూనుచు నొకమంచముమీఁద బరుండి ధ్యానించుచు నిదురించుచున్నంత నీవు శోకింప వలదు నీకుముందు మేలయ్యెడినని యొకముత్తైదువవచ్చి చెప్పినట్లు కల వచ్చినది.

ఆహాహా! ఇట్టివాడు నాకు మగడయ్యెంద నింకరాబోవు మేలెద్దియో? పతి సౌష్ఠవముగాక సతులకొండెద్ది సంతోషము నిచ్చును? నన్నుజూచి దైవజ్ఞులు నీవు మిగుల సదృష్టవంతురాలవై మంచి బాల్యయౌవనములఁగలదాన వగుదువని చెప్పువారు. ఈ కలయు వారిమాటలవంటిదే యగునని విరక్తిబూని యుదయంబునలేచి నాస్త్రీమగడు విడిదికి బోయిన వెనుక నా చెలికత్తెల గలిసికొంటిని.

అంతవారు నాయవయవముల బరిశీలింపుచు సఖీ! ఈ రెండు దినములు నీ బతి చమత్కృతియంతయు దాచితివిగాని యీనాఁడు దాచలేకపోయితివేమి? నీగుట్టం తయు తెలిసినదిలే. పాపమీ గోరుగీటు లింతమోటుగా నున్నవేమిటి? నీమగనివిన్నాణ మిపియే చెప్పుచున్నవి. కొంచెము గంధమలందుదుమా? వాతెర యీ తెరగున నున్న దేమి? రక్తము స్రవించుచున్నది. మేలు మేలు రతిపారవశ్యమంత వింత గాబోలు అన్నన్నా! నీకన్నులు శోకనదశోభ వహించియున్నవి. యించుకయైన నిదురలేదా యేమియని పెక్కు తెరంగుల నన్ను బరిహాసవచనంబులవేఁపు చున్నంత వారి మాట లన్నియు నాహృదయశోకాగ్ని కింధనములైనను మరుగుపరచుచు లేనినవ్వు తెచ్చు కొని యప్పటికి దగిన యుత్తరములు చెప్పి వారినిగూడ సంతసపరచితిని.

అది మొదలా కింశుకశాస్త్రిని బైటికి రానీయక సంతతము నంతఃపురమందె యుంచుకుని యాగుట్టు బైటపడకుండ వానికి నిత్యము లోకవ్యవహార ధర్మములు నేరఁపుచుంటిని. కాని వానికేదినమున కాదినమే క్రొత్తగా నుండునది ఈరీతి గొన్ని దినములఁజరిగినంత మా దురదృష్టవశమున నాతండ్రి హేమాంగదుడు పరలోక గతు డయ్యెను. మాతల్లియు నతనితో నగ్నిజొచ్చినది. పిమ్మట మంత్రులు నామగనికి బట్టాభిషేకము సేసిరి. నిత్యము నేనెంతో బోధజేసినను వాని తెలివితేటలు మంత్రులకే కాక ప్రజలకుగూడ స్వల్పకాలములోనే వెల్లడియైనవి.

అప్పుడు మంత్రులీతడు రాజుగా నుండుటకు దగడనియు వీని బుద్ధిబలము ప్రజల యోగక్షేమములకు సమర్థము కాదనియు వీనియసామర్థ్యమువిని శత్రురాజులు సంఘముగా గూడుకొని రానున్నట్లు చారులవలన దెలియవచ్చినదనియు దీనికి నీవేమి యుత్తరమిత్తువో చెప్పుమని నాకొక పత్రిక నంపిరి. దానిం జదువుకొని యేమి చేయవలయునో తెలియక యాలోచించుచు ప్రత్యుత్తరము పంపుటకు రెండు మూడు దినములు జాగుచేసితిని. ఇంతలో మరల జాబు వచ్చినది. దాని విప్పి చదువుకొనిన నిట్లున్నది, మేము మీకు మూడుదినముల క్రిందట నొక పత్రిక నంపితిమి. దానికుత్తరము వ్రాసితిరికారు. ఇప్పుడు పెక్కండ్రు రాజకుమారు లొక్కటియై చతురంగ బలముతో మన పట్టణము ముట్టడించిరి. వారితో బోర మనకుదగిన సేనలులేవు ఈ రాత్రి కోటవశపరచుకొందురని ధ్వని పుట్టినది. కావున నిక నెవరిమానము వారు దక్కించుకొనదగినదేగాని వేరుసాధనములేదు! తర్వాత మీచిత్తము అని వచ్చిన రాజుల సంఖ్యయు, నామములు వ్రాసియున్న యాచీటిం బలుమారు శోధించి యోహో! ఈ వచ్చిన రాజపుత్రులందరు పూర్వము నన్ను వరించినవారే. తమ్ము వరించితినికానని యీర్ష్య మనంబునంబెట్టికొని యిప్పుడు సమయము కనిపెట్టి యూరు ముట్టడించిరి. ఇక మేమిచ్చట నిలిచినచో మమ్ము జెరపట్టక మానరు. కష్టపరంపర లిట్లొండొంటఁ బయింబడుచుండ నొంతుపలంపవలసినది యేమున్నది. కానిమ్ము కర్మసూత్రమెట్లుండు నట్లుకాక మానదుగదా? జీవమున్నంతవరకు జికిత్స చేయవలయును. శాస్త్రరీతి నిప్పుడీకోట నుండి మేము తప్పించుకొనిపోవు నుపాయ మాలోచింపవలసియున్నది. ఇట్టి యాపదలు వచ్చినప్పుడు కోటదాటిపోవ బ్రచ్ఛన్న మార్గంబులు గోటగట్టునపుడుంచు నాచారము గలదు. దీనికి నెందేని దారియుండక మానదని యూహించుచు కోటలో నలుమూలలు వెదకింపదొడంగితిని. కాని యాకోటనంతయు బరిశీలింపుటకు బెక్కండ్రకు నాలుమాసములు పట్టును. అప్పుడు మరల నాలోచించి రహస్యపుస్తకములు వెదకింప నొకదానిపై గోటలోని రహస్యముల గ్రంథమని వ్రాసియున్నది. దానింబుచ్చుకొని పరిశీలింప శత్రువులు కోటముట్టడించినప్పుడు వారు లోనికి జొరకుండ జేయ గోటచుట్టును నమర్చియున్న యంత్రముల విషయమై పెక్కు వ్రాయబడి యున్నది. అది యంతయు బరిశీలింపగ చివరకు పోవబోవ బావి పోవు దారి సంగతి వ్రాయబడియున్నది. దానిని వ్రాసిన వారిని బెక్కుగతుల నుతింపుచు దాని రీతినంతయు నిదానముగా విమర్శించి యెవ్వరికిని దెలియకుండ రాత్రివేళ నా మగని మాత్రము వెంటబెట్టుకొని ఈ గుఱ్ఱమునకు జీను గట్టించి వెలువగల రత్నములు గొన్నిటి మూట గట్టుకొని యాగూఢద్వారము దాపునకు బోయితిని. ఆ గుమ్మముచెంత నమర్చిన యంత్రముల చిత్రమునకు వెరగుపడుచు దాని తలుపు

తెరచు విధము పుస్తకము చూచి తెలిసికొంటిని. వేరొక విధమున బ్రహ్మకు దెలియదు.
ఆహా! పనినమర్చిననాడెంత నేర్పరియోగదా? తలుపు తెరచినంత గుహలాగున విశా
లముగా నొకబిలము గనంబడినది. మేమీగుర్రముతో నా గుహలో ప్రవేశించి యాపుస్త
కములో చెప్పిన చొప్పున మరల నాతలుపు మూసితిని ఆ పుస్తకమును విడువక
యాదరింపబడి నడువఁజొచ్చితిమి. అందు నడుమ నడుమ గొప్ప మాణిక్యముల నమర్చి
యుండుటచే నిండైన చీకటిలేక పట్టపవలు లాగున నున్నది. రాజవీధివలె నొప్పుచున్న
యాబిలములో నీగుర్రము నెక్కి నామగని వెనుక నెక్కించుకొని కళ్లెము పట్టుకొని
కొంతసేపు మెల్లగా గుర్రమును నడిపించితిని

నామగనికిఁ దురగమెక్కు పాటవము లేదు కావున నే మాత్రము గుఱ్ఱ
మును వడిగా నడిపించినను నా నడుము బిగ్గరగాఁ బట్టుకొని మొఱ్ఱోయని యరచు
వాఁడు. వెరవకుము. నా నడుము గట్టిగాఁ బట్టుకొనుము నీకేమియు భయములేదు.
కొంచెము వేగముగా నడిపించినంగాని యీ బిలముదాటి పోలేమని నేనెంత చెప్పినను
నతని భయము పోయినదికాదు. అతఁడట్లెంత యరచినను నడుమ నడుమ వడిగా
నడిపించుచు మరల మెల్లగా పోలుచు ఈరీతిని బెద్దదవ్వుపోయితిమి. అందు దిన
రాత్రి విభేదము తెలియదు. కావున నెంతకాలము నడచితిమో యెఱుఁగము. ఆకలి
యైనప్పుడు నేనుఁదెచ్చిన పచ్చిపిండి పంచదారతోఁ గలిపికొని తినువారము. అట్లు
నడుమ నడుమ నిన్నటి సాయంకాలమునకు వియ్యాడవిలోనున్న యొక పర్వత శిఖ
రమునకు వచ్చితిమి. ఆ బిల మాకొండ శిఖరమున కమరించినట్లు పుస్తకములోనే
యున్నది అచ్చటనొక విచిత్రమైన కవాటము గలదు. అది యడ్డము వచ్చినతోడనే
యాపుస్తకమును జూచి యది తలుపుగా గ్రహించి తదుక్తపద్ధతిని నా తలుపు తెరచుకొని
కొండమీదికి వచ్చితిమి.

అప్పర్వత శిఖరము మీదనుండి చూచినఁ బరమేశ్వరుండైన నాద్వార రహ
స్యము తెలిసికొన జాలఁడు. అప్పుడు నేనాపుస్తకమునే జీవనౌషధముగాఁ దలంచి
దానిఁ గన్నుల నద్దుకొని యీగుమ్మము దాపున నొకచోట రహస్యముగాఁ బెట్టితిని.
మరియు నాబిలవిశేషముల పరిమాణములు పెక్కులాపుస్తకములో వ్రాయబడి
యున్నవి. కాని యాపత్సముద్రమున మునింగియున్న నాకు వానిఁబరామర్శింప
నిష్టము లేకపోయినది. పిమ్మట నేనొకచేత గుర్రపుకళ్లెము రెండవచేత నామగనిం
బట్టుకొని మెల్లన నాకొండ శిఖరమునుండి భూమికి దిగియుండున్న మార్గమునంబడి
నడువఁజొచ్చితిమి. కొంత దిగువరకు చీకటిపడినది. అందు నిలిచినచో క్రూరమృగములు
బాధించునేమోయని గుఱ్ఱమును దిగకయే రాత్రియంతయు నడిచితిమి. ఇట్లు నడచుచు
నింకను రాత్రిశేషమున్న సమయంబున శత్రువులచేత చిక్కక బైట బడితిమిగదా?
ఇది యాపదలో మేలని తలంచుచు గమ్యస్థాన మరయుచున్నంతలో బ్రాంతమున నొక
వేలాల భయంకరముగా క్రూరసత్త్వ ధ్వనియొకటి వినబడినది. దానికి వెరచి యదరిపడి

యీ గుఱ్ఱము నేనెంత కళ్ళెము బిగియబట్టినను లక్ష్యముసేయక యెగిరి యెగిరి యతి వేగముగా బరువెత్త జొచ్చినది.

ఇక చెప్పవలసినది యేమున్నది! మొదటి గంతులోనే గుఱ్ఱముపై నిలువలేక యరచుచు నాపెనిమిటి తటాలున దబ్బున క్రిందుగా నేలబడియెను. కన్నులార జూచియు గుఱ్ఱమునాపలేక యింతదూరము దాటి వచ్చితిని. వాయువేగముగా బరువిడి వచ్చిన యీ గుఱ్ఱము యిప్పటికి వచ్చియాగినది. అతడు పడినతావు మిగుల దూరముగా నుండవచ్చును. అప్పుణ్యాత్ముండిపాటికి నాకలోకసుఖం బనుభవింపుచుండును. పాప మాయన నేనేమి చెప్పినను దానింజేయువాడుగాని నామాట నించుక యతిక్రమింప లేదు. దైవమువంటి పెనిమిటింజంపిన పాపాత్మురాలను, గ్రుక్కెడు ప్రాణమునకై యాసపడినప్పుడు గదా యిన్ని చిక్కులం బడ వలసి వచ్చినది. ఇంక నీజన్మమునకు నాకు సుఖము గలుగదని తలంచి ప్రాణము పోగొట్టుకొన నురి కంఠమునకు దగి లించికొంటిని ఇంతలో మీ దూతలువచ్చి నన్నాటంకపరచిరి. పిమ్మట మీరు వచ్చితిరి గదా ? ఇదియ నా వృత్తాంతము నన్ను జావనిండు మీ పాదములకు మ్రొక్కెదనని యేడ్చుచు నాచిన్నది మిక్కిలి బ్రతిమాలుకొన్నది.

అట్లు విశాలాక్షి వృత్తాంతమువిని యింద్రద్యుమ్నుండు పెక్కు గతుల బొక్కుచు నయ్యో ! తల్లీ ! నీవా ! నీతండ్రి నాకు బినతల్లి కుమారుడు. అతండు మృతుండైన వార్త నేను వినలేదు. కటకటా ! నీవు తగని యిడుములంగుడిచితివి. చింతింపకుము. నీమగడు సురక్షితముగా నున్నట్లు నీ మొగమే చెప్పుచున్నది. అది యిసుకనేల యగుటచే గ్రిందబడినను దెబ్బ తగులదు. నీపెనిమిటిని శ్రీఘ్రమ వెదకి తెప్పించి నీతో గూర్చెద. నావెంట రమ్ము పోదము శిబిరంబున మీ పినతల్లి యున్నది.

అని బల్కి యాదార్చుచున్న సమయంబున దన శిబిరము వైపున హల్లకల్లోలముగా, గోలాహలధ్వని వినంబడినది. అదేమియోయని దృష్టి నాదెసకు బోనిచ్చి విమర్శింపుచుండ గొందరు రాజభటులు పరుగున వచ్చుచున్నట్లు గనబడినది. వారిరాకకు వెరచుచు నారాజు కొంచెమెదురు నడిచి యింత తొందరగా వచ్చుచున్నా రేమి యని యడుగుచుండగనే యొగిర్చుచు స్వామీ ! యా సింహమువచ్చి మన సేనలనెల్ల చెల్లాచెదరు చేసినది. ఏనుగులు గొలుసులు ద్రెంచుకొని గుర్రములను, గాల్బలములను నుగ్గునుగ్గుగా ద్రొక్కుచు బారిపోవుచున్నవి. సింహము సేనానివేశము చుట్టు కొరవిత్రిప్పినట్లు తిరిగివచ్చి ముందు గజముల భుజింపుచున్నది.

దేవిగారి కేమిహానము వచ్చునోయని వాహినీపతు లందరు భయపడుచున్నారు. దేవరవారు త్వరగా విచ్చేయవలయునని పలికిన నులికిపడుచు గడువడిగా గుర్రమునెక్కి యచ్చటికి బోవుచుండ మరి కొందరరుగువచ్చి దేవా ! యాసింహ మిప్పుడే యీ వైపుగా బోయినది. అది యొకచోట నిలిచియుండదని చెప్పిన నాదెసకు

గుఱ్ఱమును దోలెను. సాయంకాలము వరకు నయ్యడవి యంతయు దిరిగినను సింగము గనంబడలేదు. అంత మరునాడుగూడ వెదకుచు బోయినను దృష్టిగోచరము గాలేదు. ఈరీతి బదిదినములు దారి తెలియక చూచిన పొదలే చూచుచు జొచ్చిన కోనలే చొచ్చుచు దిరుగుచుండగా నొకకోయపల్లె గనంబడినది.

ఆ పల్లెలోనికి బోయి వాండ్ర నందఱింజీరి యోరీ ! యీ యడవిలో దిరుగుచున్న సింహమీ పెడకు రాలేదుకద ! దానిజాడ మీకేమైనం దెలిసినదా ? యని యడిగిన నవ్వుచు వాండ్రిట్లనిరి. సామీ ! మీకు దెలియదుకాబోలు ! సింగము సచ్చి పదిదినములైనది. దాని మాంసము మేమే తింటిమి. పదిదినములనుండి నిర్భయముగా నిదురించుచుంటిమని చెప్పగా నతండాశ్చర్యము జెందుచు నేమేమీ ! సింహము చచ్చిపోయినదా ! దాని జంపిన బలశాలి యెవ్వడు ? మా యోధుడా లేక మరియొకడా ? తెలిసినచో జెప్పుడని యడిగిన వాండ్రిట్లనిరి.

అయ్యా! అతండు మీయోధుడో మరియొకడో మాకు దెలియదు. పది దినముల క్రిందట యుదయమున మాయూరివారు కొందరు పొలమునకు బోవుచుండగా నొక పుంతదారిలో నొకడు పడియుండెనట. వానికి మొలలో కత్తియున్నది. మంచిదుస్తులు ధరించియున్నవాడు. నీవెవ్వడవని యడిగిన స్మృతిలేనందున గన్నులు మాత్రము తెరచెనుగాని మాటాడలేదు. పిమ్మట వాండ్రు వానిని దప్పికొని యున్నవానిగా నిశ్చయించి వెదురుగొట్టములోనున్న నీటిచే నతని స్నానము చేయించిరట. దాన దెప్పిరిలి యతడు లేచి కూర్చుండి వానితో నేదియో మాటాడబోవు సమయమున సింగము సింగమని యరచుచు నీ పల్లెలోనివారెల్ల నామీదుగా బారిపోవ దొడంగిరి.

అప్పుడమ్మహాపురుషుండు తనకట్టిబల మెచ్చటినుండి వచ్చినదో వెరవకుడని పలుకుచు లేచి వరనుండి కత్తిదీసి యాసింహమున కెదురుపోయెను. అదియు గాండ్రుమని మీదికురికిన బెడిదంపుటడిదము వ్రేటున దానిం బరిమార్చెను. పిమ్మట మేమందరము ముక్కలుముక్కలుగా నరికి మాకసిదీరునట్లుగా నేటివరకు దాని మాంసమే తినుచుంటిమి. ఆవీరుడంతట నేదియో ధ్యానించుచు గన్నీరు నించుచు మేమెంత స్తుతియించుచున్నను సంతసింపక తనతోవన బట్టిపోయెను. అని చెప్పగా విని యారాజు వెరగుపడి యోహో ! అతండు విశాలాక్షి మగడు గాడుగద. వానికంతబల మెచ్చటినుండి వచ్చినది ? మొదట చిహ్నములన్నియు వానివిలాగేయున్నవి. అట్టి వాడైనచో విశాలాక్షికి చింతయేల గలుగును ? పాప మయ్యయో ! విశాలాక్షి మాట మఱచిపోతినే ? సింహవార్తలచే దటాలున జనుదెంచితినని అమె పిమ్మటనేమయ్యెనో ! వేగబోయి యరయవలయునని నిశ్చయించి యాగుఱ్ఱమెక్కి వడిగా నామార్గమునం బట్టిపోయెను.

అతండెంతవడిగా బోయినను నాలుగు దినములకుగాని యచ్చటికి జేరలేక

పోయెను. అందుముందు సేనానివేశస్థానమే కనంబడినది. శిబిరమంతయు దున
కిలై పడియున్నవి. ఏనుగులు గుర్రములు కాల్బలము నుగ్గయియున్నవి. భటులెవ్వరును
లేరు. అప్పుడారాజు భార్యందలచుకొని అయ్యో ? నిన్ను నిష్కారణ మీ యడవిపాలు
సేసితినే. నీ విషయమంతయు బరామర్శింపనైతిని అక్కటా ! అక్కల ఫలంబిది
కాబోలునని పరిపరిగతుల శోకించుచు ఉద్విగ్ధాంబరయ కొంచెము దూరముపోయెను.
అప్పుడొక చెట్టుమీదనుండి యొకడు స్వామీ ! యని కేకలుపెట్టెను. ఆ కేకలు విని
యింద్రద్యుమ్నుడు తల పైకెత్తగా నందు మనుష్యుడున్నట్లు కనబడిన నిలువంబడి
నీవెవ్వడవు ? చెట్టుపైన నేటికుంటివని యడుగగా వాడు మెల్లన చెట్టుదిగివచ్చి
మ్రొక్కుచు నిట్లనియె.

దేవా! నేను దేవరపరిచారకుడ సింహభీతిచే జెట్టెక్కితిని. మీరెచ్చటనుండి
వచ్చితిరి ? సింహమేమైనది తెలుపుడని యడిగిన నారాజిట్లనియె ఓరీ ! సింహము
చచ్చి పదిదినములైనది. నీవెఱుగక యింకను జెట్టుపైనేయుంటివి మరియు మన సైన్య
మంతయు నేమైనది ? నా పట్టమహిషి కుశలముగా నున్నదా ! ముందు జెప్పుమని
యడిగిన వాడిట్లనియె. స్వామీ ! మాయమ్మగారి కేమియు గష్టములేదు. సింహము
విజృంభించినతోడనే చుట్టును బలములాయుధపాణులై తోడనా బల్లకినెక్కి పట్టణము
నకు వెళ్ళినది. వాహినీపతియు సహాయార్థమై యామె వెంటనే పోయెను. ఆమెను
సురక్షితముగా నీపాటికింటికి జేర్చును దేవరవారికివర్తమానము జెప్పుటకు దండ నాయ
కుడు నన్నిందుంచెను. నేనును దేవరరాకకై వేచుచు సింహభయమున నీ చెట్టుపైన
నిలిచితిని. ప్రాణమన్న నందరకు భయమెగదా ? మిమ్ముంజూడగంటి. నాకు మరల
ప్రాణములువచ్చినవి. ఇంతవరకు నాసింహమెప్పుడు వచ్చునోయని యొంటిప్రాణముతో
నుంటిని. అమ్మగారి రక్షణము మిషపెట్టుకొని యీ భయముచేతనే యందరు నింటికి
బోయిరి. ఇదివరకెన్నడును నిట్టి భయంకరమైన మృగమును చూచియుండలేదు.
దానిని దేవరగాబట్టి చంపిరి. మరియొకరు చంపలేరని స్తుతిజేయ మొదలుపెట్టెను.

అప్పుడారాజుభార్య సురక్షితముగా నున్నందులకు సంతోషించుచు సింహము
చచ్చినరీతి వానికిజెప్పి యొకచీటివ్రాసి తన కుమారుడు విజయునకిమ్మని చెప్పి వాని
నంపెను. పిమ్మట నమ్మనుజనాయకుడు విశాలాక్షి క్షేమమరయుటకై వెదకికొనుచు
మునుపుచూచిన తావునకరిగెగాని యందామెజాడ యేమియులేదు. గుర్రమును గనబడ
లేదు. గుర్రపుటడుగులు మాత్రమెచ్చటికో పోయినట్లు చెప్పుచున్నవి. ఆపథచిహ్న
ములబట్టి కొంతదూర మయ్యడివిలో వెదకజొచ్చెను "విశాలాక్షీ" యని పెద్ద
యెలుంగున బిలువజొచ్చెను. ఎందును విశాలాక్షి యున్నట్లు కనంబడలేదు. పిమ్మట
సతండాప్రాంతమందున్న కోయపల్లెలకుబోవుచు నాపూబోడి వృత్తాంతమడుగు
చుండెనుగాని యెవ్వరును నేజాడయు జెప్పలేదు.

మిక్కిలి పొడవగు నక్కానలో నమ్మానవతిని వెదకుచుండ నారుమాస
ములు గతించినవి. అప్పుడతండు విసిగి యా చిన్నది చెప్పిన కొండకు గురుతుగా
బోయెను. అప్పర్వతశిఖరమెక్కి యక్కలికి చెప్పిన చిహ్నంబులన్నియు నరయుచు
నెట్టకేలకు నాపుస్తకమును గనిపెట్టెను. అది యందుకొని యందులోని విశేషము
లన్నియు జదివి యౌరా! విశ్వకర్మసృష్టికాని యది మానవసృష్టి కాదు. ఇట్టికోటలు
గలిగినచో శత్రువులేమి చేయగలరు. ధైర్యమాపలేక విశాలాక్షి పారిపోయినది గాని
దానిలో జెప్పినట్లుండుండి నడిపించినచో బ్రపంచమంతయు నేకమైవచ్చినను నేమియు
జేయలేదు. అన్నన్నా! ఇట్టికోటను గూడ శత్రువులుబట్టుకొనిరే. దైవగతి యసాధ్య
మైనదిగదా? అని పెక్కువిధముల దర్కించుచు నాపుస్తకమునం దున్నరీతి నాతలుపు
తెరచి యాబిలములజూచి వాని విశేషములకు వెరగందుచు గొంత దూరము
పోయెను.

ఇప్పుడు నేనుబోయినను లాభమేమియులేదు. విశాలాక్షి యాద్వారమున
గోటలోనికి బోవనట్లాపుస్తకమే చెప్పుచున్నది. అట్లేగివున్న నీపుస్తక మిందుంచదు.
అచ్చేడియ బైటనెక్కడనో యున్నది కావున నేనిప్పటికి మరలి యత్తలిరుబోడిం గలిసి
కొని పిమ్మట నీబిలమార్గంబునబోయి పగరంబరిమార్చెదనని నిశ్చయించి యందుండి
మరలబైటికివచ్చి యాతలుపుమూసి యాపుస్తకమును బుచ్చుకొని కొండదిగెను.

తురగమెక్కుపాటవముగల యప్పాటలగంధి యింతదనుక నియ్యటవిలో
నేమిటికై యుండును. ఈపాటికెవ్వేటికైనం జేరకమానదు. కావున నిక నీకానలో నర
యుటమాని పురంబులకుబోయి వెదకెదను. విశాలాక్షి మగడైనను విపినమందేటికి
యుండును. తెలియక నిన్నాళ్ళరక యలసితిని. వారియవురంగూర్చి కాని యింటికి
బోనని మొదటనే శపథము చేసితినిగదా? వారు బ్రతికియుండినచో నెప్పటికైనను
గూర్పక మానను. వారు సజీవులైయున్నందులకు మదీయ మానసంబే తార్కాణము.
అని తలంచుచు నయ్యరణ్యమార్గము విడిచి గ్రామములమీదుగా నడువజొచ్చెను. ప్రతి
గ్రామమునకు దప్పక పోయి వారిజాడ నరయుచుండ మరియు నారుమాసములైనవి.
అదివరకెన్నడును గనిపిని యెఱుగనియొక విదేశమార్గంబునంబడి పోవుచుండ నాదారి
యొకనాటి సాయంకాలమున కొకపట్టణము దాపునకు దీసికొనిపోయినది. అందొక
పురుషుం డెదురుపడినవాని కిందిచ్చుసున్నం బిట్లనియె.

# మళయాళ దేశము కథ

అయ్యా ! ఈ దేశముపేరేమి ? ఈ పట్టణ మెవ్వరిది? ఇచ్చటి రాజధర్మము లెట్టివి ? ప్రజలెటువంటివారు ? ఇచ్చటినుండి మార్గ మెచ్చటికిగలదు విశేషములేమైనం గలిగిన వక్కాణింపుమని యడిగిన నా బాటసారి యిట్లనియె. అయ్యా ! ఇది మళయాళదేశము. దీనిని సంవత్సరము నుండి చంద్రవర్మ యల్లుడు సింహకేతుండనురాజు పాలింపుచున్నవాడు ఇందలి ప్రజలు శక్తి నారాధింపుచు విదేశస్థులువచ్చిరేని వారినిదాచి నవరాత్రిదినములలో బలియిచ్చుచుందురు. శ్రీం పెత్తనమధికము సింహకేతుడు కడు ధర్మాత్ముడు సంవత్సరనుండి యిచ్చటి దురాచారము కొంచెము తగ్గించెను. నీ వీ చిక్కుల నెరుగవు కాబోలు నిందెవ్వరింటను బసచేయకుము ఆ రాజుగారే విదేశస్థులకై సంవత్సరము క్రిందట నొక సత్రము నూతనముగా గట్టించినారు. అచ్చటికి బొమ్ము భోజనము పెట్టుదురు. గ్రామస్థుల మాయలంజిక్కకుండ రాజభటులు కావలియున్నారు. నేనును విదేశస్థుడనే నిన్న నౌకపనిమీద నిచ్చటికివచ్చి యాసత్రములోనే భోజనము చేసి మా యూరికి బోవుచున్నాను. వెనుక పరదేశస్థుని బలాత్కారముగా బట్టుకొని పోవువారు. ఇప్పుడు చాలాభాగము తగ్గినది బనను, శ్రీలయెడ కడు జాగ్రత్తగా నుండ వలయును. లేనిచో మోసపుత్తురని యిచ్చటి విశేషము లన్నియుం జెప్పెను.

ఇంద్రద్యుమ్నుండాలసి మాటలువిని సంతసింపుచు అయ్యా ! నీవు కడు పుణ్యాత్ముడవు. ఈ పట్టణము గుట్టంతయు జెప్పితివి. లేకిచో నేను గూడ మోసపోవు దును కొత్తవారి కేమి తెలియును. అని యతని స్తుతిజేయుచు వానిచేననిపించుకొని గ్రామములో ప్రవేశించెను. ఇరు ప్రక్కలను చక్కనిమేడలపంక్తి యింపుగా గనంబడి నది ఆ సౌధంబులన్నియు సలంకారభూయిష్ఠములై కుబేరుని తిరస్కరించు నా గ్రామస్థుల యైశ్వర్యమును ప్రకటించుచున్నవి. అది చూచువారికి స్వర్గమోయని తోచక మానదు అన్నియు మేడలేకాని సాధారణమైన యిల్లొకటియులేదు. అంతకుమున్న తానుచూచిన పట్టణములలో నంత విచిత్రమైనది లేదు కావున నింద్రద్యుమ్నుడు దాని రీతి నెంతయు మెచ్చుకొనుచు వింతలజూచుచు నా వీథింబడి నడువజొచ్చెను. అడుగడుగు నకు నొకవిశేషము గనంబడుచున్న నిలబడి చూచుచుబోవ నాతనికి నడకసాగి నది కాదు. అరీతిని కొంత దూరముపోయి యొక మేడకడ నిలువంబడి యొకరిని అయ్యా! విదేశస్థులు నివసించు సత్రమెంత దూరమున్నదని యడిగెను.

ఆ మాటవిని యాయింటిలోనుండి యొకవాల్గంటి పసిండిబొమ్మయనందక్క తళుక్కుమని మేనికాంతులు నలుదెసల బొదల దటాలున జనుదెంచి అయ్యా ! ఇటు రండు. నపురు పరదేశస్థులుగాబోలు సత్రము పెక్కుదూరములోనున్నది. ఈ రేయి

నిచ్చట నుండి మాయిల్లు పవిత్రము సేసి యుదయమున పోవచ్చును. మీకిష్టమువచ్చి నట్లు భోజనము పెట్టుదుమని యతివినయముగా బ్రార్థించినది.

దాని మృదుమధుర గంభీరవచనములకు వెరగుపడుచు నింద్రద్యుమ్నుండు ఓహో! ఈ చిన్నది మిగుల పతివ్రతగాగున దోచుచున్నది. సౌందర్యముగలిగి గర్వమించుకయైనను బూనక యతిథి మర్యాద జేయుచున్నది. కొందరు మందమతులింటికి వచ్చిన బంధువునైనను తగురీతుల సత్కరింపరు. సాధ్వియైన భార్యవలన గదా యజమానునకు గీర్తిగల్గును. భార్యవశ్యురాలును, గుణవంతురాలును, పుత్రవంతురాలు నైన యెడల ధర్మార్థ కామములు దానియందేయున్నవని పెద్దలు చెప్పుదురు "భార్యామూల మిదంగృహ"మని దానంజేసియే పఠింతురని పెక్కుగతుల మెచ్చుకొనుచు నింతలో బాటసారిమాట జ్ఞాపకము వచ్చుటచే పయ్యిందువదనతో సుందరీ! నేనిందునిలువను సత్రమునకు బోవలసిన యగత్యమున్నయది నీ యాతిథ్యమునకు సంతసించితి బోయి వచ్చెదనని పలికి యందుండి పయికినడచెను. మరి కొంతదూరము నడచి యొక యింటి యజమానునితో నయ్యా! పరదేశస్థులు నిలుచుటకై క్రొత్తగా గట్టిన సత్రమెంత దూరములో నున్నది. ఈ మార్గమున బోయిన బోవునాయని యడిగెను.

అప్పుడాగృహము నుండి యొకజవ్వని త్వరన మెదదిగి వచ్చి యతనిమది కచ్చెరువుగొలుపుచు నెదురుగా నిలిచి స్వామీ! మీరు పరదేశస్థులు సత్రము దూరములో నున్నది. ప్రొద్దుపోయినది యుదయమున బోవుదురుగాక. ఈ రాత్రి మా యిల్లు పావనము సేయుడని వేడుకొనినది దాని మాటలువిని యారాజు వెరగు జెందుచు నోహో! యీ యూరువారు మిగుల మర్యాద నెరిగినవారు. బాటసారి నాతో మరి యొకరీతిని చెప్పెను. ఇచ్చట నట్టి చర్యలేమియు గ్యారకముగా గనబడుటలేదు. సుగుణ సంపత్తిలేక నీయూరింత భాగ్యసంపన్నంబగునా? వానికేమితోచి యట్లనెనో కాని నాకంత విశ్వాసయోగ్యముగా గనంబడలేదు. కానిమ్ము మరియు బరీక్షించెదంగాక యని తలంచుచు బోటీ! నీమాటలకా నేను సంతసించితిని నా కచ్చోటికి బోవలసిన యవసరము కలదు. పోయివచ్చెద నేటి కానతిమ్మని పలికి యా యిల్లుదాటి మరికొంత దూరము నడిచెను.

ఆ రీతినడిగిన తావున నెల్ల నచ్చటియింటి చిన్నదివచ్చి లోపలకు రమ్మనివేడు కొనుచుండుటయు నన్నరవరుడద్భుతపడి తుదకు బాటసారిమాట బూటకముగా దలంచెను. అట్లు పెక్కిండ్లుదాటిపోయి మరియొక్కచోట నొంటి తెరగున సత్రమెంత దూరములో నున్నదని యడిగెను. ఆ మాట మేడమీద నుండివిని కృష్ణదాసునువాని భార్య ప్రజ్ఞావతి యనునది వడివడి మేడదిగివచ్చి దారికడ్డముగా నిలువంబడి వినయంబున నిట్లనియె. అయ్యా! తమదేశమెద్ది? యెచ్చటికి బోవుచు నిచ్చటికి వచ్చితిరి. సత్ర మడిగితి రేటికని యడిగిన నా రాజపుంగవుం డంగనామణీ! మా దేశము పెక్కు దూర ములో నున్నది. ఒక కార్యార్థినై యిచ్చటికే వచ్చితిని. బసచేయుటకయి సత్రమడి

గిరిసని యుత్తరము చెప్పెను. అయ్యా! యీ యూర నిన్నియిండ్లు గలిగి యుండగా మీకు బసచేయుటకు స్థలమెచ్చటను దొరకినది గాదు కాబోలు? యీ యర్ధరాత్రి మెచ్చటనో యున్న సత్రమునకు బోవలయునా? మీ వంటివారు నిమిత్తము లేక ప్రార్థించినను వత్తురా? గృహస్థులై యున్నందులకు ఫలము మీ వంటివారిని బూజించుటయే కదా అతిథిపదధూళిసోకని భవనము వనమని యార్యులు చెప్పుదురు. గంధర్వనగరప్రాయమైన యీ సంసారమందున్న సారం బిదియకాక మరేమియున్నది. మీరు మా పుణ్యవశమున సత్రమునకు బోవుచు దారితప్పి యిట్లు వచ్చితిరి. ఈ రాత్రి మా యింట నింతయాతిథ్యము పుచ్చుకొని యుదయమున బోయెదరుగాక లోనికి రండని మిక్కిలి భక్తితో బ్రార్థింపదొడగినది.

అమ్మానవపతి యా మానవతి భయభక్తి విశ్వాసములకు మిగుల నానందము నొందుచు నౌరా! వీరి మర్యాద లెంత వింతగానున్నవి. పట్టణంబున నెంత ధర్మాత్ములైనను బసయిచ్చుటకు సమ్మతింపరు. బాటసారి నన్ను మోసపుచ్చుటకై యట్లు చెప్పెను కాబోలు. విదేశస్థుని మాయలెట్లు గ్రహింపనగును. తఱుచు టక్కరివాడే మంచివారిని టక్కరులని చాటుచుండును. లోకంబున నందరు దుర్మార్గులుగా నుందురా? ఇందు జూచిన వారెల్ల నన్ను దమయింటికి రమ్మని బ్రతిమాలుచుండిరి. ఇదియునుగాక సత్రమునకు బోవుదారి తప్పితినట, ఈ యర్ధరాత్రి మెచ్చటగనుంగొనగలను. ఈ రాత్రి వీరి యింటనుండి యుదయంబున బోయెద. నింతలో నేమి మోసము చేయుదురని తలంచుచు నామె యింటికి వచ్చుటకు సమ్మతించెను.

పిమ్మట నా ముద్దుగుమ్మ యమ్మనుజపతిని దోడ్కొని పోవుచు గనుసంజ్ఞ జేసినంత బరిచారికలు బంగారు కలశములతో నీళ్ళుదెచ్చి యిచ్చిరి. వానిని బుచ్చుకొని అతడు తన యొద్దనున్న పుస్తకము మూటయు నా చావడి గుమ్మముపై యరలోనుంచి కాళ్ళు గడిగికొని లోనికిబోయెను. ఆ చిన్నది అతనిని మేడ మీదికి దీసికొనిపోయి ఒక కనకపీఠమునంగూర్చుండబెట్టినది. ఆమ్మేడ యందుగల అలంకారమతని స్వాంతమునకు వింతవేడుక గూర్చినది. వారుచేయు నుపచారములన్నియు రాజోచితముగా నున్నవి. తన్నుం జక్రవర్తిగా నెంచి అట్లు చేయుచున్నవారని అతడు భ్రాంతిపడి సంతోషము జెందుచు వీరుకోరరేని తన దేశములో గొన్ని గ్రామములిత్తునని నిశ్చయించుకొని యుండెను.

పిమ్మట అతనికి బెక్కు పిండివంటలతో భోజనము పెట్టిరి. భోజనము సేయు సమయమున నా రమణి అతనియొద్ద కూర్చుండి అయ్యా! నెమ్మదిగా భుజింపుడు. శాకములేమియులేవు. ప్రొద్దు పోవుటచే వంటకములు తయచు లభ్యములు

కాలేదు. యెట్లో ఆకలి దీర్చుకొనుడు అని పలుకుచు సురటిగైకొని వీచుచు నడుమ నడుమ నేయి తానే వడ్డించుచు నీరీతి నతనిని లేచుదాక బలవంతపెట్టుచుండెను.

ఆబోటి మాటలకు మోమాటము జెందుచు నతండు భుజించెను. తర్వాత నతనిని పరిచారికలు శయనగృహమునకు దీసికొనిపోయి యందు హంసతూలికాతల్పంబునం గూర్చుండబెట్టిరి. ఇంతలో అక్కాంతయు గప్పురపువీడెము చేతంబుచ్చుకొని యాగదిలోనికి బోయి యతనికందిచ్చుచు దాససంతుష్టి వడసిన పిమ్మట వీణంబుచ్చుకొని హాయిగా దంత్రీనాదముతో కంఠనాదము మేళగించి పాడదొడంగినది. సంగీత ప్రియుండగు నానాజాపాటలగంధి పాటకు మనంబు గరుగ అచ్చెరువందుచు అప్పుడు దానిని దివ్యాంగనగా దలంచెను. అచ్చేడియ పాడుచుండగనే అందున్న పరిచారకులు క్రమక్రమముగా అవ్వలకు బోయిరి.

ఒంటరిగా నుండి పాడుచున్న యాచిన్నదానిం జూచి యాతేడు వేరొకలాగున సందియమందుచుండెను. అంత పాటచాలించి యా యించుబోడి మెల్లగ అతని చెంతకువచ్చి ఆర్యా! పెక్కుదూరము నడచి వచ్చితిరి. అలసటదీర బాదము లొత్తుదునా అని అడిగెను. ఆ మాటలకు సంశయమందుచు అతం డిహో! యింతవరకు చేసిన యుపచారములన్నియు గృహస్థురాలికి దగునుగాని పరపురుషునంటి పాదములొత్తుట సతీధర్మముకాదు. ఈ చిన్నది దానికి యొడంబడుచున్నది. ఈ దేశాచారమిట్టిది కాబోలు, యెంత అతిథియైనను పతివ్రత పెనిమిటికాక ఇతరునియొద్ద నొంటిగా నిలుచునా? అట్లు నిలుచుటయే తగదు మరియు బాదములొత్తినచో మనము చాంచల్యమందక యాగునా? ఇంద్రియ వ్యామోహము బలవంతమైనది విద్వాంసుని కూడ మోసము చేయగలదు. మరియాక దేశములో కారత్వ సంకోచము లేదని వాడుక గలదు. దీనియభిప్రాయమట్టిదిగా దోచుచున్నది. దీనినిజెంత నుండనిచ్చిన నేనును భ్రమజెందుదునేమో అని తలంచుచు దానికిట్లనియె.

సాధ్వీ! నాకు శ్రమ యెంతమాత్రము లేదు. ఇంతదనుక నీవు చేసిన యుపచారమునకెంతేని సంతసించితిని. ఇక చాలును. ప్రొద్దుపోయినది. నీవుపోయి పండుకొనుము. నాపాదము లంటరాదని పలికిన అక్కలికియు బయ్యెట సవరించుకొనుచు మొగంబున జిరునగవు జిలుకి దొలకరి మెరుపు తెరగునమైదీగెమెరయ మరల అతనికిట్లనియె. ఆర్యా! మా దేశాచారము మీకు దెలియదు కాబోలు. మాకు నతిథిని సంతోషపెట్టుట కంటె యుత్తమ వ్రతంబులేదు. అతిథినే దైవముగా భావింతుము. అతండేమి కోరినను వలదనకిత్తుము. నీవు సంశయింపవలదు నీ యిష్టముదీర్చు కొమ్మని పలికెను. అతండా మాటలు సహింపక మంచము నుండి నేలకురికి యావలకరుగసాగెను. పిమ్మట నమ్ముదవతియు నతని మతి కలుగదని నిశ్చయించి ఆర్యా! పోకుము పోకుము రమ్ము. పంచముపీద బహుండుము నీచితమరయ నిట్లు చేసితిని. ఇక నెన్నడు ముట్టనని ఒట్టుపెట్టుకొని యతడు శయనించిన తరువాత నాగదినుండి మరి

యుక యింటిలోనికి బోయినది. దానికృత్యములన్నియుం దలపోయుచు నది కైతవమా? యదార్థమాయని వితర్కించుచు నిశ్చయింపలేక మనంబుయ్యెల లూగుచుండ నతండెట్టకే నిదురించెను. అతండుదయమున లేచి చూచువరకు బాదములకు జేతులకు సంకెళ్ళు తగిలి యున్నవి. ఇనుపనాళములచేత గట్టంబడి బోనురీతినున్న యొకగదిలో నుండెను. ఆ గదికి నవ్వలవైపునం దాళమువైచి యున్నది. అట్టి విధమంతయుం జూచి అయ్యో! నేనేమి నేరము చేసితిని? నన్ను కారాగృహములో నుంచుటకు గతంబెద్ది? అమ్ముద్దియకోరినరీతి నడువకునికి కాబోలు. మేలు మేలు. పాపమా బాటసారి యీ యూరిలో నాడువారు మోసపుత్తురని మొదటనే చెప్పియున్నవాడు అమ్మాటల నమ్మక యీకొమ్మ చేజిక్కితి నిక నేమిసేయగలను? ఎంత బలము గలిగి యున్నను బోనునంబడిన సింహమేమి చేయగలదు? కటకటా! నవరాత్రదినములు సమీపమునందే యున్నవి. ఇప్పుడు నన్ను శక్తికి బలి యిత్తురు కాబోలు. కానిమ్ము దానికి నేను వగవను. ఎప్పటికైనను మరణమున్నదియేకదా? శపథము దీర్చుకొనలేక పోతినను చింతమాత్రమున్నది నాకు దైవమీరీతి మృతి వ్రాసియుండగా మరియొకరీతి నెట్లు జరుగును?

శ్లో॥ అభావీనభవత్యర్థో నాభావో భావినః క్వచిత్॥
ఏతద్వదంతో విద్వాంసః క్లిశ్యంతె దేవమోహితాః॥

అనగా కానిప్రయోజన మెన్ని విధముల బ్రయత్నము చేసినను కానేరదు. ఏమియు బ్రయత్నము చేయకనే కానున్నది కాకమానదు. అని చెప్పుచు విద్వాంసులు సైతము దేవమోహితులై భ్రాంతినొందుచున్నారు. కావున నేనిప్పుడు చింతింపనేల కర్మసూత్రమెట్లున్నదియో యట్లు జరుగక మానదు.

శ్లో॥ విదేశోర్వ్యామప్యటనం శైలారోహణమప్యంబుధేస్తరణం
నిగళంగుహాప్రవేశోవిధివశపాకః కథంనుసంతార్యః॥

విదేశసంచారము పర్వతారోహణము సముద్రముమీద బోవుట కారాగృహప్రాప్తి, గుహలో బ్రవేశించుట లోనగునవి దైవవశమున సంప్రాప్తించుచుండును. వాని దాట నెవ్వనికిశక్యముకాదు. అని పెక్కు తెరగుల విచారించుచు నింద్రద్యుమ్నుండా బందీగృహంబున గొన్ని దినంబులుండెను. పుణ్యపురుషులలో నగ్రగణ్యుండగు సమ్రాజు ప్రాకృతునుండువోలె నొకయింట బంధముపడి యుండెను. అన్నన్నా? పుడమిలో నిడుములం గుడవనివాడు లేడుగదా? ఇట్లుండునంత నాయూరి సభాపతులు కొందరొకనాడు రహస్యముగా నొకసభజేసి యీరీతి సంభాషించుకొనిరి. సభాధ్యక్షుడు. సభాపతులతో మనకు ప్రభువగు సింహకేతుడు పూర్వపురాజు దండవర్మ నంగూడి పసి మంత్రశాస్త్ర పుస్తకములన్నియు ముట్టడించి లాగుకొనియెను. నవరాత్రములలో పనము చేయుశక్తిబలులు సాగనిచ్చుటలేదు. విదేశస్థులు మనయిళ్ళకు

రాకుండ స్వతమొకటి యుంచెను. మరియు పుస్తకములుగాని బలినిచ్చువారిగాని దాచెద మేమోయని వత్సరమునకొకటి రెండుసారులు మన గృహములు పరీక్షించుచుండెను గదా ? ఇక మన కృత్యములెట్లు సాగును ? దీనంబడసిన యీ యైశ్వర్యము లెట్లు నిలుచును ? నవరాత్రదినములు సమీపించుచున్నవి. యీపాటికి మన యిండ్లన్నియు బలిపురుషులతోడను స్త్రీలతోను నిండియుండినవి. ఇప్పుడెవ్వరునున్నట్లు తెలియదు. అమ్మకమునకు దెచ్చువారు కూడ రాజభీతిచే పూర్వమువలె నరుదెంచుటలేదు. ఈ సంవత్సర ముత్సవము లెట్లు జరుగునో తెలియకున్నది. ఐనను నేటికి సిద్ధముజేయ బడిన బలిపురుషుల సంఖ్య యెంతయో చెప్పుడని యడిగెను. అప్పుడు సభాపతు లందరు తమ తమ యిండ్లలో నున్న పురుషులను స్త్రీలను లెక్కింప నూటపదమువ్వు రైరి. వారిలో స్త్రీలు పదమువ్వురు. తక్కిన నూర్గురు పురుషులు. విత్తమిచ్చి కొనిన వారు ముప్పదిమంది తక్కిన వారందరు నింద్రద్యుమ్నునివలె లభ్యమైనవారేయని యాసంఖ్యను సభాపతులు వేరువేర నిరూపించి చెప్పిరి.

పిమ్మట సభాధ్యక్షుడు మరల వారికిట్లనియె. ఈనూట పదమువ్వుర నింత వరకు గాపాడితిరి. ఇంక దాచుట కష్టము. నిన్నటిదినమున చాటింపు సంగతివింటిరా ? మన గృహములన్నియు బరీక్షింతురట. దీనికేమి చేయవలయునో యాలోచింపుడను టయు నందొక వృద్ధసభాపతి యిట్లనియె. అయ్యా ! నాకు దోచిన సంగతి నేను జెప్పెదను వినుండు. ఒక్కడేని మనయింట దొరికినతో మనలను శిక్షింపకమానరు. కావున నీలోపుననే మనము వీరినందరిని వేరొక చోటున దాచవలసియున్నది. అట్టి తో డెద్దియంటేని యీ చండివర్మ రాజ్యమునకు వచ్చిన నాటంగోలె లేదు గాని మన పూర్వులు గూడ నీ దినములలో రాజభీతిచే బలిపురుషుల బ్రచ్ఛన్నముగా దాచువారు. దానికై యీ పట్టణమునకు బ్రాంతమందుగల యడవిలో నొక పాతాళగృహము గట్టించిరి. అందు రెండు గదులున్నవి. ఒకటి పురుషులకు, రెండవది స్త్రీలకునుగా నేర్పరచిరి. ఒక్కొక్క దానిలో వేయిమంది పట్టుదురు. దానిలో భోజనాదిక్రియలు జరుగుటకు దగిన యరలున్నవి. కావున వీరినందరిని రహస్యముగా నందుజేర్చి బరీక్ష దినములు దాటినతోడనే మరల మన యిండ్లకు దీసికొని రావచ్చును. అట్లు చేసిన యుక్తముగా నుండునని చెప్పెను.

వృద్ధసభాపతి చెప్పిన యాలోచన యుక్తముగా నున్నదని యందరు నొప్పుకొనిరి. పిమ్మట మరల సభాధ్యక్షుడు వారితో నిట్లనియె. ఈతడు చెప్పిన పద్ధతి సమంజసముగా నున్నదని యందరు సమ్మతించిరి. నాకును సమ్మతమేగాని మరి యొకటి విచారింపుడు. మనము నూర్వురనేకముగా నొకతావున నుంచినచో వారందరు నేకమైన మన యాజ్ఞలో నుందురా ? ఎదిరించి పరిచారకులను దండింతురు. ఇదియునుం గాక నిందరనేకముగా నచ్చటికి దీసికొనిపోవుచుండ నా యలజడి రాజభటులకు దెలియక మానదు. దెలిసిన పిమ్మట శిక్షింపక మానరు. కావున దీనికేమి చెప్పెదరని యడిగెను.

అప్పుడు మరల వృద్ధసభాపతి అయ్యా ! మనము బలిపురుషులకందరి కాళ్ళకు జేతులకు సంకెళ్ళువైచితిగదా యొకచోట నుంచుచుంటిమి. అట్లుబద్ధులైన వారేమి చేయగలరు. సూర్యులైన నొకటియే, యొకండైన నొకడియే, రావణుడంతవాడు బద్ధుడై యేమియు జేయనేరక కారాగృహంబున పెద్దకాలము పడియుండలేదా ? తక్కిన వారినెన్న నేల ? మఱియు వారినందరిని నొక్కనా డొక్కసారియే తీసుకొనిపోకూడదు, వారందరు నొకచోట లేరుగదా ? యెవరింటి యొద్దనుండి వారే రహస్యముగా దీసికొనిపోయిన నలజడి యుండదు. కావున నట్లు చేయుటయే యుత్తమము ఇంతకన్న వేరొక యుపాయము లేదని నాకు దోచుచున్నదని పలికెను. ఆ మాటలకందరు సమ్మతించిరి. అట్లు చేయుటకు రేపటి నుండియే యారంభింపవలయునని స్థిరపరచుకొని యంతటితో సభ ముగించుకొని తమ నెలవులకు బోయిరి

అమ్మరునాడు రాత్రి సభాపతులందరు నిరూపించుకొనినట్లు తమతమ గృహంబులలోనున్న బలిపురుషులను ప్రచ్ఛన్నముగా నా పాతాళగృహములకు జేర్చిరి. ఇంద్రద్యుమ్నుండు నాటి యుదయంబున స్థలాంతరమందు దానువోలెగర చరణంబులకు నిగళంబులు దగిలింపబడియున్న పెక్కండ్రు పురుషులంజూచి వెరగందుచు నిట్లు తలంచెను. ఆహా ! వీరిమంత్రశక్తి మిగుల గొనియాడదగియున్నది. అంటినమాత్రమె మేల్కొనను నేనుసైత మిచ్చటికెట్లువచ్చితినో తెలియకుంటిని. లేకున్న వీరందరు నెట్లు మాయజేయగలరు ? అన్ననా ! యీయూర నిన్ని నరహత్యలు జరుగుచుండ దెలియకున్నవాడీరాజెంత మందమతియోగదా ? నాకీ సంకెళ్ళు లేకున్న నీయూరి ప్రజల నందరను శక్తికి బలియిత్తునుగదా! కాలవశమున నిట్లయితినేమి సేయుదును ! పాపము ! నేనువలె వీరును మోసపోయిరి కాబోలు. దైవ మాయవు మూడిన వారి నీయూరికి జేర్చుచుండును. వీరందరు నెట్లుచిక్కిరో యడిగి తెలిసికొని యెదగాకయని నిశ్చయించి ప్రతిపురుషు నొద్దకునుబోయి నిష్కారణ బంధమునకయి వగచుచుండ మంచిమాటల నూరడింపుచు నీవట్లు వీరికి జిక్కితివో చెప్పుమని యడుగుచు నతండు చెప్పినరీతిఁవిని వెరగుపడుచు నీప్రకారంబు క్రమంబున నందరిని దెలిసికొనిపోయెను. వారిలో గడ్డమును మీసములును బెంచి దివ్యతేజంబున నొప్పుచు, యోగిరూపము వహించి యెద్దియో తలంచి చింతించుచున్న యొక పురుషు నొద్దకు బోయి అయ్యా ! తమ నివాసమెచ్చట ? కులమెయ్యది ? యీ పురంబేమిటికి వచ్చిరి? మిమ్మెట్లు వశపరచుకొనిరి ? మీయాకారముజూడ వేడుకయగుచున్నది. మీవృత్తాంతము వినవలతుం జెప్పెదరే ! ఏ నింద్రద్యుమ్నుండనువాడు. మాది ద్రోణపురము. సింహమును జంపుటకై యడవికివచ్చితి. అచ్చట కాశీరాజుకూతురు విశాలాక్షి యనునది మగనితోగూడ శత్రుభీతిచే బారిపోయి వచ్చుచు మార్గంబున గుఱ్ఱముమీదనుండి మగడు జారిపడుటయు నతండు మృతినొందెనని శోకింపుచుండ నాధ్వనివిని యక్కాంత చెంతకుపోయి యామెనోదార్చి మగనింగూర్చెదనని శపథముచేసితిని. ఇంతలో

సింహము నా సైన్యంబుల నురుమఁ జేయ దొరఁగిన దానిఁ జంపుటకై పోయితిని. నేను పోవువరకు మఱియొక వీరుడు దానిని గడతేర్చెను. నేను మరల వెనుకకు పోవునప్పటికి విశాలాక్షి యచ్చటలేదు. నా భార్య సేనలతో నింటికి పోయినది. పిమ్మట నేనా చిన్న దానిని దాసిమగనిని వెదకుచు నారు మాసము లా యడవిలో గ్రుమ్మరితిని. పిమ్మట గ్రామములలో నరయుచు గుదకీయూరు జేరితిని. బాటసారిమాట వినక యిందొకని యింట నాతిథ్యమున కంగీకరించి యిట్టియవస్థకు బాల్పడితిని ఇదియె నావృత్తాంతము. ఇందున్న వారందరు నావలెనే మోసపోయిరి. మీ రేమిటికో విచారింపుచుంటిరి. ఈ బంధనమునగాక వేరెద్దియేని గారణమున్న దాయేమి ? తెలుపుదని యడిగిన నతండు తలయెత్తి యతనిని బహూకరింపుచు నిట్లనియె

హా ! విశాలాక్షి ! హా ! ప్రాణనాయకీ! వెఱ్ఱిగానుంచినప్పుడే నా యందు భక్తి నీకు మెండుగా నుండునది. ఇప్పుడెంత సంతోషించెదవోగదా ? రాజేంద్రా ! నీవు పుణ్యాత్ముడవు. భార్యనైనను గణింపక పరులనిమిత్తము పాటుపడుచుంటివి. నన్నా విశాలాక్షి మగనిగా భావింపుము. సింహమునుజంపినవాడను నేనేయని నుడివి నంత నాభూకాంతు డత్యంతసంతోషము జెందుచు నోహో మావిశాలాక్షి మగడవు నీవేనా ? రూపమామె చెప్పినట్లున్నది. కాని నీ తెలివి జూడ వేరొకలాగున దోచుచున్నది. ఇదియునుగాక సింహమునుగూడ నేనేచంపితినని చెప్పితివి. విశాలాక్షి తనమగడు వెఱ్ఱివాడని చెప్పియున్నది. నీ వట్టివాడవే యని యడిగిన నతండు మరల నిట్లనియె.

# మదనుని కథ

రాజా ! విశాలాక్షి చెప్పిన మాట యదార్థమే నా పూర్వవృత్తాంతము వినిన నీసంశయము వాయును. చెప్పెద నాకర్ణింపుము. మా కాపురము గోదావరీతీరమున నున్న వీరభద్రపురంబను నగ్రహారము. మా తండ్రిపేరు సోమశేఖరుడు. అయన చిన్నతనమందే కాశికిబోయి యందు వేదశాస్త్రవిద్యలం జదివి యాచార్యులని బిరుదువహించి మరల నింటికివచ్చి యచ్చటఁబెక్కు క్రతువులఁ జేసెను. మహర్షితుల్యుండగు నతడొక నాఁ డుదయంబున నగ్నిహోత్రగృహంబునందు మాతల్లి పుత్రార్థమై యాచింప సంతసింపుచు బుత్రజన్మహేతుభూతమగు నిష్టినొకటి గావించుటయు దత్ప్రసాదంబున నేను వారికి బుట్టితిని. బాల్యంబున నా రూపంబునకు వెరగందుచు బ్రజలందరు నన్ను మదనుడని పిలువం బొడంగిరి. మా తండ్రి నాకు ధనంజయదాసని పేరు పెట్టెను గాని యా పేరున నన్నెవ్వరును పిలువనందున నాకు మదనుడను నామమే వాడుక లోనికి వచ్చినది.

మాతండ్రి నాకు బదియేను వత్సరములప్రాయము వచ్చువరకే తనకు వచ్చిన విద్యలన్నియుం జెప్పెను. నా బుద్ధి మిగుల సూక్ష్మమైనది. కావున నా విద్య లన్నియు చక్కగా గ్రహించితిని. అధర్వణవేద మొక్కటియే మాత్రము మా తండ్రికి రాదు. మాతండ్రిగారి సహాధ్యాయుడు విశ్వనాధభట్టను నతండు మాతండ్రికంటె నెక్కుడుదినంబులు కాశిలోనుండ యావేదముకూడ గ్రహించెను. అతండును మా గ్రామమునకు సమీపములోనున్న కుక్కుటేశ్వరమను నగ్రహారంబున విద్యార్థులకు బాఠములుజెప్పుచు నివసించియుండెను. నేను మాతండ్రి యనుజ్ఞవడసి విద్యార్థినై యాతనియొద్దకు బోయితిని. అయనయు మా తండ్రియందుండు గౌరవస్నేహములం బట్టి నన్ను దన యింటబెట్టుకొని యధర్వణవేదము మొదలబెట్టెను.

అయనభార్య సురుచి యనునది మిగుల రూపవంతురాలు. విశ్వనాథభట్టు ప్రాయము మిగిలినతరువాత గాశినుండివచ్చి పెండ్లియాడెను. కావున నా దాంపత్యము చూచువారికి హాస్యాస్పదముగా గనంబడక మానదు. సురుచి రూపవతియు విద్యావతియు నగుటచేత వృద్ధుండైనను మగనికనుకూల వర్తనమున మెలంగుచు గుణవతియనియే పేరుపొందినది. నన్నును భోజనభాజనములయందు మిగుల వాత్సల్యముతో జూచు చుండునది. ఇట్లుండ నంతనొక్కనాడు విశ్వనాధభట్టుగారు రెద్దియోకార్యావసరమున గ్రామాంతర మరిగిరి. విద్యార్థులును తలయొకపనికై మరియొకచోటునకు బోయిరి. తుదకు మేమిరువురముగాక యింటిలో మరియెవ్వరునులేరు. నాటియుదయము మొదలు కొని సురుచిబుద్ధి మారిపోయినది. మధ్యాహ్నము నేను భోజనముసేయుచుండ దాపునం గూరుచుండి వినసక్రరచే నన్నుమునసరి చల్లార్చుచు గురుతుపట్టరాని వంటకములు కొన్ని వడ్డించి నవ్వుచు నా కిట్లనియె.

మదనా! మీతండ్రి పండితుండగుటచే నీకుదగిన పేరుపెట్టెను సుమీ! నీ రూపమునకుదగిన విద్యకూడనున్నది. పూవునందావియుంబోలె విద్యారూపములు గలిగిన నిన్ను జూచునప్పుడెల్ల నాయుల్లమున సంతోషము వెల్లివిరియుచుండును. ఈ వడ్డించిన భక్ష్యములేవియో చెప్పుకొనుము. చూతము. నీ బుద్ధియని నన్ను బరిహాస ములో దింపినది. అప్పుడామెయభిప్రాయము పూర్ణముగా గ్రహింపనేరక నేను బూర్వపు రీతియేయనుకొని యావంటకముల బరీక్షించియు దెలిసికొనలేక సాధ్వీ! యవి సురుచిగానున్నవిగాని వీనిమర్మముమాత్రము నాకు దెలియలేదని చెప్పితిని. నా నోట నుండి యప్రయత్నముగా బయలు వెడలిన మాటలలో శ్లేషగ్రహించి యాయింతిబోడి దృగంచలములు నాపైని బరగించుచు చిరునగవుమొగమునకు నగయెమెరయ నౌనౌను మదనగ్రహము సోకక యూగుటెట్లు తేటబడును? నీవు చెప్పినమాట యథార్థమే యనను ఇప్పెడ వినుమివి మనోహరములు. చేదికలను నామముగల వంటకములు. సుస్నిహితాపములని చెప్పనొప్పు. వీనిదినిన ఖారమేమియు నుండదని చెప్పెను.

అప్పుడామెయన్న మాటలకు నర్థముపరికింప శ్లేషగనంబడినను. పిమ్మట

నేననిపమాటలుదలంచుకొంటిని. అందు శ్లేషయున్నది. అవియెరిగియనిన మాటలుకావు దైవము నానోటనుండి యట్లనిపించెను. ఇవి సురుచిగా నున్నదిగాని మర్మము తెలియ లేదంటిననగా సురుచియొక్క మర్మము నాకు దెలియలేదను ధ్వని సూచించుచున్నది. దాసికామె యుత్తరము చెప్పినది. మదనుగ్రహము సోకక నీసురుచిగుట్టెట్లు తెలియును. అనుదాసితో నాదయలేక యీవంటకములసంగతి నీకెట్లు తెలియుననియు నీ యందు మదనావేశము జెందినప్పుడుగాని నా గుట్టు తెలియ నీ కవసరము లేదనియు మనో హరమగుచేటికలు మనస్సును హరించు దూతికలనియు సుస్నేహరితము లనగా మంచి చమురువల్ల పుట్టినవని వంటకములకును అనురాగమున కివియే హేతువులని రెండవ యర్థము స్ఫురించుచున్నది. నేను జెప్పినదానికి దగునుత్తరమిచ్చినది. ఇది మంచి చతుర. మాగురువు చతురుండైనను వృద్ధుడగుటచే నీమెకు సరిపడడు. వృద్ధునకు దరుణి విషమనుమాట సత్యము గదా. అని పెక్కు తెఱంగుల దలంచుచు దల వాల్చు కొని భోజనము చేసి పిమ్మట నేను విద్యామందిరమునకు బోయితిని.

విద్యార్థులందరునుగూడ పాఠములు చదువుకొనుమందిరమునకు విద్యా మందిరమని పేరు. అదియు వారింటిని జేరియే కొంచెమెడముగా నున్నది. అచ్చటికి బోయి నేను బాఠములు చదువ బూనుటయు నా మనం బందుజొర సురుచి యనిన మాటలు తలంచుకొనుచు నోహో ! ఆమెయభిప్రాయ మేమియైనకదా ? చివర దినినం భారముండదనికూడ యనినది. ఆ మాటలో ననుభవింపుమనియుం దోచు చున్నది. అట్టి మాట యనునా ? ఇదివర కీమె గుణవంతురాలని ప్రఖ్యాతి యున్నదే. ఇప్పుడుమాత్ర మాప్రవర్తనేల చెడుపుకొనుచు, విద్యావతిగనుక చమత్కృతికయి యట్లనెనని తోచుచున్నది. వెరొకయభిప్రాయము నిక్కముగా గలిగినచో నీ లోపున నిచ్చటి కెద్దియో మిషబన్ని రాకమానదు. అది నిజమైన నేనీయాపద నెట్లు దాటుదును. దైవవశమున నీరాత్రి మాగురువుగారు వచ్చిన లెస్సయగుంగదా ! అని పరిపరిగతుల దలంచుచు సంశయాకులచిత్తుండనై తల్లడిల్లుచుంటిని. ఇంతలో సాయం తన సమయమగుచుండ నా యంతఃజగమన నా దండకు వచ్చి మదనా ! యీ రాత్రి నీకిష్టమైన శాకమెద్దియో చెప్పుము. వండెదనని యడిగినది. అప్పుడు నేను దద్దరిల్లి యేమియుంటోచక నీకిష్టమైన శాకము వండుమని చెప్పితిని. ఆ మాట విని యాజవ్వని నవ్వుచు మదనా ! నా యిష్టమైనది నీకిష్టమేనా యని మఱిమ్మారు పలికినది. దానికి నేనౌను నీకిష్టమగు కూర నాకునిష్టమే యని చెప్పితిని. అప్పుడప్పాటలగంధి మదనా ! యీ మాట మరువకుము. పిమ్మట నీకిష్టము లేదన్నను దప్పుదుసుమీ యని పలికి తిరిగి జూచుచు లోపలికి బోయినది.

అప్పుడు నామనంబునగల యనుమానము తీరినది. ఆ చిన్నది యెన్నడును మా విద్యామందిరమునకు వచ్చినదికాదు. నా యిష్టము నీ యిష్టమా యని యూరక మఱిమ్మారు తర్కింపనవసరమేమి ? తిరిగి చూచుచుబోయినది. ఈ చిహ్నము

లన్నియుం బరిశీలింప నా మదవతి హృదయము చాంచల్యమందినదనుట కేమియు సందియము లేదు. ఇటుమీద నేనేమి చేయదగినది. ఈ రాత్రి భోజనమునకు బోయి నప్పుడు మిగిలిన సందియముగూడ దీర్చును. అనర్థమురాకమున్నే ప్రతీకార మూహింపవలసియున్నది. ఇప్పుడామెకు జెప్పకుండ నేనెక్కడి కేనింబోయి గురువు వచ్చినవెనుక వచ్చెదమనుకొనిన నీచిన్నది యొంటరిగా నుండుట జూచి యిల్లు ముచ్చులు కొల్లబెట్టినటో నేమిచేయనగు ? ఇదియునుంగాక మాటలచాతుర్యమువలన నూహించుటయేకాని తన యభిప్రాయము నాకు వెల్లడించినదా ? అంతమాత్రమునకే నేను లేచిపోయినటో మా గురువు నన్ను మందలింపకమానడు. ఇప్పటికైన నతరుణి చిత్తవృత్తి యిట్టిదని నిరూపింప శక్యమగునా ? కావున నాకేమిచేయుటకు దోచుట లేదు. కానిమ్మంతపని వచ్చినప్పు డక్కాంతామణి స్వాంతము నీతిబోధచేసి మరలించెదనని నిశ్చయించుకొని భగవంతుని వేడుకొనుచుంటిని

ఇంచుక చీకటిపడినటో లేదో యంతలోనే నన్ను భోజనమునకు రమ్మని కేకవైచినది. మేను కంపమునొంద మెల్లనలేచి భోజనమునకు బోయితిని. నాకు గాళ్ళు గడిగికొనుటకు నుష్ణోదకము దెచ్చి యిచ్చినది. నేనును బాదప్రక్షాళనముచేసి తడిబట్ట గట్టికొని లోనికి పోవునంత మంచివిలువగల మాగురువుగారి పట్టుపుట్టము నెదురుగా దెచ్చి యీయబోయిన నేనిట్లంటి అయ్యో ! ఇది మా గురువుగారిది నేను గట్టుకొన గూడదు. వేరొకటి తెమ్మని యడిగిన నచ్చేడియనవ్వుచు గురువుబట్ట గట్టుకొనగూడదని యే గ్రంథములో వ్రాసియున్నదో చూపింపుము. వేరొకబట్ట యారవేయలేదు. ఇది ధరింపక తప్పదని బలాత్కారముగా నాచేతం బెట్టినది. దానిని గట్టుకొని పీటమీద గూర్చుండునంత మూడు భాగములు మిగిల్చి కోసిన యరటి యాకువైచి యందు సన్నని యన్నము కూరలు పచ్చడులు భక్ష్యములు వింతవింతలు వడ్డించినది.

రాజేంద్రా ! నే నేమని చెప్పుదును. ఆదినమున నాకు జేయునుపచారము లన్నియు గ్రొత్తవియె కాని యెన్నడును జేయనవిగావు. అదేమిపాపమో, యెప్పుడో తన యభిప్రాయము స్పష్టంగా వెల్లడించిన తరువాత నీకి చెప్పెదనని తలంచితినిగాని మొదటనే యివి యేమి చర్యలు విపరీతముగా నున్నవి. తగ వని చెప్పుటకు నోరు వచ్చినది కాదు. ఆమె యేమిచెప్పిన నొప్పుకొనువానివలె నూరకుంకి చేయుటచే గ్రమక్రమముగా నాయువతి మితిమీర దొడంగినది. నాకు మాట్లాడబోయినంత కంపము వచ్చుచుండును. ఏమి చేయుదును. మనంబున నెన్నియో యూహలున్నవి. యొక్కటియు నోటినుండి వెలువడలేదు. నేను దలవాల్చుకొని భుజింపుచుండ బెంతెగూరుచుండి రుచులు చక్కగా నున్నవియా, నీకిష్టమైనవేనా యని యడుగుచు పలువిధముల

జతురతగా బల్కఁదొడంగినది. తల్లదిప్పటియే కాని నే నొక్కదానికి నుత్తరము జెప్ప లేదు.

భోజనముజేసి నేను వాకిటకు బోవ యత్నము చేయుచుండగా సురుచి నాతో మదనా! నీ వొంటిగా నుండలేను, నేను గుడుచునప్పుడు దాపున గూరుచుండ వలయును. నేడు విద్యామందిరమునకు బోవుట మానివేయుము. నాకు భయము చాల గలదు. నీ విందు గూర్చుండనిచో నేను కుడువనని చెప్పగా నేనేమి చేయవలెనో నీవే చెప్పుము. దానికేమియు నుత్తరము చెప్పలేక యూరకున్నంత దాపున నొక పీటవైచి యందు గూర్చుండుమని చెప్పినది. నే నందు గూర్చున్నంత దన తళుకుచూపులు నడుమనడుమ నాపై బరగించుచు నెద్దియో పలికి నవ్వుచు ప్రీతిలో భోజనముచేసి లేచినది. పిమ్మట నన్నుజూచి మదనా! నీ వెచ్చట బరుండెదవో చెప్పుము మంచము వాల్చెద నని యడిగిన నేను గజగజవణంకి కంఠము డగ్గుత్తికపడి స్వరమురాక హీన స్వరముతో నీ-నీయిష్టమని పలికితిని. అప్పుడా సురుచి యట్లయిన నా గదిలో బరుండె దవా? యని యడిగినది. ఆ ద్వంద్వార్థము గ్రహించి నేను శిరఃకంపము సేయుచు నేమియు ననలేక యూరకున్నంత నక్కాంతయు నంతకుబూర్వమే యలంకరించి యున్న తనగదిలోనికి దీసికొనిపోయినది.

నే నాగది నంతకు మున్నెన్నఁడు జూచియుండలేదు. కడువింతగనున్నది. అట్లుపోయి యందున్న పట్టుపందిరిమంచముమీద గూర్చుంటిని. అప్పటి నా యభి ప్రాయమెద్దియో మీరు గ్రహించితిరా? ఆయోష తన యభిలాష బూర్ణముగా వెల్ల డించినప్పుడు నీతి జెప్పెద మని యంతవఱకు నేను చెప్పినటుల చేయుచుంటిని కాని మఱియొక కారణముగా మనుడీ! అంత నక్కాంతయు వేఱొకగదిలోనికిపోయి నిమిష ములో జగన్మోహనంబైన యలంకారముబూనివచ్చింది. రాజేంద్రా! నీకు దాచనేల? అప్పుడు దానిని జూచిన నంతకు బూర్వముగల నా మనస్థైర్యము కొంచెము సాంక ర్యము నొందినది. దానిని దృఢపరచుకొనుచున్న నాచెంతకువచ్చి యచ్చేడియ మదనా! నేనెందు బరుండనో చెప్పుమని యడిగినది. నీయిష్టము వచ్చినచోట బరుండుమని యుత్తరము చెప్పితిని. నాచేత ననిపించుకొనవలయునని యామెకును, ఆమె తనకోరిక వెల్లడించిన పిదప నీతిజెప్పుదమని నాకును మనంబున గలిగియున్నది.

నా మాటవిని యబ్బోటి మదనా! చాలుచాలు. నీ వెప్పుడును పుల్లవిఱచి నట్లే మాటలాడెదవు. అన్నింటికిని నీయిష్టమే యందువుగాని యొకదానికి దగునుత్తర మియ్యవు. అన్నియు నా యిష్టమైనచో నిక నీయిష్టమేది. నామంచము మీద నీవు పరుండితివి. నాకు వేఱొక శుభ్రమైన మంచములేదు. దానికై యాలోచించుచు నిన్నడి గితిగాని నా యిష్టమైనచో నిన్నడుగనేల? పోనీ నేలనే పరుండెదనులే యని పలుకుచు చాప ననవింపబోయినది. అప్పుడు నేను మంచము దిగనురికి అయ్యో! నీవు క్రింద బరుండగా నేను మంచముమీద బండుకొందునా? నీకన్న నేనెక్కుడు సుకుమార

వంతుడను కాను. నీవు దీనిమీద బవ్వళింపుము. నేను వేరొకచోట శయనించెదనని చెప్పితిని. అంత నక్కాంత శిరఃకంపము సేయుచు వద్దు వద్దు. నీవామంచము మీదనే పరుండుము. కొంచెము శుభ్రమైనమంచమొకటి యున్నది. దానిని దెచ్చుకొని యిందువైచి పరుండెదనులే యని చెప్పి యాప్రకారము చేసినది. అంతలో మరల లేచి మదనా! యిదుగో యిందాక నీకు దాంబూలమియ్యవలయునని యిచ్చటబెట్టి మరచిపోయితిని, వైచుకొనుమని నా మంచము దాపునకు వచ్చినది.

నాకు దాంబూలము వైచుకొను నలవాటులేదు. ఇదియునుంగాక నేను బ్రహ్మచారిని. బ్రహ్మచర్య వ్రతమందున్నవారు తాంబూలము వైచుకొనగూడదు. నీవే వైచుకొనుము. పొమ్ము పరుండుమని కొంచెము ధైర్యము దెచ్చుకొని చురుకుగా బలికితిని. అప్పు డామె నవ్వుచు నోహో! చాలు చాలు, ఏమి నీబ్రహ్మచర్యవ్రతము పాపము తాంబూల మొక్కటివామి తక్కినపను లన్నియుం జేయవచ్చును గాబోలు, నాముందరనా నీడాంబికములు బ్రహ్మచారిగారూ! మంచముమీద బరుండవచ్చునా? ధోవతులు గట్టవచ్చునా? గంథములందు కొనవచ్చునా? ఏది! గ్రంథములో నెట్లున్నదియో చూతము. దోషమని యుండినచో నుదయమున బ్రాయశ్చిత్తము చేయించుకొని యెదవుగానిలే? యని బలుకుచు నాకు మదుపులం జేతబట్టుకొని నానోటం బెట్టబోయిన నేనును దొందరపడి దాని చేయిం బట్టుకొని సురుచీ! నిలనిలు, నీకు గొంత జెప్పవలసి యున్నది. నామాట వినిన పిమ్మట నిత్తువుగాని యని యెంత జెప్పినను వినక నా యెదుట బెక్కు కామవికారముం బ్రకటించినది.

అప్పుడు నే నహంకారముతో అన్నా! సురుచీ! ఇది యేమిపని? నీ వెంతో గుణవంతురాలవనుకొంటినే, నేటితో దేటయైనది. నీవంటివారలు నీతిమాలిన పనులు చేయుదురా? విశ్వనాథబట్టుగారు వచ్చినచో దండింపరా? యుదయము నుండియు నేను గనిపెట్టుచునే యున్నాను. నీచర్యలన్నియు విపరీతముగా నున్నవి. వెళ్ళుము నీమంచముపీద బరుండుమని యెన్నియో నీతివాక్యములు చెప్పదలంచు కొన్న నాకాపాటి మాటలు నోటినుండి వచ్చువరకు గ్రుత్యాద్యవస్థయైనది. అప్పటి నా చిత్తవృత్తి యెట్లున్నదియో యదార్థముగా నీకుజెప్పెద వినుము. ఉదయముకన్న మధ్యాహ్నము, మధ్యాహ్నము కంటే సాయంతనము, సాయంతనముకన్న రాత్రియు, రాత్రికన్న నప్పుడు క్రమంబున నామనము చాంచల్యమందినది.

శ్లో॥ బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి॥

ఇంద్రియములు చంచలమైనవి విద్వాంసుని సైతము మోసము జేయునను నార్యోక్తి నాకు బాగుగ నచ్చినది. అట్టి మాటలువిని యాచిన్నది కిన్నునెఱ్ఱజేయుచు నోహోహో! బుద్ధిమంతుడా! శ్లేషలు నీకేకాని యెవ్వరికి దెలియవనుకొంటివి గాబోలు నాదుర్గుణంబేమి కనిపెట్టి యిట్లంటివి. యింకొకసారి యనుము. తర్వాత

జెప్పెదను తప్పంతయు దనయొద్ద బెట్టుకొని యెదిరినపుట లోకస్వభావమేకదా ? నేను పుజ్యమునకు వంటకములు వండిపెట్టి యెట్లున్నవని యడిగిన సురుచిగానే యున్నవికాని మర్మము మాత్రము తెలియలేదని పలికిన మాట మరచిపోయితివేమో ! సురుచియని నామాట ముందుగా నేమిటికి దలపెట్టవలయును. ఈతప్పెవ్వరిదో చిన్నదానినిజేసి యొంటిపాటు చూచి యాడించుచుంటివిలే ! యని పరిహాసమాడెను.

అప్పుడు నామనంబున నొకమూల బాపభీతియు నొకమూల దాపభీతియు వేధింపదొడంగినది దాని క్రియలకు బ్రతిక్రియజేయ నుద్యుక్తుండనగుటకు దెగింప బోవుచు నంతలో నయ్యో ! ఇంత చదువు చదివియు బాపిలేని పూవుబోణి నెట్లుగూడుదును లోకులు వినిన నిందితురేయని మరగ్గొంకుచు నీరీతి గొంతసేపా పెదలిసేయు కృత్యముల సైతము గుర్తెరుంగక చింతింపుచుంటిని. తరువాత జెప్పనదేమి గలదు.

శ్లో॥ సంసారేపటలాంత తోయచపలే సారంయదేకః పరం
తస్యాయంచపునస్సమ స్తవిషయగ్రామః ప్రపంచోమతః
యత్సౌఖ్యం పరతత్వవేదన మహానందోపమం మందధీః
కోవాపిందతి సూక్ష్మమన్మథకళావైచిత్ర్యమూఢోజనః॥

ఇంటిమీదబడు జలమువలెనే చంచలమగు సంసారంబున నింద్రియములే ప్రపంచకమనవొప్పు. కామసౌఖ్యము మిగుల సారవంతమైనదియు బ్రహ్మానందతుల్యమైనదియు నట్టిదానిని మన్మథరహస్యవేత్త కానివాడేమి తెలిసికొనగలడని పూర్వమొక పండితుడు వ్రాసెను. వానిమాట యదార్థమయినది. అంత నుదయంబున మేము లేచునప్పటికి మించిపోయినటుల మా గురువుగారింటికి వచ్చిరి. ఆయన నను జూచినతోడనే నాహృదయము ఝల్లుమనినది. అయనయు నన్నుజూచి రాత్రి యింటియొద్ద నెవ్వరుండిరి. బదిలముగా బండుకొంటిరా. నీకన్నులంత యెఱ్ఱగా నున్నవేమి రాత్రి యెక్కువసేపు మేల్కొనియుంటివా యేమి ? యని యడిగిన నేనును నించుక గొంకుచు నిట్లంటిని. అయ్యా ! మీరు గ్రామాంతరమరుగుటచే విద్యార్థులందరు తలయొక పనికింబోయిరి. మీరాకవిని నేడే రాగలరు. ఇంటియొద్ద భద్రముగానే పండుకొంటిమి. రాత్రి పాఠచింతన తడవుదనుక జేయుచుంటిని. ఇదియునంకాక మీరు లేకపోవుటచే మీ భారమంతయు నామీద బడుటచే నిల్లుగాయుటకై మేలుకొంటిని. దానంజేసి నాకన్నులెర్రగా నున్నవని పలికితిని. నాయందు మిగుల నమ్మకము గలదు కావున నాయన మాయొంటిపాటును గురించి యంత విచారింపరయ్యెను. మనము తలిదొరకినప్పుడుగాక మఱి ఎప్పుడును నవ్వుచు మాటాడగూడదు, చూడగూడదు, చేరగూడదు. గూఢముగా నుండవలయునని నేను మొదటనే యమ్మదవతితో జెప్పియుంటినిగాని యామాట లేమియు నిలిచినవికావు.

అమ్మద్దియ ఎద్దియో యొకమిషమీద నాయొద్దకు వచ్చుచు నన్ను బిల్క-

రింపుచు నవ్వుచు సాభిప్రాయముగా జూచుచు నింటిలో నేపనిచేయుచున్నను నాయందే బుద్ధినిల్పికొని యీరీతిని కొన్ని దినములు గడిపినది. మరికొన్ని దినములు సిగ్గువిడిచి యెవ్వరేమన్ననుసరేయని పలుమారు నేను బోధించుచున్నను వినక నెల్లరకు దెల్లమగు నటుల నాతో సంభాషింపదొడగినది. నేనును దానికి బోధించుటయే కాని మన్మథవికారములకు జిక్కింటికి బాత్రుడనైతిని. ఆహా!

శ్లో॥ స్వప్రత్యవాయదుర్లభ నిషేధవిషయోషియోషితాంవిషయః
కామస్యభావపాతః ప్రసరతితత్రైవదుర్నివారః॥
శ్లో॥ ప్రభవతిమనసివివేకో విదుషామపిశాస్త్ర సంభవస్తావత్
నిపతంతి దృష్టివిశిఖా యావన్నేందీవరాక్షీణాం॥

అను శ్లోకముల బఠించుచు వారింజెప్పిన వారిని బొగడుచు వివేకమింతైనను లేక స్మరపిశాచగ్రస్తుండనై యుక్తాయుక్తముల నెఱుంగక సంచరింపదొడంగితిని. చోరత్వము జరిగిన యారుమాసములకును జారత్వమిక నారుమాసములకు జరుగు ననునప్పుడే వెల్లడియౌనను వాడుకగలదుగదా? మాచర్యలు మరునాటి నుండియు నిరుగుపొరుగువారు చెప్పుకొనదొడంగిరి. కాని యది మేమెఱుంగక గూఢముగానేయున్నదని తలంచుచుంటిమి మరికొన్ని దినములు జరిగిన వెనుక తుదకు మా యెదుటనే పరిహాసము చేయదొడంగిరి. ఒకనాడు నా స్నేహితుడొకడు రహస్యముగా నన్ను బిలిచి మదనా నీనడత యేమియు బాగుగా నుండలేదు. నిన్ను ప్రజలు మిక్కిలి నిందించుచున్నారు. నీవు పండితుడవయ్యు నిట్టికొరమాలిన పలుకులకు దొరంగరాదు. పరకాంతాభిలాషయే దూష్యము. గురుకాంతతో రాత్రింబగళ్లు నీవిట్లు లోకాపవాదమునకు వెఱువక వర్తింప నేమనగలవారము. మీకేమియుందెలియకున్నది. మీచిత్తజవికారము లరయ బరిహాసాస్పదములైయున్నవి. కొంచెము కాలములోనే మన గురువుగారికి గూడ తెలియునట్లు తోచుచున్నది. నీవిలోపల నింటికి బోయిన బాగుగనుండునని నాకు దోచుచున్నది నీకు ప్రాణమిత్రుండ గావున నింతజెప్పితిని. పిమ్మట నీయిష్టమని మందలించెను.

పైత్యరోగము గలవాని నాలుకకు పంచదార సైతము చేదుగా నుండునట్లు మదనవికారమత్తుండనగు నాకు వాని నీతివాక్యము లేమియుం జెవులకెక్కినవికావు. అంత నొక్కనాడు మా గురువుగారెద్దియో పనిబన్ని మరల నూరికి బోయెదనని చెప్పి విద్యార్థుల నెవ్వరిని వెంటదీసికొనిపోక తానొక్కరుండే పయనమైపోయెను. అప్పుడు సురుచియునట్టి అవసరము పెక్కుకాలమునకు దొరికినదని మిగుల సంతసించుచు మనంబునకోరికె లువ్విళ్ళూరుచుండ సాయంకాలమగుటకు వేచి యుండెను. విద్యార్థులు మఱికొందరుగూడ నుండిరి. గనుక పగలేమియు మాటాడుటకు వీలు చిక్కినదికాదు. ఆ దినమున సూర్యుని గుఱ్ఱముల పాదములు విరిగిపోయినవని కాబోలు నెప్పటికిని ప్రొద్దు గ్రుంకినదిగాదు.

అంత దివసాంతమగుటయు నా కాంత వింతగా అలంకరించుకొని స్వాంతంబున కంతుసంతాపమెంతేని వేధింప నెట్లో భోజనాదిక్రియలు నిర్వర్తించి విద్యార్థులందరు సరస్వతీ నిలయమునకు బోయిరోలేదో అంతలోనే తాను శయన గృహమునకుబోయి నారాకకై వేచుచుండెను. నేనును బోడివారిని దాటించుకొని యా గదిలో జేరితిని. ఆపైన నేమి జరిగెనో నేను జెప్పలేను.

రాజా ! మఱి జెప్పవలసిన దేమున్నది? మేమిరువురము స్మరానందసాగర మగ్నులమై యొడలెఱుంగక మేనులుపెనవైచుకొని మంచముపై బండుకొనియున్న సమయంబున మాగురువుగారు తటాలున తలుపు తెరచుకొని లోపలకువచ్చిరి. విద్యార్థులుండు మందిరము దూరముగా నున్నది. ఇతరులీలోపలకు వచ్చువాడుకలేదు. కావున, మేము తలుపుబిగించుకొనకయే పండుకొంటిమి. దానంజేసి యతండు నిరాటంకముగా మేమున్న గదిలోనికి వచ్చెను. అయన మాచర్యలగ్రహించి మమ్ముబట్టుకొనుతాత్పర్యము ననే యట్లూరికిబోయెదనని చెప్పి యెచ్చటనో దాగి అప్పుడు వచ్చినట్లు తర్వాత నూహించితిమి.

అట్టి యవస్థలో నాయనను జూచినప్పుడు మాహృదయము లెట్లుండునో నీవే యూహింపుము. తలలు శరీరమునుండి వేరైపోవుచున్నట్లు తలంచి యేమియుం బలుక నేరక కొంతసేపు ప్రమాన్పడియుండి యెట్టకే నామంచము దిగి సిగ్గుచేత తలలువాల్చి కొని నిలుచుంటిమి. అప్పుడా బ్రాహ్మణుడు దూర్వాసునివలె మండిపడి కన్నులెఱ్ఱ జేసి దంతములు పటపట గొరుకుచు గటములదర నుత్కటకముగా మమ్ముదూరెను. గాని అవియేమియు భయకంపితులమైనమాకు వినంబడినవికావు.

అడుదానిసాహసమెట్టిదో చూడుము. వీరభద్రునివలె నహంకార మావేశించి తిట్టుచున్న యావిప్రుని పాదములంబడి యప్పుడతి నాథా ! ఈ తప్పునాదిగాని మదను నిదికాదు. నాదుర్బోధచేతనే యాతండిందులకు సమ్మతించెను. వానికిజేయుశిక్ష నాకు విధింపుము. అడుపుట్టుకయే తప్పుగలది. అట్టివారు తప్పుచేసినప్పుడు మగవాండ్రు సైరింపకున్న నేనేమిసేయవగును. గురుడంతవాడు తనచేడియంబాడిదప్పినదని నిర సింపక దేవతలసన్నిధి స్వీకరింపలేదా ? సకలశాస్త్రజ్ఞులైన మీరెఱుంగనిదిగలదే ? స్త్రీస్వభావమును గురించి కవిశిఖామణియగు కొక్కోకుడు వ్రాసినది జ్ఞాపకము దెచ్చుకొనుడు.

శ్లో॥ ఉజ్వలవపుషంపురుషంకాయమతే స్త్రీవకోపితాం దృష్ట్వా
అనయోరేషవిశేషస్త్రీకాంక్షతి ధర్మనరపేక్షా॥
భృశమనురాగఃపత్యావపత్యే వాత్సల్యమతివయస్స్వంచ
వ్యతికరనిర్వేదిత్వం ధర్మాపేక్షావ్యస్తి నకస్యాశ్చిత్॥

రః శ్లోకములు నేను జెప్పినవికావుగదా ? లోకస్వభావమును మాసిపింప నెవ్వనిశక్యము. రక్షింపుడని పెక్కుతెరంగుల బ్రార్థించినది.

నేయిబోసిన యగ్నివలె దానిమాటలచే నతండు మఱియు మండిపడుచు సురుచిని విరూపగా శపించి నన్ను జూచుచుంజూచి యోరీమూర్ఖా ! నీవు విద్యలచే నాకు సమానుండవయ్యును వివేకమింతైనం దలంపక నిట్టిఘోరకృత్యమునకు బూనుకొంటివి. కానిమ్ము నీవు విద్యలన్నియు మరపుజెంద బూర్వపుస్మృతి యించుకయు లేక వెర్రివాడవయి చరింపు మీపాటి ప్రాయశ్చిత్తము నీకు జాలునని నన్ను శపించి యరుగనున్నసమయంబున నేనును బాదంబులంబడి యార్యా ! కడుశ్రమపడి చదివితిని. ప్రమాదవశంబున భ్రష్టుండనైతిని. నాగుణము మీరెఱుంగనిదియా ? నన్ను గటాక్షించి శాపాంతము గూడ నను గ్రహింపుడని వేడుకొనగా గరుణాహృదయుండగు నాభూసురుం డోరీ ! నీవు మరణప్రాయమైన యిడుములం గుడిచినప్పుడు నీకు మరల నీవిద్యలన్నియు జ్ఞాపకము వచ్చును. నీ పూర్వపుణ్యము మంచిది పో పొమ్ము. బ్రతికి పోతివని పలికి అతండెందేని పోయెను. అప్పుడు నేను పశ్చాత్తాపతప్తచిత్తుండనై అదియు నొకప్రారబ్ధముగా దలంచి విచారింపక ధైర్యముతో నన్నా శాపవైకల్య మాశ్రయించులోపున గాశికి బ్రయాణమై కతిపయదినములకు గాశిం జేరితిని.

అందు ప్రవేశించిన కొన్నిదినములకు విశాలాక్షిం బెండ్లియాడితిని. ఆ తర్వాత వృత్తాంతము మీరెఱింగినదేకదా ? అట్టి విశాలాక్షి నీపాటి తెలివితో వీక్షించు భాగ్యము లేకపోయినది. అన్నన్నా ఇప్పుడు నన్నుజూచి యెంతసంతసించునో ? ఆ చిన్నదాని చర్యలం దలంచుకొన గన్నులనుండి అశ్రువులు ప్రవాహముగా వెడలు చున్నవి. నేను తిన్నగా మాటాడునంత గోటిదీనారములు దొరికినట్లు సంతసించునది. నానిమిత్తము ప్రాణములు పోగొట్టుకొనదలంచిన యా మహాపతివ్రత యెట్లున్నదియో గదా ? నేను వెర్రివాడనని యించుకయు నామాట నిరసించునదిగాదు. రాజా యేమి చెప్పుదును. అట్టి కాంత నిక యీజన్మమునంజూడనని తోచుచున్నది. గుర్రమునుండి నేలబడినంత నాకు శాపాంతమైనది. అప్పుడే సింహమును జంపితిని. నాపరాక్రమము సంగతి మొదట నీతో జెప్పుట మఱచితిని. నేను బాల్యమునుండియు శస్త్రవిద్య యందును బరిశ్రమ చేయుచుంటిని. దానంబట్టియే యక్కేసరి నవలీలం బరిమార్చితిని. పిమ్మట నా విశాలాక్షిని వెదకుచు బెక్కుదేశములకుబోయి తుదకీయూరుచేరితిని. ఈ గ్రామమున నిట్టిఘోరకృత్యములు జరుగుచున్నవని తెలిసికొనలేకపోయితిని.

సాయంకాలమున కిందుజేసిన నొకయిల్లాలు దారికడ్డమువచ్చి మర్యాదగా దనయింటికి భోజనమునకు దీసికొనిపోయినది. ఆ రాత్రి వారియింట నాకు జేసిన విందు అల్లునకైనం జేయరని చెప్పగలను. దాచనేల నాయింటిలో నొకసుందరి నేను శయ్యాగతుండనైయున్నసమయంబున జక్కగా నలంకరించుకొని నాయొద్దకు వచ్చి

నది. మొదట నమ్మదవతి యుపచారములు సేయుదానివలె నటించి క్రమంబున దన చతురవిలోకన సంభాషణాది విలాసములచేత నామనం బనంగాయత్తంబు గావించినది.

అప్పుడు సురుచి సంగమసమయమాట జ్ఞాపకమువచ్చిన బుద్ధితెచ్చుకొని వస్తు నిరూపణచేయుచుండ నీశ్లోకము స్మరణకు వచ్చినది.

శ్లో॥ కాంతేత్యుత్పలలోచనేతి విపులశ్రోణీభరేత్యున్నమ
త్పీనోత్తుంగపయోధరేతి సుముఖాంభోజేతి సుభ్రూరితి
దృష్ట్వామాద్యతిమోదతేభిరమతే ప్రస్తౌతి విద్వానపి
ప్రత్యక్షాశుచిభస్త్రికాంస్త్రియమహోమోహస్యదుశ్చేష్టితం

క్రొత్తవాడనని యించుకయు గొంకులేక పెక్కువిధంబుల బోవునమ్మత్త కాశిని తత్తరమువారించుచు నించుబోతి మేమింద్రియంబుల జయించినవారము నీవిలాసములు మాకుల్లాసము గావింపనేరవు. నీవిందుండిన లాభమేమియులేదు. పోపొమ్ము. మీమగవారు జూచిన మోసమువచ్చును ఉత్తమస్త్రీలకిది ధర్మముకాదని మందలించిన జలించిన దెండముతో నమ్మందయాన మందయానమున దానువచ్చిన త్రోవంబోయి నది పిమ్మట నేను శయ్యయందు బరుండి యుపాయంబుననలేచి చూచువరకు బాదములకు సంకెళలు దగిలించి యొక బందీగృహంబున బద్ధుడనై యుంటిని. నాయవస్థ యంతయు నీవుసైతమనుభవించినదే. మఱియు జెప్పనేల. నేడు ప్రొద్దున నేమిటికో యీ పాతాళగృహంబునకుదెచ్చిరి. ఇందు మీదర్శనలాభముకలిగినది ఆపదలయందును శుభములు గలుగుననిచెప్పిన పెద్దలమాటలుయదార్థములని నమ్మవచ్చును. మిమ్ముజూచుటచే నాపడిన యిడుములన్నియు మఱచితిని. ధన్యుడనైతిని. ఇదియే నావృత్తాంతమని పలుకుచు నతకూరకుండెను.

అతని వృత్తాంతమంతయును విని యీ యింద్రద్యుమ్నుడు మిగుల వెఱగుపడుచు నతనిం గౌగలించుకొని యోహో! మిత్రమా! విశాలాక్షి యిప్పుడు నిన్నుజూచిన నెంతసంతోషించునో గదా! ఆపూబోడికి నీవు తగినవాడవగుదువు. దానంజేసియేనీ పెండ్లియైనపిమ్మట చింతించుచున్న యాచిన్నదాని స్వప్నములో నీవు చింతింపకుము. నీకు మేలయ్యెడినని యమ్మవారు చెప్పినది. అద్దేవిపలుకుపోలి బోవునా? ఈయిడుములు సైతముదాటి యాబోటితో గలిసికొనగలవని నాకు దోచుచున్నది. ఇప్పటికి దీనిని దాటుపాటవమెట్టియుంటోచకున్నది. కానిమ్ము. ఈయిక్కట్టు తెచ్చిపెట్టిన దైవమే దీనిని మరలించును. న్యాపతిన నెరవేర మీయిరువు రెన్నడు గలిసికొందురో యని పలుకుచు నతనిశోకమును శాంతిపజేయుచున్న సమయంబున వారిమాటలన్నియు వినుచున్న యొకపురుషుడు విన్నముడై యారాజున కిట్లనియె.

దేవా! నేను దేవరదాసుడను వీరదాసునాద, మీ సంవాదమునంతయు విని యుంటిని. మిమ్ము నాయేలికయైన యింద్రద్యుమ్నునిగా దెలిసికొంటిని. మీవంటి వారిట్టి కట్టునంబడి యుండుట లోకంబిట్టటగుటకని తోచుచున్నది. అగ్నినొడిగట్టిన

యట్లు మిమ్మెఱుగక చెరబెట్టిరి గదా మఱియు దేవరకు గోరుచుట్టుపై రోకటిపోటునాటి నట్టి యార్తిపైదారుణంబగు నొకవార్త నెఱింగించుచున్నదాన వినుండు.

అల్లనాడడవిలో సింగపురాదవిని భయపడ చిత్రసేన సేనలంగూర్చుకొని తమయానతిలేకయే పురంబునకు బోవుచుండ నడుమదారిలో శబరసైన్యమెదురుపడి మనసైన్యమునంతయు బారదోలెను. మనభటులందరు ప్రాణభీతిచే దలయొకదారిని బారి పోయిరి. ఒక్కరితయే దిక్కుమాలియున్న యక్కలికిమిన్న నుబల్లకీతోడనే వశముచేసి కొని యక్కిరాతులు పోవుచుండ నేనదిజూచి యోర్వజాలక యొక్కరుండ నేమి సేయునని యించుక శంకింపక విడువుడు విడువుడు అని కేకలు వేయుచు వారి వెంటబడితిని.

అప్పుడు నన్ను వాండ్రుపట్టుకొని రెక్కలుగట్టి యెచ్చటికో దీసికొని పోయిరి. కొన్నిదినములు నన్నెచ్చటనో దాచిదాచితుదకీయూ రొకనాడు దీసికొనివచ్చి నన్నొక గృహస్థునికి విక్రయించిరి. అతఁడును నాకన్నము పెట్టుచు స్వేచ్ఛగా మాత్రము తిరుగనీయక నొక బందీగృహమునసుంచి నిన్నటిదినమున నిచ్చటికి దీసి కొనివచ్చెను. కారణమేమియో నాకు దెలియదు. దేవిగారినిసైతమీయూరే తీసికొనివచ్చి నట్లు వాండ్ర మాటలవలన నూహించితిని. ఎచ్చటనున్నదియో నాకు దెలియదు. ఇంత పట్టు నా యెఱింగినదని యాదూత చెప్పెను.

అప్పుడమ్మహారాజు మూర్ఛమునింగి నేఁబడి యొక్కింతకు దెప్పిరిలి అయ్యో? నా ప్రేయసి యింటికి బోయి సుఖంబున్నదని యెంతయు సంతసించు చున్నవాడ నచ్చేడియయు నావలెనేయాతనము జెందుచున్నయది. కటకటా! కిరాతులా నాతి నెంతకష్టపెట్టిరో యిప్పుడెచ్చటనున్నదియో నాకైయెంతపరితపించుచుండెనో అన్నన్నా పాపపువేటకారణంబునగదా యిన్నియాపదలు తటస్థించినవి. దుర్నిమిత్తంబు లప్పుడే పొడగట్టినవి. శంకించుకొనియు మానితినిగాన. నాభాగధేయంబిట్టుండ మంచిబుద్ధియేలపుట్టును? ఇప్పుడు చింతించుటకంటె కొంచపుపనిలేదు లోకంబంతయు దైవాయత్తంబై యున్నది గదా యతని యానతిలేక నేపనియు జరుగదు. తదను గ్రహము గలిగెనేని యిన్నియాపదలు తృటిలో బాయగలవని ధైర్యముదెచ్చుకొని భక్తి పూర్వకముగా బరమేశ్వరుని ధ్యానించుచుండెను.

అప్పటి కర్ధరాత్రమైనది. అందరు నిద్రించుచున్నవారలు. తఱంచి యందు గావలియున్న కళింగుడు పుళిందుడు ననువారలిట్లు సంభాషించుకొనిరి.

పుళిందుడు—కళింగా! యిటురమ్ము గ్రామవిశేషము లేమి? నీబావమరది పురసంరక్షకులలో నొక్కడగుటచే నీకు స్పష్టముగా దెలియును గదా. ఇచ్చటి వారం దరు గాఢముగా నిద్రబోవుచున్నవారలే, మన మాటలను వినరు రహస్యములను జెప్పుకొనవచ్చును.

కళింగుడు—అన్న! పుళిందా! ఈ జీవచ్ఛవములు మేలుకొని మాత్ర మేమి చేయగలరు? మాబావమరిది చెప్పిన విశేషములు గొన్నిగలవు వానిని జెప్పెద వినుము.

పుళిందుడు—ఏలాగునైనను కొంచెము మెల్లగా జెప్పుము. గోడకు జెవు లుండునను సామెతగలదు.

కళింగుడు—మరేమియు భయములేదు. విను. నేటియుదయమున బురమంతయు రాజభటులు పరీక్షింపగా నెవ్వరి యింటిలో నేమియు దొరకలేదు. కృష్ణదాసు మందిరమునందు మాత్ర మొక పుస్తకము దొరికినదట.

పుళిందుడు—కృష్ణదాసుడు రాజశాసనము వినలేదా ఏమి? మంత్రశాస్త్ర పుస్తకములన్నియు లాగికొని యట్టివి దాచినచో శిక్షింతుమని రాజుగారు చాటింపలేదా; ఆ పుస్తకమచ్చట నేమిటికుంచవలయును?

కళింగుడు—అది మంత్రశాస్త్ర పుస్తకము కాదు. దేవభాషతో నేమియో వ్రాసియున్నది ఆ లిపి యిచ్చటివారి కెవ్వరికి దెలియదట

పుళిందుడు—అట్టిపుస్తకమచ్చటి కెట్లువచ్చినది?

కళింగుడు—అదియేమో యెవ్వరికి దెలియదు. (చెవులో) కృష్ణదాసు చర్యలు మనకు క్రొత్తవాయేమి భోజనమునకు బిలిచి యేపండితుని జెరపెట్టెనో. వాని పెండ్లాముగూడ మిగులజాణ బాటసారులను మాటలచేతనే మోహముపెట్టి యింటికి రప్పించును.

పుళిందుడు—తర్వాత నేమిజరిగినది?

కళింగుడు—ఆపుస్తకము దీసికొనిపోయి రాజునెదుట బెట్టిరట. పిమ్మట నేమిజరిగినది నాకు దెలియదు, అందులకు గృష్ణదాసుడు కొంచెము వెరచుచున్నవాడని వాడుకగా నున్నది.

పుళిందుడు—కృష్ణదాసు గడుమొండిలే! ఇట్టివానికి జడియడు. అయినను గట్టిగాబట్టి యీపుస్తక మెచ్చటిది చెప్పుమని రాజుగారడిగిననేమిచెప్పునో!

కళింగుడు—ఎద్దియోచెప్పి దాటిపోవగలడు.

పుళిందుడు—రేపటిదినమున మరల వీరినందరను బూర్వపు స్థలములలో జేర్తురా? ఇంకను నిందేయుంతురా?

కళింగుడు—ఇంకేమి పనియున్నది? యిండ్లన్నియు బరీక్షించిరిగదా? రేపు రాత్రి మరల వీరిని దీసికొనిపోవుటయే పని.

పుళిందుడు—పుస్తకమునుగురించి కృష్ణదాసుడు శంకించుచు దన బలిపురుషుని దీసికొనిపోక ఇంకను గొన్ని దినములుంచునేమో!

కళింగుడు—ఎల్లుండి మధ్యాహ్నము కృష్ణదాసుగారి యింటిలో దేవీపూజ జరుగును. అప్పుడు దేవికి బలియియ్యవలయును. దాని ఏమిచేయును?

పుళిందుడు—అవును, రేపమావాస్యయే కాదా! కలశస్థాపనము ఎల్లుండియే? మరచితిని. తప్పక రేపే వీరిని దీసికొనిపోదగినదే.

కళింగుడు—అయినను మనకు మరల జాబు రాకమానదు.

పుళిందుడు—ఎట్లైన నీయేడు రాజుగారు కడుదీక్షగా బరీక్షించుచున్నారు. వెల్లడి కాకమానదు.

కళింగుడు—ఏమో తెలియదు. ప్రొద్దుపోయినది యికనిద్రబోవుదుము అని వారిరువురు నిద్రబోయిరి.

ఆ మాటలన్నియు నింద్రద్యుమ్నుని చెవినిబడినవి. పుస్తకమును గూర్చి సంభాషించిరి గావున నది తనదేయనియు నా కృష్ణదాసు తన్ను బట్టినవాడేయనియు నెల్లుండి దప్పక తనకు మరణము విధియైయున్నదనియు నిశ్చయించి యింద్రద్యుమ్నుడు ధైర్యమువిడువక యోగంబవలంబించి

చ॥ జలదములోని క్రొమ్మెరుగు చాయలు భోగపరంపరల్, మహా
నిలపరిఘట్టితా జలకణీరతుగా జీవితంబు చం
చల తరముల్ వయోభిమత సౌఖ్యసుసీగతి నాకలించి స
భ్యులు పరమాత్మ యోగమున బుద్ధిఘటింపగ జేయుటొప్పగున్.

అని వైరాగ్యాయత్త చిత్తుండై భగవదారాధనను జేయుచుండెను.

అంత మరునాటి యర్ధరాత్రంబున వారిద్దల్ల బొందినెవరులకు జేర్చిరి. ఇంద్రద్యుమ్నుని గృష్ణదాసు తనయింటికి దీసికొనిపోయి వెనుకటి గదిలోనేకట్టిపెట్టించెను. మరునాడుదయంబున నవరాత్రి ప్రారంభము. అతడు మొదటి దివసమునందే యమ్మవారికి బలియియ్యవాడుక వున్నది. కనుక నాడు ఇంద్రద్యుమ్నునికి దలయంటి మేన మంతయు బసుపు బూసిరి. మెడకు వేపకొట్టగట్టిరి. మంచిమంచి యలంకారము లుంచిరి. అదియేమియు నమ్మహాపురుషుడెరగడు. బాహ్యాప్రచారము ఏమియు లేదు. అయింటిలోనే యొకగదిలో భయంకరరూపముగానున్న మహాకాళి కెదురుగా నొక స్తంభముపాతి బంగారుగొలుసులతో నతని నందు గట్టిపెట్టిరి. దమ్మహాశక్తి కెదురుగా నిలబడి తన దేహమూరకపోక కాళికకు వినియోగ మగుచున్నందులకు మిగుల సంత సించుచు విశాలాక్షిని మగనితో గూర్చుమని దేవిని బ్రార్థించుచు సర్వసంగములు విడిచి మనం బీశ్వరాయత్తంబు గావించి తనమెడకు కత్తివేటునకు వాటముగా నుండు నట్లు వాల్చి మరణసమయ మాకాంక్షించి యుండెను.

వానిధైర్యమునకు నర్చకులందరు వెరగుపడిరి. కాళియు గజగజ వణకజొచ్చినది. అర్చకులు పుష్పపూజావసానమున ధూపమును దీపమునుందీర్చి మహానైవేద్య సమయమైనది. ఇక బలి యియ్యవచ్చును వ్రేయుడని పలుకుచున్న సమయములో గృష్ణదాసు వీధి తలుపులు తీయుడని యరచుచు నెవ్వరో వీధిలో సందడిచేయు

చున్నట్లు వినంబడినది. అదివిని కృష్ణదాసు తటాలునబోయి తలుపుల దెరపించెను. వీధిలోగొందరు పరిచారకులతో రాజుగారి గుఱ్ఱమెక్కి పౌరులు చుట్టును బరివేష్టింప నెద్దియో పుస్తకము చేతంబూని నిలువబడియుండిరి.

కృష్ణదాసు తలుపుతెరచినతోడనే రాజుగారు గుఱ్ఱమునుదిగి లోనికిబోయిరి. కృష్ణదాసు మిగుల భయపడుచు నోహో! నాగుట్టెవ్వరో తెలియపరచిరి. పరీక్షించుటకై వీరువచ్చిరి. ఇప్పుడు తలుపులుతీసి మోసపోయితినని పశ్చాత్తాపమునొందుచు నప్పు డేమియు జేయునదిలేక జేతులుజోడించి రాజుగారియెదుట నిలువబడియుండెను

రాజు—కృష్ణదాసనువా డెవ్వడు?

కృ—చిత్తము మహాప్రభూ! నేనండి.

రాజు—ఈయిల్లు నీదేకాదా?

కృ—చిత్తము. చిత్తము. నాదేనండి.

రాజు—నీయింటిలో నీపుస్తకము దొరికినట్లు మాభటులు చెప్పుచున్నవారు నిజమేనా?

కృ—చిత్తము నేనాసమయమం దింటిలోలేను. కావున నాకు నిజము తెలియదు.

రా—నీవింటిలోనున్నట్లు వారుచెప్పిరే? నీవబద్ధమాడుచుంటివేమి?

కృ—చిత్తము మొదటలేను తర్వాత వచ్చితిని.

రా—ఓహో! ఎప్పుడు వచ్చిననేమి? ఈ పుస్తకము మీయింటిలో దొరికినదా లేదా? చెప్పుమని యడిగిన నెద్దియో చదివెదవేమిటికి?

కృ—చిత్తము. చిత్తము. నాయింటిలోనే దొరికినది.

రా—ఇది నీయింటికెట్లు వచ్చినది?

కృ—(కొంచెముసేపాలోచించి) దేవా! యొకనాడు మాయింటికొక బాటసారివచ్చి భోజనముచేసి దీని నిందు వదలి వెళ్ళిపోయెను. నాటినుండియు నిది మాద్వారము మీదనే యున్నది కాబోలు. మేము సైతము చూడలేదు. మొన్న మాకింకరులు దీనిని దీసికొనిపోయిరి. ఇదియె యదార్థము.

రా—ఆవచ్చినవా డెందుబోయెనో యెఱుంగుదువా?

కృ—నాకు దెలియదు.

రా—నీ మాటలు విన శంకాస్పదములుగా నున్నవి నీయిల్లు బరీక్షింపవలసి యున్నది. నీవేమి చెప్పెదవు?

కృ—తమరు నాకు క్రొత్తవారా? మాయిల్లు జక్కగా బరీక్షింపవచ్చును. ఇప్పుడు పూజాసమయము కొంతసేపుండి పరిశీలింపుడు.

రా—మీపూజ మేము చూడగూడదా ఏమి?

కృ—మా నియమ మట్టిది. అని యిట్లు కృష్ణదాసు పలికిన విని యనుమానముపడి యారాజు తక్షణమే యతని యిల్లు బరీక్షింపుడని భటుల కాజ్ఞాపించెను.

అప్పుడు కృష్ణదాసు భయపడుచు లోనికిఁబోవ బ్రయత్నించెను. రాజభటులు కదలనిచ్చిరికారు. తర్వాత రాజుగారు భటులతోఁగూడ నాలోనికిఁబోయి నలుమూలలు వెదకించిరి. అంతకు పూర్వమే యాయలజడివిని యర్చకులందరు తలయొకదారిని బారిపోయిరి. అందున్న యింద్రద్యుమ్ను డొక్కరుండు మాత్రము యూపంబుననున్న యజ్ఞపశువువలె స్తంభమున గట్టంబడి యొకవెరపుంగక శక్తికభిముఖముగా నిలువంబడియుండెను. అట్టివానినిజూచి యారాజు శంకించుచు నీతండెవ్వఁడు? ఇట్లు గట్టఁబడియుండుటకు గారణమేమి? అని అడుగగా నొక్కరుండును మాటాడలేదు. పిమ్మట నతని మెడనున్న గొలుసుల విప్పించి నీవెవ్వండవని యడిగెంచెను. అతఁడు గన్నులు దెరచకయే నేనిప్పుడు పరమాత్మను. వేగమశిరము నరుకుఁడని యుత్తరము చెప్పెను. ఆమాటలువిని యాపుదమిఱేడు పరితపించుచు నోహో! వీనిని బలియిచ్చుటకు నిచ్చట గట్టిరి. దాననే వీని నిట్లు పసుపుకుంకుమము మొదలగువస్తువులచే నలంకరించిరి. అన్నన్నా! యొక నిమిషముదాటిన నిష్కారణము వీఁడు చచ్చిపోవునుగదా? కృష్ణదాసు నిటురప్పింపుడని దూతలంబంపుటయు నదివరకే సగముచచ్చియున్న అతండామాట విని వెరచుచు నెట్టకే యక్కడికి వచ్చెను.

ఆ రాజు కృష్ణదాసుని జూచి యోరీ! ఈతనినిట్లు స్తంభమునం గట్టించితివేమి? ఇతఁడెవ్వఁడు? నిజము చెప్పకున్న నిన్నిప్పుడు చిత్రవధ సేయంబత్తు ననుటయు నతండు గడగడ వడంకుచు మహారాజా! మేము వీనిని జంపుట కిందు గట్టలేదు. అమ్మవారి ప్రీతికై యిట్లు గట్టితిమి పిమ్మట విడిచివేయుదుము. ఇది మా కులచారమైయున్నది. ఈ విషయము మీరు పౌరులనడిగి దెలిసికొనుడని నిర్భయముగా బొంకెను. ఆ రాజు వాని మాటలు విని కినియుచు ఓహో! మీ యాచారమంతయు వినియే యిచ్చటికివచ్చితిని. మరల పౌరుల నడుగవలసిన యగత్యములేదు.

ఈ యూరివారెల్ల నిట్లే చేయుచుండిరి. కానిందు నేను మునుపటి రాజుగాను. వీని చేతనే యదార్థమంతయుం జెప్పించెద జూడుమని పలుకుచు నింద్రద్యుమ్నునిం గట్టిన గొలుసులు విప్పించి వానిచే నా కృష్ణదాసుని గట్టించి యింద్రద్యుమ్నున కిట్లనియె. అయ్యా! మీ యాపద తొలగిపోయినది. నేనీ పట్టణపు రాజును. నా పేరు సింహకేతుఁడు. వీరి చర్యల విని పట్టుకొనుటకై యిచ్చటికి వచ్చితిని. మీరెవ్వరు? మీ పేరేమి? ఇట్లేల కట్టఁబడితిరి? మీ వృత్తాంత మంతయుం జెప్పుడని యడిగెను. ఆ మాటలు విని యింద్రద్యుమ్నుఁడు మనం బెట్టకే బాహ్యప్రచారమునకు త్రిప్పి మెల్లన గనులు దెరచి యెదురనున్న అతని రేనిగా దెలిసికొని నమస్కరించుచు నిట్లనియె. అనఘా! నన్ను దేవలోకము నుండి మరల నీ లోకమునకు దెచ్చితివి. ప్రాణదాన సుకృతము నీకు దక్కినది. మీ వంటివారు పాలించుచుండ నీ గ్రామమున నిట్టి క్రూరకృత్యములు జరుగుట వింతగా నున్నది. ప్రజల యిడుమల నరయని రాజు నిరయమును బొందునని చెప్పుదురు. నా వృత్తాంతము వినుండు. నేనింద్ర

ద్యుమ్నుడను నాడను. దైవవశమున వీరికి జిక్కి బలిపురుషుడ నైతినని తాను వేటకు బయలుదేరినది మొదలు నాటి దనుక జరిగిన వృత్తాంత మామూలచూతముగా వక్కాణించెను.

ఆ వృత్తాంతమంతయును విని యా భూకాంతుడు సంతోష భయ సంభ్రమ శోకంబులు చిత్తంబులబెట్టి సరము పై గరంబిడుకొని కటకటా ! ఈ గ్రామవాసు లెంత క్రూరులు ! వీరినందర నేకముగా జంపించినను దోషము లేదుగదా ! మార్గస్థుల నందర నీ రీతిని వేధించుచున్నారు గాబోలు. తెలిసికొనలేక పోయితినే. కానిమ్ము దైవకృపవే నిప్పటికైనం బట్టుకొంటినని సంతసించుచు కృష్ణదాసుని జూచి యోరీ ! తులువా ! ఇక నీవేమి చెప్పెదవురా ? నిన్ను గత్తుల కోసలో ద్రోయింతును చూడు మని పండ్లు పటపట గొరుకుచు నా క్షణమే గ్రామములో నన్ని యిండ్లును బరీక్షించి యచ్చటనున్న వారినందర దన యొద్దకు దీసికొనిరండని యమకింకరులంబోలు కింకరుల కానతిచ్చి యా యింద్రద్యుమ్నుని వెంటబెట్టుకొని తన కోటలోనికి బోయెను. రాజభటులు శరాసితి బటురయంబునబోయి ప్రతి మందిరమును వెదకి యందున్న బలిపురుషుల గనుగొనుచు వారికివైచిన సంకెలలు విప్పి యా యింటి యజమానుని బంధించుచు గ్రామంబున నీరీతి అందరం బట్టుకొని సాయంకాలమునకు రాజుగారి యాస్థానమునకు దీసికొనివచ్చిరి.

ఆ భూపతి వారి వారి వృత్తాంతములన్నియు విని పౌరులు గావించిన క్రూరాచారములకు మిక్కిలి సంతసించుచు నయ్యపరాధులకెల్ల దగిన శిక్ష విధించి బలి పురుషులనెల్ల నాదరింపుచు గానుకలతో గూడ వారి వారి దేశముల కనిపెను. వారిలో నున్న యింద్రద్యుమ్నుని భార్య చిత్రసేనను మదనుని ప్రత్యేకముగ గౌరవించి యంతఃపురమునకు దీసికొనిపోయెను. ఇంద్రద్యుమ్నుడందు దన భార్య జిత్రసేనను గురుతుపట్టి తన్నా మెకుం దెలియజేసి యా సతీమణి పడిన యిడుము లన్నియు విని మిక్కిలి పరితపించెను.

క్షత్రియ దంపతులును మదనుండును సింహకేతుడు తమకు గావించు అపూర్వసత్కారములకు మిక్కిలి విస్మయము జెందుచు పలువిధంబుల గొనియాడ దొడంగిరి. పిమ్మట సింహకేతుండు వారి మువ్వుర నొక రహస్యస్థలమునకు దీసికొని పోయి యుచితాసనంబులం గూర్చుండబెట్టి యిట్లు సంభాషించెను. ఇంద్రద్యుమ్న మహారాజా ! నీవును నీ భార్యయు నీ మదనుడును కాశీరాజు కూతురు విశాలాక్షి కతంబున గదా యిట్టి యిక్కట్టులంబడితిరి ? నీవు గడు బుణ్యాత్ముడవు. నీ పరోప కారపారీణత దినం దేటబడుచున్నది మరియు నీ పుస్తకము మొదట విశాలాక్షి యాపద దాటించినది. ఇప్పుడు మీ యిక్కట్టును నిదియే పోగొట్టినది. దీనిని జూచియే గదా నేనా యిల్లు పరీక్షించితిని. ఈ పుస్తకము వ్రాసినవాడు కడుపుణ్యాత్ము లగుదు రని పల్కుటయు నింద్రద్యుమ్నుండా నృపతి కిట్లనియె. అనఘా ! నీవు మాకు

చేసిన యుపకార మెన్నటికిని మరువవలసినది కాదు యమలోకమునుండి వెనుకకు లాగికొని వచ్చితివి. నా యావజ్జీవము నీ యందు గృతజ్ఞుఁడనై యుండెద, మాకు బోవ ననుజ్ఞ యిమ్ము. నాకిక విశాలాక్షిని వెదకి యా మదనునితో గూర్పవలసిన పని యొకటి మిగిలియున్నది. అమ్మహాసాధ్వి యెందున్నదో తెలియదు. ఆ కొరంత దీరెనేని నేను గృతకృత్యుండ నగుదుదని పలికిన విని యజ్ఞపతి నవ్వుచు నిట్లనియె.

నరేంద్రా ! ఈ మదనుండు శాపగ్రస్తుండై యున్నతరి అత్తలోదరిని బెండ్లియాడెను. అప్పటంతియు నితని విడిచి చాల కాలమైనది. మీరిప్పు డాపూవు బోడి వెదకి తీసికొనివచ్చినను నీతండానాతి బరిగ్రహించునా ! అ మాట దెలిసికొని మరి యుం బొందని నుదువుటయు నయ్యెడయుం దమ్మదనుని మొగముజూచెను. అతం డప్పుడు భూపా ! నేను శాపగ్రస్తుండనైయున్నను అమ్మహాసాధ్వి మనోవృత్తి నెఱుంగుదును. మేరువైనం జలించునుగాని యమ్మదవతి హృదయము చలింపదు అక్కాంచనగాత్రిని గాంచుటకంటె భాగ్యమున్నదియా ! ఎట్లయిన నా ప్రేయసిని గూర్పుడు మీ కనేక వందనముల గావించెదనని పలికెను ఇంద్రద్యుమ్నుండును విశాలాక్షి గుణంబులట్టివేయని స్తోత్రము జేసెను.

అప్పుడా సింహకేతుడు నవ్వుచు నా చిన్నది యా యింటిలోనే యున్నది. మీకు జూడ వేడుక యేని నిందురప్పించెద నుండుడని తటాలున లేచి లోపలికిం బోయెను. ఒక ముహూర్తములో నా లోపలి నుండి యొక చిన్నది వారికి నమస్కరించిన మదనుండు గురుతుబట్టి హా ! ప్రేయసి ! హా! విశాలాక్షి ! యని పలుకుచు నాయెలనాగం గౌగలించుకొనియెను. ఇంద్రద్యుమ్నుండును అమ్మా ! నీవు మా విశాలాక్షివే ! ఇచ్చటికెట్లు వచ్చితివి ! ఎందెందు తిరిగితివి. ఈ నృపతి యాశ్రయం బెట్లబ్బెను నీవృత్తాంతము జెప్పుమని యడిగిన నప్పడతి నవ్వుచు నార్యా నా కథ మిక్కిలి యద్భుతమైనది. సావధానముగా జెప్పవలయు నిప్పుడు ప్రొద్దుబోయినది. భోజనాదిక్రియలు నిర్వర్తింపవలయునని పలికి వారిని లోపలికిం దీసికొనిపోయి తగు నుపచారముల జేయించినది. అని యెఱింగించి మణిసిద్ధుండు వేళ యతిక్రమించుటయు నప్పటికి కథ జెప్పుటమాని తదనంతరోదంతంబవ్వలి మజిలీ యందిట్లని చెప్ప దొడంగెను.

# 14 వ మజిలీ

## విశాలాక్షీ ప్రవాహము కథ

గోపా ! విను మా కాశీరాజపుత్రిక విశాలాక్షి తన వృత్తాంతము వారి కిట్లని చెప్పఁదొడంగినది తండ్రీ ! నీవటు సింహమును బరిమార్పనరిగి యెంతకును రాకునికి బరితపించుచు నీ ! నా కిక బ్రతికినం బ్రయోజనము గాన్పింపదు. శోక పరంపరలు నన్నూరక బాధింపుచున్నవని నన్నుగాక నాకుపకారము చేయవచ్చిన వారినిగూడ వేధింపుచున్నవి. అహో ! కాలమహిమ యని తలంచుచు మరణకృత నిశ్చయనై యందులకు సాధనమాలోచించుచున్నంతలో నించుక నిద్రపట్టినది.

అప్పుడొక కామినీలలామంబు కలలో నాకు గనబడినది తల్లీ ! నీ యుల్లంబున జింతమానుము. నీకు మేలయ్యెడినని దయామేదురములగు చూపులు నాపై వాలింపఁజేయుచు నానతిచ్చినది. అంతలో నేను మేల్కాంచి యాకల్కిని నలుమూలలు వెదకుచు నెందునుగానక కలయని నిశ్చయించుకొని యోహో ! నాకు బలుమారిట్టికలలు వచ్చుచున్నవేమి ? శుభమో యశుభమో తెలియదు. కానిమ్ము. మరికొంతకాల మరసెదంగాక యని నిశ్చయించి మరణోద్యోగంబు మాని వెండియు దురగమెక్కి యక్కడ గనంబడిన త్రోవంబడి నడువ దొడంగితిని. ఆదారి యెక్కడికిబోవునో నాకుదెలియదు మిట్టమధ్యాహ్నము దనుక వడిగా నాతత్తడిని నడిపించితిని. యాయరణ్యమున కంతము గనంబడలేదు.

తీవ్రతప్తనగుట మేనం జెమ్మటలు గ్రమ్మ క్షుత్పిపాసలతో నలసి యరుగుచున్న నాకు రోగార్తున కమృతంబువోలె మధుర జలపూరితంబగు సరోవరం బొండు గన్నుల పండువ గావించినది. అప్పుడు సీతకరణచోరకములగు మారుతకిశోరములు మార్గాయాస మపనయించినవి. వికచసారసవాసనలు నాసాపర్వమొనర్చినవి. జలవిహంగమ విరుతంబులు శ్రవణసుఖంబుజేసినవి. అట్లాసరసి నాకతిథి సత్కారంబుల గావించిన సంతసించుచు నేనందు గుఱ్ఱముదిగి మోకాలిబంట నీటిలో నిలువంబడి కరతలంబున నెరయజిమ్ముచు నిర్మలజలంబు గడపునిండ గ్రోలి యందు నిలువంబడి కొంతసేపు తదీయ విలాసంబులరసితిని. అన్నన్నా ! యనుంగువయస్యలు సేవింప ప్రియునితో గూడికొని యిట్టి తటాకంబున గ్రీడించు చేడియదిగదా భాగ్యమని తలపోయుచు దటంబుజేరి యవ్వటవిటపిశీతలచ్ఛాయ హస్తోపధానముగా శయనించి యాత్మీయగహన సంచారాది ప్రచారంబుల దలంచుకొనుచుండ నంతలో గాఢముగా నిద్రపట్టినది. నేనెంతసేపు నిద్రబోయితినో నాకు దెలియదు. మరికొంతసేపటికి

గన్నుల దెరచి చూచినంత నేనొక యుద్యానవనంబులో బండుకొనియుంటిని. అప్పుడు లేచి కన్నులు నులిమికొని నలుదెసలు పరికించునంత నా గృహము నా తటాకము నావటవృక్షము గనంబడినదికాదు. అప్పుడు భ్రమజెందుచు నోహో! ఇదియేమివిచిత్రము. ఇప్పుడు నేను తటాకము దాపుననున్న మఱ్ఱినీడను బవ్వళించితినే. ఇచ్చటి కెప్పుడు వచ్చితిని. నన్నెవ్వరైనం దెచ్చిరా ఏమి. ఇది కడువిచిత్రముగానున్నది. ఇపూవు దోట యెక్కడిది ? నేను విశాలాక్షి నౌదునా ? మఱియొకతెనా అగునగు, ఇదికల నిజమనుకొని భ్రమపడుచుంటిని. కాకున్న నే నెరుంగకుండ నిచ్చటి కేలవత్తును. అయ్యో! ఇది కలయని యెట్లు నమ్ముదును. స్వప్నము నిద్రలోవచ్చునుగదా! ఇప్పుడు నా కన్నులు తెరవబడియున్నవి. ఇదిగో కర్మేంద్రియము లన్నియు బ్రసరింపుచున్నవి. ఇదిరాత్రియా! పగలా! సూర్యచంద్రులిరువురు గనంబడుట లేదు. వెలుతురుమాత్రము చక్కగానున్నది. నా జన్మావధిలో నిట్టి యద్భుత మెన్నడును జూచియుండలేదే! యని పెద్దతడవు పెక్కుగతుల దలపోసి యదియేదియైనను నిశ్చయింప లేకపోయితిని.

ఏది యెట్లయినను మేలగుంగాక యని యపూవుదోట సోయగం బరయదలంచి మెల్లన నమ్మంటపముదిగి యత్తోటలో బ్రవేశించితిని. అందు మగరాల చేత గట్టంబడి విశాలమగు మార్గముల ప్రక్క మొక్క మొక్కకును నీటితుంపురు లెగర జిత్రవిచిత్రములగు జలయంత్రము లమర్పబడియున్నవి. కుసుమఫలభారమున వంగి నేలంటియున్న లతాకుడుంగములు కన్నులపండువులై పొదగట్టినవి. అందున్న పుష్పజాతులు ఫలజాతులు భూలోకములో నెన్నడును గనివిని యెఱింగినవికావు. వాని పరిమళ విధమీ రీతిదని చెప్పుటకు శక్యము కాదు. విరులయందేగాక ఫలములయందు సైత మద్భుతమైన పరిమళము గలిగియున్నది.

పలుతెఱంగుల రంగులుగల విరులచే నొరయు గుత్తుల మొత్తముల నెత్తావుల గుత్తకొని యత్తోటలెల్లెడల గ్రుమ్మరు తెమ్మెరలమ్మమ్మా! యొకమాటు మేనికి సోకినంజాలదా! సుమరసంబు గ్రోలి సొమ్మసిలి ఝుమ్మని మ్రోయు తుమ్మెదల రొదలు వినిన మునుల హృదయములకు సైతము మదన వికారము బొడమకమానదు. మొదట తీవియల పందిళులు వానిచుట్టు విరిమానులు వానిపైన ఫలజాతులు సూత్రపట్టి పెక్కుతరములుగా నాటబడియున్నవి. నాటిన రకము వెందెందును మరల నాటబడియుండలేదు. ప్రతిపాదపమునకు యేదో యధారముగ గలిగియున్నది. అట్టి వినోదకరమగు వనవిశేషములు జూడదలచి యొక మార్గమునంబడి పోవదొడంగితిని. ఎంత దూరము పోయినను తుద మొదలు కనబడలేదు. మఱియు వచ్చిన త్రోవయు, బోయిన త్రోవయు సైతము తెలిసినదికాదు.

ఆ మార్గమువిడిచి మరియొకదారింబడి నడువ దొడంగితినిగాని యదియు

నట్లేయుండెను. ఈ రీతి నందున్న మార్గములన్నియుం దిరిగి చూచితినిగాని దేని నుతయు గనంబడలేదు. అందుజూచిన జాతి మరల జూడలేదు. అవ్వనములో గ్రమ్మరునప్పుడు నాకు పూర్వపు విచారమంతయు జ్ఞాపకము లేదు. దిరిగినకొలఁది సంతసమేగాని యలసటలేదు. నాకు దిఘగునప్పుడొకచోట నొక వింతయైన ఫలము గనంబడిన దానిం ద్రుంచి భక్షించితిని. అయ్యారే, ఆమాధుర్యమేమని వక్కాణింతును ? దానిని దినినది మొదలు నాకు బలముగలిగి క్షుత్పిపాసలు నశించినవి. ఆ ద్రుమమునం దట్టిఫలము మరియొకటిమాత్రముండుట బరికించి దానిని గోసి మూటగట్టితిని. మరియుం దిరుగ దిరుగ నొకద్రుమమున మిక్కిలివింతైన పూవొక్కటియే వికసించి పరిమళము వెదజల్లుచు బ్రకాశించుట బరికించి దానింగూడ గోసి పైటచెరంగున మూటగట్టితిని.

పెక్కేల నక్కానన సౌభాగ్యమంతయు దేటపఱ మీకు వక్కాణింప నారు మాసములు పట్టును. వినుమట్లు నేనత్తోటలో దిరుగుచుండ నొక దండ నవరత్నములచే గట్టబడిన దేవాలయ మొకటి గనబడినది, దానిని మొదట దూరము నుండి చూచి కాంతి పుంజమను కొంటిని దాపు చేరిన కొలఁది యాలయమని తెలియవచ్చినది. ఆహా ! మనోహరోద్యానవనములో నా దేవాగారమెంతటి శోభగా నున్నదని చెప్పను? కేవలము నాణెమైన రత్నములే బంగారు నీటితో అతికి గట్టబడినవి. అందు జనులందరును సంతోషముతో అలరజేరినంత నమ్ముఖమంటపమునందు గూర్చుండి వీణ నవరించు చున్న యొక తరుణీలలామంబు నాకు నేత్రపర్వము గావించినది.

కాశీలోనున్న విశాలాక్షి పోలికగా అందొక మహాదేవి యున్నది. పిమ్మట ఆ శక్తిని జూచినంత నాకు మా అన్నపూర్ణ జ్ఞాపకమువచ్చినది పిమ్మట నేనా వీణా వతి దాపున అతివినయముతో నిలువంబడితిని ఆమెయు నన్ను గూర్చుండుమని కను సన్న జేసినది. నేను అతి భక్తిపూర్వకముగా అద్దేవికి మ్రొక్కి అచ్చట నోరగా గూర్చుంటిని. అపూర్వవుబోడి పాణియుగంబున వీణధరించి యింపుగా స్వరంబుల వెలయింపుచు అద్దేవిమీద దాను రచించిన కృతుల గాంధర్వాకృతులుగా గలకంఠ నాదము మేళవించి హాయిగా బాడినది. వీణావతి అను పేరుగల అయ్యంబుజాక్షి తుంబురు నొద్ద సంగీత మభ్యసించినదట ! విశాలాక్షి అను అద్దేవతను ప్రతి దిన మనుకూల ప్రియసమాగమమునకు సేవించుచున్నట్లచ్చేడియ పాడినకృతిమూలముననే నాకు దెల్లమైనది ఎట్టి కాంతకు అనుగుణ ప్రియసమాగమంబభిలషించుట సహజ గుణముగదా ! నేను భూలోక గాన విశేషములన్నియు వినుటయేగాక సంపూర్ణముగా అభ్యసించి గాయనీ గాయకులలో నుత్తమురాలనని ప్రసిద్ధి నొందితిని. అన్నన్నా ! అన్నాళీకవదన చేసిన స్వరకల్పనలకేనెంతేని విస్మయము జెందితిని. చేతనము లచేతనములుగా అచేతనములు చేతనములుగా సంగీతము బాడిరను కవి ప్రౌఢోక్తి

యదార్థమని నాకప్పుడు తోచినది. అట్టి శాస్త్రము మన లోకములో లేదు. ఆ వీణావతి పాడిన స్వరవిశేషములన్నియు సులభముగా నేను గ్రహించితిని.

మరియు గానావసానమున అక్కాంతతో గొంత ముచ్చటింప దలంచుకొని సమయ మరయు చున్నంత నా చిన్నది మోహనం బనురాగము తంత్రీనాదముతో గంఠనాదము మేళగించి మనోహరముగా పాడినది. ఆహా ! ఆ రాగము నిజముగా జగన్మోహనంబని చెప్పవచ్చును. దానివిశేషముల సైతము గ్రహింపు చున్నంత నాకంతలో భ్రాంతి బొడమి మనంబుసీరై మేను పరవశమైనందున నేల కొరిగితిని. అంత గాఢముగా నిద్రపట్టినది. మరికొంతసేపటికి లేచి చూచినంత మునుపటి మఱ్ఱిచెట్టు నీడను బండుకొని యుంటిని. అప్పుడులేచి నలుమూలలు పరికించుచు అప్పటికి జాము ప్రొద్దుండుటజూచి నేను నిద్రబోయినది జామని తెలిసికొని జాములో నెన్ని విశేషముల గంటినని వెరగందుచు అట్టికల యెన్నడేని మరలవచ్చునాయని ధ్యానించుచు దద్విశేషంబులన్నియూ స్మరించుకొనుచు నా తొయ్యలితో సంభాషింపక పోయితినే అని పశ్చాత్తాపపడుచు గాన విశేషములన్నియు జ్ఞాపకమున్నందులకు అద్భుతపడుచు నీరీతి కొంతసేపు డోలాయ చిత్తురాలనై విచారింపుచుంటిని.

లోకములో మంచిస్వప్నములు వచ్చినప్పు డందరికి మరల అట్టిది కనంబడిన బాగుండునని తోచుట సహజముకదా ! అట్లు నేనది కలయని భ్రాంతితో గొంతదనుక దొట్రు పడుచు అంతలో నా పైట కొంగున గట్టిన మూట జూచుకొని ఇదియేమి ? వింతగా నున్నదె ? నేను కలలో గట్టిన మూట అట్లే యున్నదేమి ? అని వెరగందుచు నా మూట విప్పి చూచిన నా ఫలము పుష్పము దానిలో నున్నవి.

అప్పుడు నే నోహో ! ఇందాకటిది స్వప్నమనుకొంటినే; కాదు కాదు. నిజముగా అట్టిపని జరిగినది. లేకున్న నాకొక రప్పుడుగట్టిన పూవును పండు నెట్లుండును. ఆ! ఏమి నిజముగానే అపూర్వతోట కెప్పుడుపోయితిని. పోలేదే, తెలిసినది. నాకిది స్వప్నమే. నిజముగా నేనీ మఱ్ఱిక్రింద బరుండలేదు. అయ్యో! మరల భ్రాంతిజెందు చున్నానేమి నేనిందాక గుఱ్ఱమెక్కి యిచ్చటికివచ్చి యిచ్చెరువులో నీరు ద్రాగి మార్గశ్రమవాయుటకయి యిందు, బరుండలేదా! ఇదియే స్వప్నమనుకొనుచున్నానే! కాదు కాదు. నిజమేయని పలుదెరంగుల జింతించుచు నాపూవును ఫలమును ముందుబెట్టుకొని వాని సౌరభ మాఘ్రాణించుచు మెచ్చుకొనుచు నొక్కింత సేపేమియుం దోచక యూరక కూర్చుంటిని.

మరికొంతసేపు ధ్యానించి ఫలభక్షణంబున క్షుత్పిపాసలుడుగుటయు, గాన విద్యాపరిశ్రమము విశాలాక్షిదర్శనము, ఫలపుష్ప ప్రాప్తిలోనగు చర్యలన్నియు దలంచుకొని అది అంతయు విశాలాక్షి కృపావిశేషముగాక మరియొకటి కాదని నిశ్చయించితిని.

అదిమొదలు నాకెట్టి చింతయును లేదు. ప్రియసమాగమము కూడ





శ్రమముగాఁ గాఁగలదని ధైర్యము మనంబున గుదురుపడ సంతతము పరిపూర్ణానందముతో నుంటిని. అట్టి సంతోషముతో లేచి యా పుష్పమును ఫలమును మరల పయ్యెద కొంగున మూటగట్టికొని యా గుర్రమెక్కి పశ్చిమాభిముఖముగా నడువ జొచ్చితిని. అప్పటికి జాము ప్రొద్దున్నది సాయంకాలము కాకమున్న యెద్దియేని యొకయూరు చేరవలయునని తలంచి తత్తరిని వడివడిగా దోలితిని. ఆ దారి కొంతదూరము పశ్చిమముగాఁబోయి పిమ్మట దక్షిణమునకు మరలినది.

# భీమశర్మ యను బ్రహ్మచారి కథ

దానింబడి పోవబోవ సాయంకాలమున కొక యగ్రహారము దాపునకు జేరితిని. అం దిరువది సంవత్సరములు ప్రాయముగల యొక బ్రహ్మచారి మానుకొమ్మకు త్రాడు బిగియించి యదితనమెడ కురిగా దగిలించుకొని ప్రాణముల బోగొట్టుకొనుటకు సిద్ధముగా నుండుట జూచి తటాలున గుర్రముదిగి నేను వాని చేయి బట్టుకొని యిట్లంటిని. వటుడా! నీవెవ్వఁడవు? ఇట్టిబోసికొని బలత్కారముగా మృతినొందనేల? ఆప్తలెవ్వరును లేరా? ఈ తెగువకు గారణంబేమి అని మెల్లగా నడిగిన నతండు నన్ను గనుచీకటిలో గురుతుపట్టనేరక పురుషుడనుకొని నాకిట్లనియె. అయ్యా! నీవు నాచేయి వదలుము. నేను బ్రతికియుండినను లాభమేమియును లేదు. ఈ పడిన యిడుమలు చాలవా! లోకంబున దరిద్రుడును విద్యలేనివాడును బ్రతికియుండుటకంటె నీచము లేదు. అని పలుకుచు వెక్కు తెరంగుల బొక్కుచున్న యా చిన్నవానితో మరల నే నిట్లంటి.

విప్రుడా! నీజన్మముత్కృష్టమైనది. దరిద్రముచేత నీకుఁజావవలసిన యగత్యములేదు. నీవృత్తాంతము చెప్పుము. నిన్ను భాగ్యవంతుని జేసెదనని అనునయపూర్వకముగా నడిగిన నతండిట్లనియె. అయ్యా! ఇచ్చటికి గ్రోశదూరములోనున్న విజయపురి యను నగ్రహారము నా కాపురము. నాపేరు భీమశర్మయండ్రు. మే మేడ్వుర మన్నదమ్ములము. నేను గడపటి వాడను. నాకు విద్యయేమియు నబ్బినదికాదు. దానంజేసి యందరకు గాసినవాడనై వర్తింపుచుంటిని. నాకు దల్లిదండ్రులు పుట్టినప్పుడే మృతినొందిరి. నేను మా అన్నలుచెప్పిన పనులు శ్రద్ధతో జేయుచు వారికిష్టముగానే మెలంగుచుంటిని. మావదినెలందరు కాపురమునకు వచ్చిన తరువాత సైతము నాకు దాసత్వము తప్పలేదు. మఱికొంతపని ఎక్కువైనది. వారికిని నుపచారములు చేయవలసివచ్చినది. అందరకును దాసుడనై పరిచర్యలజేయుచున్నను నాకు నిత్యము వారివలన బ్రహరణములు తప్పలేదు. వానిని గణియింపక నేను నాయోపినంత పనిజేయుచుంటిని. నేడు రెండుజాములవరకు నింటిలో బనులుజేసి బ్రాహ్మణార్థమై పిలువబడి

యొకరింటికిబోయితిని. అచ్చట బిండివంటలు శాకములు మొదలగు పదార్థములు తృప్తిగా దిని భోజనమైనవెనుక కొంతసేపచ్చట విశ్రమించి యింటికిబోయితిని. అప్పుడు మాపెద్దన్న భార్య నన్ను గోపదృష్టింజూచుచు భీమశర్మా! నీవు భోజనము జేసి వెంటనే యింటికిరాక యింత యాలసించితివేల యింటిలోని పనులన్నియు నెవ్వరు చేయుదురనుకొంటివి. ఈదివసమున మాత్రము భోజనముదొరికిన జాలునా? రేపక్కర లేదా ఏమి? నీవు మునుపటివలె గాదు మిక్కిలి ప్రాల్మాలుచుంటివని కసరుచు దానుయ్యేలలో బయుండి ఇంటిలో మంచినీరులేదు. బావికి బోయి కావడియెత్తుకొని రమ్మని యాజ్ఞాపించినది.

అప్పుడు నామనంబునందొడమిన కినుక నాపుకొనుచు వదినా! నాకీదినమున భోజనము బరువైనది. దాననాయాసముచేత నింటికి రాలేక యచ్చటనే విశ్రమించితిని. ఇంకను నాయాసముదీరలేదు. ఇప్పుడు బావికి బోలేను. కొంచెముతాళి వెళ్ళెదనని యుత్తరము చెప్పితిని. దీనిలో నేమితప్పున్నదియో నీవేచెప్పుము. తానుచెప్పిన మాట వింటినికాకని అహంకారముచేయుచు నౌరా, నేనుజెప్పిన పని చేయక యిక నాయింటిలో నుండెదవా, నీకెవ్వరో దుర్బోధచేయుచున్నారు. కానిమ్ము మీయన్న వచ్చినతరువాత నిన్నేమిచేయించెదనో చూడుమని పెక్కుదుర్భాషలాడినది. అప్పుడు నేను జడియుచు పోనీ నీకింత కోపము వచ్చినచో నిప్పుడే పోయెదనులే అని కావడి సవరించుకొని బిందె లందులో నుంచుకొనునంతలో దటాలున నుయ్యాలదిగివచ్చి యాకలశము లాగికొని ఛీ! నీవు మాకు నీరుతేవలదు తెచ్చిననీరు త్రాగినది మాదిగదే సరియని యొట్టుబెట్టుకొనుచు పెక్కుతిట్లు తిట్టినది.

ఏమమ్మా! నేనేమంటినని యింతకోపము చేసెదవు. ఆయాసముగా నున్నది గనుక అనకదెత్తునంటినిగాని నీకెదిరించితినా? ఈతప్పు గావుము ఇకనెన్నడిట్లనని ఎంతప్రతిమాలినను నామె కోపము తీరినదికాదు. ఆమె గయ్యాళితనమునకు భయపడియో స్వభావము చేతనోకాని తక్కినవదినలు సైతము నాదే తప్పనిరి. కాని యామె నేమియు ననరైరి.

పిమ్మట నావిధ తలగట్టుకొని పండుకొని మగడువచ్చిన తరువాత నాపై లేనిపోని నేరములుచెప్పి యతని కహంకారముగలుగజేసినది. అతడెంతమాత్రము నిదానించక పెండ్లాము మాటనమ్మి నిర్భాగ్యుడా! నీవింతపోతరింతువేయని యరచుచు నన్ను లావుపాటి దుడ్డుగ్రరతో జావమోదెను. అప్పుడు తక్కినయన్నలుగాని, యన్నల భార్యలుగాని యొక్కరైనను నడ్డపడరైరి. దిక్కుమాలిన నాబ్రతుకునకు నేను నిందించుకొనుచు దెబ్బలచే మేనంతయు నొచ్చినందున ప్రాణములం దిచ్చలేక ఎవ్వరికిని దెలియకుండ జావవలయునని యీ యోడపిలోనికి వచ్చి యిట్లు చేయుచుంటిని. ఇంతలో నీవడ్డుపడితివి. యిదియే నావృత్తాంతము. పైన నేనేమిచేయవలయునో నీవే చెప్పుము. ఎంతయాపదయునులేక యూరక నేనుమాత్రము జావయత్నింతునా యని

పలికిన నవ్వఁదగు నుడువులు విని నేను మిగుల జాలిపడి బ్రాహ్మణుడా! నీవు వెరవకుము. నీయాపది యుడిగించెదను. "జీవన్భద్రాణిపశ్యతి" యను నార్యోక్తి గలదు. అని యోదార్చుచు నాకొంగు ముడినున్న పండుతీసి అతని చేతిలో బెట్టి యిట్లంటిని.

వడుగా! ఈఫలము మిగులమహిమగలది. ఎన్నిదినములున్నను వాడక ఇట్లే యుండును. దీనిని దినిన వారికి క్షుత్పిపాసలుండవు. మీదేశపురాజునకు దీనినిచ్చిన నీకు వలయునంత విత్తమియ్యగలడు. దానయథేచ్ఛముగా జీవింపుము పోపొమ్ము. చావవలదని యతని మరణము తప్పించి యాఫలమునిచ్చి యంపితిని.

నేను నారాత్రి యాయగ్రహారములో బ్రచ్ఛన్నముగా నొకచోటఁబండుకొని యుదయమునలేచి మరల త్రోవఁబడి నడవఁజొచ్చితిని. అచ్చటనుండి యామార్గము తూర్పుగాబోయినది. అట్లు మధ్యాహ్నము దాక నడిచి యెండ మిక్కుటముగా నున్నది కావున కొంచెము విశ్రమించిపోయెదంగాక యని తలంచి యందొక చెట్టునీడ నా గుర్రముఁగట్టి యందుగూర్చుండి యా ప్రాంతవిశేషములరయుచుంటిని.

అంతలో నొక ముసలి బ్రాహ్మణుడు పదుగురు పిల్లలతో నా మార్గమున నెందేనిఁ బోవుచు నాతపభీతిచే విశ్రమించు కొరకు నా చెట్టునీడకే వచ్చెను. అతనిఁజూచి నే నిట్లంటి. అయ్యా! తమ దేశమెద్ది? ఎచ్చటికి బోవుచుంటిరి? ఈపిల్లలు మీ కేమగుదురు? మీ వృత్తాంత మెఱింగింపుడని యడిగిన నతండు కంటనీరు నించుచు మెల్లన నిట్లనియె.

అమ్మా! మాది విదర్భదేశము. నా పేరు కృష్ణశర్మ. ఈపిల్లలు నా సంతానమే. నాభార్య ప్రసూతి వికారమువలన స్వల్పకాలముక్రిందటనే పరలోకగతురాలయినది. ఈపసికూనలతో మిగుల చిక్కులు పడుచుంటిని. కడుబీదవాడను. వేరే యాడు దిక్కునులేదు. నిత్యము భిక్షాటనముచేత కాలక్షేపము సేయుచుంటిని. ఇప్పుడు మా దేశమందు వర్షములులేక క్షామముబుట్టినది. ఆ భిక్షమైనను చాలినంత దొరుకుటలేదు. ఎచ్చట కేనిం బోయిన జీవనములు నిలుచునేమో యని బయలుదేరితిని. కాని నాకన్న ముందరనే నాదురదృష్టదేవత నడుచుచున్నట్లు తలంచుకొంటిని. ఎచ్చటికిబోయినను యన్నము దొరుకుటలేదు. నేను భోజనముచేసి రెండుదినములైనది. ఈపసిబాలురు నడువలేరు. ఆకలికిదాళలేక యూరక యరచుచున్నారు. ఈకుటుంబభారము భరింపలేక బలవంతమున చచ్చిన బాగుండునని తోచుచున్నది. తల్లీ! నీవుచూడ మిగుల గౌరవము గలదానివలె తోచుచుంటివి. నాకేమైనం దయచేయుదువే అని కన్నీరునించుచు అడిగెను.

అప్పుడు నే నాతని దీనాలాపములవిని సహింపనేరక శివశివా యని చెవులు మూసికొనుచు నించుక చింతించి యిట్టి దరిద్రుని బాగుచేయుటకంటె పుణ్యము లేదని నిశ్చయించి నాయొద్దనున్న యా అద్భుతపుష్పము నాతనికిచ్చి యిట్లంటిని.

బ్రాహ్మణుడా! ఇది పారిజాతమువంటిది. దీనిని బయటనుంచినచో యోజనదూరము దీని పరిమళము వ్యాపించును. ఎన్నిదినములున్నను వాడక యిట్లే యుండును. ఇది భూలోకములో దొరుకునది కాదు. మిగుల వెలగలది. నీయందలి జాలిచే నీకిచ్చితిని. నీవు దీనిందీసికొనిపోయి నీ కుటుంబమంతయు నెల్లకాలమును బోషించు వానికే యిమ్ము పొమ్మని అతని కా కుసుమమిచ్చి గుఱ్ఱమెక్కి మరల దారిం బడితిని.

ఆ మార్గము కొంతవరకు దూరుపుగాబోయి మరల నుత్తరమునకు మరలినది. అప్పుడు నేను బరిశీలించి అయ్యో! ఈ దారి మరల నుత్తరదిశకు గొనిపోవుచున్నది. అం దరణ్యమేకాని గ్రామములు లేవు. నే నెక్కడికి బోవలసియున్నదో నాకు దెలియకున్నది. నా ప్రాణనాయకుండెందున్నది ఎఱుంగరాదు. స్వప్నమునం జెప్పిన మహాదేవి మాటలనమ్మి యిట్లు గ్రుమ్మరుచుంటిని. దారితప్పి యిటు వచ్చితిని. వృద్ధబ్రాహ్మణుడు గనంబడినచోటనే పెరొక తెరవున్నది దానింబడిపోవలసినది అయినను మరల వెనుకకు బోనేల? ఈ మార్గముననే పోయి చూచెదనని పెక్కుగతుల దలపోసి యాదారినే గుఱ్ఱమును నడిపించితిని.

అట్లు సాయంకాలమువరకు నడిచినను జనపదం బేదియు గనంబడినదిగాదు. అప్పుడు మనంబు దిగులుపడి యోహో! ఇది మిగులయరణ్యప్రదేశము. ఇందు క్రూరసత్వరములుండక మానవు. చీకటులుదెసల నాక్రమించుచున్నవి. శకుంత సంతానంబులు గురాయనములప జేయుచున్నయవి. నేనిజీయి నెటుల వేగించుదాననో తెలియకున్నది. అయ్యో! నాకిట్టి చింతయేల జనింపవలయును ప్రాణత్యాగమునకు దెగించియున్న నాకిమృగభీతియేల? యెట్లయినను మేలేయగుంగాక అని మరల ధైర్యము దెచ్చుకొని యారాత్రి నివసింపదగు స్థలమరయుచు మరికొంతదూరము నడచితిని.

# కోయపల్లెకథ

అంత నచ్చట పశువుల యార్పులు వినంబడినవి. దానింబట్టి యాప్రాంతమందెద్దియో పల్లెయున్నదని నిశ్చయించి యారొద అనుసరించి అల్లన అప్పల్లెలోనికి బోయితిని. అందున్న కోయదొరలందరు రక్కసులవంటివారే. నాడెద్దియో యుత్సవముచేయుచు నాబాలవృద్ధముగా నొకచావడిలో దీపముపెట్టి పెక్కురీతుల అడవి వాద్యములు వాయించి మిక్కుటముగా త్రాగి యాడుచుండిరి. వారిని జూచినంత నాగుండియ లవిసిపోయినవి. ఎట్టియాపదలోనున్నను మరణభీతి మాత్రము విడువదు సుడీ! వాండ్రు నన్ను జూడలేదు.

వాండ్రందరు నుత్సవము సందడిలోనుండిరి. ఆ పల్లెలో నెచ్చటను దీపము లేదు. ఆ చావడిలో మాత్రమున్నది! అప్పుడు నేను మెల్లన గుఱ్ఱముదిగి నాపొలములో నొకచోట గట్టివైచి, ఆ పల్లెలో వేరొక మూలకు బోయితిని. ఆ గుడిసెలకు వావరణములులేవు. అద్భుతములైన కుక్కలున్నవి. అవి క్రొత్తవారినిజూచిన వెంటనే కరచి చంపక మానవు. నా పుణ్యమువలన అవియు నాచావడియొద్దకే చేరినవి. గుడిసెలలో నెవ్వరును లేరు.

అంత నేనొక గుడిసెటిన్నె మీదకుబోయి మెల్లగా గూరుచుంటిని. అంత కొంతసేపటికి నాయుత్సవమునుండి యొకయాడుది యా గుడిసెలోనికివచ్చి యరుగు మీదనున్న నన్నుజూచి కోయభాషతో నెవరువారని యడిగినది. నాకు నేబదియారు భాషలువచ్చునుగాని కోయభాష రాదు. అదియు నాంధ్రభాష ననుసరించియే యుండెను గావున నూహనుబట్టి దాని యభిప్రాయము గ్రహించి అవ్వా! నేను బరదేశిని దారితప్పి యిట్లు వచ్చితిని. ప్రొద్దునలేచి పోయెదనని చెప్పితిని.

అది నా మాటలర్థము జేసికొనలేక అమ్మయ్యో! మన కొండదేవత మా యింటి అరుగుమీదికివచ్చి కూర్చున్నదిరోయని పెద్దయెలుంగున అరచుచు నాచావడి యొద్దకు బరుగెత్తినది. ఆ మాటలు విని వాండ్రందరు నాగందదీపముతో వాద్యములు ప్రయోగించుచు నాయొద్దకు వచ్చిరి. అప్పుడు నామేన ప్రాణములులేవు. చచ్చితినేయని నిశ్చయించితిని. కాని అంతలో మరల నాకొక యూహతోచినది.

అది నన్ను గొండదేవతయని అరచిన అరపు వినబడినది. కొండదేవతకై వారట్లుత్సవము జేయుచున్నారని నిశ్చయించి వారు వచ్చులోపల నాపొరవుపాటి వెంట్రుకలన్ని విరజిమ్మి శివమువూనిన దానివలె నాడుచుంటిని. ప్రాణభీతి ఎన్ని పనులు చేయించునో చూచితిరా? అంతలో వాండ్రు నన్నుజూచి అమ్మోరో, యని యరచుచు వాద్యములు వాయింపదొడగిరి. నేను లేచి యానాదానుగుణ్యముగా నాట్యమాడ దొడంగితిని. నాతో గూడ వాండ్రందరు చిందులు ద్రొక్కుచుండిరి.

అట్లు కొంతసేపు గంతులు వైచిన తరువాత డప్పులు వాయించుట మానిపించి నాకు మ్రొక్కుచు అమ్మోరో! నీకు బలులిత్తుమో పొనకాలిత్తుమో, యమ్మోలో, మాగుడిలోనికిరమ్మో! యని మాటిమాటికి డప్పుపై గొట్టుచు బదాలుపాడగా నేనును దల్రదిప్పుచు అప్పుడా చావడికే పరుగెత్తుకొని పోయితిని.

అప్పుడు నాతో గూడ అందరు, అమ్మోరుగుడికి బోవుచున్నదని యుపచారములు చెప్పుచు డెంపలువాయించుకొనుచు దండములు పెట్టుచు నాచావడియొద్దకు వచ్చిరి. అదివరకే యమర్చబడియున్న వెదురుబద్దలగద్దెపై నేనుబోయి గూర్చుంటి వాండ్రనందరను నాట్యమాడుమని వ్రేలితో సూచనజేసినంత అందరును దమయిష్టము వచ్చినట్లు అడవిపదాలు బాడుచు జిందులు ద్రొక్కదొడంగిరి. అట్టి సమయమున నావెనుకదెసనున్న యాడువాండ్రిట్లు సంభాషించుకొనిరి.

ఒకతె—ఓసీ! ఈయేడు మనకొండదేవత మంచిరూపముతో వచ్చింది సుమీ! అమ్మొరువెంట్రుక లెంతపొడవుగా నున్నవో చూచితివా?

మరియొకతె—ఔను. మొన్నను మాదొరకలలో నిట్లావత్తునని చెప్పినదట! ఈభేమ్మాండములన్నియు చేసేదేవతకు తలవెంట్రుకలు పొడుగుగానుండుట యేమియాశ్చర్యము.

ఇంకొకతె—ఓసీ. మనయమ్మవారు ఎంతమంచిబట్ట గట్టుకొనినదో చూచితివా? ఈమెకు మగ డున్నాడా?

వేరొకతె—ఓసీ. అయ్యో! ఈమెకుమాత్రము మగ డుండడా! ఈమె మగనిపేరు పోతురాజు. పిల్లలుమాత్రము లేరట.

మరియొకతె—మనమందరము యీమెపిల్లలముకామా? ఈమె కృపలేక పోయిన నిక్కడుండగలమా? మనలను బుట్టించినదే ఈమె.

ఇంకొకతె—ఓసీ. నే నెరిగిన తరువాత మనకొండదేవత యిట్టిరూపముతో రాలేదుసుమీ!

వేరొకతె—అవును. నిరుడు పులిరూపమున వచ్చి తెల్లవారకముందే వెళ్ళిపోయినది. ఆ వెనుకటేడు చిరుతపులిగా వచ్చినది. అప్పుడును దెల్లవారకముందే వెళ్ళిపోయినది.

ఇంకొకతె—నే డీయమ్మవా రెంతసేపుండునో?

వేరొకతె—ఓసీ! తెల్లవారుదనుక నుండి పిమ్మట వెళ్ళునని తలంచెదను ఈయేడు మాత్ర మెక్కువగా నిలుచునా?

ఇంకొకతె—ఓసీ! అమ్మవారిదేహము బంగారములాగే యున్నది. రెండు దినములుండినం జూచుచుందుముగదా?

అని యిట్లావాండ్రు సంభాషించుకొను మాటలన్నియు వింటిని. మహారాజా! ఆసంగతి దలంచుకొనిన నిప్పుడు సైతము నాకు నవ్వువచ్చుచున్నది. అట్లు తెల్లవారువరకు గ్రామదేవతవలె వారిచే నర్పింపబడి తెల్లతెల్లవారుచున్న సమయంబు నాగద్దెనుండి లేచితిని.

అప్పు డందరు అమ్మొరు వెళ్ళుచున్నదని కేకలుపెట్టుచు గ్రామదేవతను సాగనంపునటుల నావెంబడి రాదొడంగిరి. నాగుర్రమున్న చోటికిబోయి దానినెక్కి అందరు వెనుకకు బొండని సంజ్ఞచేయుచు గుర్రమును ముసుపువచ్చినదాడికి దోలితిని. వాండ్రందరు కొంతవరకు వెనుకనువచ్చి నాకు దండములు పెట్టుచు నాగుర్రముతో బరుగెత్తలేక క్రమక్రమముగా వెనుకకుబోయిరి. నేనును యమపురి దాటివచ్చినట్లు

సంతోషించుచు నాకట్టి యుపాయము దోపింది యా యాపద, దాటించినవాడు భగవంతుడేయని తలంచి అతనిని మిక్కిలి స్తుతిజేసితిని.

నే నట్లుచేయనిచో నన్ను దప్పక నాకొండదేవతకు బలియిత్తురు. వాండ్ర క్రూరకృత్యములన్నియు నాయాడువాండ్ర సంభాషణలో నాకు దేటపడినవి. పాపము కోయదియే నన్ను గొండదేవతగా నిరూపించినది ఇంతకు దైవమిట్లు శుభము గూర్ప దలచియుండ మఱియొకరీతి నెట్లుజరుగును. అట్లు వసిగా బోవుచు నొకనాడు సాయంకాలమున కొకయూరు చేరితిని. నాడు శివరాత్రి యగుటచే బెక్కండ్రుజనుల కోటీశ్వర మను పేరుగల యాక్షేత్రమునకు వచ్చిరి.

ఆక్షేత్రాధినాయకుండగు కోటీశ్వరుని మహిమ పురాణప్రసిద్ధమగుట దూర దేశములనుండి వేలకొలది జనులు వచ్చుటచే అచ్చట మిగుల సమ్మర్దముగానున్నది. అప్పుడు నాగుర్రమును దూరముగా విడిచి నేను స్నానముచేసి రాత్రివేళ నాగుడిలోనికి బోయితిని. ఆ యాలయములో నొకతరుణి నాకెదురుపడినది దానెచ్చటనో చూచి నట్లుండి పరిశీలింపుచుండగా నత్తలోదరి నన్నుజూచి ఏమమ్మా ! నన్ను సాభిప్రాయముగా జూచుచున్నావు. ఎక్కడనైనా జూచిన జ్ఞాపకమున్నదా యని నవ్వుచు నడిగినది.

అప్పుడు నేను అవును. నిన్నెక్కడనో చూచినట్లేయున్నది. అదియే తలచు కొనుచున్నానని చెప్పితిని. పిమ్మట నమ్మదవతియు జ్ఞాపకమురాలేదా ? అల్లనాడుద్యానవనములో విశాలాక్షి గుడి ముఖమంటపముమీద నేను వీణబాడుచుండగా నీవచ్చటికి రాలేదా ? గానావసానమందు నీతోగొంత ముచ్చటింతమనుకొను నంతలో నీవు నిద్రపోయితివి. పిమ్మట నాకు గనంబడితివికావు. ఇప్పుడైన జ్ఞాపకమువచ్చినదా యని అడిగినది.

అప్పుడు నేనక్కజమందుచు నేమేమీ ! ఇది కడువింతగానున్నదే. ఈకల కంటిని గలలోగంటి. నదినిజమెట్లగును ? కలలోగన్న పదార్థము మేల్కొనినయప్పుడు కనంబడుట వింతకాదా? ఒకవేళ నది కలగాదేమో నిజమే. ఫలపుష్పములసంగతి ఎట్టిటో నిదియునట్టిదే ! యీమాయ దెలిసికొన నెవ్వరికి శక్యముగాదు. నాజన్మావధిలో నిట్టి వింతల గని యెఱుంగనని తలయూచుచు నామెతో నమ్మా ! జ్ఞాపకమువచ్చినదని పలికితిని. మరల నాకాంత కొమ్మా ! నీవత్తోటనుండి యొకఫలము పూవును దెచ్చితివి. వానిమహిమ నీకు దెలియునా ? భద్రముగా దాచుకొంటివాయని యడిగినది. అమ్మా ! నాకువానిమహిమ దెలియదు. ఇమ్మువుర బ్రాహ్మణుల దైన్యము చూడలేక వారి కిచ్చితి నని చెప్పితిని.

అప్పుడదక్కలికి నుక్కుమీద వ్రేలిడికొని ఎంతపనిచేసితివి ? అమ్మవారు నీకై వాని నిచ్చెంగదా ! అల్పపసువుల మఱియొకరికి నియ్యవచ్చునాయని పలుకుచు గాసిల్లు, దైవకృపగలిగిన నది ఎక్కడికి బోవునని పలికినది. నేను బిమ్మట నవ్వన

వృత్తాంత మడుగుదమని తలంచుచున్నంతలో నక్కాంతారత్నంబు ఇదిగో లోనికి బోయివచ్చెద నిందుండుమని గర్భాలయములోనికిబోయి మరల గనంబడినదికాదు. ఆమె మరలవచ్చునని పెద్దతడవచ్చట గాచుకొనియుంటిని. గాని ఎంతసేపటికినీ నామె జాడ గనంబడినదిగాదు. నేను గర్భాలయములోనికి బోయి వెదకితిని. అందును లేదు.

అప్పుడు అన్నన్నా ! ఆ చిన్నదానిచేయి గట్టిగాబట్టుకొని యడుగక యూరక విడిచిపెట్టితినే ! ఇప్పుడేమనుకొన్నను లాభము లేదు. ఆమె విశాలాక్షి కాపుగాలుగా దోచుచున్నది. దానంబట్టియే నాయందును దయగలిగియున్నది. ఇట్టిచిత్రమెవ్వరితో జెప్పినను నమ్మరుగదా ! ఫలపుష్పములు రెండును అమ్మవారు నాకిచ్చినట్లు చెప్పినది. అద్దేవి ప్రచ్ఛన్నముగా నన్ను కాపాడుచునే యున్నది. అమ్మవాదేవినే నమ్మియుంటి నెట్లుచేసినను లెస్సయేయని బహువిధంబుల దలంచుచు మరల వెలపటికివచ్చి యచ్చేడియను వెదకితిని కనంబడలేదు.

పిమ్మట నేనక్కడబయలుదేరి యశ్వయానమున మరునాటి సాయంకాలమునకు ధర్మపురియను రాజధానిం జేరితిని. ఆరాత్రి యొక సత్రమువేదికపై బండుకొని యున్న సమయంబున నందు గొందరు బ్రాహ్మణు లిట్లు సంభాషించుకొనిరి.

సుబ్రహ్మణ్యశాస్త్రి—ఆ వీధినట్లు జనులు గుంపులుగా బోవుచున్నారెక్కడికో ఎఱుంగుదువా !

రామశాస్త్రి—ఎఱుంగుదును. రాత్రి కోటలో గొప్పసభ జరుగునట.

సుబ్రహ్మ—సభావిశేషము లేమి ?

రామ—ధర్మాంగద మహారాజుగారి దివాణమున కొక యద్భుతమైన ఫలమువచ్చినదట దానిజాతి యిట్టిదని ఎవ్వరును జెప్పలేకపోయిరి. అదియెన్నిదినములుండినను వాడదు. మనోహరమైన పరిమళముగలిగియున్నది. దానిందినిన నేమిజరుగునో ఎవ్వరికిని దెలియదు. అట్టి ఫలమును గురించి యుపన్యాసమిచ్చుటకు నీరాజు నానాదేశములకు వర్తమానములు పంపెను. దానికై పెక్కండ్రు మహారాజులు వచ్చిరి. ఈరాజు స్నేహితుడు మళయాళదేశపురాజు చంద్రవర్మ యను నాతడుగూడ యద్భుతమైన పుష్పమును దెచ్చెనట. అదియు నెన్నిదినములున్నను వాడదట. దాని పరిమళము యోజనదూరము వ్యాపించును. చూడగా నారెండు నొకజాతివృక్షమున బుట్టినవియేయని వాసనంబట్టి చెప్పిరి. వానింగురించి ఉపన్యాసములు జరుగును. పిమ్మట సభాసదులు వినోదమునిమిత్తము మదనమంజరియను వేశ్య సంగీతముపాడును. ఇవియే సభలో జరుగు విషయములని చెప్పెను.

వారిమాటలు విని నేను తటాలునలేచి యాఫలపుష్పముల గురించి ఏమేమి మాట్లాడికొనియెదరో వినియెదంగాకయని నిశ్చయించి స్త్రీ వేషముతో సభకుపోరాదని తలంచి పురుషవేషము వైచికొని యాసభకు బోయితిని. ఆసభ చక్కని దీపములచేతను వింత వస్తువులచేత గద్దియలచేత నలంకరింపబడి యున్నది ఆసభామధ్యంబున నా

ఫలపుష్పములు రెండును వ్రేలగట్టిరి. వానిపరిమళ మాసభ్యులకు నాసాపర్వము గావించుచున్నది.

అందు మండలాకృతిగా నమరింపబడియున్న సింహాసనముల మహారాజులు గూర్చుండిరి. రెండవశ్రేణియందు దరతరముగా నధికారులు కూర్చుండిరి. యొకదెస పండితులు నొకదెస గాయకులు మొదలగువారు సభ నలంకరించిరి.

అట్టిసభలో నేనొకమూల పీఠముపై గూర్చుండి వారుచేయబోవు నుపన్యాసమునకు చెవియొగ్గియుంటిని. ఇంతలో నగ్రాసనాధిపతి యాసతింబూని యాగ్రామ ప్రభువైన ధర్మాంగద మహారాజుగారు నిలువంబడి యెల్లరు విన దెల్లముగా నిట్లనిరి.

ఆర్యులారా! లోకాతీతమగు వస్తువెద్దియేని సంప్రాప్తమగు నప్పుడద్దాని విశేషమెల్లరకు దెలియజేయుట రాజధర్మము. ఈ యద్భుతఫల మాహాత్మ్యము నేను జెప్పకయే మీకు దెలియబడుచున్నయదిగదా! ఈ పుష్పము సైతము పరిమళమును నీఫలవృక్షసంజాతమైనట్లే తోచుచున్నది. ఇది యెన్నిదినములున్నను వాడక యీరీతినే యుండును. నేను పదిదినములనుండి చూచుచున్నాను. ఇంచుకయైనకాంతి దప్పలేదు. ఇట్టిమహిమ కల్పవృక్ష సంజాతములకుగాక మరియొకవానికి గలుగదు. ఈఫలమును దినుట వలన కలుగులాభ మెట్టిదియో యెవ్వరికిని దెలియదు. ఏద్దియో విశేషములుండక పోదని నేను రూఢముగా జెప్పగలను. అయినను నివి మాయొద్దకు పెక్కంతరముల నుండి వచ్చినవి. వచ్చినవిధమంతయు నాయాయూజనులచేత మీకు దెలియజేయుంచెదను. బుద్ధిమంతులగు మీరును తరువాత వీని పూర్వోత్తరములను గురించి యాలోచింతురుగాకయని పలుకుచు నా ఫలపుష్పముల సంగతి గుఱుతెరిగిన మనుష్యులను సదర నంతకు మున్నే యప్పటికి రప్పించియున్నవాడు గావున వారికెల్ల మీకు దెలిసినసంగతులు యదార్థముగా గ్రమము దప్పక జెప్పుడని యాజ్ఞాపించెను. అందుముందుగా భీష్మశర్మయను బ్రహ్మచారి లేచి సభ్యులకు నమస్కరించుచు నిట్లనియె.

# అద్భుతఫలము కథ

సభాసదులారా! నా కాపురము విజయపురియను నగ్రహారము. నాపేరు భీష్మశర్మ యందురు. నేనొకనాటి సాయంకాలమున మాయన్న చేసిన యవమానము సహింపలేక చావవలయునను తాత్పర్యముతో మాయూరిప్రాంతమందున్న యడవికి బోయి యందు మెడకురి దగిలించుకొనిబిగించుకొనుసమయములో నెవ్వడో యొకపురుషుడు పంచకళ్యాణిగుఱ్ఱమెక్కి యాదారింబోవుచు నాయుద్యమము చూచి తటాలున గుఱ్ఱముదిగివచ్చి నాచేయిబట్టికొని యిట్టిసాహసము జేయ గారణమేమియని యడిగి

నావృత్తాంతమంతయు విని జాలిపడి నన్నోదార్చుచు మనంబున నెద్దియోధ్యానించి పిమ్మట దనచెంగు ముడివిప్పెను.

అందు నీఫలమును పుష్పమును ప్రకాశించుచున్నవి. ఫలము మాత్రము నాకిచ్చుచు వడుగా! ఇదిమిగుల మహిమగలది. నీదరిద్రము తీర్చువానికే దీనినిమ్ము. సాధారణులకియ్యవద్దు. పోపొమ్మని నాకనుజ్ఞయిచ్చి యతండు గుర్రమెక్కి యెక్కడకో పోయెను. పిమ్మట నేను మిగుల సంతోషించుచు నాఫలమును పదిలముగా ధోవతిని మూటగట్టికొని మాదేశప్రభువగు నీధర్మాంగద మహారాజుగారి కిచ్చినచో నాకు గొప్పబహుమతి జేయునని నిశ్చయించి కతిపయప్రయాణముల నీధర్మపురి జేరితిని.

నేను వీధింబడి బోవుచుండగా నెన్నిపొరలలోనిమిడ్చి కట్టినను దీని పరిమళము నిలుపక దెసలవ్యాపింపం దొడంగినది. వీధియరుగున గూర్చుండిన కుబేరదత్తుడను కోమటి కావాసనకొట్టుటయు వీధింబోవుచున్న నన్ను దరికిబిలిచి బ్రాహ్మణుడా! మీదేయూరు అటట్లో నున్న వస్తువేమియని యడగెను. ఆశెట్టి మిగుల భాగ్యవంతు డని యెఱిగియున్నవాడగావున గొప్పవానితో బొంకనేలయని యాతనితో నాఫల వృత్తాంతమంతయు జెప్పితిని. ఆకుబేరదత్తుండును నామాట విని నన్ను మిక్కిలి గౌరవముగా దనమేడమీదికి దీసికొనిపోయి యేదేది ఫలమెట్టిదో మూటవిప్పి చూపింపు మని తొందరబెట్టెను

అప్పుడు నేను మెల్లన మూటవిప్పి యాఫలమతనికి జూపించితిని. దానిం జూచి యతండు మిగుల నద్భుతమందుచు బ్రాహ్మణుడా! దీని దినిన సంతానము గలుగునాయని యడిగెను.

ఆ సంగతి నాకుదెలియదు నేనెఱింగిన సంగతి నీకుదెలియ జెప్పితినని యుత్తరము సెప్పితిని. తరువాత నత డయ్యా! నీకు బదికాసు లిచ్చెద దీని నాకిచ్చెదవా యని యడిగెను నేను రాజుగారికై దీని దీసికొనిపోవుచున్నాను. పదికాసులకు నిరువది కాసులకు నమ్మను. దీనివలన గ్రామముగాని ముఠాగాని రావలయునని కోరికయున్నది. సామాన్యులకియ్యవద్దని మొదటనే యమ్మహాపురుషుడు చెప్పియున్నాడు. పోయివచ్చెద ననుజ్ఞయిమ్మనలేవబోవునంత నతండు నన్ను జేయిబట్టుకొని కూర్చుండబెట్టి కొసరికొసరి చివరకు లక్షరూపాయ లిచ్చెదనని చెప్పెను. అప్పుడతని మాటలకు మోమోటపడి నేను రాజుగారు మాత్రమింతకన్న నెక్కువనిత్తురా? యీవిత్తమున నాయంతరము సుఖముగా గడుపుకొనవచ్చును. ఎక్కడికి? అశకంతమున్నదియా యని సంతుష్టితో దానికి సమ్మతించి యాఫలమాశీర్వచన పూర్వకముగా నతనిచేతిలోనుంచి యా ధన మిమ్మని యడిగితిని.

అతండాఫలము నొకపెట్టెలోదాచి నన్ను వీధిలోనికి దీసికొని వచ్చి అయ్యా! ధనమంతయు నిప్పుడు సిద్ధముగాలేదు. రేపటియుదయమునకువచ్చును. శ్రమయని యాలోచింపక ప్రొద్దున్న దయచేయుడు. మీవిత్తమున కేమియు భయము

లేదు. మీపెట్టెలోనిదేయని తలంచుకొని యుండుఁడు. ఇప్పుడేదానికి మనుష్యుని పంపు చున్నానని చెప్పెను. వర్తకులమాయ లెవ్వరికిదెలియుఁగ ? వానిమాటలు యదార్థము లేయని యప్పటికి బసలోనికి బోయితిని. మరునాఁడుదయముననే నా కుబేరదత్తునింటికి బోయితిని ! అతండు నన్నుజూచి అయ్యో ! తెల్లవారకుండవచ్చితివేమయ్యా ! యూరికిబోయిన మనుష్యుఁడు రావలయునా ? మీసొత్తునకేమియు భయములేదు. ఒకవేళ వాడు మధ్యాహ్నమునకు వచ్చునేమో ! తమరు సాయంకాలమున రండి. మీసొమ్ము తీసికొని పొందని సమాధానపరచి మరల బసకు బంపెను.

అతఁడు చెప్పినప్రకారము నేను సంజవేళ వానియింటికి బోయితిని. అప్పుడు నన్నుజూచి అయ్యా ! అకూలినా డింకను రాలేదు కారణమేమో తెలియదు. ఉదయమునకు దప్పకవచ్చును. ఇప్పటికి వెళ్ళి పొద్దుటరండి అనిచెప్పెను. వానిమాట యదార్థమే యనుకొని అప్పటికిబోయి యుదయమున మరలవచ్చితిని. అప్పుడును వెళ్ళిన మనుష్యుఁడు రాలేదేయని చెప్పెను. ఆరీతి నాలుగుదినములు త్రిప్పి అయిదవదినమున మనుష్యుఁడు వచ్చినాఁడు కాని సొమ్ముతీసికొని రాలేదు, వారము దినములలో బంపెదనని అచ్చటివర్తకుఁడు చెప్పినాడట. అతఁడు నాకు బాకీయున్న వాఁడు. కావున మీరు వారము తాళివచ్చినచో మీసొమ్మంతయు నిచ్చెదమని చెప్పెను. అప్పుడు నే ననుమానము జెందుచు వర్తకుఁడా ! నీకుసొమ్ము నిలువుగాలేకున్నప్పుడే కొనవచ్చును. ఈపాటికి నాపండు నాకిమ్ము. పోయెదనని యడిగితిని. అవ్వర్తకుండు అయ్యో ! ఇంతమాత్రమునకే నన్ను నమ్మవా ? అని యొండురెండుమాట లైనచో నెక్కడనైన, సర్దుదును నిలువంబడి నూరురూకలు తెమ్మన్న నెట్లుతెచ్చును ? అనక రండు యెక్కడనో చూచి యిచ్చెదనని చెప్పెను. అప్పుడు నేను తొందరపడుచు నేమీ ! నూరురూకలా ? నామెగమువంక చిన్నగాజూచి చెప్పుము. నేను దీని నీ కమ్మను. నాఫలము నాకుదెమ్ము నీపాటివారా దానిఁగొనువారని యుగ్రముగా బలికితిని.

నా మాటవిని యా కోమటి యో వెఱ్ఱిబ్రాహ్మణుడా ! నిజముగా నాఫలమునకు లక్షరూపాయ లిత్తువనుకొంటివి గాబోలు నీవు గ్రామమనియు ముఖాయనియు పలికినమాటలువిని యపేక్షకు నద్భుతపడి లక్షరూపాయలని పరిహాసముగా నంటినిగాని యది యదార్థముకాదు. ఊరక వెఱ్ఱియాశపడక నేనిచ్చిన దానితో సంతోషించి వెళ్ళుడు. నేను కావున నింతమాత్రమైన నిత్తునని చెప్పుచుంటిని రాజుగారైన నూరకయే పంపుదురు. అని చెప్పుచు పదిరూపాయలు నాకియ్యవచ్చెను.

అప్పుడు నేను మిగుల నహంకారముచేయుచు నాకిసొమ్మక్కరలేదు. నాపండు నాకిమ్మని బలవంతపెట్టితిని. ఆ ఫల మిదివరకే తింటిమి. చేదుగానున్నది. దానిగుణ మేమియు నాకు గనంబడలేదు. నీకానబెట్టితిని గదా అని యిచ్చుచుంటిని. కాని అది కానియైన చేయవని యా కోమటి నాకు బదులుచెప్పెను. అతనిమాటలువిని నేను గుండెలు బాదుకొనుచు అయ్యో ! ఈకోమటి నన్ను మోసపుచ్చి నాఫలము హరించి

నాడు. నాకియ్యవలసిన సొమ్మియ్యకున్నాడు. చూచితిరా పెద్దమనుష్యులని యాపాళింత మందున్న వారితోజెప్పి తగవుపెట్టితిని. అప్పటి పెద్దమనుష్యులువచ్చి యాకోమటితో నీబ్రాహ్మణుడు తన ఫలము హరించి యిచ్చెదనన్న సొమ్మిచ్చితివి కావని తగవుపెట్టుచున్నాడు. దీనికి నీవేమిచెప్పెదవని అడిగిరి.

అప్పుడా కుబేరదత్తుడు వారితో అయ్యా! ఈబ్రాహ్మణుడు పదిదినముల క్రిందట నడవిపండెద్దియో మూటగట్టుకొని యీదారిం బోవుచుండెను. అత్తరి నేనది యేమిఅని అడిగితిని. ఈపారుడిది యద్భుతమైన ఫలమని నాతో డాంబికపుమాటలు కొన్ని చెప్పెను. ఆమాటలు యదార్థమని యెంతకిత్తువని అడిగితిని. ఆయన దురాశగా జెప్పెను. నేనుదానికి దగినట్టు పరిహాసముగానే మాటలాడితిని పిమ్మట నీయిష్టమువచ్చినంత యిమ్మని సమ్మతిపడెను.

పల్లెయని నేనాఫలము దినగా జేదుగానున్నది రుచియేమియు గనంబడలేదు. పైన వికారముగానున్నది. పిచ్చియెత్తునేమోఅని వెరచుచున్నాడ. ఇట్టిస్థితిలోవచ్చి మేము పండుతినినసంగతి తెలిసికొని దానికి లక్షరూపాయలు గావలయునని నిర్బంధించుచున్నాడు. ఎక్కడనైన నొకఫలము లక్షరూపల వెల జేయునేమో మీరే చెప్పుడు. అయినను బ్రాహ్మణుడుగదా! ఫలముమాటకేమి? నాకు ఫలమైన నుండదాయని పది రూపాయ లియ్యబోయిన బుచ్చుకొనక యూరక పిచ్చికేకలు వైచుచున్నాడు. ఇట్టి దరిద్రుని నాచెంతకు బిలుచుట నాదేతప్పుఅని యుక్తయుక్తముగా వారితో జెప్పెను.

వారందరు వాని మాటనమ్మి ఎట్టిఫలమైనను లక్షరూపాయల వెలజేయదని పలుకుచు నెదురునన్నే బూటకమువానిగా దలంచి మిక్కిలి మందలించిరి. అంత నేను చింతాకుల స్వాంతుడనయి యేమియు జేయునది లేక ఎవ్వరితో జెప్పినను నమ్మకుండుటచే చివరికిది నా దురదృష్టమని తలంచుచు గలంకపడి రెండుమూడుపవాసములతో నీధర్మాంగద మహారాజుగారి యొద్దకు వచ్చి చెప్పుకొంటిని.

ధర్మప్రభువగు నీ మహారాజు నామొర నాలించి యాక్షణమందే యాకుబేరదత్తుని తీసికొనిరండని తనదూతలనంపెను. ఆ క్రిందటిరాత్రియే వాని యిల్లంతయు దొంగలు కొల్లబెట్టి యింటిలోనున్న ధనమంతయు బెట్టెలతో గూడ నెత్తుకొనిపోవుటచే వీధిలోబడి గుండెలు బాదుకొనుచు కుబేరదత్తుం డేడ్చుచుండెను.

సీ. నరనాథ కులకాననముల దహింపంగ
నవనీసురుల విత్తమగ్నికీల
జననాయకుల నిజైశ్వర్యాబ్ధు లింకింప
బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు

పార్థివోత్తముల సంపదైశ్వర్యంబులగుఁగాక
భూసురధనము దంభోళిధార

జగతీవరుంకీర్తి చంద్రికమాయింప
సూర్యోదయము ధరాసురుల సొమ్ము

గీ. విప్రవిత్తసొమ్ము కంటెను విషముమేలు
గరళమునకును బ్రతిక్రియగలదుగాని
దాని మాన్పంగ భువి నౌషధములులేవు
గాన బ్రాహ్మణస్వము లుగొంట గాదు జగతి.

అని భాగవతంబున జెప్పబడియున్న నీతియెంతప్పను పిమ్మట నాభటులు పటురయంబున నక్కుబేరదత్తు నాన్నపసత్తము నొద్దకు దీసికొనివచ్చిరి. ఇచ్చటను మొదట బొక్కబోకలంబోయెను. గాని రాజదండన భయంబున జివరకు నిజముజెప్పి యాఫలమున్న మందసముగూడ దొంగలెత్తుకొనిపోయిరని విన్నవించుకొనియెను.

తర్వాత నీభూతలపతి యతిప్రయత్నముతో నెల్లెడ వెదకించి తుదకు నీ ఫలమును బట్టికొనెను. ఇంతియ నేనెఱింగినది యని యాబ్రహ్మచారి యుపన్యసించి తర్వాత తన పీఠముమీద గూర్చుండెను అప్పుడందరు గరతాళములు వాయించిరి.

అటుపిమ్మట నందున్న కుబేరదత్తుండు లేచి సభకు మ్రొక్కుచు అయ్యా! యీ భీమశర్మ చెప్పినదంతయు సత్యము. నేను ధనలోభమున బ్రాహ్మణుని మోసము జేసినందులకు మంచి ప్రాయశ్చిత్తమైనది. క్రొత్తకాపైన నింటిలోలేను సర్వస్వము చోరులు కొల్లబెట్టిరి. సింహల పాల్పడితిని. ఇకనెప్పుడు నిట్టిపనులు చేయకుండ బుద్ధివచ్చునట్లందరిలో నపరాధము జెప్పుకొనుచున్నవాడనని లెంపలు వాయించుకొని కూర్చుండెను.

తరువాత రాజు నానతి రెక్కలుగట్టి తీసికొని రాబడిన తస్కరులిట్లనిరి. అయ్యలారా! దైవప్రేరితమైన బుద్ధిచే మేమా కుబేరదత్తునిల్లు గొల్లబెట్టి యాపెట్టె లన్నియు నీయూరనే వాడుక ప్రకారము నిపుణికుడను కంసాలియింటికి దీసికొనిపోయి తిమి. ఆ స్వర్ణకారుడు మాయెదుటనే యన్ని పెట్టెలు విడదీసి యందున్న సరుకు లన్నియు జూపించెను.

తుదకొక పెట్టెలో నీ ఫలమున్నది. దీని పరిమళమునకు వెఱగందియిట్టి ఫల మీ శెట్టి ఎచ్చటనుండి తెచ్చెనోయని పలుతెరంగుల చింతించితిమి. తరువాత మేమా ధనమంతయు బంచుకొనుచు నీ ఫలమును నిపుణికుడు కోరినందున వాని కిచ్చి తిమి. అతండేమి చేసెనో మేమెఱుగము. ఇదియే మాకు తెలిసినది యని చెప్పిరి. పిమ్మట నా కంసాలి అయ్యా! నేనాఫల సువాసనకు వెఱగపడి యాదొంగలను కోరి దీనింబుచ్చుకొంటి రెండుమూడు దినములు నాయొద్దనే దాచి యిట్టి యద్భుతఫలము

నేసుదినిన నేమి లాభమున్నది తారావళి కిచ్చిన మిగుల సంతసించునని నాకు భోగ భామినియైన తారావళి యను వేశ్యకిచ్చితిని.

అదియు దాని విశేషము లరసి మిగుల మురియుచు దాను సైతము భక్షింపక కేళిసౌధంబున గందుకముగా వ్రేలగట్టినది. ఇంతలో రాజభటులాఫలమును గురించి వెదకుచుండుట విని మోసము వచ్చునని జడియుచు దాని నెత్తుటనయిన బారవేయు మని యావేశ్యకు బోధించితిని. అదియు భయపడుచు దానినొక పెట్టెలో బెట్టి తన దాదికిచ్చి కంచకములో పారవేసి రమ్మని రాత్రివేళ నంపినది ఇంతవరకె నేనెరుంగుదు నని యా కంసాలి నుడివెను.

పిమ్మట నాదాసిని నిలబెట్టి చెప్పుమని రాజభటులు బంధించిన నాదాది గజ గజ వణంకుచు నిట్లనియె అయ్యా! నే నాఫలమున్న పెట్టెను నెత్తిమీద బెట్టుకొని యాకంచకమునకు బోవుచు దారిలోనున్న నావిటపురుషునిం జూడవలయునని నాని యింటికి బోయిన వాడు నన్ను జూచి సంతోషించుచు నీపెట్టెలో నున్నదియేమని యడిగెను.

అప్పుడు నేనిదియొక యద్భుతఫలము దీనిని నీకొరకెంతో కష్టపడి తెచ్చి తిని. చూడుమని యాపెట్టెతీసి చూపించితిని. వాడు దానికి సంతసించుచు నాకు దన యందుగల ప్రేమాతిశయమును గురించి మిక్కిలి మెచ్చుకొనియెను. ఆ రాత్రి యచ్చటనుండి యుదయమున మరల మాయేలికసానియైన తారావళి యింటికివచ్చి యాఫలమును గందకములో బారవైచితినని చెప్పితిని. అని యిట్లు దాది చెప్పిన తరు వాత రాజభట చోదితుడైన యావిటపురుషుడు సభవారికిట్లనియె.

అయ్యా! నేనిట్టిపండు తినిన లాభమేమియు గలుగదు. అంగడికి దీసి కొనిపోయి యమ్మిన నెక్కుడువెల రాగలదని నిశ్చయించి దీనికాపట్లు మెరుగక ధారాళముగా నంగడికి దీసికొనిపోవుచుంటిని. దాని పరిమళము నలుమూలలు వ్యాపించి నది. జనులందరు వెఱగందుచు నీగల ముసిరినట్లు మూగిరి.

అంతలో రాజభటులువచ్చి నన్ను బట్టుకొని నీకీఫల మెక్కడ దొరికినదని నిర్బంధించుచు బందీగృహంబునకు దీసికొనిపోయిరి. వారి దెబ్బలకు దాళలేక నేను యదార్థము జెప్పితిని. తరువాత క్రమముగా నాదాదిని తారావళిని కంసాలిని దొంగి లను బట్టుకొని యీ రాజభటులు దాని గుట్టంతయు బయలుపరచిరి. అని యావిట పురుషుడు చెప్పెను. అప్పుడందరు కరతాళములు వాయించిరి. ఈరీతి ఫలాగమన వృత్తాంతమంతయు సభ్యులకు దేటపడిన పిమ్మట నాపుష్పసమాగమ విధముగూడ దెలుపుటకయి నారివారి నాజ్ఞాపించిరి. అందుమూలముగా వృద్ధబ్రాహ్మణుడు లేచి మెల్లన నిట్లనియె.

# అద్భుతపుష్పముకథ

అయ్యా! నేనొక్కనాటి మధ్యాహ్నపువేళ నొక యడవిమార్గమున బోవుచుండగా నొక చెట్టుక్రింద జక్కని చిన్నదియొకతె కూర్చున్నది. ఆమె కన్నులు తెల్లతామరరేకులవలె సోగలై కర్ణముల పర్యంతము వ్యాపించియున్నవి. శరీరచ్ఛాయ పచ్చనిది. తెల్లనిచీర గట్టుకొని యున్నది. నగలేమియును లేకున్నను దేవకన్యవలె బ్రకాశించుచున్నది. ఆమె ప్రక్కనొక్క పెద్దగుఱ్ఱ మున్నది. దానినెక్కి ఎక్కడికో పోవుచున్నది. ఆచిన్నది నాదరిద్రమంతయును విని జాలిపడి కొంతసేపెద్దియో యాలోచించి తన చెంగున మూటగట్టియున్న ఈ పుష్పము నాకిచ్చి ఎల్లకాలము నీకుటుంబము పోషించువారికే ఈ పుష్పమియ్యవలయునని చెప్పి యామె ఎచ్చటకో పోయినది.

ఆమెను నాభాగ్యదేవతనుగా భావించి యామె చెప్పినమాటలు మంత్రోపదేశముగా జపించుకొనుచు నొకనాటి సాయంకాలమున కొక యూరుచేరితిని. ఆ గ్రామము పేరెద్దియో నేనెరుగను. నేను గ్రామములో ప్రవేశింపకమున్నే యిద్దరు మనుష్యులు గుఱ్ఱములెక్కి విహారార్థమై పోవుచు నాకెదురుపడిరి.

అట్లు గుఱ్ఱములెక్కి వడిగా బోవుచున్న వారిని నా మూటలోనున్న పుష్పపరిమళముసోకి యడుగయినను గదలనిచ్చినది కాదు. అపూర్వమైన యాసువాసనకు వారు వెఱగందుచు నలుమూలలు వెదకుచు నాయొద్దకువచ్చి బ్రాహ్మణుడా! నీ యొద్దనేమైనను బరిమళద్రవ్యమున్నదియా అని యడిగిరి.

లఘుబుద్ధినైన నేనాగుట్టుదాపలేక వారి మాటవిని ఔను. ఉన్నది. ఇదిగో అద్భుతమైనపూవని యా మూటవిప్పి వారికి జూపితిని. వారు దానింజూచి మిక్కిలి యక్కజమందుచు నీకీ పూవెక్కడదని యడిగిన గుట్టు దాచక యదార్థమంతయుం జెప్పితిని. ఆ మాటలు విని వారు మిగుల సంతోషించుచు అయ్యా, మీ కుటుంబము నెల్లకాలము మేము పోషించెదము. మా యింటికి రండు ఈ పుష్పము మాకిమ్మని వేడుకొనిరి. వారి మాటలకు నేను సంతోషము జెంది నాకుటుంబమును మీరు పోషించుటకు త్రికరణములచేతను బాధ్యతవహించెదరేని యిప్పుడే యీ సుమము మీకిచ్చుచున్నానని పలికి ముమ్మారువారిచే బ్రమాణికము జేయించి యా ప్రసూనరాజము వారికిచ్చితిని.

పిమ్మట వారు మమ్ముదమయింటికి దీసికొనిపోయి చెప్పిన ప్రకారము గౌరవముగా బోషింపుచుండిరి. ఆజన్మదరిద్రుడనకు స్వల్పలాభము సైతము రాజ్యపదవిగా దోచుచుండును. వారు చేయుచున్న భోజనపు మాత్రపు సదుపాయమే నాకు బట్టాభిషేకములాగున దోచుచున్నది. మొదట నేను వారిద్దరు నొక్కటియే అనుకొంటిని

గాని పదిదినములు విచారించినంత వారిద్దరు మిత్రులనియు మమ్ము బోషించు విషయములో నిరువురు సవరించుచున్నారనియుం దెలిసికొంటిని. వారిరువురకు నొక్కటెయే విటకత్తెకలదు. దానిమూలముననే వారికట్లు మైత్రిగలిగెను.

అవృత్తాంతమంతయు నాకు మరి పదిదినములకు వెల్లడియైనది. ఇట్టి యథమవృత్తిగల వారికి ప్రసూనమిచ్చితినే యని పశ్చాత్తాపము జెందుచుంటిని. ఇట్లుండునంత మరిపదిదినములకు నావిటకత్తియ మూలముననే వారిరువురకు విరోధము పుట్టి క్రమక్రమంబున బలసి తుదకు వారికి ముఖావలోకనములు లేకపోయినవి.

శ్లో॥ అవజ్ఞాస్ఫుటితం ప్రేమ యేకీకర్తుంక ఈశ్వరః।
సంధింనయాతిస్ఫుటితం లాక్షాలేపేనమౌక్తికం॥

బద్ధలైన ముత్తెము లక్కచే నతుకొననట్లు సమానముచేత విడిపోయిన స్నేహముమరలగూడికొనదు. ఒకనిమిషమైనను విడువక యేకదేహముగా వర్తించు వారిరువురును కాంతామూలమున శత్రువులైన తిరస్కారవాక్యములచే రోషముబెంచుకొని యొకనాటిరాత్రి బొమ్మియుద్ధములో నొకరిచేత నొకరు చంపబడిరి.

పిమ్మట మమ్ము బోషించువారు లేక యాపూవు విషయమై వారి ఇండ్లలో వెదకి యెందునుంగానక చింతించుచు జివరకా విటకత్తియ యింటిలో నుండుట విని దానియొద్దకుబోయి యాపుష్పమును గురించి జరిగిన శపథముల తెరంగెరింగించి యిమ్మని యడిగితిని. అలంజతొత్తు ఇది నాసొత్తయినది. అవసరమున్నయెడల వారి దాయాదులమీద ఋణముగట్టి అధికారులతో జెప్పుకొనుము. పొమ్మని నన్ను దిరస్కరించి పలికినది.

అప్పు దాసంగతి నేను గ్రామాధికారులతో జెప్పితిని. వారు దానిని రప్పించి యడుగగా నాయొద్దజెప్పినట్లే వారియొద్దను బింకముగా జెప్పినది. వారును కర్తవ్యమెద్దియో తెలియక చింతించుచుండిరి. ఇంతలో మాదేశప్రభువగు చండవర్మ మహారాజుగా రిచ్చట సభకు వచ్చుచు నాదినమున మాగ్రామములో బసజేసిరి. కావున నాసంగతులన్నియు వారికి దెలియజేసితిని.

"రత్నహారీతుపార్థివః" అని యున్నదిగదా ? శ్రేష్ఠమైన వస్తువుల విషయమై రాజులు అభిలాషవహింతురు. చండవర్మ మహారాజుగారు పెసంగతు లన్నియు దరువాత విచారించెదగాక యని యాపూవు పుచ్చుకొని మమ్ముగూడ రమ్మని చెప్పి యీసభకు వచ్చిరి. ఇదియే దీనివృత్తాంతమని చెప్పి యాబ్రాహ్మణుడు గూర్చుండెను. అప్పుడు సభ్యులందరు మఱల గరతాళధ్వనులచే నాసభామంటప మంతయు మ్రోగింపజేసిరి. అంతట చండవర్మ మహారాజు లేచి సామాజికుల కిట్లనియె.

అయ్యా ! ఈపలపుష్పాగమములరీతి మనమందరము వినియుంటిమి గదా ! బ్రహ్మచారి తనకీఫల మిచ్చినవాడు పురుష దనియు నప్పు దీపువ్వు వాని

మూటలోనుండగా జూచితినని యుం జెప్పెను. ఈవృద్ధబ్రాహ్మణుడు చక్కని స్త్రీ యీపూవు నిచ్చెనని చెప్పుచున్నాడు. ఈవిషయములో గొంచె మాలోచించవలసి యున్నది అని చెప్పుచు నాబ్రహ్మచారిం బిలిచి అయ్యా! నీకు ఫలమిచ్చిన పురుషుని పోలిక యెట్లున్నదో చెప్పగలవా యని యడిగెను.

ఆ బ్రహ్మచారి యప్పుడు కనుచీకటిగా నుండుటచే నిదానముగా బరిశీలింప లేదు. పురుషుడనుకొంటినేకాని యదియు నిశ్చయముగా జెప్పలేను. మూటవిప్పినప్పుడు పయ్యెద చెంగులాగన గనంబడినది గుర్రమెక్కి వచ్చెను గావున బురుషుడని చెప్పు చుంటిని. గుర్రము మాత్రము పంచకళ్యాణి రంగుగలది అని చెప్పగా మరల చంద వర్మ యిట్లనియె.

ఆ ఫలమును పుష్పమును నిచ్చిన మచ్చెకంటి యొక్కరితియే. ఆమె దేవకన్య గాని మనుష్యస్త్రీ గాదు. దేవతలు భూలోకములో విలాసార్థము విహరింతురను వాడుక కలదు. ఈఫలపుష్పములు రెండును దేవలోకములోనివే. యెద్దియోకారణముచేత నానాతి వీనిందీసి కొనిపోవుచుండగా నడుమ వీరిదైన్యమువిని దయాబుద్ధితో నిచ్చినది. దేవతలు కృపాస్వభావులు గదా? ఇంతకంటె మరియొకటికాదు. ఈ బ్రహ్మచారి గురుతుపట్టజాలక పురుషుడని చెప్పెను. వీరి పూర్వ పుణ్యవశంబున అద్దేవికి దయ బుట్టినది. వీరి దురదృష్టవశమున బయల చేతంబడినవి. కాని దాతృత్వమహత్వమునం బట్టి దాగినవికావు. ఇవి రాజార్హమయిన వస్తువులు. సామాన్యులకడ నుండదగవు. వీని నిత్యము బూజించుచుండవలెయును. ఈబ్రాహ్మణుల కిరువురకు దగు బహుమతు లియ్యదగినది. ఇదియే నాకుదోచిన యభిప్రాయము. యింతకన్న బుద్ధిమంతుల కెద్ది యేని దోచిన వక్కాణింపనగునని పలికిన నాసభ్యులందరు నారాజు మాటలే యదార్థము లనియు సహేతుకములనియు గర్తవ్యములనియు నేక వాక్యముగా బలికిరి.

ఇట్లు కొంతసేపా ఫల పుష్పముల గురించి యుపన్యాసము జరిగినపిమ్మట సభావినోదార్థము సంగీతము బాడుటకై మణిమంజరి కాజ్ఞయిచ్చిరి. అప్పుడు మణి మంజరి హాయిగా వీణబుచ్చుకొని పాడి సభ్యులకు సంతోషము గలుగజేసినది.

సాధారణముగా గానవిద్యాభ్యాసముగలవారికి బరులు పాడునపుడు తమకు గూడ బాడవలయునని నుత్సాహము గలుగుట సహజమైయుండును. అప్పుడు నాకు పిణావతిచేసిన స్వరకల్పనలన్నియు మనంబున గురుతుగా నున్నందున వాని పాడ వలయునని యొకవేడ్కయానందము గలిగినది. మణిమంజరి పాట ముగించినతోడనే నేను సభాముఖమునకు బోయి అగ్రాసనాధిపతితో అయ్యా! నాకును గానవిద్యాపాట వము కొంచెము గలిగియున్నది. ముహూర్తమాత్రము మదీయ గాంధర్వ విశేషము గూడ నవధరించి నన్ను గృతార్థుని జేయ బ్రార్థించుచున్నవాడ అనుజ్ఞయిత్తురేయని వేడుకొనిన నతండు సమ్మతించి నాకొక వీణ నిప్పించెను.

అప్పుడు మిగుల సంతోషముతో నేనావీణ బుచ్చుకొని సారెల జక్కగా

సవరించి కొంతసేపు పూర్వము నేర్చిన విశేషములన్నియుం బాడి పిమ్మట వీణావతి స్వరకల్పన లెత్తుకొని యొక కృతిబాడితిని. అప్పుడు సభ్యులందరు చిత్రప్రతిమలవలె కదలక వినుచుండిరి. మఱియొక కృతిబాడగా లేచి గంతులువైచుచు నృత్యము జేయ దొరగిరి. ఇంకొకకృతికి వారుగూడ నెద్దియో పాడువారివలె కూనరాగములు తీయ దొడంగిరి. ఈరీతి మేనులు పరవశమొంద సభ్యులందరు కృతికొక వికృతియాకృతితో మెలగదొడంగిరి.

అట్లు కొంతసేపు సభ్యుల వికారము నొందించి పిమ్మట మోహనరాగంబు బాడితిని. దానిని వినుటచే అందరు నరగనుమోడ్పుతో నిద్రావశంవదులైరి. అంతటితో గానము ముగింపగా దెప్పిరిలి యందరు ఏమేమీ! అనన్నా! ఔరా! యని అద్భుతము జెందుచు నిది దేవగానము కాని మనుష్యగానము గాదనియు నితడు తుంబురుడో నారదుడో కాని మనుష్యమాత్రుడు కాదనియు నిటువంటి విచిత్ర మిదివరకు విని యుండలేదనియు జేతనము లచేతనములుగాగ గానముపాడిరను మాట యదార్థమయ్యె ననియు నీ మొదలగు స్తుతివాక్యముల సభ్యులందరు అద్భుతముగా జెప్పుకొన దొడంగిరి.

మణిమంజరియు నాస్వరకల్పన లిట్టివని తెలియక వెఱగందుచుండెను. పిమ్మట ధర్మాంగదుడు నన్ను గౌరవముగా జేరబిలిచి పీఠమిచ్చి అయ్యా! తమదేశ మెద్ది? ఎచ్చటికి బోవుచున్నారు? మీ నామవర్ణంబులేయవి? ఇచ్చటికెప్పుడు వచ్చితిరి. ఈ అద్భుత గీత మెందభ్యసించినారు? ఇట్టి విద్య జెప్పదగిన యుపాధ్యాయు డీలోకములో నున్నవాడా? మీఫలపుష్పముల లాగున మీరును నయత్నోపలబ్ధముగా దటస్థించిరి. మాయదృష్టము మంచిదని యనేక విధముగా స్తుతిచేసెను.

అప్పుడు నేనాతనిమాటలు విని కొంత యాలోచించి సంతసించు వానివలె అభినయించుచు అయ్యా! నాపేరు సింహకేతు డందురు. నాజాతి క్షత్రియజాతి, మాది కాశీపురము, దేశాటనము సేయవలయునను అభిలాషతో నిందువచ్చితిని. నేనీ గానము స్వయంకృషివలననే కాని యొకరివలన నేర్చుకొనియుండలేదు. ఇచ్చట సభ జరుగునని విని చూచుటకై వచ్చితి నిదియే నా వృత్తాంతమని చెప్పితిని.

అప్పుడు చండవర్మ నన్ను మీకు వివాహమైనదియా? అని యడిగెను. కాలేదని చెప్పితిని. మరల నతండు మరియు దమ కేయే విద్యలలో బరిశ్రమగలదని యడుగగా నాకు కొంచెము కొంచెముగా నన్నివిద్యలలోను ప్రవేశంసయున్నదని చెప్పితిని. తరుచు గాయకులకు నితర విద్యాపరిశ్రమ గలిగియుండుట అరుదు. నాకన్ని విద్యలయందు పాటవము గలదని చెప్పినతోడనే సభ్యులందరు నా విద్యా పరిశ్రమ మట్టిదో వినవలయునని కుతూహలముగలిగి మరునాడు శాస్త్రప్రసంగమునకు మరల సభచేయవలయునని యమ్మహారాజుగారిని వేడుకొనిరి. అందు మిగుల శాస్త్రపరిచయము గల పండితులు పెక్కండ్రు గలిగియుండిరి. వారితో వాదమునిమిత్తము మరునాడు

సభచేయుదుమనియు నందుగూడ దమ విద్యామహత్వము జూపి మమ్మానందింపచేయ వలయునని ధర్మాంగదమహారాజుగారు నన్ను ప్రార్థించిరి.

దీనికింత నన్ను స్తుతిసేయవలదనియు నట్టి ప్రసంగములకయి ఎన్ని దినములుండుమనిన నుందుననియు దీనికే నేను దేశాటనము చేయుచున్నాననియు జెప్పితిని. అంతటితో నాఁటిసభముగించిరి. అంత మరునాడు మధ్యాహ్నమే యాసమాజ మారంభమయినది. అదివరకు నాప్రఖ్యాతి విని యాదినమున జరుగబోవు ప్రసంగములఁ జూచుటకు బాలవృద్ధముగా వేలవేలు జను లాసభకు వచ్చిరి. అందు దిగ్దంతులను ప్రసిద్ధిగలిగి యనేక రాజసభలలో జయపత్రికలు గొన్న మహాపండితులు నలుగురు నాతో బూర్వపక్షసిద్ధాంతములుసేయ నిరూపింపబడిరి. వారికి నన్ని విద్యలలో బరిశ్రమ గలిగియున్నది. ఒక్కొక్క శాస్త్రమునందు రెండుమూడు పూర్వపక్షములుచేసి యోదంబుచ్చి వారు చెప్పినది తప్పనియు నేను జెప్పినది యొప్పనియు వారిచేతనే యొప్పించితిని. అప్పుడు నావాచనైపుణ్యము బూర్వపక్షసిద్ధాంతముల చాతుర్యము ప్రశాంతతాబోధకత్వము గ్రహణధారణలపొందు లోనగు నాప్రజ్ఞలజూచి నాప్రతివాదులే నన్ను స్తుతిజేసిరి. అప్పుడు మదీయాద్భుత విద్యావైశారద్యమునకు మెచ్చుకొనుచు ధర్మాంగదుండు చంరవర్మ మొదలగు రాజులు దమలోనెద్దియో యాలోచించుకొని స్తుతివాక్యపురస్సరముగా నాకిట్లనిరి.

రాజకుమారా! నీవమానుష ప్రభావము గలవాడవు. నీవిద్యలన్నియు నట్టివే. మరియు విశేషించి నీరూపమువలెనే సంగీతము త్రిలోకమోహజనకమైనది. ఈ విషయములచే మాకు మిగుల నానందము గలుగజేసితివి. ఇట్టి నీకు బారితోషికమిచ్చుటకు మాయొద్ద దగిన వేమియును లేవు. మారాజ్యమంతయు నిచ్చినను నీవిద్యకు బ్రతికాదు. నీవిద్య జగత్ప్రకాశమైనది. దానికితోడుగా నిట్టి మహిమగల యీఫలపుష్పములు రెండును నీయొద్దనుండినచో బంగారునకు పరిమళము గలిగినట్లుండును. భగవంతుడుసైతము భక్తితోవచ్చిన ఫలపుష్పములచేతనేకదా సంతసించును. నీవును అట్లే సంతసింపవలయునని పలుకుచు నా ఫలపుష్పములు రెండును నాకిచ్చిరి.

వానిని నేను వినయపూర్వకముగా స్వీకరించి వారితో నిట్లంటిని. అయ్యా! మీరు నాకివి ప్రసాదపూర్వకముగా నిచ్చితిరి వీని వృత్తాంతము నిన్నసభలో గూర్చుండి వింటిని. ఆ బ్రాహ్మణులకు గరుణాపూర్వకముగా నెవరో యిచ్చిరి. వారినపారధనికులుగా జేయుట వారియభిప్రాయమై యుండవచ్చును. కావున ముందు వారికి దగిన ధనమిచ్చి సంతసపరుపవలయునని పలికితిని. నా మాటలు విని వారందరు మిగుల సంతసించుచు నాబ్రాహ్మణులకు జెరియొక యగ్రహారము నిచ్చిరి. నేనాధర్మపురిలో నున్నప్పుడెప్పుడేని విహారార్థమై రాజమార్గంబున నడిచితినేని నా చుట్టును బెక్కండ్రు చుట్టుకొని యపూర్వరూపముగా జూచుచు దేవునికివలె నాకు వందనములుచేయుచు స్తుతి చేయ దొడంగుదురు. ఆ గ్రామమందే యొకమాసము వసించితిని. ఒకనాడు నా

గుఱ్ఱము బందెపడి గ్రమముగా రాజుగారి కోటముఖమునకు దేబడినది. దానింజూచి నేను మిగుల సంతసించుచు నృపతియనుమతిని దానిని స్వీకరించితిని. ఆహా! దైవగతి యెంత వింతయైనదో చూడుడు. న్యాయమైనసొమ్ము నట్టేట బారఁజిమ్మినను నట్టింటికి వచ్చునను సామెత యదార్థమైనది.

ఇదియంతయు భగవతీకటాక్షముకాక మరియొకటి కాదని నిశ్చయించుకొని కర్మానుసారముగా బుద్ధినడచుననుమాట దృఢపరచుచు మనంబు నెట్లుతోచిన నట్లు చేయుట తప్ప వేరే యాలోచింపక వ్యసనములకు జింతింపక వర్తించుచుంటిని. అంత మళయాళ దేశప్రభువగు చండవర్మ తన గ్రామమునకు బోవు సమయమున నన్ను దనతో రమ్మని మిక్కిలి ప్రార్థించిన సంతసించుచు నతనితో గూడ నీ గ్రామము వచ్చితిని. అతండు నాకు నెక్కుడు గౌరవముచేయుచు దనకోటలోనే యొకవిడిది నియమించి యందు నన్ను బ్రవేశపెట్టి యుపచారములకయి తగుపరిచారకుల నియమించెను. నేను సంతతము నావిలాస సౌధంబునం గూర్చుండి యావీణావతివలన దెలియబడిన స్వరవిశేషములనే పాడుచు హాయిగా గాలక్షేపము సేయుచుంటిని. ఒక నాడు సాయంకాలమున నేనా ఫలపుష్పముల రెంటిని ముందిడికొని మనోహరముగా విపంచి వాయించుచుండగా నాముంగల నొకచిలుక వచ్చి వాలినది.

నేనును బాటసందడిలో దానిని బరామర్శింపకపోతిని. అదియు గొంతసేపు నాయవసరము వీక్షించుదానివలె నిలువంబడి నేనాగానము ముగించి యూరకున్నప్పుడు తనముక్కున దగిలించుకొని పట్టియున్న యొకపత్రికను నాముంగలవిడిచినది. నేనా చీటిని బుచ్చుకొని విప్పి చదువుకొనినంత నందిట్లున్నది

పురుషోత్తమా! నీయపూర్వగాంధర్వ మహిమాతిశయంబును మించిన కళావిలాసమునకు వన్నె పెట్టుచున్న నీసౌందర్యచాతుర్యాది విశేషములు శ్రుతిపుటద్వారంబున హృద్గతంబులయి మదీయమానసమును హరించినవి. గాంధర్వమహిమంగాక యిట్టి యదృష్టవస్తుచోరక శక్తిగలుగునా? అపూర్వవస్తుదిదృక్ష యెవ్వారికి గలుగకుండును? అద్భుతఫలపుష్పముల నొకసారి జూచితినిగాని తన్నాయకుని సైతము చూచినప్పుడు గదా మదీయచక్షుస్సులు సాద్గుణ్యమును బొందుట. మఱియు నీ మురిపెంపు వీణాగానరసంబాన చెవులు పోరువెట్టుచున్నవి. నాచక్షుశ్శ్రవణంబుల కలహము మాన్ప పాత్రుండవు నీవే వసంత తిలకాభిఖ్య సహకారప్రాప్తి మూలముననేకదా నశేషశోభ వహించును. మఱియును,

వసంతతిలకావృత్తము.

సౌందర్యగానకుశలశీల కళావిలాసః
ప్రత్యేకతోపిచనయంతియశః పుమాంసం।
కింవాచ్యమత్ర తదశేషవిశేషలాభే।
లాద్యగ్రసంనను నవాంఛతికా వధూటీ॥

అని యున్న పత్రికను పలుమారు పఠించి దాని కల్పనకు వెఱగందుచు నోహో! ఈపత్రిక వ్రాసిన చిన్నది మిగుల చతురయు విద్వాంసురాలు నగును. ఈవృత్తమూలమున మదీయవృత్తాభిఖ్యల తెలుపుచుంగనగు నని వ్రాసినది. అభిఖ్య యనగా పేరు. వృత్తము వసంతతిలక కావున దానిపేరు వసంతతిలకయై యుండ వచ్చును. దానిలోనున్న యర్థము సౌందర్యము, సంగీతము, మంచివంశము, మంచి స్వభావము, మంచివిద్య మొదలైన గుణములు. ఒక్కొక్కటి యున్నను పురుషుని గొప్పఖ్యాతి గలవానిగా జేయును. అన్నిగుణములు నొకచోట నుండినచో నేమి చెప్ప దగినది. అట్టి పురుషుని ఏకామిని వరించదు, అని యున్నదిగదా! అట్టి పురుషుడవు నీవనియు నిన్ను వరించుటచేత నావృత్తము మంచిదేకాని చెడ్డదికాదనియు మరియు నా విద్యాదిగుణసంపతి దీనిమూలముననే తెల్లమగుచున్నదనియు ప్రౌఢముగా వ్రాసినది. కానిమ్ము దీని మరిగొంత పరీక్షించి చూచెదంగాక యని మఱల నొకపత్రికలో నీ క్రిందిశ్లోకము వ్రాసితిని.

శ్లో॥ జగమిషుభిః పరదారాన్ సిద్ధ్యాయతి ప్రత్యవాయపరిహారః॥
ప్రాగేవచింతనీయా లబ్ధావసరోహి దుర్ధరో మదనః॥

ఇట్టి శ్లోకమువ్రాసి పత్రికముడిచి యా చిలుకముక్కున కందిచ్చితిని. అది యెంతనేర్పరియో చక్కగా నాచీటిని ముక్కునవిడిగియ గఱచుకొని రివ్వున నెగిరి పోయెను. నేను దాని ముక్కునకు మిక్కిలి సంతోషించితిని. నేనును దానిపోయిన వలను చూచుచుండ నదియుంబోయి కొంతసేపటికి మరల నాయొద్దకువచ్చి వ్రాలినది. అప్పుడు దానిముక్కునందున్న పత్రిక మరల నరసిపుచ్చుకొని విప్పి చదుకొన నందు ఆర్యా పరశబ్ద ముత్కృష్టార్థముగా భావించినచో దక్కిన శ్రమ లేమియు నుండవు కదా?

అని వ్రాయబడియున్నది. నన్ను బరదారగా భావించవద్దనియు స్వదారగా స్వీకరింపవలనియు సూచించుచున్న యాయుత్తరము చూచుకొని నేను మరల నీ భావము భాగవతమైనది కాని క్రియాభావమగునని వెఱచుచుంటినని వ్రాసియంపుటయు భావము దిరమైయుండ గ్రియాభావ మెన్నడును కానేరదని దానికి ప్రత్యుత్తరము వ్రాసినది. ఈరీతి నుత్తర ప్రత్యుత్తరములచేత మాకు బరిచయము గలిగిన పిమ్మట నొకనాటిరాత్రి నేనామేడమీద గూర్చుండి సంగీతము పాడుకొనుచుండగా నొకనెంతుక వచ్చి నాకు నమస్కరించిన నీవెవ్వతెవని యడిగితిని. అది ఆర్యా! నేను వసంతతిలక సఖురాలను. నాపేరు తిలోత్తమయందురు, మారాజపుత్రిక తమసంగీత రసంబు శ్రుతి పుటంబులగ్రోల నుత్సుకనుజెంది యిక్కడి కరుదెంచినది. ప్రవేశింప ననుజ్ఞయిత్తురే యని సవినయముగా బ్రార్థించిన నాలించి ఏమనుటకుదోచక యొక్కింతతడవు ధ్యానించి యిట్లంటి.

రాజపుత్రిక లిట్టి అర్ధరాత్రిమున నొపుంమేసేఁకు సంగీతము వినుటకు వచ్చిన దప్పుకాదా ? కానిమ్ము. మిగుల వచ్చినదిగదా తీసికొనిరమ్మని చెప్పిన విని యప్పుడతిపోయి వసంతతిలకను ప్రవేశపెట్టినది తదీయ సౌందర్యాతిశయము నాకే విస్మయము గలుగజేసినది. అప్పుడు నే నాయింతిని గూర్చుండ గనుసన్న జేసితిని. ఆకోకస్తని నాకు నమస్కరించి కూర్చున్న యనంతరంబు నేను మనోహరముగా మోహనరాగముబాడి అచ్చేడియను మోహావిశం జేసితిని.

అప్పు డప్పడతి సిగ్గువిడచి సఖురాలితో ముదితా ! ఇతడు రాగంబున మదనుండువోలె మదవతుల హృదయములు భేదింపుచున్నాడు. ఈతప్పునకు గట్టింతు మని చెప్పుమని ఏమియో పలికి మనసవికారములు నాయెదుట నభినయించిన నేనును మందలింపుచు బెద్దవారుండ గన్యకలు స్వతంత్రింపరాదు. తొందరయేమివచ్చినది. వలదు వలదుడుగుమని యమ్మగువ యపస్మారవికారములు గుదురుపరచి సానునయ ముగా జెలికత్తెయతో గూడ నంపితిని.

అది యంతయు వారిపెద్దలందరు నెరింగిన కపటము కాబోలు? అమరునాడే రాజు నాయొద్దకువచ్చి మెల్లన నిట్లనియె. అయ్యా ! నాకు బుత్రసంతతిలేదు. వసంత తిలకయను కూతురుమాత్ర మొక్కతెగలదు అదియు విద్యాగుణరూపంబుల నీకుదగి నది. దాని పాణిగ్రహణము సేసికొని యీరాజ్యభారమంతయు వహించి నీవు పాలిం పుము. నేను పెద్దవాడనైతిని. ఇది నాయభీష్ట మందులకే నిన్నీయూరు దీసికొనివచ్చితి నని పలికినవిని నే నేమియు బలుకనేరక సమ్మతించినవానివలె నభినయించుచు లజ్జా వశంబున నూరకుంటిని. అంత నా వసుంధరాకాంతుండు మిగుల సంతోషించుచు నాసన్న శుభముహూర్తమున మిగుల వైభవముతో నాకా వసంతతిలకనిచ్చి వివాహము గావించెను. నే నేమిటికి నప్పూబోడిని బెండ్లియాడితినో నాకే తెలియదు. లోకములో నెట్టివారును సంకల్పపూర్వకముగ బనులు చేయుదురుగదా ? నేనట్లు చేయకపోవుటకు విధి నియామకముతప్ప వేరొండులేదు.

శ్లో॥ అఘటితఘటితానిఘటయతి ఘటితఘటితాని దుర్ఘటీకురుతే
విధిరేవతానిఘటయతియాని పుమాన్నైవచింతయతి.

ఈ శ్లోకమును పలుమారు పఠించుకొనుచు నీరాజ్యలక్ష్మితో గూడ వసంత తిలకను స్వీకరించితిని. మఱియు నతరుణితో గలసికొనినప్పుడు యుక్తియుక్తముగా నిట్లంటి. మదవతీ ! నీతో మొదట నొక సంగతి చెప్పుట మరచితిని. అది యిప్పుడు జ్ఞాపకమువచ్చి మిగుల చింతించుచుంటిని. నేను బెండ్లి యయిన సంవత్సరములోపల భార్యను గలిసిన మృతినొందుదును. పూర్వము నాకొకయపరాధ మూలమున నిట్టిశాప మొకసన్యాసి యిచ్చెను. అంతదనుక నేనెంత బ్రతిమాలినను నీవు సమ్మతింపవద్దు

సుమీ. పాండురాజు వృత్తాంత మెరుంగుదువా? ఇదియే మనస్సులో దృఢముగా జ్ఞాపక ముంచుకొనుము. సంవత్సరము దాటిన వెనుక మన యిష్టమువచ్చినట్లు క్రీడింపవచ్చు. నీ సంగతి రహస్యముగా నుంచుమని చెప్పి నాచతురతచే నాయువతి నొప్పించి సంతసము గలగజేసితిని.

అంత శ్రీముఖకాలములో చంద్రవర్మ స్వర్గస్థుడైనంత యమాత్యులు నన్ను రాజుగాజేసిరి. నేను సింహాసన మెక్కినతోడనే నీయూర శక్తిపూజ మూలమున జరుగు చున్న జీవహింసల తెఱంగంతయు విని యిట్టిపనులు చేసినచో శిక్షింతునని యాజ్ఞా పత్రికల సంపుటయే కాకి రాజభటులను యింటింటకును నెల కొక సారి పరీక్షించి బలిపురుషుల నరయునట్లు నియమించితిని మరియు వీని మంత్రశాస్త్ర పుస్తకము లన్నియు లాగి కొనునట్లాజ్ఞాపించితిని. మొన్నటినెల పరీక్షలో నీపుస్తకము తెచ్చి నాకిచ్చిరి. దానిం జూచి కాదే గురుతుబట్టి యీయింటికి వచ్చితిని ఇదియే నావృత్తాంతము దైవకృపచే నేటికి మనమందరము సుఖముగా నొకస్థలమునకు జేరితిమి. ఇదంతయు భగవతియగు విశాలాక్షి కృపగాని వేరొకటికాదు. అని తన వృత్తాంతమంతయుం జెప్పి యాఫల పుష్పములం దెచ్చి వారికి జూపినది.

వానింజూచి యారాజును మదనుడును మిగుల వెఱగుపడిరి. పిమ్మట నక్కాంత వసంతతిలకను రప్పించి యావృత్తాంత మంతయుం జెప్పి మనమనోహరుం డితడే యని మదనుని జూపిన జూచి యాచిన్నది మిగుల సంతసించినది పిమ్మట నావిశాలాక్షి యాఫలమహిమ యంతయు నెరింగినది గావున సమ్మహారాజుతో దేవా! ఈఫలము నాకు విశాలాక్షి మహాదేవి ప్రసాదపూర్వకముగా నిచ్చినది దీనిని భక్షించిన వారికి క్షుత్పిపాసలు గలుగవు. స్వప్నమందు దీనిగ నాకు సైత మవి యిప్పటికి గలుగలేదుగదా! ఎందరిచేత చిక్కినను చివరకి ఫలము విశాలాక్షి కృపచే మనయొద్దకే వచ్చినదని పలుకుచు దానినిగోసి నాలుగు ఖండములు చేసి యింద్రద్యుమ్నునికి అతనిభార్యకును మదనునకు వసంతతిలకకును సమానముగా బంచి యిచ్చినది.

ఆ ఖండముల దినినంత వారికి క్షుత్పిపాసలు హరించినవి. అందరును దాని యాశ్చర్యకరమైన మహిమను గురించి యనేక స్తుతిపాఠములు చేయదొడంగిరి. అంతట నింద్రద్యుమ్నుడు విశాలాక్షినిం జూచి అమ్మా! మేము మాదేశము విడిచి వచ్చి పెద్దకాలమైనది. నాకుమారుడు విజయుడు మా జాడ దెలియక చింతింపు చుండును. ఇచ్చటనుండి మాదేశమునకు నోడమీదబోయిన వేగిరముగా జేరుదుము యోడ సిద్ధపరచి మాదేశమునకు మమ్ము బంపు ప్రయత్నము చేయుము ఇప్పటికి మనమందరము కృతకృత్యులమైతి మని పలికిన నక్కాంతకిట్లనియె.

ఇప్పుడు మదనునికి పట్టాభిషేకము చేయించి పిమ్మట మనమందరము కాశీ పురమునకు బోయి యందున్న శత్రువుల బారకోలపడపడి మీదేశమునకు బోవలయునని నాయభిలాషగానున్నది. దీనికి మీ అనుమతి యెట్టిదని అడిగిన అప్పుడతి కతం ట్లె

నిశు. అమ్మా! నీయందు విశాలాక్షికి మిక్కిలి దయగలదు. నీకవశ్యము జయము గలుగను. మీరు సేనలతో గుహామార్గమునబోయి కోటలో ప్రవేశించి వైరుల సులభముగా గెలువుడు. నేనువచ్చి కడు తడవైనది. కాబట్టి నౌకాయానమున మాయూరికి బోయెదము, అట్లు సమ్మతింపుము. నీవు కాశీపురము వశముజేసికొనిన పిమ్మట మాయూరికొకసారి రావలయు నిదె నాకోరికయని చెప్పిన అప్పడతియు అతని మాటలకు సమ్మతించి శీఘ్రకాలములోనె అట్టియోడను ప్రయాణమునకు సిద్ధపరపించినది.

# ఇంద్రద్యుమ్నుని సముద్రప్రయాణము

అంత నింద్రద్యుమ్నుండు మంచిసమయమున విశాలాక్షి యనుమతి వడసి సముచితపరివారము సేవింప భార్యతోగూడ నౌకయోడనెక్కి మంచిగాలి విసరుచుండ దెరచాపలెత్తించి రేవు విడిపించెను. అందప్పుడెక్కిన జనమునకు సంవత్సరమునకు సరిపడిన భోజనసామాగ్రి యున్నది. మంచినేర్పరులగు నావికులచేత నాప్రవహణము నడుపబడుచుండుట గడువేగముగా మూడువారములు నడచినది. అట్లు నడచుచుండ నొకనాడు సాయంకాలమున గర్ణధారుడు మింటిచిహ్నముల బరీక్షించి గాలివానలక్షణములు గాన్పించుచున్నవని తొందరగా బలుకుచు దెరచాపలదింపి యోడకు లంగరు వైపించెను.

వానిపరీక్ష ఎట్టిదో అంతలోనే గాలి అద్భుతముగా విసరజొచ్చినది. అప్పుడు నావలోని జనులందరు జడియ దొడంగిరి. ఓడ సరదారుడు వాండ్రకందరకు ధైర్యము గరపుచు రెండుమూడుదినములు గడపెను. నాలుగవదినమున విసరెడు గాలినిజూచి యిక పడవ నిలువదు. ఎవరి యిష్టదైవముల వారు స్మరించుకొనవలసినదే మఱియొక సాధనము లేదు. భూమి దాపునలేదు. ఈరాత్రి మిక్కిలి ఝంఝూవాతము విసరును. ఓడ తల్లక్రిందగునని చెప్పుచు గన్నుల నీరునిడుపజొచ్చెను. అప్పుడతని యధైర్యమును జూచి అందున్నవారెల్ల గొల్లుమని యేడువదొడంగినది. ఇంద్రద్యుమ్న మహారాజు వాయలజడి అంతయు నడిపి మరణభీతిచే దొట్రుపడుచు దన్నుగౌగలించుకొను భార్యను దగ్గరదీసి కన్నీరుదుడుచుచు వెఱపుగ వైరాగ్య వాక్యంబుల నిట్లుపన్యసించెను. బోటీ! నేవేటికి జింతించెదవు. పుట్టినవారి కెప్పటికైనను చావు సిద్ధమైయున్నదిగదా! మనకు దైవమీయుదధి మధ్యమున మరణము విధించి యుండబోలును. అమ్మితిదాటశక్యమగునా? సుఖదుఃఖములకు దానుపూర్వమున జేసిన కర్మయేమూలమైయున్నది.

శ్లో॥ సుఖస్యదుఃఖస్యనకోపిదాతా పరోదదాతీతికుబుద్ధిరేషా
అహంకరోమీతివృథాభిమానః స్వకర్మసూత్రగ్రథితోహిజంతుః

అనియుండగా యెట్లుతప్పును ? దాననేకాదా మనపెద్దలు,

శ్లో॥ అలంహర్ష విషాదాభ్యాం శుభాశుభఫలోదయే
విధాత్రానిహితం యద్యత్తదలంఘ్యం సురాసురైః॥

శుభమునకు సంతసమును అశుభమునకు విచారము నెన్నడును బొంద గూడదు. బ్రహ్మవిహితమైనది సురాసురులైనను దాటజాలరు. మనుష్యుడెప్పుడును సుఖ దుఃఖములలో బొరలుచునేయుండును. సుఖదుఃఖములనుండియే శరీరము పుట్టినది. సుఖానంతరము దుఃఖము, దుఃఖానంతరము సుఖము దినరాత్రులవలె జంతువులకు నియమితముగా వచ్చుచుండును. మరియు సుఖములో దుఃఖము, దుఃఖములో సుఖమును గలిగియున్నవి. కావున్నే విద్వాంసులు ఆపత్తుల జలింపకుండవలయును. సర్వమును మాయ యని యెరింగినచో మోహమేల గలుగును ? అది యెఱుంగక సంసారపంక నిమగ్నులై పశువులవలె జరించినచో మూఢత్వము దట్టమై యురక యిడుమలం గుడి పించును ఇదియునుంగాక,

శ్లో॥ పాథానామివవర్త్మని క్షితిరుహాంనద్యామివభ్రశ్యతాం
మేఘానామివపుష్కరేజలధౌసాయాంత్రికాణామివ
సంయోగః పితృమాతృబంధుతనయ భ్రాతృప్రియాణామహో
సిద్ధోదూరవియోగ ఏవ విదుషాం కాత్రతచింతాభవేత్

మార్గంబున బాటసారులు, నదులయందు దారువులు, గగనమున మేఘ ములు, సముద్రమున నావికులును గలిసి విడిపోవునటుల తల్లిదండ్రులు అన్న దమ్ములు భార్యాభర్తలులోనగువారు గలసికొనిపోవుచుందురు. అట్టి వియోగము లెప్పటికైనను దప్పనివే దీనికై విచారింపనేల ? కావున మన మిప్పుడీ సముద్రమునం బడి మునిగిపోవుదుమను విచారమింతయేని స్వాంతమునం దగులనీయకుము. మనమిది వరకు బడిన యిడుముల కన్న నిదిపెద్దదియా ? వానిని దాటించిన భగవంతుడిప్పుడు లేడా ? మనకిందు చావు విహితమైనచో నెట్లును దప్పదు. సుఖమున కాసబడినప్పుడు గదా దుఃఖము గలుగుచున్నది. అట్టియాశయే వదలుకొనినచో నెట్టిసుఖమున్నదో జరీక్షింపుము. దీనికి నీవు వగవకుము. లెమ్ము సముద్రమునంబడుటకు సిద్ధముగా నుండుము. సముద్ర మన నెద్దియనుకొంటివి ? మనల రక్షించుచున్న నారాయణ మూర్తి శయనగృహము.

అని దగ్గుత్తికతో బలుకుచున్న యాజేని నీతివాక్యములచే దేరి యానారీ శిరోమణి చింతవిడచి ధైర్యముతో భగవంతుని ధ్యానించుచుండెను. ఇంతలో నాసర ధాపుకు చెప్పినప్రకారము గాలి క్రమ క్రమముగా నతిశయించుచు జివరకు నాయోడ

బుసబుసగునంత వడిగా విసరినది. అప్పుడు పర్వతమువలె నలలు కొట్టుకొనుటచే నాయోడ నిలువలేక యొరిగి సముద్రములో మునిగిపోయినది.

అందున్న జనులందరు నప్పుడు హాహాకార రవముతో భగవన్నామస్మరణము చేయుచు దమకు దొరకిన సాధనములం బట్టుకొని సముద్రములో దూకిరి. అప్పు డింద్రద్యుమ్నుడు భార్యను బిగ్గరగాగౌగిలించుకొని చిత్తమీశ్వరాయత్తము జేసికొని మహాసాహసముగా సముద్రములో దూకెను. అప్పు డతని కేమియు దెలియలేదు. పిమ్మట గొంతసేపు నీళ్ళలోమునిగి కొంతదూరముపోయి పైకితేలినట్లు దెలిసినది ఎంత వైరాగ్యము గలిగియున్నను మృతియన వెరువకమానరు.

అతను నీటిపై దేలినప్పుడు తన సందిటనుండి చిత్రసేన జారిపడినదని తెలిసికొని మితములేని శోకముజెందియు నామున్నీటి తరంగములలో నోపినకొలది నీదుచుండెను. అహా! ప్రాణమెంతతీపైనదో చూచితివా. బాహావునచే సముద్రము నీద దొడంగిన యతని యుద్యమము నూతబడినవాడు దరినున్న గడ్డిపోచను నూతగా బూన దలంచునను సామెతను దృఢపరచుచున్నది కొంతసేపట్లు భుజములచే నీది యీది యాయాసముజెంది మనంబున నిట్లు తలంచెను.

అయ్యో! అజ్ఞానపురుషుడు మోహాంధుడై దరిలేని సంసార సాగరము వోలె నే నీసముద్రము నీదుట దరిజేరుటకే! యెంతదూర మీదగలను. శ్రమ బలియుచున్నది. నేను బ్రతికియున్న లాభములేదు. ప్రాణతుల్యయగు భార్యను గోలుపోయితిని. ఇక బ్రతుకు మీద నాస యేలకలుగ వలయును? నేను గూడ మృతినొంది ప్రాణనాయికం గలిసికొందు. మరణావసానంబున భగవదారాధన సేయుట యుచితముగదా. అమ్మహాత్ముని హృదయంబున నిలిపి పరమపదంబు నొందెదనని పెక్కుగతుల దలంచుచు మనంబీశ్వరాయత్తంబు గావించి మరణకృత నిశ్చయుండై యీదుట మాని వేసెను. అప్పు డతనికి నాసాపర్వముగ నొక యద్భుతమైన పరిమళము గొట్టినది. అట్టి సువాసనకు వెఱగందుచు నతండు గన్నులం దెరచిచూడ దాపున నొక దారువు గొప్ప తరంగమును బోలి గొట్టుకొని వచ్చుచున్నది. దానిం జూచి యది యోడంగూర్చిన దారువుగా నిశ్చయించి దానిదాపునకు గొంచెమీదెను.

అదియు నీటివాలున తన కభిముఖముగా వచ్చుచున్నది. కావున వేగిరమే దానింజేరి పైకెక్కెను. అదియు నోడవలె విశాలమై గూర్చుండుటకు నుపయుక్తముగా నున్నది. దానిమీద నొక వనిత పండుకొని యున్నది. ఆమెంజూచి తనయోడలో నొకతె దీనిం గ్రహించెనని నిశ్చయించి మరలదాని పరిమళము పరీక్షించి మంచిగంధపు తరువుగా దెలిసికొని యట్టిది యోడకేల గట్టెదరని శంకించుకొనియెను. తరువాత నతం డానాతిని లేపి నీవెవ్వతె వీదారువున నేమిటికి వసించితివని యడుగగా నాచేడియ శోకభరముతో గన్నులు దెరువకయే హా! ప్రాణేశ్వరా! నన్ను విడిచి సముద్రములో మునిగిపోయితివే. నేనుగూడ మునుగకుండ నీయాధారమేటికి దొరకవలయును. ఈ

దుఃఖ మనుభవించుటకా? యని చింతింపుచ నంతలో గన్నులుదెరచి యెదురనున్న యింద్రద్యుమ్నునింజూచి గురుతుపట్టి యింతింతనరాని సంతోషముతో నతనిం గౌగ లించుకొన్నది.

అతం డాచేడియ తనభార్యయని తెలిసికొని దైవసంఘటమునకు వెరగు పడుచు నోహో! ఇందుముఖీ! మనకీ సంయోగము గలుగుటకు భగవంతుని యను గ్రహముగాక వేరొకటికాదు. ఈ దారు వాధారముగాజూపి మనల రక్షించిన యద్దయా మయుని బెక్కు తెరంగుల వినుతింపదగినదిగదా? ఈదారువే భగవంతుడని తలంపుము. దీనియాధారమున మనము తీరము జేరుదుమని యూహించెదను. నాకట్టి శకునము లగుచున్నవి మనకు క్షుత్పిపాసలు లేవుగదా? కానిమ్ము. ఎన్నిదినములకైన దీరము జేరకపోదువాయని పలుకుచు నాదారువునందు భగవద్బుద్ధి నిలిపి మనఃకుసుమ ములచే నర్చింపుచుండెను.

అట్లు రెండుమూడు దినములు గడచినంత నొకనాటి యుదయమునకా దారువు వారినొకతీరమున జేర్చినది. ఉదయమున లేచి చూచువరకు భూమిగనంబడి నంత వారియానందమేమి చెప్పదును. భూమిభూమి యని కేకలువైచి యింద్రద్యు మ్నుడు భార్యకు దెలుపుచు నాదారువు దీరధారుణిం జేరినది. కావున సులభముగా నతండు భార్యతోగూడ నొడ్డెక్కెను పిమ్మట వారా పారావారమును గన్నులారజూచి గుండెలు బాదుకొనుచు వా రనుభవించిన కష్టి యంతయు దలంచుకొని గోచందన దారువే తమ్ము రక్షించెను గావున దైవమని తలంచి మొక్కి దానిని నున్నతస్థితికిదే దలచి కర్తవ్యమరయుచు దానిని విడిచిపోలేక యాదేశనామము సైతము గురుతెరం గరు గనుక యచ్చటనే తిరుగ జొచ్చిరి.

అంతలో నాప్రాంతమున నొక సేనానివేశము సందడి వినంబడినది. దానిం బారజూచి ధారుణీభర్త యచ్చటికిబోయి యాదేశ మెద్దియో తెలిసికొనవలయునని తలంచి భార్యతోగూడ మెల్లన నా సేనానివేశమునకుబోయెను. పటకుటీరవారముచే నదియొక గ్రామము వలె గనంబడినది. దానిదాపునకుబోయి యందొకనింజేరి యీ సేనానివేశ మెవ్వరిది? యీ దేశము పేరేమి? యిది యేసంవత్సరము తిథివార నక్షత్రములెట్టివో తెలుపుమని అడిగెను.

వా డతని మాటలు విని వెరగుపడి యోహో! నీప్రశ్న మిగుల వింతగా నున్నదే! తిథివార నక్షత్రములుచెప్పుటకు నేను పంచాంగపు బ్రాహ్మణుడ నను కొంటివాయేమి? నీ కామ్రాతము తెలియదా? సంవత్సరముపేరు సైతము మరచితివా? బాగుబాగు! అని పరిహాసమాడుచు నిది యోధ్రదేశము యీ సేనానివేశ మింద్రద్యుమ్న మహారాజు కుమారుడు విజయునిది. అతండు తండ్రిని వెదకుచు దైవజ్ఞునిమాట నను సరించి మూడుదినములకింద్రదట నిచ్చటికిపచ్చెను. ఇది చిత్రభానుసంవత్సరము, నే

దాషాఢశుద్ధపౌర్ణమి, వారము శుక్రవారము, నక్షత్రము పునర్వసు ఇప్పుడే బ్రాహ్మణుడు చెప్పిపోయెనని చెప్పెను.

ఆ మాటలు విని రాజనుక్కున వ్రేలువైచుచు బోటీ! వింటివా మన విజయుడు మనలవెదకుచు నిచ్చటికే వచ్చెనట. అన్నా! భగవత్సంకల్పమిట్టిదికాబోలు. మనము సముద్రములో మూడుసంవత్సరములు చిక్కుబడినట్లు వీడు చెప్పిన కాల పరిమాణమున దెలిసినది కానిమ్ము. వెగరము బోవుదము రమ్మని పలుకుచు జనుల నడిగి తెలిసికొనుచు విజయుని శిబిరములకు బోవునంత ద్వారపాలకు డడ్డము వచ్చి అయ్యా! ఇప్పుడే కాశీరాజుగారు మలయాళదేశపు రాజుగారును లోనికిబోయిరి. విజయ మహారాజుగారితో వారెద్దియో యాలోచించు చున్నవారు తమరిప్పుడు పోవుటకు సమయముకాదు. పోవలదనిచెప్పిన వాని కతడిట్లనియె.

ఓరీమూఢా! మీతండ్రియగు నింద్రద్యుమ్నుడు వచ్చియున్నవాడని మా విజయునికి జెప్పిరమ్మనగా వాడు తెల్లపోవుచు నేమేమీ? తమరింద్రద్యుమ్న మహా రాజుగారా? యిట్టిరూపముతో నున్నారేమి. నాయపరాధము క్షమింతురుగాక యని పాదముల వ్రాలుచు మన పెద్దరాజుగారు వచ్చినారోఅని అరచెను. ఆ ధ్వనివిని అందరు తొందరపడుచు నేమేమి! అని వాని దాపునకు వచ్చిరి. వాడును గడువేగముగా లోనికిబోయి విజయునితో దమ తల్లిదండ్రులు వచ్చినారని చెప్పగా నమృతోప మాన ములగు వాని మాటవిని అతండు దిగ్గునలేచి యెక్కడెక్కడ అని పలుకుచు బరుగెత్త జొచ్చెను. ఎదురుగా వచ్చిన విజయుని జూచి కన్నుల నానంద బాష్పములు గ్రమ్మ నాయిరువురు పెద్దతడవు గాఢాలింగనములు చేసుకొని దగ్గుత్తికచే మాటరాక సంతోష దృష్టులచే నొండొరుల జూచుకొనుచుండిరి. అంతలో మదనుడు విశాలాక్షియు వచ్చిరి. వారింజూచి యారాజు ఓహో మాబంధువ్యూహంబంతయు నిచ్చటనే యున్నదే యీ దినంబెంత సుదినము అని మెచ్చుకొనుచు వారిని గుశలప్రశ్న జేసెను.

వారందరు శిబిరములోనికిబోయి యందు గూర్చుండి యొండొరుల క్షేమ సమాచారము దెలిసికొనుచుండగా, నింద్రద్యుమ్నుడు తన వృత్తాంతమంతయు నామూలచూడముగా విజయునకు జెప్పి నీవిప్పుడిచ్చటికెట్లు వచ్చితివని అడుగగా నితండిట్లనియె. తండ్రీ! మీరు కానకుబోయిన గొన్నిదినములకు మన సైనికులు వచ్చి యచట జరిగిన విశేషములన్నియుం జెప్పిరి. మా యమ్మను దారిలో శబరసైన్యము వచ్చి యడ్డగించుకొని తీసికునిపోయిన వార్త వినినతోడనే నేను మిగుల బరితపించుచు జతురంగబలముతో బయలుదేరి యయ్యరణ్యములన్నియు నరసితినిగాని యెందును యీయమ జాడ గనంబడినది కాదు.

అది మొదలు నేను స్వస్థతలేక రాజ్యము మంత్రియధీనము జేసి ప్రతి పట్టణము ప్రతి అరణ్యము ప్రతిపల్లెయు వెదకుచు బెక్కుదేశములు తిరిగితిని. నేను శోకించుచు మాతృపితృహీనంబయిన నగరంబు సొరనొల్లక వైరాగ్యంబు వహించి దేశాటనముచేయుచు గ్రమంబున గాశీపురము నరిగితిని. అందు పరమభక్తితో విశ్వ

నాథు నర్చించుచు గంగాస్నానమున బాపముల నిర్జించి పూర్వజన్మోపార్జిత ఫలంబున గొన్ని దినంబులందు వసించితిని.

ఒక్కనాడు సాయంకాలమున విశ్వేశు దేవళమునకు బోయిన నందు నప్పటి యప్పట్టపురాజు మహాపూజ చేయుచుండుటచే లోనికిబోవ నవసరము జిక్కినది కాదు. నన్ను బ్రతీహారులు దూరముగా ద్రోసవేసిన నేను నాసిపచ్ఛ్రుతికి జింతాక్రాంతుడనై అయ్యో చక్రవర్తికుమారుండనైన యిట్టి వారిచేత నవమానితుండనైతినే ఇది కాల మహిమయేకదా నా గౌరవమిచ్చటి వా రెవ్వరెరుంగుదురు? యేమిచేయుదును అని చింతించుచు నా వీధివేదికపై గూర్చుండి యుండగా నందొకసన్యాసి నాయవస్థ యంతయు గ్రహించి నన్ను గౌరవముగా మన్నించి మెల్లననిట్లనియె అయ్యా! నీ వెవ్వడవు? నీ దేశ మెచ్చట? ఇచ్చట కెప్పుడు వచ్చితివి. నీ వేమిటికో విచారింపు చున్నావు. కారణమేమి నీవృత్తాంతము చెప్పుమని యకారణస్నేహముగా నతండడిగిన నేనును నావృత్తాంతమంతయు నెఱింగించి నమస్కరించుచు అయ్యా! తమరు త్రికాలవేదులు మీ కెఱుగని రహస్యములుండవు. నాతలిదండ్రులెచ్చటనున్నారో చెప్పుడని అడిగితిని అమ్మహానుభావుడు నాదీనాలాపము లాలించి దయారసంబు చిలుక పలుకులచే నన్నోదార్చుచు వత్సా! మీ తండ్రి జగత్ప్రఖ్యాతుండు. కడుధర్మాత్ముండు. అతండు చిరకాలజీవి. యతని విషయము నీవు చింతింప నవసరములేదు. వానియున్న తావు చెప్పెద వినుమని యిద్ధియో గుణించి యిప్పుడు మీ తల్లిదండ్రులు నీటిలో జిక్కులుపడుచున్నారనియు నాషాఢ శుక్ల పాడ్యమి నాడుదయమునకు నోడ్రదేశమున నీరేవునకు వత్తురని నప్పటికి నీవచ్చుటకు బొమ్మనియుం జెప్పెను.

అతికాగరములు గుర్తెఱింగిన యమ్మహర్షి వచనంబులువిని నేను మితిలేని సంతోషముతో నతని యడుగులంబడి మ్రొక్కుచు నతని యనుమతివడసి యమ్మరునాడు మా గ్రామమునకు బయనమై పోవ బ్రయత్నించు సమయమున నయ్యూరిలో హల్లకల్లోలముగా జనులు వీధుల గ్రుమ్మరుచుండుట జూచి యిదియేమని అడిగితిని. అప్పుడు నాతో నొకరు అయ్యా! ఈ దేశపురాజైన హేమాంగద మహారాజుగారి అల్లుండును గూతునునువచ్చి కోటలో బ్రవేశించి అందున్న శత్రురాజును బారదోలు చున్నారట. వారు ప్రచ్ఛన్నముగా గోటలో దూరిరట. పాపము శత్రురాజు లాలు బిడ్డల విడిచి పారిపోవుచున్నారు. వారిని సైనికులు తరుమ గంగానది నోడలందాటుచు గొందరు భీతిచే నందులో బడిపోయిరట అన్నన్నా! యెంత యాపదవచ్చినది? వారి కట్లు కావలసినదే, పాపము హేమాంగదుడు పరలోకగతుండైన వెనుక యున్నవారు చిన్నవారని గ్రహించి నిష్కారణముగ గోటముట్టడించి వారిని బారదోలలేదా? యిన్ని దినములెచట దాగియున్నదో హేమాంగదుని కూతురు. విశాలాక్షి మహాబుద్ధిశాలిని యుండియుండి తగిన సేనలం గూర్చుకొని శత్రువులం బారదోలినది ఈ యులజడి యంతయు నదియని చెప్పగా నేను మిగుల సంతసించుచు వారికి బారితోషికమిచ్చి

అయ్యో ! నాకు మంచివార్త దెలిపితివి. వారు నాకు బంధువులు, వారి జయము విను టచే నాకు గొంత చింత మానినది. అని అతనితో మాటలాడుచు నాడు పయనము మాని హేమాంగదుని బంధువులతో గొంత ముచ్చటించి పోయెదంగాక యని నిశ్చయించి యప్పుడు కోటయొద్దకు బోయితిని.

అప్పటికే శత్రురాజులం బారదోలి హేమాంగదుని యల్లుండు మదనుడు గూతురు విశాలాక్షి సేనలతో గోటలో ప్రవేశించినట్లు తెలిసినది. వారి ప్రవేశమును గురించి అచ్చటివారందరు నద్భుతముగా జెప్పుకొనుచుండిరి. శత్రురాజుల స్త్రీలను చెర బెట్టక గౌరవముగా వారి మగల యొద్దకు బంపిన విశాలాక్షి దయాహృదయమును గురించి చేయు స్తుతివాక్యములు నాకు సంతోషము గలుగజేసినవి.

అప్పుడు నేను సంతోషించుచు నా పేరును తండ్రి పేరును గ్రామము పేరును వ్రాసి దర్శనార్థము వచ్చి ద్వారముననున్నానని పత్రిక లోనికి నంపితిని. దాని నంపినక్షణములో మదనుండు నాయొద్దకు వచ్చి నన్ను సగౌరవముగా దన యంతఃపురమునకు దీసికొనిపోయి భార్యకు జూపెను. ఆమెయు నన్ను సోదరీభావంబున మన్నించి గద్దియనిడి కుశల ప్రశ్నము సేయుచు నేనడిగినంత తన వృత్తాంతమంతయు జెప్పినది. అప్పుడు నేను పట్టరాని మోదముతో నా వృత్తాంతమంతయుం జెప్పి యాయూరిలో సన్యాసి చెప్పిన వర్తమానము సైతము తెలియజేసితిని. దానికి వారు సందియమందుచు మీదంపతు లిన్నిదినములు నీటిలో నుండుటకు కతంబేమియో యని తలపోసి మిమ్ము నరయుటకై నాతో గూడ వారును ప్రయాణమైరి.

ఆ కోటకు దగిన కావలియుంచి మేమందరము బయలుదేరి దారిలో మీరు పడిన యిడుమల జెప్పికొనుచు గొన్ని దినముల మొదట మన పట్టణమునకు వచ్చితిమి. అందు మీ జాడ యేమియు దెలిసినది కాదు. వెంటనే బయలుదేరి యాసన్యాసి మాట దలచుకొనుచు మొన్నటికి లావు జేరితిమి. ఇందు శిబిరములచే గ్రామము గట్టించి మీరాక వేచుచుండ మా పురాతన సుకృత విశేషంబున మీరు వచ్చితిరి. మిమ్ము గాంచి కృతార్థులమైతిమి. దైవము మా కాసన్యాసి రూపమున వచ్చి చెప్పినట్లూహి చెదము. లేకున్న నిష్కారణముడుగకుండ నతండేమిటికి జెప్పును. దైవకృపచే మనకిప్పటికి మంచిదినములు వచ్చినవి. ఇదియే నా వృత్తాంతమని చెప్పిన రాజు మిగుల కుతుకముందుచు సతినితో నిట్లనియె.

వల్లా ! మనల గర్మసూత్ర మిన్నిదినములు త్రిప్పినది గానిమ్ము. గతము [illegible] వగవనేల నిప్పటికి దైవానుగ్రహము గలిగినది. మరియు నొకటి వినుము మమ్ము [illegible] జందనదాస స్వరూపమున వచ్చి భగవంతుడు గట్టున [illegible] నాదరువునందు నాకు దైవభక్తి లిగిడి కాపున నిందు క్షేత్రముగా

నేర్పరచి యాదారువు దేవతావిగ్రహములుగా జేయించి స్థాపించెదను. అమ్మహా సముద్ర మధ్యమందున్న సమయంబున నట్లు సంకల్పించుకొంటిని. ఇప్పుడా గ్రామము నిచ్చుటకి దీసికొనివచ్చుటకు దగువారి నియమింపుము. మరియు శిల్పికర్మవిశారదుల రప్పించి గొప్ప యాలయముల గట్టింపవలయు నంత దనుక నేను మన పురమునకు రాను. అట్టి ప్రయత్నమంతయు శీఘ్రకాలములో జరుగవలయునని పలికిన సంతోషింపుచు విజయునప్పుడే పెక్కండ్ర జనులచేత నా మంచిగంధపు తరువును పెకలాగించి యొక స్థలములోనుంచి అప్పటినుండియు బూజా సంస్కారములు జరుపుచుండెను.

మరియు సమర్థులగు శిల్పివారుల రప్పించి కడువిచిత్రములైన యాలయముల గట్టించెను అంతనద్దారువు విగ్రహముగా జేయు సమర్థుడెవ్వడో యని యాలోచించుచుండగా నొక నాడాకస్మికముగా నొక శిల్పివచ్చి అయ్యా నేను విగ్రహములు శాస్త్రీయముగా చేయగలను. శిల్పశాస్త్రమంతయు జూచితిని. సెలవిచ్చినచో మీ చిత్తమువచ్చిన విగ్రహముల జేసెదనని చెప్పెను. అందులకు సమ్మతించి యింద్రద్యుమ్నుడు సామగ్రి యేమికావలయునని యడిగిన అతం డయ్యా! నా కేమియు అక్కరలేదు. నీ విగ్రహంబుల నొక రహస్యగృహంబున తెరవైచుకొని చేయుచుందును. నాయంతట నేను సమాప్తమైనదని చెప్పువరకు నా తెరలోపల కెవ్వరు రాగూడదు. వచ్చినచో ప్రమాదమగును. ఇదియే నాకు మీరు చేయవలసిన పని అని చెప్పిన అందులకు సమ్మతించి అట్టి రహస్యస్థల మతని కేర్పరచిరి.

పిమ్మట నా శిల్పి యాదారువు నందు జేర్పించి తెరవైచుకొని విగ్రహంబుల జేయ మొదలుపెట్టెను. అట్టి సమయమున నింద్రద్యుమ్నుడు ప్రతిదినము ప్రాతఃకాలంబున బ్రాహ్మణులకు అనేక గోదానంబులు కొమ్ములయందును డెక్కలయందును బంగారమునుంచి జగంబెన్న జేయుచుండెను. మరియు నతండు జేయు నితర దానంబులకు లెక్కయేలేదు. పెక్కేల అతండు దానము జేయునపుడు ప్రతిదినము పొద్దుపొడుపుగా నిలిపిన గోవుల డెక్కలరాపిడిచే నానేలయంతయు బల్లమై యగాధమైన తటాకమైనది అదియేకదా? మనము తీర్థమాడిన సరస్సు దానంబట్టియే దానికింద్రద్యుమ్న మనుపేరు వచ్చినది

అట్లు రెండుమూడు వత్సరములు జరిగినను నా శిల్పి తెరదీసికొని వెలుపలకు రాలేదు. దానికి శంకించుకొనుచు అయ్యో? ఆయుధంబులు సిద్ధముగా నున్నవి. విగ్రహంబులపని పూర్తికాలేదు ఎన్నిదినంబులైన నాశిల్పి యీవలకు రాడు బ్రతికి యుండెనో లేదో యని అనుమానంబు గలుగుచున్నది. ఇన్నిదినంబు లూరకుండుటయు దప్పేయని నిశ్చయించి యొకనాడు సాయంకాలంబున మెల్లన బోయి అచ్చటనున్న తెరయెత్తి అతండేమి చేయుచున్నాడో యని తొంగిచూచెను.

అప్పుడతండెవ్వడును గనంబడలేదు. విగ్రహంబులు మాత్రము కరచరణ శూన్యములుగా నితర యవయవంబులు పూర్తి చేయబడినవి మిక్కిలి చక్కగానున్నవి.

అదృశ్యమునకు వెడలుచు అతడంతర్ధానంబు నొందెను. ఈయంగములెవ్వడు బూర్తి జేయగలడని దుఃఖించుచు బశ్చాత్తాపంబున దల్లడిల్లజొచ్చెను. అప్పుడు భగవంతు డతని స్వప్నములో గనంబడి అనఘా? నీవు చింతింపకుము. నేనిట్టి రూపముతోనే పుడమియందు జగన్నాథస్వామియను పేరుచే నొప్పుచుందును నీకీర్తి భూమియందు స్థిరముగా నుండును. నీ భక్తికి మెచ్చితిని అని చెప్పెను.

అట్టి కల తెలుంగెల్లరకు జెప్పి యాస్వామికి దనయందుగల ప్రేమాతిశయమునకు సంతసించుచు నింద్రద్యుమ్నుడు శుభలగ్నమున స్థాపన జేయదలంచి అట్టి లగ్నమును దెలిసికొనుటకై యోగబలంబున బ్రహ్మలోకమునకు బోయెను. అందు ద్వారమందు నిలిచి ద్వారపాలకునిచే దనరాక బరమేష్ఠికి విన్నవించిన అతండు లోనికి రప్పించుకొని నీవు వచ్చినపని యేమని అడిగెను. ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మకు నమస్కరించి అయ్యా నేను! జగన్నాథస్వామిని బ్రతిష్ఠ జేయదలచుకొని యాలయంబుల గట్టించితిని. అందులకు ముహూర్తము పీవలన బెట్టించుకొనవలయునని వచ్చితినని చెప్పెను. ఆ మాటలు విని చతురాననుండు నవ్వుచు నోహో! ముహూర్తమునకై యింత దూరము వచ్చితివా చాలులే అన్నియున్నైనవి పోపొమ్మని యానతిచ్చెను.

పిమ్మట నామనుజపతి మరల జగన్నాథమునకు వచ్చి చూడ నా స్వామి వేరొకయాలయంబున స్థాపింపబడి అద్భుతములైన యుత్సవముల ననుభవింపు చుండెను. అందు దన్నెరింగిన వారెవ్వరును లేరు. కాలవ్యత్యయము మిక్కిలి గనంబడుచున్నది. దానికి తొందరయు నాశ్చర్యమును జెందుచు నా యాలయములోనికి బోవ నాపల్లభుని గావలివారలాటంక పెట్టుటయు అయ్యో! ఇదియేమి కర్మము. నేను మహారాజునను సంగతి గురుతెరుంగక వీండ్రు తోసివేయుచున్నారే! మావారందరు నెందు బోయిరో? అని తలంచుచు వారితో నేను చక్రవర్తిని యీ వేల్పులు నా యిష్టదైవములు నన్ను ద్రోచివేసెదరేల? అని యెన్ని విధముల జెప్పుకొనినను అతని మొర వినినవారులేరు.

అప్పుడతడు సముద్రతీరమునకుబోయి భక్తివిశ్వాస పురస్సరముగా నాస్వామిని ధ్యానించిన నాభక్తరక్షకుం డంతరిక్షగతుండై రాజా! నీవుచింతింపకుము. నేను గారడాంతరమున నీవు రాకమున్న నిందు బ్రతిష్ఠింపబడితిని. నీయాలయమునకు గూడ నేడేట నొకసారివచ్చి యుత్సవముల నొందుచుండెదను. నీకీర్తి చిరకాలము జగతియందు నిలుచును. నీవు స్వర్గసుఖముల ననుభవింతువుగాక నీ బంధువులందరు

చిరకాలమగుటచే లోకాంతరగతులైరి. నీవిక్కడనుండిపోయి పెద్దకాలమైనది. దేవ మానమునబట్టి నీకేమియుం దెలియకున్నది. నాకంబున రాకకై వేచియున్న నీభార్యను గలిసికొనియెదవు లెమ్ము. అదిగో ! నీకొరకు దేవలోకమునుండి విమానము వచ్చు చున్నది. దానినెక్కిపొమ్మని పలికి యూరకుండెను. గగనతలమునుండి యేతెంచిన భగవద్వచనములు విని యారాజు వింతసంతసముతో నున్నంత నా దేవయానము వాని ముందర నిలిచెను. అతడు భక్తిపూర్వకముగా దాని నధిష్ఠించి యందున్న దివ్యాంబరాభరణములు ధరించి దేవదూతలు సేవింప స్వర్గమునకు నిర్గమించెను.

గోపా ! దానంజేసి యా జగన్నాధుని రూపమట్లున్నది. సుభద్రాదేవి యాయన భార్య, బలభద్రుడు శేషుడు దీనినే బుద్ధావతారమని చెప్పుదురు. ఈస్వామి నారాధించిన వారిపాపము లగ్నివలన దూలికవోలె హరించును. ఇతండు కలివేళ ప్రత్యక్షదైవము. మన పూర్వపుణ్య విశేషంబున సిద్దేవుని సేవలభించినది. నీ ప్రశ్నం బున కిదియే యుత్తరము వింటివిగద ! ఇంక లెమ్మని పలికిన, వాడు మిక్కిలి సంతో షించుచు నాస్థలమహిమ కచ్చెరువందుచు బలుమారా కథావిశేషముల దలపోసికొనుచు గురునితో గూడ గావడియెత్తుకొని నడుచుచుండ నిరువురును దరువాతి మజిలీచేరిరి.

శ్లో॥ స్వమత్వేనోన్నమంతః పరగుణకథనైస్స్వాన్ గుణాన్ ఖ్యాపయంతః
స్వార్థాన్ సంపాదయంతః వితతపృథుతరారంభయత్నాః పరార్థే
క్షాంత్యైవాక్షేప రూక్షాక్షరముఖరముఖాన్ దుర్జనాన్ దుఃఖయంతః
సంతస్సాశ్చర్యచర్యా జగతిబహుమతాః కస్యనాభ్యర్చనీయాః



# కాశీమజిలీకథలు

## రెండవ భాగము

## 15 వ మజిలీ

# సంగీతవృక్షము కథ

పదియేనవమజిలీ స్థలమునకు ముంగరి గ్రామము మిక్కిలి దూరముగా నుండుటచే నయ్యతీంద్రుడు అందున్న స్థలమునందు బసజేసి వంట జేయుటకు ముందుగా స్నానముజేసి జపము చేసికొనుచున్న సమయంబున వింతలుజూచుటకై యాప్రాంతమునకు బోయిన శౌనకుడు వడిగా జనుదెంచి తాను జూచివచ్చిన విశేషమును దెలుపుటకై యాయన మౌనముద్రను విడగొట్టి యంజలిపట్టి యిట్లనియె.

స్వామీ ! మీ జపమున కంతరాయము గలుగ జేసినందులకు క్షమింపుడు, నేను జూచిన విశేషము వినిన తరువాత మీరు నామీద గోపము చేయరు. మీరు జపము జేయుచున్నవారు గదా యీలోన యిచ్చట గూర్చుండనేల. నీప్రాంతవిశేషములు జూచి వచ్చెదంగాక అని నేను యిటునటు దిరుగుచుండగా గనుచూపు మేరలో నొక దట్టమైన వృక్షముల గుంపు గనంబడినది. పర్వతము లాగున నొప్పుచున్న యత్తోట యేపాటి మేటిదియో యని దాని దాపునకు బోయితిని. అందు బెక్కు వృక్షవిశేషములు గలవు. దేనికైన దినుటకు ఫలము లుండునేమోయని పరిశీలింపుచున్నంతలో నా చెవులకు నద్భుతమైన గానధ్వని యొకటి వినంబడినది.

దానికి వెరగుపడుచు నలుమూలలు పరికించి యాపాటవీతెంచిన తెరవరయ లేక విభ్రాంతి నొందితిని. అంతలో మరల నాగీతి వేరొకరీతిని వినవచ్చినది. అచ్చట జనులెవ్వరును లేరు. ఇండ్లులేవు. ఇట్టిగానస్వాన మెచ్చటనుండి వచ్చినదో యని పెక్కుగతుల దలపోయుచు నొకవేళ దేవతలు విమానము లెక్కి గ్రుమ్మరునప్పుడు గానము పాడుకొనుచుండుట గలదు. కావున నదియేమో యని యాకాశమంతయు బరిశీలించితిని. ఎచ్చటను నెవ్వరిజాడయుం గనంబడలేదు. ఇదియునుంగాక మిక్కిలి దాపుగా నున్నట్లు వినంబడినది. ఆచెట్లపైన నెవ్వరైన నుండిరేమోయని వాని కొమ్మల బరిశీలించి చూచితిని. కాని యందు నెవ్వరును లేరు. అంతలో మరల నొకవిధముగా వినబడినది. ఆహా ? ఆ సంగీతము మనుష్యలోక సంబంధమైనది కాదని రూఢిగా జెప్ప

గలను. ఆ వృక్షములపైన ప్రచ్ఛన్నముగా నుండి దివిజులు పాడుచున్నారని యూహించితిని. నిముషమున కొకరీతిగా నాగీతము వినంబడును. నేను బెద్దతడవందు నిలబడి వింటిని. ఎంతసేపున్నను నచ్చటనే వినబడినది. ఆ గానము వినుటచే మన స్వాంతయు నీరైపోయినది. మనము కొన్నిదినము లిందుండి యా గానము వినుచు జంతోషముగా గాలక్షేపము చేసికొందము అయ్యా! ముందుగా నావృత్తాంతమెట్టిదో చెప్పుడు. తరువాత జపము చేసికొనవచ్చును. దానివిధము వినినదాక తోచుటలేదు. అని మిక్కిలి వినయపూర్వకముగా బ్రార్థించెను.

జపవిఘ్నము చేసినందులకు మొదట వానిపై నెంతేని గోపము వచ్చినది కాని వాని దీనాలాపములచే దుదకది యంతయుం బోయె మణిసిద్ధుడు పక్కున నవ్వుచు నోరీ! నీతో మిగుల జిక్కుగానున్నది. సమయము తెలిసికొనక యడుగుచుందువు. ఏమి మించిపోయినది. మరికొంత సేపుండి అడుగరాదా! యెన్నిసారులు చెప్పినను నీ తొందర విడువవు. నే నెచ్చటికేని బోయెదనా! భోజనమైన వెనుక సావధానముగా గూర్చుండి చెప్పుకొనిన జక్కగా నుండునుగద కానిమ్ము. ఇక ముందెన్నడు నిట్లు జపవిఘ్నము చేయకుమని పలుకుచు నమ్మణివిశేషముచేత దద్వృత్తాంతమంతయు గరతలామలకము భంగి దెలిసికొని సంతసించుచు వానికా వృత్తాంతమిట్లని చెప్పం దొడంగెను.

# రుచికుని కథ

తొల్లి జగన్నాథంబున బలదేవుండను మాలికుడు గలడు అతడు నిత్యము రమ్యముగా బుష్పమాలికలగట్టి యమ్ముకొనుచు జీవనము చేయుచుండెను. బలదేవుడు ప్రతిదినము రెండు పూటల యందు దప్పక జగన్నాథస్వామి యాలయమునకు బోయి మంచి మంచి దండలర్పించి స్వామినర్చించి యింటికి వచ్చుచుండును. దానం జేసివానికి హరిదాసని నామాంతరము గలిగియున్నది దైవమునందు వానికిగల భక్తి విశ్వాసములు వాని సాధుజీవనము జూచి ప్రజలా వానిని మహర్షితుల్యునిగా భావించు చుందురు.

ఒకనాడు కళింగ దేశాధీశ్వరుండు సకుటుంబముగా యాత్రకు వచ్చి జగన్నాథస్వామి నర్చించి యేగెను. బలదేవుండు నాలుగేడులు ప్రాయము గలిగి ముద్దులమూట గట్టుచున్న యా భూపాలుని కుమారుని దాది యెత్తుకొనగా జూచి యుత్సుకమూ జెందుచు దనకట్టి నందను గలుగ జేయుమని నిత్యము హరిభజనావసర ములయందు నాస్వామిని బ్రార్థింపుచుండెను. అట్లు కొన్ని దినములు గడిచినంత జగ

న్నాడని కరుణావిశేషంబున దత్పత్ని గర్భవతియై పదవ మాసంబున దివ్యతేజస్స మంచితుండైన కుమారుం గనియెను. బలదేవుడు వాని సౌందర్యాతిశయంబున కచ్చెరువందుచు బ్రాహ్మణ ప్రేరణంబున వానికిం రుచికుడని నామకరణము జేసెను.

శిశువుగా నున్నప్పుడు వానిం జూచిన వారెల్ల యౌవనోదయంబున వీడెంత చక్కగా నుండునోయని యక్కజ పడజొచ్చిరి. యముడు కృతాకృతంబుల విచారింపడుగదా? రుచికుని కైదేడులు రాకముందే తల్లి పరలోక మలంకరించినది. బలదేవుడు పత్నీవియోగశోకంబు గణింపక తల్లిలేని లోపముగుపడకుండ కుమారుని మిక్కిలి గారాబముగా బెనుచు చుండెను. పసితనంబుననే రుచికుడు తండ్రి మాలికలు గట్టుచుండ దానుగూడ నల్లుచుండును. రుచికునకు బూవుబంతులు, మాలికలు, జడలు క్రీడనకములై యొప్పెను. రుచికుని కెనిమిదేడులు ప్రాయము వచ్చినది. మొదలంత ప్రాయముగల గౌతముడను విప్రకుమారునితో మైత్రి గలిగినది. బలదేవుడు రుచికునకు గౌతముని సహాధ్యాయునిగా జేసి తన యింటికి నుపాధ్యాయుల రప్పించి పెక్కు విద్యల నేర్పించెను. రుచికుడు మిగుల బుద్ధిమంతుడగుట శీఘ్రకాలములో అనేక విద్యల యందు పాండిత్యము గలుగజేసికొనియెను.

మఱియు వానికిగల మాలికా నిర్మాణ కౌశలమింతింతయని చెప్పనలవి కాదు. ప్రజలు రుచికుడు కృత్రిమ పుష్పములతో గట్టిన అలంకారముల దొడవులకు మారుగా ధరించుచుండురు. విశేషించి వారకాంతలు వానిదండలును బంతులును దొడవులును గోరికతో ధరించుచుండురు. దానంజేసి దేశమంతటను రుచికుని ప్రఖ్యాతి యెక్కువగా వ్యాపించినది. గౌతముండొకనాడు రహస్యముగా రుచికుంజూచి తమ్ముడా! నీవు గట్టిన దండ లంగళ్లలో విశేషము అమ్ముబడుచున్నవి. నీయందు గల ప్రేమచే నీతండ్రి నిన్నిల్లు గదలనీయడు నీమాలికలు నీవు స్వయముగా వేశ్యాంగణమునకు దీసికొనిపోయి అమ్మితివేని నెక్కుడు వెల రాగలదు. మీ తండ్రి గుడికి బోయినప్పుడు రహస్యముగా అంగడికింబోయి దండలనమ్ముకొని వత్తమేయని బోధించిన విని సంతసించుచు రుచికుడు నాడు మంచి మంచి దండలంగట్టి వాడుక ప్రకారము తండ్రి స్వామి నర్చింప నాలయమున కరిగినవెంటనే చక్కగా నలంకరించుకొని గౌతమునితో గూడ గణికాంగణంబున కరిగెను.

నానావిధాలంకార శోభితంబులైన గగన మొరయుచున్న మేడలపై గూర్చుండి వేణువీణాపటహమద్దల ధ్వని విశేషముల కనుకూలముగా మేళగించి మధుర స్వరంబులతో గాంధర్వంబు వెలయింపుచున్న వేశ్యామణులగాంచి రుచికుండు విస్మయముతో గౌతమా! మనవీట నిట్టి వింతలున్నవని యెన్నడును జెప్పితివికావేమి? ఆహా! యిది స్వర్గము కాదుగద! అయ్యారే! ఆ కనంబడువారు అచ్చరలేమో!

భళిభళీ! అని మెచ్చుకొనుచు జూచిన సౌధమే చూచుచు బోయిన వీధికే పోవుచు విన్న గానమే వినుచు బెద్దతడవా వీధినే తిరుగుచుండెను.

ఒకచోట వారాంగనా నిమిత్తమునం జేసి యిరువురు బ్రాహ్మణులు కలియబడి పోట్లాడుచుండుట చూచి రుచికుఁడును గౌతముఁడును విడిపించిరి. ఆ సందడిలో రుచికుని చేతనున్న పూవుదండలు నలిగి పోయినవి. అప్పుడతండు గౌతముం జూచి అన్నా! దండలు నలిగిపోయినవి. వీనినెవ్వరును గొనరు మాతంత్రి యింటికి వచ్చువేళ కావచ్చినది. మనమిక నింటికిఁ బోవుదమే? అని పలికిన అతండును సమ్మతించెను. ఇరువురునుఁ గదలి యింటికి బోవుచుండ నాదారిలో నొక చిత్రసౌధము వారికి నేత్రపర్వము గావించినది.

తద్విశేషములరయుచు నొక్కింత తడవువారందు నిలువంబడిరి. అప్పుడా లోపలినుంచి యొకపూబోఁడి వాకిటకువచ్చి యెవ్వరి నిమిత్తమో పరిశీలింపుచుండెను. అప్పుడా వీధింబడి యొక విటపురుషుండు పోవుచుండ వానింజూచి యా చిన్నది రసికశేఖరా! ఇటుచూడక పోవుచుంటివేమి? నన్ను గురుతుపట్టలేదా యేమి! నీవు కొన్ని దినములు కళత్రముగా స్వీకరించిన దారావళి సఖురాలను. పూవుంబోణిని. జ్ఞాపకము వచ్చినదా? అని పల్కరించిన అతండటుచూచి యోహో? పూవుబోణి! నీవిందుంటివేల? ఇది చంద్రలేఖ గృహము గదాయని అడిగిన అప్పడతి యిట్లనియె.

బావా! నేను ప్రస్తుతము తారావళి యొద్దనుండుటలేదు. దానికిని నాకును విరోధము వచ్చినది. చంద్రలేఖ నాకు జుట్టముగుట నిందుంటిని. మాపనికత్తియ రుచికుఁడు గట్టిన పూవుదండలు దెమ్మనిన అంగడికిబోయి నేఁడు మరియొకరు కట్టిన దండలం దెచ్చినది. రుచికుని దండలుగాని చంద్రరేఖ ధరింపదు. అందునిమిత్తము దాని మరల అంగడికిఁ బంపితిని. దానిపోవ నరయుటకై యిందు వచ్చితిని. దీనికి ఫలము మీదర్శనమని పలికిన నవ్వుచు నావిటశిఖామణి యిట్లనియె.

పూవుబోణి! చంద్రలేఖ యింటికెవ్వరైన సరసులు వచ్చుచున్నారా? దానికెవ్వరైన గన్నెరికము గావించినారా? అది తల్లిమాట వినక సంతతము విద్యాగోష్ఠియే చేయుచుండునని చెప్పుదురు. ఆ నియమంబులన్నియు నున్నయవియా? లేవా? నాకుఁ దడవులంబట్టి దానిఁజూడవలయునని యున్నది. ఉపాయ మేమని అడిగిన అప్పడఁతి బావా! అది పట్టిన నియమము బ్రహ్మవచ్చి చెప్పినను విడువదు. విద్యారుచికుంగాని పెండ్లియాడదఁట సరసులఁ గన్నెత్తిచూడదు. అనపండితులకుగాక యితరులకు గనంబడదు. నీవు దానింజూడఁ గోరితివేని యొక యుపాయము చెప్పెదవినుము. రుచికుని దండలు మాదిరిగాఁ గట్టవలయునని ప్రయత్నము చేయుచున్నది కానిశక్యముకాకున్నది. ఆ రుచికుఁడీ యూరనే యున్నవాఁడట. వానిం దీసికొనిపత్తువేని దర్శనము చేయింతునని చెప్పుటయు అతండు నవ్వుచు నాలాగే ప్రయత్నము చేయుదునని పలికి అవ్వలికిఁబోయెను.

ఆ ప్రసంగమంతయును విని రుచికుడు మరియును గౌతమా ! మాలికల మూలమున నాకు మంచివాడుకయే వచ్చినది. నేనిప్పుడే లోపలికిబోయి నాపేరు జెప్పిన జంద్రలేఖ నన్ను మిక్కిలి గౌరవపరచును కాబోలు పోయియాపని దానికి నేర్పుదునా అని అడిగిన అతండు నవ్వుచు జాలుచాలు మనమింటికిబోవుదము రమ్ము నిన్ను గానక నీతండ్రి పరితపించుచుండును. నీవు లోపలికి బోతివేని తిరిగివత్తువా ? అని మందలించెను. అప్పుడు రుచికుడు వయస్యా ! ఎట్టియినను మాతండ్రి మందలింపక మానడు అయిన యాలస్యమైనదిగా మఱికొంత సేపిందుండి వింతలంజూచి పోవుదమని బ్రతిమాలిన అతండు మరికొంతసేపు నిలిచి మరల రమ్మని నిర్బంధించెను. కాని పోవుటకు రుచికునికి గాళ్ళుసాగినవికావు. అప్పుడు గౌతముడు గోపము చేయుచు గానిమ్ము ఇంత ప్రొద్దుపోయినదికదా రాకుంటివి నేనుబోయి మీతండ్రిం దీసికొనివత్తునని అవ్వలికి బోయెను. అంతలోఁ బరిచారిక దండలు తెచ్చినదేమోయని పూష్పబోణి మరల వాకిటకు వచ్చినది ఆసమయము గ్రహించి రుచికుడు పడతీ ! నీవు రుచికుడు గట్టిన దండల నిమిత్తము విమర్శింపుచుంటిని. అవి నాయొద్దనున్నవి కాని కొంచెము నలిగినవి చూచుకొమ్మని పలుకుచు అక్కలికి యొద్దకుఁబోయి యా మాలికలం జూపెను.

అచ్చెల్వ వానిం బుచ్చుకొని విమర్శించిచూచి యివి రుచికుడు కట్టినవే. నలిగినను రమ్యముగానే యున్నవి. వీనినెంతకమ్మెదవని అడిగిన మీరు నిత్యము నెంతకు గొనుచున్నారో అంతియే నీవెల యని చెప్పెను. అదిమాకు దెలియదు. నీవీ దండలనెచ్చట గొంటివి లాభమేమి కావలయును అడిగిన అతండు నవ్వుచు నేనివి యొరులయొద్ద గొనలేదు. స్వయముగానే కట్టితిని. కావున నీయిష్టము వచ్చినంత నిమ్మిమ్మని అడిగిన అవ్వెలంది నీపేరేమని యడిగినది. అప్పుడతండు నా పేరు రుచికుడని చెప్పెను.

ఆమాటవిని యాబోటివిస్మయ నభినయించుచు నేమేమీ ! దండలుగట్టెడు రుచికుడవు నీవేనా ? మీయిల్లెక్కడ. ఎప్పుడుఁ గనంబడితివి కావేమి ? నీదండలకు మాసఖురాలు మిక్కిలి వేడుకపడుచుండును. ఆపని నీయొద్ద నేర్చుకొనవలయునని నిన్ను దీసికొనిరమ్మని పలుమారు నాతో జెప్పినది. నీయునికిపట్టు నాకు దెలిసినదికాదు. లోపలికి బోవుదమురమ్మని పలుకుచు దీపము వెలుగున వాని చక్కదనముఁజూచి తల యూచుచు నక్కజపాటుతో నాబోటివానిని లోపలికి దీసికొనిపోయి అమ్మా ! రుచికుడు. రుచికుడని నీవు పలుమారు స్మరించుచుండువు. వాని నిదిగో ! నీయొద్ద దీసికొని వచ్చితిని జూడుమని పలికిన విని యబ్బురముఁజెందుచు జేరలకు మీరిన కన్నులును దళుక్కు చెక్కులును, దీర్ఘబాహువులును సుందరముఖంబును గలిగి లేతయౌవనముఁ బొలు

పొందుచుఁ గంతు, వసంతాదుల మించియున్న రుచికునింగాంచి యక్కాంచనగాత్రి హర్షపులకితగాత్రియై మోహావేశముజెందుచు లేచి వాని సుచిత పీఠంబునం గూర్చుండ నియమించి స్వాగతపూర్వకముగా నిట్లనియె.

అయ్యా ! నిన్నుఁజూడక పోయినను నీవుగట్టిన దండలు నీపరిచయము గలుగఁజేసినవి. ఈవిద్యయొక్కటియే యక్కజమనుకొనుచుంటిమి. రూపమంతకంటె వింతగానున్నది. నీవీవిద్య నెక్కడ సంపాదించితివి? నీకు గురువులెవ్వరు ? నీకులశీల నామంబు లెట్టివని పలుకుచు శృంగారవిలాసములతని మొగంబున వెలయించి వాని హృదయమును స్మరవికారము నొందించినది. రుచికుడు తదీయవిభ్రమవిలోల చిత్తుండై యున్మత్తుండువోలె వక్తవ్యాంశము నెఱుఁగక యేమేమో చెప్పఁదొడంగెను. వాని చిత్త చాంచల్యమరసి యమ్మత్తకాశిని చిత్తజునివంటి యాప్తుండెవ్వడును లేడుగదాయని సంతసించుచు నాతడే తన మనోహరుడని నిశ్చయించుకొని మనసుచే వరించి యవ్విషయ మెఱుకపడనీయక కపటముగా మాటాడుచు సంగీతము పాడి మోహము గలుగఁ జేయుచుఁ జందన తాంబూలాది సత్కారంబుల బరిహాసపూర్వకముగాఁ గావించుచు వానిం శృంగారలీలాజలధి వీచికలఁ దేలఁయాడ జేయుచుండెను.

అంతలో వీధిద్వారముదాపున నేదియో సందడి వినంబడినది. అది యేమని విచారింపుచున్నంత రాజభటులు తలుపుతీయుఁడని అఱచిరి ఆ రొదవిని రుచికుం డదరిపడి అయ్యో ! ఇక నేమియున్నది. గౌతముఁడు పోయి మాతండ్రికిచ్చుటకిఁ దీసి కొనివచ్చెను నే నొక్క నిమిషము గనంబడనిచో మాతండ్రి మిక్కిలి పరితపించును. కదలక కదలక యిల్లు కదలి యింత అల్లరి పాలయితినేమి ? ప్రమాదము వచ్చినది. నీప్రియ వాక్యముల విని నేను వెనుకటి కథలు మరచితిని. నన్నొకచోట దాచి యవమానము రాకుండఁ గాపాడుమని వేడుకొనుటయు నవ్వుచు నాచంద్రలేఖ యిట్లనియె. రుచికా ! నీవు వెఱవకుము. మాయింట దాగినవానిని బరమేశ్వరుఁడు పట్టుకొనలేడు. నీ తండ్రిమాట లెక్కయేమని పలికి అతనికొక గుప్తమందిరము చూపినది. అది మా తండ్రి వెదకక మానడు. మరియొక రహస్యస్థలము చూపుమని అడిగెను అప్పుడ తయుఁ దనయింటనున్న గూఢప్రదేశము లన్నియుఁ జూపించినది కాని అతండంగీకరింపక వేరొకటిలేదా అని అడుగుచుండెను. చివరకది తనయింటిలోఁ జేసియున్న యొక యుద్యానవనము జూపి దానికి రెండవ దారిలేదనియుఁ బరిచితులు వెదకినను నందున్న గనంబడరనియుం జెప్పి వానినందొక మందిరమున నుండ నియమించి యా దొడ్డితలుపు బిగించి యీవలకు వచ్చినది.

అంతలో రాజభటుల యార్పులతిశయించి చంద్రలేఖ హృదయభేదము గావించినవి. అక్కలికి వెఱచుచుఁ దలుపులు దీయించినది. అందు గౌతముఁడును బలదేవుఁడును రాజభటులతో నిలువంబడియుండిరి. వారిఁజూచి చంద్రలేఖ యీ అర్ధరాత్రమున మీ రందఱు మాయింటికేమిటికి వచ్చితిరని అడిగిన రక్షకభటు లిట్లనిరి.

ఈ బలదేవునికొడుకు రుచికుఁడను వాఁడు మీయింట నున్నాఁడఁట. వానిం దీసికొని పోవుటకు వచ్చితిమి. సామమున పంపుదువా? క్రమ్మ ప్రకారము చేయమా అని బెదరించిన నత్తలోదరి రుచికుఁ డెవ్వఁడో మే మెఱుఁగము. మాయింటికి రాలేదు. క్రమమేదియో అట్లు చేసికొనవచ్చునని నిర్భయముగాఁ బలికినది. అప్పుడందరు లోపలికి బోయి కరదీపికలఁ దాల్చి దాని యిల్లంతయు వెదకిరి. ఎందును వానిజాడ కనంబడినదికాదు. అంతలో దెల్లవారినది. అప్పుడు గౌతముఁడు పెరటి లోనికింబోయి నలుమూలలు చూచుచుండ నిష్కుటద్వార కవాటము గనంబడినది. దానితలుపు తీయమని కోరినఁ జంద్రలేఖ యా యుద్యానవనము తనది గాదనియుఁ మరియొకరి తోఁటకుఁ బంపుటకు తన కధికారము లేదనియు దానిముద్ర తనయొద్ద లేదనియుఁ జెప్పి పెద్దతడవు వాదించినది. గాని రాజభటులు సమ్మతింపక బలాత్కారముగా ముద్రవిడఁగొట్టి యాతోఁటలోఁ బ్రవేశించిరి.

అత్తరినత్తన్వి హృదయమున దిగులుపడి యేమియుమాటాడక మేడమీఁదికి బోయి పశ్చాత్తాపముఁ జెందుచుఁ బూవుఁబోఁడి! మన మనవసరపు కృత్యము గావించి బొంకరులమైతిమి. అయ్యో! ఇంత యేలవచ్చినది పిలిచి నప్పుడే యదార్థము చెప్పిన ముప్పులేక పోవునుగదా. రుచికుని పిరికితనము జూచి యిట్టిపూనిక వహించితిమి. కానిమ్ము నీవుబోయి యక్కడనేమేమి విశేషములు జరుగునో చూచి రమ్మని పంపినది. పువ్వుఁబోఁడి పోవువరకు నాతోఁటనంతయు వెదకి రుచికునిఁగానక విచారింపుచున్న బలదేవునూరడింపుచు నీవలకు వచ్చుచుండిరి. ఆవార్త దెలిసికొని పువ్వుబోఁడి పరిపరిఁబోయి చంద్రలేఖ కెఱింగించినది. అతండందు లేడను వార్త విని చంద్రలేఖయు మిక్కిలి విస్మయముఁ జెందుచుఁ గానిమ్ము మాటఁ తరువాత విమర్శింపవచ్చును. ఇప్పటికి యవమానము దాటినదికాదా యని సంతసించుచు నక్రమముగాఁ దనయిల్లు బరీక్షించినందులకై యభియోగముఁ దెత్తునని యెదురువారిని బెదరించినది. అప్పుడేమియు మాటాడలేక లజ్జాపనతముఖులై వారెల్ల వచ్చినత్రోవం బోయిరి. రాజభటులు గౌతముని యవిమృశ్యకారిత్వమునకు మిక్కిలి నిందించిరి. వారలేగినవెనుకఁ జంద్రలేఖ పువ్వుబోఁడితోఁ గూడికొని యాతోఁటలోనికిబోయి కొమ్మకొమ్మ చెట్టుచెట్టునందుఁ గొంచెమైన విడువక వెదకినదికాని యెందును రుచికుని జాడగనంబడలేదు.

ఆ తోఁటకు రెండవదారిలేదు. దాని ప్రహరి మిక్కిలి యెత్తయినది. అతఁడందు లేకుండుటకు గారణముఁదెలియక అక్కలికి మిక్కిలి పరితపించుచు రహస్యముగా పూఁబోఁడిఁబంపి యాగ్రామ మంతయు వెదకించినది. కాని యెందునుగనంబడి లేదు. మరికొన్నిదినము లరిగిన తరువాత నొకనాడు గౌతముడు చంద్రలేఖ యొద్దకు వచ్చి యుచ్చితుండై యల్లననిట్లనియె. బోఁటీ! నీవు లోకముపాటి యాటవెలఁదివికావు విద్వాంసులచే ననవద్యవై యుంటివి. బలదేవుడు పుత్రవియోగ దుఃఖంబునఁ జీవిక ప్రాణావశిష్టుఁడై యున్నవాడు. అపాపమేలఁ గట్టుకొనియెదవు. రుచికుని విడిచిపెట్టుము. నీకు

మంచిపుణ్యము రాఁగలదని బోధించినఁ గన్నీరుగార్చుచు నా గణికామణి జరిగిన యదార్థ మంతయు వానికి జెప్పి విచారింపఁదొడంగినది.

గౌతముఁడాబోటిమాటలువిని వెఱఁగుపడి యాతోటలో సంచారవృక్షము లున్నవేమోయని శంకించెను. పిమ్మటఁ జంద్రరేఖ గౌతమా! యీదోషము నేనుగట్టి కొంటిని. బలదేవునితో నీకుమారుని వెదకి తెప్పింతునని చెప్పుము. నిక్కమతనినే నేనుఁ బతిగావరించితి నన్నిగతుల నాకాతనికంటె జీవనోపాయములేదు. నీకుఁ గావలసినంత ద్రవ్యమిచ్చెద. దేశాటనముచేసి అతనిజాడఁ దెలిసికొనిరమ్ము. ఎప్పటికప్పుడు నాకు విశేషవార్తల దెలుపుచుండుము. అతండు నీకునుఁ బరమాప్తుడు గదాఁయని ప్రార్థించిన సంతసించుచు నప్పుడే కొంతద్రవ్యముగైకొని బలదేవునికిఁ జెప్పి యిల్లువెడలి రుచి కుని వెదకుచుఁ గొన్ని దినములు దేశసంచారము గావించెను.

మఱికొన్ని దినములరిగిన వెనుక గౌతమునొద్దనుండి చంద్రరేఖ కొక యుత్తరము వచ్చినది. అందు చంద్రరేఖా! నేను పెక్కుదేశములు తిరిగితినిగాని యెందును రుచికునిజాడ తెలిసినదికాదు. ఇప్పుడు సముద్ర ప్రాంతమందున్న రామ చంద్రనగరంబునకు వచ్చితిని. ఇందు బరికింప నొకవిశేషము గనంబడినది వినుము. ఈపట్టణంబు శూరసేనుఁడను రాజు పాలింపుచున్నవాడు. ఇతనికి దిలోత్తమయను కూతురు కలదు. ఆ చిన్నది విద్యారూపగుణశీలంబుల అసామాన్యయైయున్నది. ఎట్టి రాచపట్టివచ్చినను మెచ్చక దివ్యప్రభావసంపన్నుఁడగు వానినిగాని పెండ్లియాడనని నీమముచేసికొనియున్నదఁట మఱియుం దండ్రి బలవంతముసేయఁ గొన్నిదినంబుల క్రింద నొకసుందరపురుషుని యాకృతిం జిత్రఫలకమునఁ వ్రాసి యిట్టివానిం దెచ్చినఁ బెండ్లియాడుదు. లేకున్న నాతో మఱిచెప్పవలదని చెప్పినదఁట ఆధాత్రీపతియు నా చిత్రఫలకం బాయూరిలోనున్న యొకదేవాలయంబులోఁ బ్రేలగట్టించి అట్టిపురుషునిం దెచ్చినవారికిఁ బారితోషిక మిత్తునని ప్రకటనవ్రాసియున్నవాఁడు. నేనును నాగుడిలోనికి బోయి యాపటంబును చూచితిని మన రుచికుని యాకృతియేయందున్నది. దానింజూచిన నామిత్రుని చూచినట్లేయున్నది. కొంతసేపట నిలచి నాకన్నుల కఱవుదీరఁ బ్రత్యవయ వంబుఁ బరికించితిని ఇంతయేని భేదము గనఁబడలేదు. అచ్చుద్దినట్లే యున్నది. అచ్చట నున్నవారిని దానివృత్తాంతమడిగినఁ బైనవ్రాసిన ప్రకారమే చెప్పిరి.

మన రుచికుఁడాతిలోత్తమ హృద్గతుఁడగుటకుఁ గారణమేమో తెలియదు. నేనాతిలోత్తమ నడుగుదమన్నను శుద్ధాంతచారిణియగు నక్కాంతారత్నము నెట్టుల చూడనగును. అప్పుడతియు నిప్పుడెద్దియో విచారముజేఁ గుందుచున్నదఁట. నేనచ్చట నున్న ప్రకటనలనుఁ జదువుచుండగా రాజభటులువచ్చి యిందున్నవాని నెఱుఁగుదువా యేమి యిట్టివానిందీసికొనివచ్చెదేని నీకు మంచి బహుమతి నిప్పింతుననుటయు నేనిట్లంటి, అయ్యో! యిందున్నవాఁడు నామిత్రుడు వానివెదకుటకే నేనువచ్చితిని. వాఁడు కనఁ బడినఁజాలును. ఇంతకన్న బహుమతి నాకక్కరలేదు. ఇంతకన్న మీకేమైనం దెలిసిన

జెప్పఁడు. మీకు నేనే బహుమతినిప్పింతునని చెప్పితిని. నామాటలకు వారు వెరఁగడుచు మాకింతకంటె నేమియుఁ దెలియదని చెప్పిరి. మఱియు నిందెవ్వరికేమిం దెలియు నేమోయని పురమంతయుఁ గ్రుమ్మరుచుంటిని. ఇవియే యిచ్చటనున్న విశేషములు నీ వొకసారివచ్చితివేనిఁ దిలోత్తమతో మాటలాడనగును. అచిన్నదియు మిగుల పాండిత్యము గలదగుటచే నీతో మైత్రి సేయకమానదు. తక్కిన విశేషములన్నియుఁ దిలోత్తమవలన నీకుఁ దెలియఁబడును. అనియున్న యుత్తరమునుఁ బలుమారు చదువుకొని గౌతముని బుద్ధినైపుణ్యమునకు మెచ్చుకొనుచు చంద్రలేఖ రామచంద్రనగరమునకుఁ బోవుట యుచితమే అని తలంచి యాప్తులకేరికిం దెలియకుండ నొకనాఁటిరాత్రి పూవుఁబోని మాత్రము వెంటఁబెట్టుకొని ప్రచ్ఛన్నంబుగా నిల్లువెడలి రామచంద్రనగరంబునకుఁ బోవు తెరవు తెరంగంతయు గౌతముండుత్తరములో వ్రాసియున్నవాఁడు కావున నట్టి మార్గమునంబడి చంద్రలేఖ స్వల్పకాలములోనే యా పట్టణము చేరినది.

అంతొకయింట బసఁజేసి రెండుమూఁడుదినములు గౌతముని వెదకినదికాని అతండుగనంబడలేదు. తరువాత నానాతి దేవాలయములోనికిఁబోయి అందున్న పటము జూచిముద్దుఁబెట్టుకొనుచుఁ గొంతసేపు సంతాపముజెందినది. పిమ్మట నప్పరిచారికచే దెలుపంబడి మోహమునువిడిచి అచ్చటినుండి మరల బసలోనికివచ్చి ఆచిత్రపటమునుగురించి పెక్కుతెరంగుల నాలోచించుచుండెను. రాజపుత్రిక అగు తిలోత్తమతో మైత్రిఁజేసినఁ నాడుగాని దీనివృత్తాంతము దెలియదనియుఁ దన విద్యామహిమఁజూపినగాని యట్టిపని నెరవేరదనియు నిశ్చయించి, మరునాఁడు తానొక విద్యావినోదసభఁ జేయుననియు నందుఁ దన్ను జయించినవారికిఁ గానుకలిత్తుననియు నీయూరిలోనున్న విద్వాంసులును ప్రజలును రావలయుననియు బ్రకటనపత్రికలు వ్రాసియంపినది.

అవీటిలో మేటులగువార లాపత్రికల నంతగా మన్నింపక యా సభకుఁ బోవలేదు సామాన్యజనులుపోయి యమ్ముదితచేసిన అమానుషంబులగు విద్యావినోదంబులఁజూచి మెచ్చుకొని అమ్మరునాఁడు తత్ప్రభావమంతయుఁ జాటింపదొడంగిరి. మఱి రెండుదినములు జరిగిన వెనుక నత్తెరవ మరలనొక సభఁజేయుదునని పూర్వము వలెనే పత్రికలంపినది. అప్పుడాయూరిలోనున్న పెద్దమనుష్యులు ధనికులు విద్వాంసులు లోనగు వారందరు నాసభకువచ్చిరి. భూపతియు దానికీర్తి పౌరుల వలన విని యున్నవాఁడు కావునఁ దానుకూడఁ బండితులతో నాసదస్సునకుఁబోయెను.

పిమ్మట నాయూరిలోని విద్వాంసులుదానితోఁ బ్రసంగముచేయ బూనిరి గాని యొకటిరెండుప్రశ్నములలోనే వారలఁబరాజయంబు నొందించినది. అందుల కందరు వెరఁగందుచుండ వెండియు సద్వృత్తమత్రైన విశేషంబులు సహస్రావధానము వ్యస్తాక్షరి నిషేధాక్షరి విచిత్ర బంధకవిత్వాది వినోదములచే సభ్యులహృదయంబుల కాహ్లాదంబు గలుగఁజేసినది. అప్పుడప్పూవుఁబోఁడిని సరస్వతియొక్క యపరావతార మనిస్తోత్రములుసేయఁ దొడంగిరి. సభముగించిన తరువాత నాచేత పారితోషికమియ్య

బోవుటిది అందికొనక చేనా! నేనీసభ బహుమతుల నొందుటకుఁ జేసినదికాదు. నాకు ధనమవసరము లేదు. మీవంటి మహాత్ముల అనుగ్రహము గలిగినం జాలునని సవిన యముగాఁ బ్రార్థించినది. దానిమృదుమధురోక్తులకు సంతసించుచు సందులకభయ హస్త మిచ్చి యాఱేఁడు పరివారముతోఁగూడ నరిగెను.

# తిలోత్తమ కథ

శూరసేనుండింటికిఁబోయిన కొంతతడవునకు రాజభటులు కొందరువచ్చి చంద్రలేఖంజూచి బోటీ! నిన్ను జూడవలయునని రాజపుత్రిక తిలోత్తమ మిగుల వేడుకపడుచున్నదట? మాతోడఁ నిన్ను దీసికొని రమ్మని చెప్పెను. వెంటనే రావలయు ననుటయు నది తనకోరిక దీరెడు నవకాశమిదా అని సంతోషించుచు చక్కఁగా నలంకరించు కొని తన పరిచారిక పూబోడితోఁగూడ రాజభటుల వెంట నగరిలోనికిం బోయినది. అందు అంగనలచే జూపింపబడిన మార్గంబున దిలోత్తమ యంతఃపురమునకు బోవుటయు నక్కన్యకాతిలకంబు చంద్రలేఖ నుచితమర్యాదలతో దోడితేదగు పరిచారికల నియమించినది. ఆమె చేయు సత్కారములకు మిక్కిలి సంతసించుచు నవ్వేశ్యాతిల కము తిలోత్తమను జూచిన తోడనే నమస్కారమును జేసినది.

రాజపుత్రికయు దీవించి దానిగాత్ర సౌకుమార్యమునకు నద్భుతమందుచు నోహో! యిట్టి యుత్కృష్టవిద్యారూపంబులు గల సలక్షణి నుత్తమకులంబున బుట్ట జేయని పరమేష్ఠినిందాపాలుడు. ఇదియుం గులపుపాటిపాటింపక యుత్తమస్త్రీ లక్షణం బుల కనుగుణంబులగు సుగుణములు నొప్పారుటచే మిగుల గొనియాడదగి యున్నది. దీనితో గొంత ముచ్చటించి మరియుం దీనిస్వభావ మెఱిగెదగాక యని తలంచి అల్లన దానితోనిట్లనియె. ఇంతీ? నీవు నిన్నటిసభలోఁ జేసిన వింతపనులువినినంత నాకు మిగుల సంతసమైనది. నీ కులంబున కెల్ల గౌరవమును సంపాదించితివి. మేలుమేలు, నీకిట్టియుప దేశకులెవ్వరు? ఏమి విద్యలభ్యసించితివి! విద్యలు సాంగముగ నైనవియా? అనురూప వరునింబడయక యిట్టి లేఁబ్రాయమంతయు వృథాఁ జేయుచున్న దానవేమి? ఇది యొక్కటియే నాచిత్తమ్మున కమ్మలికము గలిగించుచున్నదని పెక్కుగతుల అమ్మద వతిని నుతియించినది.

తన్ను రాజపుత్రికచేసిన పొగడ్తల సహింపమి నభినయించుచు చంద్రలేఖ భర్తృదారికా! నేను చదివినది యొక్కరియొద్ద కాదు. కావ్యనాటకాలంకార గ్రంథము లొకరియొద్దను, వ్యాకరణ మొకరియొద్దను, తర్కము వేఱొకరియొద్దను, గీత శాస్త్ర మొకరియొద్దను జదివితిని. ఇట్లే "పుష్కలేనధనేనవా" అనురీతిని

ధనము వ్యయపుచ్చి పెక్కు విద్యలు సంపాదించితిని. చదివినవి మాత్రము సాంగంబుగానే చదివితిని. నన్నింతగా నీవు పొగడవలదు. నేను నీకంటె విద్వాంసురాలను కాను. భవదీయ విద్యామహత్వములు నిన్నటి సభలోనే పౌరులవలన వినియుంటి. నన్ను నీ చెలికత్తియలలో జేర్చుకొమ్ము. అదియే నా కోరిక. మరియు అనురూపవరుని బడయకునికి గారణమేమని అడిగితివి. బుద్ధిశాలినివగు నీకీ ప్రశ్నకుత్తరము జెప్పుట యనావశ్యకము. అనురూపశబ్దమున కర్థమెద్దియో విచారింపుము. తగిన వరుని బడయుట దైవికంబు గదా నిన్ను గూడ నేనిట్టి ప్రశ్న అడిగినచో నాయవివేకము తెల్లమగును. కావున నేను నిన్నేమియు నడుగదలచు కొనలేదు. సఖ్యము సాప్తపదీనమను ప్రసిద్ధియున్నది. మనకిప్పుడు నేస్తంబు కలిగినది. ఇటు పైన నొండొరుల అభిలాషల జెప్పుకొనుట కేమి సందేహము! నెమ్మది మీద అన్నియుం దెలియనగునని పలుకుచు తిలోత్తమ చిత్తంబును దృటిలో దన యధీనము చేసికొనినది రాజనందనయు చంద్రలేఖ పలికిన గంభీరవచనముల కెంతయు సంతసించుచు దన ప్రాణసఖులలో మొదటిదానిగాఁ జేసికొంటినని అప్పుడే వాగ్దత్తము చేసి గాఢాలింగనము గావించెను. అప్పుడిరువురకు నానంద బాష్పములు ప్రసరించినవి. శుద్ధాంత కాంతలెల్ల వారి సఖ్యమునకు అనుమోదించిరి.

అది మొదలు వారిరువురు నాహారనిద్రా క్రీడావిహారాదుల నొక నిముషమేని విడువక యేక దేహమెట్లట్లు వర్తింపుచు సంతతము విద్యాగానవినోదంబులతోఁ ప్రొద్దులు బుచ్చుచుండిరి. ఇట్లు కొన్నినాళ్ళు జరిగిన వెనుక నొక్కనాడు చంద్రలేఖ తిలోత్తమతో నేకాంత నిశాంతమందు గూర్చుండి యిష్టాగోష్ఠి విశేషంబుల సంభాషించుచు అల్లన నిట్లనియె.

సఖీ! మనమిప్పుడు నూతన యౌవనములో నుంటిమి గదా. ఇట్టి సమయంబున నొకహీనులమైయుండుట లోకగర్హితమై యున్నది. అడవిగాచిన వెన్నెలవలె మన ప్రాయమంతయు వ్యర్థాగాఁ బోవుచున్నది. నాకుఁబోలె నీకు సైతమును రూపవరుడు లభింపమికి వింతగా నున్నది. నాది నీచజాతియగుట మా కులములోని పురుషుడు విద్యారూపములు గలిగియుండరు. అన్యకులజునిఁ బెండ్లియాడుట శాస్త్రనిషిద్ధము గదా కులభ్రష్టమై వర్తించు నా యట్టిదాని కాదరణీయమేమో నీవే చెప్పుము. ఇవి అన్నియుఁ దిలకించియే నేనిట్టి కన్యావ్రతముతో నుంటిని. నీవు రాచపట్టివి. మీ కులములో విద్యారూప ప్రతాపవిహీనులు పుట్టనేర్పరు. నీవు కోరితివేని తగిన మనోహరుడు లభింపక మానఁడు. అదియునుంగాక నీవొక సుందరుని యాకృతిపటంబున వ్రాసి అట్టివానిం దెచ్చిన పెండ్లియాడుదునని చెప్పియుంటివఁట ఆ చిత్రఫలకమున నేను నగరిలోఁ జూచితిని. అందున్న పురుషుఁడెవ్వడు? వాని నెటు లెరింగితివి? అట్టివాని నెప్పుడేనిం జూచియుంటివా? లేక నీ యూహవలననే అట్లు వ్రాసితివా! ఈ వృత్తాంతమునువిన నాకు వచ్చిన నాటనుండియుఁ గోరికగా నున్నది. సమయము

గాక అడిగితిని కాను. నాకును గోప్యము కానిచో వక్కాణింపుమని మిక్కిలి వినయముగాఁ బ్రార్థించినది.

అత్తిలోత్తమయు నమ్మత్తకాశినిమాటలు విని స్వాంతంబుననెద్దియో తలంచుకొని అదరిపడి యొక్కింతవడి నేమియుం బలుకకఁ గన్నులం గ్రమ్ము బాష్పములం గోనగోరం జిమ్ముచు నన్నుఁ గని పెద్ద నిట్టూర్పునిగిడ్చి యొక్కింత తలయెత్తి వాల్గంటీ! ఏమంటివి ! నావంటి మందభాగ్యురాలి కథనురూపవతులెట్లు దక్కును. సమసుఖదుఃఖ వగు నీతో నావృత్తాంతము జెప్పవలయునని తలంచుకొనుచు నెప్పటికప్పటి కెద్దియో వినోదమూలమున మరచుదానను నీవు వచ్చినది మొదలు నేనా గోష్ఠి మరచి నీతో విలాసంబుగా నుండుటచే నించుక యాహారము భుజించుచున్నదాన. అంతకుమున్ను నేను జీవచ్ఛవంబువలెఁ బడియుండుటయే గాని యొకరితో మాటలాడుటలేదు. ఆ చిత్రఫలకంబునంగల మనోహరుని వృత్తాంతము జెప్పెద నాకర్ణింపుము.

మా తండ్రి నాకు యుక్తవయస్సు వచ్చినతోడనే వివాహము చేయవలెనని ప్రయత్నించి అనేక రాజకుమారుల రూపములు వ్రాయించి తెప్పించి నాకుఁజూపెను. నేనును వారి వారి చరిత్రల సఖీముఖంబుగా విమర్శించి తెలిసికొని వారు సరిపడరని యెవ్వారిని వరించితిని గాను. నాకు మొదటినుండియు దివ్యప్రభావసంపన్నుఁడగు వాని పెండ్లియాడ నభీష్టమైయున్నది. ఇట్లుండునంత నేనొక్కనాఁడు వసంతకాలంబున సాయంసమయంబునఁ జక్కగా అలంకరించుకొని కతిపయ ప్రియసఖీజనంబు సేవింప నేతత్సౌధోపరిభాగంబునఁ బేరోలగంబునుండి మలయమారుతములు మేనులకు హాయిసేయ నిండువేడుకతోఁ దంత్రీవాదమిశ్రితంబులైన కంఠస్వరము లమరఁ బంచమ స్వరంబున విపంచి వాయించుచుంటిని. అట్టిసమయమునం దాకాశమునఁ గలగల యని బంగారు చిరుగంటల ధ్వనియొకటి వినంబడినది. దానికి వెఱఁగందుచు మేమందరము తలయెత్తి చూచితిమి. అప్పుడు గౌరుదీప్తి నిచయముల బ్రచురమగు దీప్తిపుంజ మొకటి అల్లంత దవ్వునుండి మా కన్నులకు మిరుమిట్లు గొల్పుటయు జడిసి కన్నులు మూసికొని దిగ్గునలేచి దానికి నమస్కరించితిమి.

మరియు నాదీప్తిజాలములు మామేడయంతయు వ్యాపించుటచే నది యెట్టిదియో చూడవలయునని అభిలాష గలిగియున్నను గన్నులు దెరచుట శక్యమైనది కాదు. కొంతసేపు గన్నులఁగప్పికొని యట్టేయుంటిమికాని క్రమక్రమముగా నా మెరుపు లదృశ్యమైనందున మరల గన్నులఁదెరచి చూడగా మాయెదుట నొకపురుషుడు నిలువఁబడి యుండెను. అట్టిమోహనాంగుఁడెదురనిలువబడినంత వానినాపాదమస్తకముచూచి వర్ణించుచు బరమేష్ఠినైపుణ్యమునకు మెచ్చుకొనుచు వాఁడు తప్పక దివ్యుఁడని నిశ్చయించి యేమియుం బలుకక వాని పాదంబులంబడి నమస్కరించితిని. అప్పుడా మనోహరుఁడు తన మృదుపాణి పల్లవంబుల నన్ను మెల్లనలేవనెత్తుటయుం

దపంగస్పర్శనముచేత నామేనెల్ల గగుర్పొడిచి చెమ్మటల గ్రమ్మి వణుకఁ జొచ్చినది. పిమ్మట నేను కొంతసేపటికి ధైర్యము దెచ్చుకొని కంఠమున గద్గదికఁ దోఁపనిట్లంటి.

మనోహరా! నీవింద్రుఁడవా, చంద్రుఁడవా, వసంతుఁడవా, జయంతుఁడవా వీరిలో నెవ్వఁడవు కానిచో నిట్టిరూపము గలిగియుందువు! ఆకాశమునుండి వచ్చుటచే దివ్యుఁడవని తేటయగుచున్నది. మఱియుం దేవత లనిమిషులని వాడుకయున్నది. నీయందట్టి విధము లేకునికిఁ గారణమేమో తెలియదు నేను తిలోత్తమయనుదాన. నీపట్టణప్రభువైన శూరసేనుఁడను రాజు కూఁతురను. నేను దివ్యప్రభావసంపన్నుఁడగు వానింగానిఁ బెండ్లియాడనని నియమము జేసికొంటి. నాకోరికదీర్ప భగవంతుఁడు నిన్ను దయచేసెనని తలంచుచున్నదాన నీ వృత్తాంత మాకర్ణింప నాకెంతేని వేడుక యగుచున్నది. గోప్యము కాదేని నుడువుఁడని మోడ్పుచేతులతోఁ బ్రార్థించితిని.

అప్పుడతండు మందహాసముఁ జేయుచు నేమియుమాటాడక నా సఖులపై దృష్టినెరయఁ జేసెను. నేనాసన్నగ్రహించి యాసన్నవర్తినులగు నాచెలికత్తియలనెద్దియో మిషఁబన్ని యవ్వలకుఁబోవఁ బనిచితిని. తరువాత నాతఁడు తన మెడలోనున్న పుష్పమాలికను నా మెడలో వైచెను. నేను సంతోషముతోఁ దావులు వెదఁజల్లు నా మాలిక ధరియించి మరల నా మెడలోనున్న ముక్తాహారమొకటి తీసి అతని మెడలో వైచితిని. బోఁటీ? పెక్కేటికి వినుము. మన్మథుఁడు దుర్లంఘ్యశాసనుఁడగుట వసంతసమయము మదజనకమగుట నచ్చోటు రమణీయమైనదగుట నూత్నయౌవన మవినయభూయిష్ఠమగుట నింద్రియములు చపలస్వభావంబులగుట మనోవృత్తి చంచలప్రకృతియగుట నన్నియుంగూడిన నెట్లుండునో యాలోచింపుము. అంత నప్పురుషపుంగవుండు నాకరం బనురాగంబునం బట్టికొని యల్లనప్రాంతమందున్న తల్పంబునకుం దార్చెను. నేనును నేమి అనిన నేమి కోపము వచ్చునోయని భయపడుచు నతఁడుచేసిన చర్యలకు నొడఁబడుచుంటిని. మూఁడహోరాత్రము లీరీతి నొక్కక్షణమైనను విడువక మ్రగ్గింప మాకు గడియలాగైనను దోఁచలేదు నా చెలికత్తెయ లావృత్తాంత మెఱిఁగియుండిరికావున నితరుల నచ్చటికి రానీయక కావలియుండి మా కలిదంపులఁగూడ నేదియో మిషఁజెప్పి యామర్మమును దెలియనిచ్చిరి కారు నెచ్చెలీ! పిమ్మట జరిగిన వృత్తాంతమేమని వక్కాణింతు నామూఁడుదినములు నా శృంగారవిలాసైశ్వర్యమంతయు దేటపడి నాయొకయునితో నలరితిని.

మఱియు నాసమయంబున నొండొరులకు శృంగారవ్యాగ్రత నావిలాసంబులు మాపురమేకాని కుశలప్రశ్నావకాశ మింతయుం గలిగినదికాదు. ఒండు రెండు సారులు నీవట్టి యుద్యమము పొందమినడిగాని యేమనిన నేమి కోపము వచ్చునో అని యూరకుంటిని. అట్లు సంతోషపారావార వీచికలం దేలియాడుచు మేము మూఁడవనాఁడ

రాత్రి వేగుజాముపరకు రతిక్రీడలంజొక్కి నిద్రాయమత్తులమైతిమి. కాంతా! అంత నిశాంతమ్మున నేనులేచి చూచువరకు నా మనోహరుఁడు శయ్యపైలేఁడు. అప్పుడదరిపడి నలుమూలలు వెదకితినిగాని యెందును గనంబడలేదు. పిమ్మట నావయస్యలంజీరితిని. వారును ప్రాంతమందే వేచియున్నవారు కావున నాపిలుపు వినంబడినతోడనే తటాలునఁ జనుదెంచిరి. వారింజూచి నా వల్లభుఁడెందుఁబోయెనో యెరుంగుదురా అని అడిగితిని. వారేమియు నెరుంగమని చెప్పిరి. మేమంతరము లేచి యామేడలో నడుగు మేరయైనను విడువక మిగుల శ్రద్ధతో వెదకితిమి కాని మా ప్రయత్నంబులేమియు సఫలంబులైనవికావు.

పిమ్మట నేను నిరాశఁజేసికొని యేమియుంబోలక నేలంబడికిలబడి వాని చర్యలన్నియుం దలంచుకొనుచు వెక్కివెక్కి యేడుపఁదొడంగితిని. అప్పుడు నా సఖులు చుట్టుకొని అయ్యో! యిదియేమి చర్య ఈపాటి వియోగము సహింపలేవా? మనమొకటి మరచితిమి. అతండాకాశము నుండి వచ్చెనుగదా! యిప్పుడు సైత మా దారినే పోయి యుండవచ్చును. మరల వెంటనే రాకమానఁడు. దీనికి నీవు చింతింపనేల. అతని యాగమనంబు వీక్షించుచుండుమని నాకు ధైర్యము గరపిరి. ఆ మాటలు విని ధైర్యంబు దెచ్చుకొని యాదినము సాయంకాలము వరకు నాకాశంబు నలుమూలలకు దృష్టి ప్రసారములు బరగించితినికాని యేమియు లాభము లేకపోయినది. ఆకాశంబు జూచువరకు నాకన్నులు చిల్లులుపడినవి. అది మొదలు కంటికి నిద్రరాదు. నోటికాహార మింపుకాదు. ఏపనియుం దోచదు సర్వదా అతఁడే కన్నులకు గట్టినట్లుండును. సఖీ! నీతో నేమని వక్కాణింతు. నేఁటికతండుపోయి సంవత్సరమైనది నీతో మాట్లాడుచునే యుంటినికాని నాబుద్ధి యతని అందేయున్నది. ఇప్పటికిసైత మాశవదలక బయలు చూచుట అలవాటుపడినది. నీవువచ్చినది మొదలు కొంచెమాహారము రుచింపుచున్నయది. ఈ నడుమ మాతండ్రి యీ గొడవ యేమియు నెరుఁగక నన్ను వివాహమాడుమని నిర్బంధింపఁగా నేమియుంజెప్పక నామనంబున నాటియున్న నామనోహరుని యాకృతిఁ జిత్రపటంబున వ్రాసియిచ్చి యిటువంటి పురుషునిఁ దెచ్చినఁ బెండ్లి యాడెదనని చెప్పితిని. అతండు పటమును దేవాలయంబునం గట్టింపఁబోలు. ఇదియే నావృత్తాంతము. ఈ రహస్యము నేనును నా చెలికత్తియలుందప్ప యితరు లెవ్వరు నెరుఁగరు. నీవును నా ప్రాణసఖివిగనుక వక్కాణించితిని. నావంటి దురదృష్టవంతురాలి కట్టిప్రియుఁడెట్లు దక్కునని మిక్కిలి పరితపించుచు నతడు తనమెడలో వైచిన పుష్పమాలిక మందసములో భద్రముగా దాచి యుంచినది కావున దానిందెప్పించి చంద్రలేఖకుఁ జూపినది.

అప్పుడు చంద్రలేఖ యాదంత రుచికుగల్గిన దానిగా గురుతుపట్టి వికల మతియై యిట్లు తలంచెను ఆహా! ఈ వృత్తాంతమంతయు మిక్కిలి చోద్యముగా నున్నది ఎక్కడి జగన్నాథము? యెక్కడి రుచికుఁడు? యెక్కడి రామచంద్ర నగరము! యెక్కడి యాకాశగమనము! యెక్కడి శిలోత్తమ! ఇట్టి అద్భుతము

లెప్పుడునుఁ గనివిని యెఱుంగము. రుచికునికి వియద్గమన శక్తి కలిగియున్నట్లు తోచు
చున్నది. తన్మూలంబున నతఁడాతోఁట గోడ దాటిపోయెను కాఁబోలు. అట్టిశక్తి రుచికు
నికిఁగలిగియున్నచో నతని బాల్యస్నేహితుఁడైన గౌతముఁ డెఱుఁగఁడా ? యెఱింగి
యుండిన నాతోనేమిటికిఁ జెప్పకుండును కావున నదియును నిశ్చయింపరాదు. కానిమ్ము
మరికొన్ని దినములు నేనిందుండెద నెప్పటికేని మరల నాదివ్యుఁడిందులకుఁ రాకుం
డునా ? వచ్చినంబట్టుకొనిన సర్వము నతని వలన దెలియనగునని యీరీతిఁ బెక్కు
తెఱంగులఁదలపోసి యారహస్యమేమియుఁ దిలోత్తమకుఁ దెలుపక మరల దానితో
నిట్లనియె.

బోఁటి ! వచ్చినవాని కులశీలనామంబులు దెలియకుండ మగనిగా వరించుట
కొంచెపుసేతకాదా ! వరించితివివో ! నడుమ అడిగినందప్పా ? అప్పుడుమందును నీ
తెఱఁగెఱుఁగకుండ నీవువోలె నూరక నీతో గ్రీడించుటయుఁ జిత్రముగా నున్నది.
కానిమ్ము కడచిన పనికి వగచిన ప్రయోజనములేదు మరల నంతదెప్పటికేని రాఁగలఁడని
నాకునుం దోచుచున్నది. నీవు చింతిల్లకుము.నేనును దీనిని గురించి యాలోచించుచుండెద
నని పలుకుచు నెట్టకే దాని దుఃఖము బోఁగొట్టినది. నాఁటఁగోలెఁదిలోత్తమకువలెఁ
జంద్రలేఖకును దివ్యదృష్టి యభీష్టమైనది.

# బలసింహుని కథ

ఇట్లుండునంత నారాజు బావమరది బలసింహుఁడను వాఁడు చంద్రలేఖ
యాయూరిలో సభఁజేసిన నాటనుండియు దానిని వలచి యున్నవాఁడు గావున విరాళిం
గుందుచు మరల దానింజూచి మాట్లాడవలయునని యెన్నియో ప్రయత్నములు
చేసెను. కాని యప్పల్లవపాణి యెల్లప్పుడు తన మేనకోడలు తిలోత్తమ యంతఃపుర
మున నివసించి యుండుటచే శక్యమైనదికాదు.

బలసింహుఁడు ప్రతిదినమున వేశ్యను వశపరచుకొనుట కెన్నియో తంత్రం
బులు మంత్రంబులు క్రియలు జరుపుచుండుటచే నాసంగతి గ్రహించి పూవుఁబోఁడి
తన యజమానురాలగు చంద్రలేఖతో వాని వలపు పొలుపును మంత్రతంత్రప్రయోగ
రీతియుం జెప్పిన నప్పడఁతి అంతఁగా విశ్వసించినదికాదు. ఒకనాఁడు బలసింహునిచే
బోధింపఁబడి మంథరయను పరిచారిక యేకతమ చంద్రలేఖ యొద్దకుఁ బోయి రహ
స్యముగా నిట్లనియె.

యువతీ ! నీతో నొకరహస్యము చెప్పవచ్చితిని. అదియుఁ నీకు సుఖప్రద
మైనదని సాహసించితిని. మఱియొకలాగునఁ దలంపకుమా, మా రాజుగారి బావమఱిది
బలసింహుఁడు నిన్న సభలోఁ జూచినది మొదలు మదనశరముల కెరయైయున్నవాఁడు.

అతని వైభవము నిదివరకే వినియుండవచ్చును. శూరసేనుండు నైతమతనికి జడియు చుండును. మా రాజుగారికిఁ బుత్రసంతతి లేనందున నీ రాజ్యమతనిదిగా భావింపుము. మారాణికి బలసింహునియందు మిక్కిలి యక్కటికము గలిగియున్నది. పిన్ననాట నుండియు నతనినామెయే పెంచినది. పెక్కేల నామెకు బలసింహునియందుఁ దిలో త్తమయెడకన్న నెక్కుడు మక్కువ గలిగియున్నది. రూపంబున నీకు దగినవాడు. అట్టి పురుషుఁడు నినుఁజేపట్టఁ దలఁచికొన్నవాడు. నీవును వారాంగనవుగదా. దీని కేమికొదవయయ్యెను. సంతతము నీ విద్యారూపంబులకే యచ్చెరువందుచుండు. వేయి నేల తన ప్రాణము నీయధీనము చేయుదునని చెప్పుమనియె. యొప్పుకొనినం జక్కగా నుండునని నాకు దోచెడిని. కుసుమకోమలమైన యీ జవ్వనమంతయు వృథఁజేయ కుము. మా రాజపుత్రిక నున్మత్తగా నెంచికొంటిమి. నీవును నట్టి వెర్రితో వంబడక నా చెప్పిన చొప్పున నొప్పుకొనుము. నీకు మేలయ్యెడినని మరియుం బెక్కు విధముల దన చాతుర్యమంతయుం దేటఁబడ బోధించినది. ఆ మాటలన్నియు విని చంద్రలేఖ మందహాసము సేయుచు నోహో! మందరా! నీవు మందరయంత దానవగుదువు. నా హితంబుకోరి చెప్పినందులకెంతయు సంతసించితిని. కాని యట్టి యుద్యమము నాకు గలుగలేదు. ఱరక నా విషయమై విరాళిఁగుండుట బలసింహునికిఁ దగదని నుడువుము మరియు నేను వారకాంతనైనను బరాయతనైయుంటినిగాని స్వైరిణిగాను. నా ప్రాణవల్లభుఁడు దేశాంతరమందున్నవాడు కావున నీవీ మాటలంబోయి చెప్పుము. మరియెప్పుడును నే సందేశమును నా యొద్దకుఁ దీసికొని రాకుము. పోపొమ్ము. అని తిరస్కార పూర్వకముగాఁ బలికినది.

అప్పుడు మంధర చిన్నవోయి మారుమాట పలుకక యలుకమెయి వచ్చిన దారింబోయి బలసింహునకంతయుం జెప్పి యప్పా! యిప్పుడప్పుడఁతి రాజపుత్రిక సాంగ త్యంబు కలిగెనని మిగుల గర్వముతో నున్నది. నిన్నును నన్నును లెక్కసేయునా? యని కేరడమాడినది. అప్పుడు బలసింహునిచిత్తంబున లజ్జాక్రోధంబు లుత్తలపెట్టినవి గాని చంద్రలేఖ పయింగల వలపు పెంపునం జేసి యవి వెంటనే యణగిపోయినవి. తరు వాత నతఁడు మంధరకొక పారితోషికమిచ్చి ఓసీ? యింత మాత్రమునకు నీవు విరక్తిఁ బొందకుము. మత్తకాశినుల చిత్తంబులు క్షణక్షణమునకు మారుచుండును. నీకు మరియుం బారితోషిక మిచ్చువాఁడ. సర్వదా యా చంద్రలేఖ చిత్తంబును గనిపెట్టి యంతరమునసనే తిరుగుచుండుము. సమయమరసి నాతోఁ జెప్పుము. కోపముసేయక సిదానించుమని యెన్నియో బుద్ధులు గరపి దానినంపెను.

పిమ్మట బలసింహుఁ డేమియుం దోచక యంతకంతకుఁ గంతుసంతాపము మీరుటయు నా పట్టణంబులో శకునంబులు సెప్పునట్టి యొక యోగియొద్దకు రహస్య ముగాఁబోయి తాను వారకాంతను పలచుటయు నది తన్ను నిరాకరించుటయు లోనుగా నగు కథ యంతయుం జెప్పి యపూర్వఁబోణి తనకు వశ్యమగునట్లు చేయుదువేని నీవు

కోరిన ధనమిత్తునని పలికెను. ఆ మాంత్రికురాలు వాని మాటలు విని మిగుల సంతసించుచు నోహో యిది యెంతపని. ఆ కాంత నీచేతిలోనిదానిగాఁ దలంపుము. నా ప్రజ్ఞావిశేషంబు చూచి నీవే సంతసింతువు. నాకిచ్చు సొమ్మెంతయో చెప్పుము. దానిలో సగము ముందుగా నీయవలయును. తరువాత బహుమతితోఁ గూడ తక్కిన సగము నిచ్చెదవుగాని యిప్పుడే యాయోషధి సిద్ధముచేసి నీకిచ్చెదనని చెప్పఁటయు సంతసించి బలసింహు డిట్లనియె.

దేవీ? నేను పెద్దల బాటువాఁడనని యెఱుంగుదువు గదా అట్లైనను ముందు నీకు రెండువేల నిష్కములిచ్చెదను. తరువాత నాయీవి చూచుదానవుగదా. ఈ మాత్రమునకు సంతసింపుము నీ యుపకారమెప్పటికి మరువనని ప్రతిమాటఁ దొడంగుటయు నర్థాంగీకార సూచనము జేయుచు కానిమ్ము తెమ్ము. సొమ్మునకేమి మాటకావలయును గదా యని పలికెను బలసింహుఁడప్పుడే పోయి యాసొమ్మంతయుం దెచ్చి రహస్యముగా దానికిచ్చెను. అదియు సంతసంబు నొందుచుఁ బోయి స్నానము చేసి రమ్మని యొక మంత్రముపదేశము చేసి యిట్లనియె.

శ్లో॥ శివశిరసిస్థితమాల్యం జీవంజీవక మయూరయోరస్థి
వామక రేణగృహీతం వాత్యావర్తోద్ధితం పత్రం.

రాజపుత్రా? పరవాద్యనేకశ్లోకసమన్వితమగు నీ చూర్ణమును నేనుపదేశించిన మంత్రమును జపించుచు నీవు కోరిన చంద్రలేఖ శిరముమీదఁ జల్లుము. నీకుఁ గుక్కలాగున వశ్యయై నీవున్న చోటునకు వచ్చి సంతతము నిన్ను విడువకుండునని చెప్పి యాచూర్ణమిచ్చి యంపినది.

అతఁడా చూర్ణమునుఁ బదిలముగా మూటఁగట్టుకొని యయ్యోగిని చెప్పి చొప్పున నా మంత్రమును జపించుచు సంఖ్యాపూర్ణమైన వెనుక చంద్రలేఖ శిరంబున నోషధీచూర్ణము జల్లుట కవకాశము వెదకుచు నొక్కనాఁడు రాత్రి యంతఃపురరక్షకులకు మిక్కిలి రొక్కము పంచిపెట్టి యెట్టకేలకు మంథరతోఁగూడ చంద్రలేఖ యున్న మేడలోనికిఁబోయెను. మంథర చంద్రలేఖ పండుకొనియున్న గది యెరిగియున్నది. కావున నచ్చోటికిఁ దీసికొనిపోయి యతని కా నాతిం జూపినది. చంద్రలేఖ గాఢముగా నిద్రఁబోవుచుండుట పరికించి శిరమున కా చూర్ణము తగిలినతోడనేఁ దనతోఁ గుక్కలాగున వచ్చునను నమ్మకముతో నా చూర్ణము తీసి దాని తలపై రుద్దెను.

అప్పుడా చంద్రలేఖ యదరిపడి లేచి కన్నులు నులిమికొనుచు నెదుర నిలువంబడిన బలసింహుని జూచి భయపడి యెవ్వఁడవు నీ పని యడిగినది. అతండును హ్రాం, హ్రీం, క్లీం, హు, మ్మని యా మంత్రమును జపించుచు నా చూర్ణంబును మరలఁజల్లుచు నేను. నేను రమ్ము. రమ్ము. అని పలుకఁగా నక్కలికి యలికిపడి యోహో! నేనుఁగా నేమి నీ వెవ్వఁడవు యీ యర్ధరాత్రంబున నిచ్చటికేల వచ్చి

తివి ? యీ దుమ్ము నా శిరమ్మున రాయుటకేమి కారణము. చెప్పుమని యడిగినవాఁడు అయ్యో ! చంద్రలేఖా ? నేనే ! యింకను దెలియదా యేమి ? నిద్ర మెలకువ రాలేదు. కాఁబోలు. ఈసారి తెలియునులే యని తన చేతిలో నున్న చూర్ణమును మరల దాని నెత్తిమీదఁ జల్లెను.

అప్పుడది మిగుల వెఱపుతో దొంగ దొంగ అని అరచినది. ఆ రొదవిని యంతఃపురకాంతలెల్లరును లేచి అచ్చటికి వచ్చిరి. ఆ యలజడిలో నిలువ భయపడి బల సింహుఁడు వచ్చినదారిఁబట్టి పారిపోయెను. ఆధ్వనివిని తిలోత్తమలేచివచ్చి దొంగ వచ్చెనా అని అడిగినఁ జంద్రలేఖ బలసింహుని క్రౌర్యమని గ్రహించియుఁ దన్మూల మున నది చిన్నవోవుననితలంచి యేమియు నెఱుఁగని దానివలె మాట్లాడినది. అంత నబ్బలసింహుఁడు నంతఃపురములో నల్లరి జరిగినందులకు భయంబు జెందుచు నాసంగతి వెల్లడియైనచో రాజే తన్ను శిక్షించునని వెఱచుచు మంత్రంబును తంత్రంబును నేమియు బ్రయోజనమైనవి కావని మాంత్రికురాలిందిట్టుచుఁ జంద్రలేఖ యొకవేళ మందు తల కెక్కిన వెనుక ననురాగముఁ జెంది తన్ను వెదకికొనుచు మరల వచ్చునేమో యని యాశతో నలుమూలలు బరికింపుచు నే మాత్రము చప్పుడైనను దానిపాదధ్వనితలంచి యిటురమ్ము ఇచ్చట నున్నాఁడనని మెల్లగా బలుకుచు నీరీతి నతి ప్రయత్నముతో నా రాత్రివేగించెను. ఉదయంబున దన్నుఁజూడవచ్చిన మంథరగాంచి యేమే ! బోఁటీ ! నేను వచ్చినతరువాత జరిగిన యంతఃపురవిశేషము లేమి ? నన్ను గురుతుపట్టలేదుగద. మాంత్రికురాలు నన్ను మాయజేసినట్లు తలంచెదనుసుమీ ! అది నా ప్రస్తావనయేదైనను నీయొద్ద తెచ్చినదా ? నామందు తల కెక్కమినట్లున్నది. కాని యీపాటికి దాని హృద యములోఁ గొంచెము కొంచెమనురాగ మంకురింపుచుండు ననుకొందును. నీవేమని యెదవని బలుఁకగా నది నవ్వుచు నిట్లనియె.

మేలుమేలు, నిన్ను మాంత్రికురాలు చక్కఁగామాయఁజేసినది. దానికినీయం దెంతమాత్రము నిష్టములేదు నీవూర కాశపడియెదవేటికి ? తిలోత్తమతోఁ నీవార్త యేమియు మొదటఁజెప్పక మఱియొక రీతి బొంకినది. అప్పుడునేనది నీమంచు పని చేసినదనుకొంటిని గాని తరువాత నుదయమున నన్నుఁజూచి కోపంబుతో నిట్లనియె. మంథరా ! బలసింహుఁడుచేసినకృత్యము నేను గ్రహించితిని. రాజబంధువుఁడను బుద్ధితో నీసారికూరకుంటిని. దీనికి నీవు కారకురాలవు. ఇంకొకమాఱు మీరిట్లు చేసితిరేని రాజుగారితోఁ జెప్పకమానను. నీబలసింహుని బుద్ధిగలిగి యుండుమని చెప్పుము. మొదటఁజెప్పిన సంగతి మరచితివా ? అంతఃపుర చారిణివగు నీకిట్టిబుద్ధులు తగవు పొమ్ము. అని నన్ను భయపెట్టినది. కావున నీవు చంద్రలేఖపైఁగల యాశవదలి వేయుము. లేదా మరియొక యుపాయ మాలోచించుకొనుము. తిలోత్తమయుఁ జంద్ర లేఖయు రెండుమూడుదినముల కీయూరి ప్రాంతములోనున్న యుద్యానవనంబు లోనికిఁ బోయి యందుఁ గొన్నిదినంబులు గ్రీడింతురట. ఈమాటయు వారివలననే వింటి.

సమియే యంతఃపుర విశేషంబులు. అని చెప్పియడఁగినది. అప్పుడతఁడు హృదయమున రోషమావేశింప నౌరౌరా ! రాజపుత్రికతో మైత్రిఁబట్టికదా భోగముతొత్తునకింత మత్తత గలిగినది. కానిమ్ము. దీనిపని పట్టించెదను. ఉద్యానవనమునకుఁ బోవనీయనని తలచి యప్పుడే యాపట్టణంబున గజదొంగలని పేరుపొందిన మర్కట మారీచులను వారియింటికిఁ బోయి యంతకుఁబూర్వమే వారితో మైత్రి గలిగియున్నవాఁడు కావున వారిని కుశల ప్రశ్నవేసెను. వాండ్రును బలసింహుని మిగుల మర్యాదఁజేసి కూర్చున్న వెనుక నాగమనకారణ మడిగిరి.

బలసింహుఁడు తనకథయంతయుం జెప్పి యాచంద్రలేఖ యుద్యానవనములో నిద్రించుచుండ మంచముతోఁగూడ నా ప్రచ్ఛన్న గృహంబునకుఁ దీసికొని రావలయును. మీకుఁదగిన పారితోషికమిచ్చెదను. మీమేలెప్పటికిని మరువనని ప్రార్థింపఁగా మర్కటమారీచులందులకు సమ్మతించి యప్పుడే యతనిచేఁ బారితోషికమంది సమయ మరయుచుండిరి. అంత మఱి రెండుదినములకుఁ దిలోత్తమయుఁ జంద్రలేఖయు నుచితసఖీపరివారముసేవింప బాహ్యోద్యానవనంబునఁ గ్రీడింప నరిగిరి. అయ్యుపవనంబునకుఁ జుట్టును బ్రహరియున్నది. లోపల ననేక విచిత్రములైన మేడలున్నవి. అందు వారు నిరాఘాటంబుగా విహారంబుచేయుచుఁ గొన్ని దినంబులుండిరి.

వారిగుట్టంతయు మంధరచేతఁ దెలిసికొని బలసింహుఁడు మర్కటమారీచులకుఁ దెలుపగా వాండ్రును నొక్కనాఁడు రాత్రి తమ సహచరులఁగొందర వెంటబెట్టుకొని యత్తోఁటగోడకు మారుమూలఁ గన్నంబువైచి లోనికిఁబోయి తిలోత్తమయుఁ జంద్రలేఖయుఁ బరుండియున్న మేడ వెదకిపట్టుకొని దాని యుపరిభాగంబున నిద్రించుచున్న వారిద్దరింగనుంగొని గురుతుపట్టజాలక సంశయించుచు దమకుఁ దోచిన యూహచొప్పున దిలోత్తమనే చంద్రలేఖ యనుకొని యామె మంచంబును భుజముల నానుకొని మెల్లగా నాగోడలన్నియుందాటి కన్నము వెంబడిబడి నీవలకువచ్చి గూఢంబుగా బలసింహుఁడు నివసించియున్న రహస్యగృహంబునకుఁ దీసికొనిపోయిరి.

అహా! వారిచోరచాతుర్యమెట్టిదో చూడుము. ఎంతిదూరము నడిచినను నప్పడతికి నిద్రాభంగమైనదికాదు. బలసింహుఁడు వాండ్రతో మొదట తిలోత్తమా చంద్రలేఖల గురుతులు చెప్పుట మరచిపోయెను. కావున నావిషయమై యనుమానముజెంది వాండ్రు మంచమును తీసికొని వచ్చినతోడనే దీపముపెట్టిచూచి పరీక్షించెను. ఆ తరుణి తిలోత్తమయని తెలిసికొనినంత బలసింహునకు మేను వణకజొచ్చినది. కంఠము గద్గదికమైనది. చెమ్మటలు మేనెల్ల గ్రమ్మినవి అప్పుడు వాండ్రతో సన్నని యెలుంగున మోరీ ! కొంపముంచితిరే ! ఇది నామేనగోడలు, తిలోత్తమ. దీనికి మెలకువ వచ్చెనేని నన్ను గురుతుపట్టును. వేగిరము తీసికొనిపోయి యథాస్థానమందుంచుఁడు. లేకున్న ముప్పువచ్చునని పలుకుచు హస్త సంజ్ఞా పూర్వకముగా వాండ్రను తొందరపెట్టెను.

అప్పుడాచోరులు భయపడుచు బలసింహునిపై విసిగికొనుచు మరల నా

మంచమును భుజంబుల నానుకొని మెల్లగా వీథింబడిపోవం దొడంగిరి. అవీథియందొక పెండ్లివారుమేళతాళంబులతో నూరేగుచుండగా నయ్యలజడిలోఁ దిలోత్తమ లేచునేమో యను భయముచే మఱియొక వీథింబడి నడువసాగిరి. అందును రాజభటుల సమ్మర్దము గలుగుట నింకొకవీథినిఁ బోవఁదొడంగిరి. అచ్చటను ప్రజలు లేచితిరుగుచుండుటచే మరియొకమారు మూలవీథినరిగిరి. ఈరీతి క్రమక్రమంబుగా నొకదెసనుండి వేరొక దెసకుబోయిరి. వారికి నుద్యానవనంబునకుఁ బోవుట కెంతమాత్రము నవకాశము గలిగినదికాదు. అప్పుడు భాండుఁడు ఇక మనము తోటలోనికిఁ బోలేము. తెల్లవారు సమయమైనది. రాజభటులు మనలను జూచిరేని బట్టుకొందురు. జయసింహునివలన భయంబు మనకేటికి, దీనిమేలైన మంచివిలువఁగల రత్నపు సొమ్ములు గలిగియున్నవి కావున దీనిం దీసికొని యడవిదారింబడి పోవుదము అని యిరువురు నిశ్చయించుకొని యా మంచంబుతో నొక మహారణ్యమార్గంబునంబడిపోయిరి.

అచ్చట నుద్యానవనంబులో నుదయంబునఁ జంద్రలేఖ లేచి తిలోత్తమను గానక పరితపించుచుఁ జెలికత్తియల నందఱం బిలిచి యా తోటయంతయు వెదకుచుండెను. ఇంతలోఁ గావలివారలు తోట గోడకు దొంగలు కన్నంబువైచిరని అఱచిరి. ఆమాటలు విని చంద్రలేఖ యురస్తాడనపూర్వకముగా దుఃఖింప దొడంగినది. ఇంతలో నా వృత్తాంతము విని భార్యా మంత్రిబంధుపరివారసహితంబుగా మహీపతి అచ్చటికివచ్చి పుత్రికారహితమగు నయ్యుద్యానవనంబుగాంచి మిక్కిలి దుఃఖింపఁ దొడంగెను. పృథుకీర్తియును నతని మంత్రియుఁ దిలోత్తమ నరయుటకై వడిగల వారువంబులిచ్చి నలుమూలలకు రాజభటుల నంపెను. అట్టిసమయంబున జయసింహుఁడు చనుదెంచి చంద్రలేఖను సాధించుటకిదియే సమయమని తలంచి మోహో! మీరువెఱవకుఁడు వెఱవకుఁడు. దీనిగుట్టంతయు నేను గ్రహించితిని. అని పలుకగా నచ్చటివారెల్ల విచారించుటమాని యతని మొగంబున జూడ్కులు బరగించిరి.

అప్పుడు పుడమిఱేఁడు జ్యాలకుని జూచి యోయీ! నీవేమెఱుంగుదువో చెప్పుమని అడుగగా నతండిట్లనియె. దేవా! నేనేమని వక్కాణింతును. ఇట్టిపని చేసిన దొంగ యిచ్చటనేయున్నది. ఎచటనుండియును జోరులు రాలేదు. ఈకపటము మనము గ్రహింపలేకపోతిమి. లంజ పనుపుతో మన తిలోత్తమ సహవాసము సేయుచుండ నుపేక్షించి యూరకొనిన తప్పెవ్వరిది. ఆ లంజను నుంచుకొనినవాఁడు మన తిలోత్తమ విద్యారూపసంపత్తులువిని దానిం దీసికొని వత్తువేని నీకు మిక్కిలి రొక్కమిత్తునని చెప్పుటచే నీవేషము వేసికొని క్రమముగా దానితో మైత్రిఁ జేసి యుద్యానవన విహారపు మిషచే యిల్లు గదలఁ జేసి తుదకు నానినంపి వేసినది. ఇదంతయు నిక్కువంబు. ఈ సంగతి యొండు రెండుసారులు నా చెవింబడినది గాని మహారాజుగారే యుపేక్షింప నాకేమిటికని ప్రకటించితినికాను. ఇంతయేల యిందలి యదార్థమంతయు మనయింట

నున్న మంథర నడుగఁడు. చెప్పఁగల దనుటయు నృపతి యాదాదిని రప్పించి యడిగిన మ్రొక్కుచు నది యిట్లనియె.

దేవా! యీ చంద్రలేఖ వచ్చినది మొదలు కపటాలోచన చేయుచున్నది. మన తిలోత్తమ నెచ్చటికో తీసికొని పోవలయునని దలఁచుచున్నది. ఆ స్థలమెద్దియో తెలిసినదికాదు నిత్యంబును దాని కెచ్చట నుండియో యుత్తరంబులు వచ్చుచుండునవి. కాని దాని పరిచారిక పూఁబోణి పుచ్చుకొని చంద్రలేఖ కిచ్చిన వానికది ప్రత్యుత్తరములు వ్రాయుచుండును. ఈరీతి జరుగుట నేను గ్రహించి మొన్ననొక నాఁడా యుత్తరంబులు తెచ్చెడు సమయమున నచ్చటనే కాచి యుంటిని. ఇంతలో నా దూతలు పూర్వమువలెనే యెద్దియో యుత్తరము తెచ్చిరి. అదిచూచి నేను వారితో నయ్యా! నేడు పూఁబోణి పనిమీద వెళ్ళినది మీయుత్తరమును నన్నుఁ దీసికొనిరమ్మని చంద్రలేఖ పంపినది. కావున మీరు తెచ్చిన యుత్తరంబు నా చేతికిండని యడిగితిని. వాండ్రు నా మాటలు సత్యమేయనుకొని యాయుత్తరంబు నాకిచ్చి మేమిచ్చటనే యుందుము ప్రత్యుత్తరంబు వడిగాఁదీసికొని రమ్మని చెప్పిరి.

పిమ్మట నేనాయుత్తరము విప్పి చదువఁగా నిట్లున్నది. చంద్రలేఖా! నీవు బోయి పెక్కుదినంబులైనది. తిలోత్తమ నెప్పుడు తీసికొని వత్తువో తెలియదు. నేను నీ విరహముచేతఁ గృశించుచు గడియ యుగముగాఁ గడుపుచుంటిని. ఎట్లయినను కార్యము సఫలము చేసికొనిరమ్ము. నీ రాకకు నిరీక్షించుచున్న వాఁడను. ప్రత్యుత్తరమిమ్ము అని యింతవరకుఁ జదువునంతలో చంద్రలేఖ పరిచారిక పూఁబోణి పడిపడివచ్చి నాచేతిలోని యుత్తరము లాగికొనినది. కావునఁ దరువాత నేమియున్నదో చదువుటకు వీలు పడినది కాదు.

అప్పుడప్పూఁబోణియు నేనది చదివినందులకు మిగుల కోపము చేయుచు గానిమ్ము తిలోత్తమతోఁ జెప్పి నిన్ను దండింపఁ జేయుదునని పలికి పోయినది తరువాత నేనీ సంగతి నెవ్వరితోఁ జెప్పక యీ అయ్యగారితో మాత్రము జెప్పితిని. ఇదియే నే నెరిఁగిన సంగతి. ఇంతకన్నా నాకేమియుం దెలియదని అదరును బెదరును లేక చెప్పినది. దాని మాటలు విని అచ్చట నున్నవారెల్ల వెఱఁగు పడఁజొచ్చిరి. అప్పుడు మంత్రి తక్షణమే యా చంద్రలేఖం బిలిపించి మంథర చెప్పిన మాటలన్నియును మరల వినిపించి దీనికి నీవేమి చెప్పెదవని అడిగెను.

ఆ మాటలువిని చంద్రలేఖ ప్రమాన్పడి యొక్కింతసేపు కన్నులు మూసికొని యూరకుండి హా? విధీ! నన్నెట్టి యాపత్సముద్రంబులో ముంచితివి. ఇప్పుడు నేనేమి చెప్పినను వీరికి నమ్మకముఁ బోచునా! ఈమంథర నాపయింగల కోపముఁ దీర నెంతకల్పనం జేసినది. నాప్రారబ్ధమిట్లుండ దానిదూరఁబ యేమిటికి. కానిమ్ము. వీరితో

నిప్పుడిది సత్యము అది అసత్యము అని వాదించి చెప్పుట నాకేమి అవసరంబున్నది. అట్టి యాపులతో నియోగము గలిగినది గదా ? నేను బ్రతికియున్నను లాభ మేమి అని పెక్కు తెఱంగులం దలంచుచు నెట్టకేలకా మంత్రితో నిట్లనియె.

అయ్యా ! నే నట్టిపని చేయుదునని మీకు నమ్మకము తోచినచో నన్ను సత్వరంబుగా శిక్షింపుఁడు. అని పలికి కన్నులు మూసికొని తలవాల్చి యూర కున్నది. అప్పుడు మంత్రి చెలువా ! నీ వీరీతిఁ బలికిన మేమేమి చేయుదుము నీవు నేరంబు చేయనట్టు నిదర్శనంబులున్న వక్కాణింపుము లేకున్న శిక్షకుఁ బాత్రురాలవే అగుదువు నిజము చెప్పుము. అని అడుగ నేనట్టి పనిచేయుదునని మీకునమ్మకము తోఁచినయెడల నన్ను సత్వరముగా శిక్షింపుఁడు అని పలికినది. వారెన్నిసారు లడిగి నను వేఱొకమాటలేదు.

అప్పుడు బలసింహుఁడు కోపించుచు నీకీ అనుమానమేల గలుగవల యును ? కన్నములో దొరికిన దొంగయేమని బొంకునో చెప్పుము. అది చెప్పిన మాటలలో నొప్పుకొనునట్లు సూచన కాలేదా ? తప్పక దీనిదండింపవలయునని చెప్పెను. బుద్ధిమంతుఁడగు మంత్రి బలసింహా ! తొందరపడకుము. ఈమగువ మొగంబుచూడ నేరముచేసినట్లు కనంబడదు. ఇది యిట్లు చెప్పుటకు వేరెద్దియో కారణముండ వచ్చును. ఈ మంథర చెప్పిన మాటలు నాకంత విశ్వసనీయంబులుగాఁ దోచలేదు. ఇత్తరుణి తిలోత్తమకన్న విద్యా రూపంబులచే నధికురాలైయున్నది. ఇప్పుడతి యొకంబడు నేని మహారాజులైనను శుద్ధాంతకాంతగా స్వీకరింతురు. ఇట్టి తరుణి యొకరికి దూతికా కృత్యంబు జరుపుట కేమి యవసరము కలిగెనిని తిలోత్తమయందు దీనికి సహజాను రాగముగలిగియున్నదని నేనుఁ జెప్పగలను. తద్వియోగ శోకంబుచేతనే యిట్లనుచున్న యది. కావున నీపూఁబోణి దండ్యురాలు కాదని చెప్పెను. బలసింహుఁడును రాజు నెదుట దాని దండింపక తీరదని వాదించెను

మంత్రికిని బలసింహునకును దానిగురించి పెద్దతడవు పోట్లాట జరిగినది. రాజు మంత్రిమాట మన్నింపక బావమరది పక్షమే అవలంబించి యతండు నుడివిన శిక్ష చంద్రలేఖ కప్పుడే విధించెను. రాజశాసన మెవ్వరు గాదనఁగలరు. చంద్రలేఖను బండి యెక్కించి యూరేగించి బలసింహుఁడు వెంటరా రాజభటులు చటులముగాఁ బలుకుచు నక్కుటిలాలకను సముద్రప్రాంతమందున్న మహారణ్యములో విడిచివచ్చిరి. అహా ! విధిగతి

మ. ధరణీపాలుఁడొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుఁడై
త్వరతోడం బయవెత్తి చేరి నిలిచెం దాళద్రుమచ్ఛాయఁ ద
చ్చిరమున్ తత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ
బొం దైవోపహతుండు పోవుకడకుం బోవుంగదా యాపదల్.

బట్టతలవాఁడు ఎండబాధకు భయపడి తాటి చెట్టునీడకురాగా తాటిపండు నెత్తిమీఁదఁబడి తల్లబ్రద్దలై చచ్చెను. పాపము చంద్రలేఖ వల్లభసదయుతలంపుతో రామ చంద్రనగరముచేరగా నట్టియాపద సంభవించెను. దైవబలము లేనివాఁడెచ్చటికి బోయి నను ఆపదలునుఁ గూడనే వచ్చుచుండును. బలసింహుఁడు రహస్యముగా నసవిశిఁ బోయి రాజభటులు పురికరిగిన వెనుక తాను మెల్లన నప్పల్లవపాణియున్న తావునకుఁ బోయెను. అమ్ముదిత యేమియు నెఱుంగక నేలఁబడి యుండుటచే బలసింహుని రాకయే యెఱుఁగదు.

పిమ్మట నతండనురాగముతో నా కొమ్మ చేతికట్టులన్నియు విప్పి తదంగ స్పర్శవలన సంతోషము జెందుచు తెరవా! కన్నులు తెరువుము. నేనిట్లు చేయించితినని నామీఁదఁ గోపమాయేమి? ఈ అపరాధమునకుఁగాను నిన్ను దగిన సౌఖ్యంబునుఁ బొందింతునులే అని అనేక ప్రకారముల వన్నె చిన్నెలతోఁ బల్కరించెను. కాని అది యేమియు నెఱుఁగదు. పిమ్మట దానిలేవనెత్త వలయునను తలంపుతో లేచి కొంచెము వంగి చేతులు సాచునంతలో నాప్రాంతమున మృగముల వేటాడుటకై క్రుమ్మరుచున్న యొక కిరాతుఁ డతనిఁ జూచి యెద్దియో మృగమనుకొని వాఁడిగల యూచతో నేసెను. ఆ శరఘాతంబున నతండు హా! చంద్రలేఖా అని అరచుచు నేలఁగూలి తన్ను కొనుచుఁ గొంతసేపటికి ప్రాణములు విడిచెను. అబ్బోయవాఁడును తన బాణంబునం గూలినవాఁడు మనుష్యుఁడని తెలిసినతోడనే భయపడుచు నాప్రాంతమందు నిలువక యెక్కడికేని పారిపోయెను.

ఉ. రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాసచెడి పెద్దయుఁదస్సిన పాముపైఁత సం
పాతముఁజెందె దానిఁదిని పాము తొలంగెబిలంబు త్రోవనే
యేతఱిహానివృద్ధులకు నెక్కుడిదైవమె కారణంబగున్.

ఆకలిచేత దస్సి చచ్చుటకు సిద్ధముగానున్న యొక పాము రాత్రియందు యెలుక యొకటి తామున్న పెట్టెకుఁ గన్నముగొట్టి లోపలకురాఁగా దానిందిని యాకలి యడంచుకొని యావివరంబునుండి పెట్టె వెడలి పారిపోయెను. ఆరీతినే శుభాశుభంబులు యింటిలోనున్నను దైవమే తెచ్చి యిచ్చునుగదా! ఆ యలజడిలో జంద్రలేఖ తెరపి తెచ్చికొని లేచి యెదురనున్న బలసింహునిఁగాంచి యమ్మనోకి యతండు గతాసుఁ డగుటయుం దెలిసికొని యాశ్చర్యమందుచు నౌరా యీ దుర్మార్గుఁడు నన్ను గురించి యిట్టి యేర్పాటుఁగావించెను. వీనిం దైవము తెగటార్చెను. నాచేతికట్లు విప్పినది వీఁడే కావచ్చును. పాప మాహార వస్తువులు గూడ నామిత్రము తీసికొనివచ్చెనే! కానిమ్ము. భగవంతుఁడి నాయందు దయఁబుట్టినది కాబోలు. ఇప్పుడు నాహృదయంబున దుఃఖ మిశ్రితమైన సంతోషంబు కలుగుచున్నది. ఇట్టి సమయమందు ధైర్యమును విడువరాదు.

కర్మసూత్రంబునం బట్టిపోయెదను అని పెక్కు తెరంగులం దలపోయుచుఁ వాడు తెచ్చియుంచిన యాహార పదార్థంబులు భుజించి యాకలిఁ దీర్చుకొని మెల్లగా నచ్చటఁ గనంబడిన త్రోవంబడి నడువసాగినది.

అదారింబడి పోవంబోవ సముద్రతీరంబునకుఁ బోయినది. చంద్రలేఖకు మొదట సముద్రమొక రాతిపలకలాగునఁ గనఁబడినది శ్రీరామచంద్రుఁడంత వానిని సముద్రమునుఁ జూచినంత భయమైనది ఇఁక చంద్రలేఖ మాట చెప్పనేటికి ? చంద్రలేఖ సముద్రంబు పేరు వినుటయే కాని యెన్నఁడును చూచియెఱుఁగదు. దానిం జూచినంత హృదయము భేదిల్లినది.

అట్టి సమయంబునఁ గర్తవ్య మెద్దియో తెలియక పర్వతంబు లాగునఁ బొంగివచ్చెడు తరంగంబులంగాంచి అవి మీఁదఁబడునను వెఱపున వెనుకకుఁ బరుగిడుచు నేమూలకుఁబోవుటకు తెరవుగానక పరిపరిగతులం దలపోయుచుఁ దన చరిత్రను స్మరించుకొని వెతఁజెందుచు నా సముద్రముపై దృష్టినిడి యావిశేషము లరయుచుండెను. ఇంతలో గాలి క్రమక్రమముగా బలిసి యెక్కుడుగా వీవఁదొడంగుటయు నా ప్రతికూల వాతపాతంబున నాసాగరంబులోఁ బోవునోడ యొకటి యా చంద్రలేఖ యున్నయొద్దునకుఁ గొట్టుకొని వచ్చెను. అందున్న జనులందరు నాగాలి తాకుననోడ మునుఁగక దరిఁజేరినందులకు మిగుల సంతసించిరి.

అప్పుడు కర్ణధారుఁడు జనులంజూచి రాత్రి యీ తీరమున నుండవలయును. తూరుపుగాలి తిరిగినతోడనే యోడ నడిపింతును కావున మీరందరును దిగి యిచ్చట వంటలు చేసికొని భుజింపుఁడని పెద్ద యెలుంగునం జెప్పెను. అప్పుడందున్న వారందరు వానిమాటలు విని తమ తమ సామగ్రులతో తీరంబునకు దిగిరి సాధారణంబుగ సముద్ర తీరంబున మంచినీరు పడును గనుక నచ్చట చిన్న చిన్న చలములు తీసి యా యుదకంబుచే వంటలు చేసికొని నాఁటిరాత్రి ప్రతికూలవాతమును నుతియింపుచు యథేచ్ఛముగా భుజించిరి. సముద్ర తీరభూమి అంతయు జనాకీర్ణమగుట నా జనసంఘములోఁ జంద్రలేఖను జూచినవారెల్ల తమతో వచ్చిన బాటసారిఁగా నెంచిరి. చంద్రలేఖయు నట్టినిర్జనభూమియందు జనసహాయంబునుఁ గూర్చిన భగవంతుని వేతెరంగులఁగొనియాడుచు నారాత్రి సుఖముగా గడిపి యుదయంబున నచ్చట సారులతోఁగూడ దానును నోడనెక్కెను. ఓడసరదారుఁడు అది రేవు స్థలముకాదు కావున నప్పుడెక్కిన వారినంతగాఁ బరీక్షింపఁడయ్యెను

అప్పుడు మంచిగాలి విసరుచున్నందున తెరచాపలెత్తించి యోడవిడుచుటయు రెండుదినములు నడువవలసిన పయన మొకనాఁటికే నడచినది. కావున నమ్మరునాఁటి యుదయమునఁ ద్రిగర్త దేశరాజధానియైన యలకాపురము రేవుఁజేరెను. అప్పుడు కర్ణధారుని అనుమతినందున్న జనులందరు నోడదిగిరి. చంద్రలేఖయుఁ దిగఁబోయినది కాని తాను సొమ్మిచ్చినందులకు గురుతుగల పత్రిక తనయొద్ద లేమింజేసి నావి

కుఁడు చంద్రలేఖను దిగకుండ నాటంకము జేసెను. అప్పుడాకలికి నీకీయవలసిన సొమ్మెంత అని అడిగినదానికి నీవెచ్చట నెక్కితివో చెప్పుమని అడుగుటయుఁ దనకు రేవుస్థలముల పేరేమియుఁ దెలియమింజేసి యోడ గాలిచే యొడ్డునకు విసరఁబడిన చోట నెక్కితినని చెప్పినది. అప్పుడది చెప్పిన మాటలకతండు వెఱఁగందుచు నోహో! అది రేవుస్థలము కాదే అట్టి అరణ్యంబులో నొంటిగా నీవెట్లు వచ్చితివి? నిన్ను జూడ ననుమానముగా యున్నది. తరువాత విమర్శింతుము. ఇప్పుడు తొందరగా యున్నదని పలుకుచు నానెలఁత నొకయరలో నుంచునట్లు తన పనివాండ్రకు నియమించెను.

మార్గస్థులందరు నోడఁదిగి యరిగిన తరువాత సరదారుడు చంద్రలేఖ దగ్గిరకు వచ్చి మచ్చెకంటీ! నీవెచ్చటిదానవు! నీపేరేమి? యా రేవునకెట్లు వచ్చితివి? యెందుబోవుచున్నదానవు! నీ కేమియుభయము లేదు. నిజము జెప్పుమని శృంగారహాస విలోకనంబులంజూచి యడుగుచున్న వాని అభిప్రాయము గ్రహించి యయ్యంచబోఁడి యిట్లనియె. అన్నా? నా నివాసస్థలము రామచంద్రనగరము. నేను మా బంధువులతోఁగూడి యిందున్న మాపినతల్లిఁ జూచుటకయి వచ్చుచు దారితప్పి బంధువులతో విడి అచ్చటికిఁ జేరితిని. ఇంతలో మీయోడ అచ్చటికి వచ్చినది. అదియు నా పుణ్యమే అనుకొని అందెక్కితిని. దీనికిఁ బారితోషికముగా నీమణి భూషంబులిచ్చికొని నన్నుఁదీరమున దింపుము. నీకుఁ గడుపుణ్యము గలదని దీన ముఖముతోఁ బ్రార్థించిన విని వాఁడు స్మరశరపీడితహృదయుండై యిట్లనియె మదవతీ! నిన్నుఁ జూచినది మొదలు మదనుఁడు నన్ను వేపుచున్నవాఁడు. ఒక్కసారి నీ చక్కని చెక్కులు ముద్దుఁగొని యధరరసంబు చవిచూచెద. నన జ యిమ్ము. నీవు దాని కేమియునియ్యనక్కరలేదు ఈ మాత్రంబునకే సంతసించెద నేమనియెదవని అడిగిన నమ్మగువ ముక్కుమీఁద వ్రేలువైచుకొన అయ్యో! యిదియేమి ద్రోహము సంసారిని యిట్లనవచ్చునా నావంటి వారలు నీకు లేరా? అట్టిపని కెన్నడును నేనుద్యోగించు దానను కాను. నాయందుగల మణులు మరలిచుకొనుము. నన్ను వేగిరము తీరమునఁ జేర్పుమని పలుకఁగా నతండు మరియేమియుం జేయను. ఒకసారి ముద్దు బెట్టుము. ఊరక చెవిపోక నా మాట వినుము అని పెక్కుగతుల వేడికొనిన నాచేడియ సమ్మతించినది కాదు.

అట్లు వారిరువురు వాదించుకొనుచున్న సమయమందుఁ గ్రొత్తగా వచ్చిన యోడలఁబరీక్షించెడు రాజభటు లా యోడమీఁదికి వచ్చి యోడ సరదారు డెక్కడని కేకలువైచిరి ఆ కేకలు విని వాఁడు మిగుల భయపడుచు లేవఁబోవు సమయమునకు వారే అచ్చటికి వచ్చిరి. వారిం జూచి చంద్రలేఖ వందనములు సేయుచు అయ్యా! వీడు నన్నేమి చేయుచున్నాఁడో చూచితిరా? నేనొక బాటసారిని. మా వాండ్రందరు దిగిపోయిరి. నన్ను దిగనీయక నిర్బంధించుచున్నవాఁడు. నా పుణ్యము వలన మీ

రివ్వటకు వచ్చితిరి. నన్ను రక్షించి దరిఁజేర్పుఁడని ప్రార్థించినది. అప్పుడు రాజకింక రులు దాని దీనాలాపములు విని జాలిపడి అభయమిచ్చి యా చిన్నది చెప్పిన మాట లను గురించి యోచసరదారునడిగిరి.

వాఁడును బెదరుగదుర అయ్యా! యా చిన్నది మాకు నోడకూలి యియ్య వలసి యున్నది. ఇమ్మని యడుగుచుంటిమి కాని మరియొకటి కాదు. మా కియ్య కుండఁబోవలయునను తాత్పర్యముతో నట్లనుచున్నది. నేనేమియు నెఱుఁగనని చెప్పెను. ఆ భటులు వాని పోలిక గనిపెట్టి యట్టి పనికుద్యోగించినట్లు గ్రహించిరి. కావున వానిని వదలించి చంద్రలేఖను నెమ్మదిగా దీరమున దింపించిరి.

# వీరగుప్తుని కథ

అప్పుడు చంద్రలేఖ స్త్రీజాతిని నిందించుచుఁ గటగటా! యిట్టి కష్టపుజన్న మెత్తితి నేటికి? నా రూపమే నా కింత ముప్పు తెచ్చుచున్నది ఎచ్చటికిఁ బోయిననుఁ జిక్కులే వచ్చుచున్నవి. ఇఁక నీ రూపము మార్చి పురుషవేషము వేసికొనిన సుఖ ముగా నుండవచ్చును. అన్నన్నా! పురుషజన్న మెంత యుత్తమమయినదో గదా? యని తలంచుచు నప్పుడే యంగడికి బోయి తనవద్ద నున్న మణిభూషణ మొకటి యమ్మి దానివలన వచ్చిన సొమ్ము పెట్టి మంచి దుస్తులుకొని యారాత్రి యొక చోటునఁ బురుషవేషము ధరించెను. పురుషవేషము వేసినప్పుడునుఁ జంద్రలేఖ మిక్కిలి చక్కగా నుండెను మరియుం దగినకైదువు దానికిం దగిన దుస్తులును సంపాదించి వీరపురుషవేషముతో నా రాజధానిలో వీరగుప్తుఁడని పేరు పెట్టుకొని తిరుగుచుండెను. ఆ పట్టణమును ధర్మాంగదుఁడను రాజు పాలించుచుండెను. దైవవశం బున నాధాత్రీపతి మంత్రి కాలధర్మము నొందెను. ఆయుద్యోగంబు తమకిమ్మని యనే కులు వచ్చిరి. కాని రాజుచేసిన పరీక్షలకు నొకఁడైనను సదుత్తరంబు చెప్పలేకపోయెను. దానంజేసిన రాజా యుద్యోగం బెవ్వరికి నియ్యలేదు మరియు నే నడిగినతోడనే నా వచనంబులకు నా చిత్తవృత్తి ప్రకారంబు త్తరం బెవ్వఁడిచ్చునో వానిని మంత్రిగా స్వీక రింతునని తన సింహద్వారంబుపైఁ బ్రకటన పత్రికఁ గూడఁగట్టి యుంచెను. ఎవ్వండు వాని మాటలకు సదుత్తరంబు చెప్పలేదు. ఇట్లుండ నా వీరగుప్తుండొకనాఁడు విలాసార్థ మా పురమంతయుఁ గ్రుమ్మరుచుఁ గోటగుమ్మము దాపునకుఁ బోయి యందున్న ప్రకటన పత్రికఁజదివి సంతసించుచుఁ దనపేరు వ్రాసి నేను మీ మాటలకు దగిన యుత్తరం బిచ్చెదనని పత్రిక వ్రాసి యా రాజుగారి యొద్దకుఁ బంపెను. ఆ సర పతి చదువుకొని యంతకు మున్నట్టి వారలనేకులు వచ్చిపోయిరి కావున విసిగికొనుచు

సర్వాంగీకారముగాఁ దీసికొని రమ్మని భటుల కానతిచ్చెను. రాజకింకరు లతని యానతి చొప్పున వీరగుప్తుని రాజునొద్దకుఁ దీసికొనిపోయిరి.

రాజు వీరగుప్తుని ముఖవిలాసము నేత్రసౌష్టవంబు మొదలగు లక్షణంబులు పరికించి యోహో! ఈతఁడు మంత్రియధికారంబు కాదు. రాజ్యాధికారంబునకు సైతము తగియున్నవాఁడు వీనినొక్క ప్రశ్నయే యడిగెదను దానికుత్తరం బిచ్చెనేని తప్పక మంత్రిగాఁ జేసికొనియెదనని తలంచుకొని యతని మిగుల మన్నించి కూర్చున్న వెనుక, అయ్యా! పండ్రెండింటిలో నాలుగు తీసివేసిన నెంతయని యడిగెను. వీరగుప్తుఁడు ఆలోచింపకయే సున్నయని యుత్తరము చెప్పెను. ఆ మాటలు విని సభ్యులెల్లరు పెదవులు విరుచుచు అయ్యో! లెక్కయే రానివానికి మారాజు మంత్రిత్వ మెట్లిచ్చును. మనమేదియో నడుగునని కొంటిమి. ఈమాత్రపు ప్రశ్న మమలనుఁ జేసినచో మంత్రిత్వంబు మనకే వచ్చునే! రాజులు వెఱ్ఱివాండ్రు వారేమన్న నది గొప్పప్రశ్న యగును. పాపమీ చిన్నవాఁడు దానికే యుత్తరము చెప్పక సున్నయనెను. యెనిమిదని చెప్పినచో మంత్రిత్వంబు వచ్చును గదాయని యనేక ప్రకారంబులు జెప్పుకొనఁ దొడంగిరి.

అప్పుడు ధర్మాంగదుఁడు వీరగుప్తుని గౌరవించుచు అన్నా! నేఁటికి నాకు దగిన మంత్రివి దొరకితివి. నీ వంటి బుద్ధిమంతు డింతకుమున్న నాయొద్దకు రాలేదు. నే డెంత సుదినమో కదా ఇదిగో? ఇప్పుడే మంత్రిత్వముద్రి నిచ్చువాఁడ. నీవే నా మంత్రివని మువ్వూరు పలికి యామంత్రదీక్షలం జెప్పించి అతని కిచ్చెను. ఆ యర్థము వారు వూరకే గాక అచ్చటనున్న వారెవ్వరు గ్రహింపలేక రాజును పట్టి మూర్ఖుడని నిందింప దొడంగిరి. మఱికొందరు సాహసముతో రాజుగారిం జూచి అయ్యా! తామింతకుమున్న పెక్కండ్రకు చిక్కుప్రశ్నలిచ్చి వారెద్దిచెప్పినను సమ్మతింపక యూరకపొమ్మంటిరి. ఇప్పు డితనిని సుఖమయిన ప్రశ్న అడిగిరి. అతడు చెప్పకున్నను ప్రధానిగాఁ జేసికొంటిరి. పండ్రెండింటిలో నాలుగుపోయిన సున్నయెట్లగును యెనిమిదికాదా? ఈ సందియము మమ్మందర బాధించుచున్నది. కారణమెద్దియో చెప్పుడనుటయు ధర్మాంగ దుడు నవ్వుచు వారికిట్లనియె.

ఓ మందలార? నే నిందులకే యెవ్వరిని జెప్పుకొంటిని కాను వినుఁడు. పండ్రెండింటిలో నాలుగుపోయిన నెనిమిదని యెల్లరకు దెలిసినదే. నాఅభిప్రాయము మాత్రమది కాదు. పండ్రెండనగా మాసములు పండ్రెండు మాసములలో నాలుగనగా వర్షకాలము నాలుగు మాసములు కనుక నాలుగుమాసములు తీసివేసినయెడల అనగా వర్షింపని యెడలనని అర్థము. వర్షములు కురియనియెడల పంటలు పండవు గదా పండ్రెండుమాసములకు ముఖ్యమైనవి వర్షకాలము నాలుగుమాసములే. ఆ నాలుగుమాసములు పోయిన ననగా వర్షము కురియక యూరకున్న నా సంవత్సరము సున్న కాక మఱేమియున్నది. అందువలననే పండ్రెండింటిలో నాలుగుతీసివేసిన సున్నయని

చెప్పెను. ఇట్టిఅర్థముగల నా మాటకు వెంటనే యుత్తరము చెప్పిన యితండెంత బుద్ధిమంతుఁడో యోచింపుఁడు.

ఇంత సూక్ష్మబుద్ధికి మంత్రిత్వమిచ్చుట నా తప్పా! చెప్పుడని పలుకుటయు సభ్యులెల్లరు తెల్లఁబోయి యుల్లంబుల వారిరువుర బుద్ధికౌశల్యమును గురించి వేతెరంగులఁ మెచ్చుకొనఁదొడంగిరి. వీరగుప్తుఁడు మంత్రియై క్రమక్రమముగఁ దనవిద్యాప్రభావమంతయు ధర్మాంగదునికిఁ జూపుటయు నతండు మరియు సంతసించుచుఁ దన రాజ్యభారమంతయు వీరగుప్తునియందే యుంచి యతఁడు చెప్పునట్లుగాఁ దాను నడుచుచుండెను. వీరగుప్తుఁడు మంత్రియైనది మొదలు దేశములో సుభిక్షముగా ఫలవంతముగా పాడిపంటలు నభివృద్ధిగావించుటచేతను, ప్రజ లతనిని మిక్కిలిస్తోత్రములు చేయఁదొడంగిరి.

అని చెప్పువేళకు వేళ యతిక్రమించుటయు నప్పుడు చెప్పుట మాని యయ్యతిశిఖామణి యవ్వలికథ తదనంతరావసథంబున నిట్లని చెప్పం దొడంగెను.

# 16 వ మజిలీ

## భక్తురాలికథ

పట్టీ! వినుమట్టు చంద్రలేఖ వీరగుప్తాభిధానముతో ధర్మాంగదుని మంత్రిగా నుండి యొకనాఁడు నగరాలోకన కౌతుకంబున మీర నుచిత పరివారముతో బట్టణమంతయు గుమ్మరుచుండ నొకవీధిదండను వాసంతికకోకిల కాకిలీనాదమును మేలమాడు కంఠస్వరముతో బాడుచున్న యొకచిన్నదాని గానము విననయ్యె. ఆగ్గానము చెవియొగ్గి విని చిత్తమునీరైపోవ నెద్దియో నిరూపింపనలవికాని యుత్సాహ మొకటి మనంబునం జనింప నిలిచిపరిచారకుం బిలిచి యోరీ! యీప్రాంతమందెచ్చటనో సంగీతము పాడుచున్నట్లువినంబడుచున్నది. యరసిరమ్మని పంపిన వాఁడును బోయి సత్వరమువచ్చి అయ్యా! యీచేరువ దారకేశ్వరుని యాలయమున్నది యందొక భక్తురాలు పాడుచున్నదని చెప్పెను.

అప్పుడతండు మనమచ్చటికి బోవచ్చునా అని అడుగుటయు వాఁడు స్వామీ! సంశయమేల? దేవాలయమునకు బోవుట కెవ్వరి యానతి కావలయును? అదియును మనయధికారనకు లోబడినదే. సందియము వలదు, రండుపోదము, ఎద్దియేని తలంచుకొని యాస్వామికి మీదుగట్టినచో దప్పక యాకార్యము కాగలదు. ఈ తారకేశ్వరునికి మ్రొక్కులు చెల్లించుటకుం బెక్కు దేశములనుండి ప్రజలువత్తురు. మీరు చూడదగినదేయనిన సంతసించుచు మంత్రి యాయాలయము లోనికి బోయెను. అచ్చట





ముఖమండపములో తంత్రీనాదముతో కంఠస్వరము మేళగించి మనోహరముగా శివకీర్తనల బాడుచున్న యాభిక్షుకురాలిం జూచి దానిరూపమున కాశ్చర్యమందుచు మంత్రిపుంగవుం డంతరంగమ్మునన ద్దియే సంతోషంబు దీపింప గొంతసేపు రెప్పవాల్పక యామెంజూచెను.

మంత్రి లోనికిం బోయినంతనే యాభిక్షుకురాలును నచ్చట నున్నవారును తటాలున లేచి యవ్వలికిం బోయిరి. ఇంతలో లోపలనుండి గుడిధర్మకర్త వచ్చి వీరగుప్తుని సగౌరవముగాఁ దీసికొనిపోయి యాలయము చుట్టునుంగల వింతలును నచ్చటచ్చటఁగల విశేషంబులు చూపుచుఁ గ్రమంబున గర్భాలయములోనికిఁ దీసికొనిపోయి స్వామినిఁ జూపించి తదీయమహిమావిశేషముల వక్కాణింపుచు మరల ముఖమంటపము దాపునకుఁ దీసికొనివచ్చి యచ్చట తగిన యాస్తరణలు వేయించి యందుగూర్చుండం బెట్టెను. అప్పుడు వీరగుప్తుఁడు ధర్మకర్తఁ జూచి మనము వచ్చువరకు నిచ్చట పాడుచున్న చిన్నదియెవ్వతె అని అడిగెను. అదియొక భిక్షుకురాలు దాని కులశీలనామంబు లెవ్వరికినిఁ దెలియవు. కొన్నిదినములఁబట్టి యీ యాలయములోనున్న విజ్ఞానయోగి నాశ్రయించుకొని యున్నది నిత్యము సాయంతమీస్వామిపై కీర్తనలు పాడుచుండును. దానికి భోజనము స్వామి నైవేద్యములోనిదే యిచ్చునట్లేర్పరచితినని ధర్మకర్త చెప్పెను.

దీనికంఠస్వరము చక్కగానున్నదిసుమీ అని మంత్రి పలుకఁగా విని అతండు తమసెలవైనచోఁ దిరుగపాడింతును. దానికేమి కొదవ అది మనస్వామిదాసురాలే అని పలుకుచు భిక్షుకురాలియొద్దకుఁ బోయి అమ్మా! యిప్పుడు మంత్రిగారు నీ సంగీతమువిన వేడుక పడుచున్నారు. వడిగావచ్చి రెండు శివకీర్తనలు పాడుమని చెప్పగా నామె కొంచెముసేపు వచ్చుటకు సంశయించెను. కాని మరలనేమియనుకొని నటో తటాలునఁ జనుదెంచి మంత్రికి నమస్కరించుచు నతని అనుమతిం బ్రతి మేళగించి చక్కఁగా బాడందొడంగినది. ఆ భిక్షుకురాలు కాషాయవస్త్రము ధరించి మేనెల్ల విభూతిఁ బూసికొని రుద్రాక్షలు ధరించియున్నను నివురుగప్పిన నిప్పునుంబోలె నొక అద్భుతతేజంబునఁ బ్రకాశిల్లుచుండుట వీరగుప్తుఁడు దానిని మిక్కిలి నిరూపణ పూర్వకముగా జూచుచుండెను.

మరియు నా భిక్షుకురాలు శివకీర్తనలు పాడుచు నడుమ నొక గీతము పాడినది. ఆ గీతము చంద్రలేఖ రచించి తిలోత్తమకు జెప్పి ది. దానిలోఁ జంద్రలేఖ అంకితమున్నది. అద్దానిం బాడినతోడనే వీరగుప్తవేషముతో నున్న చంద్రలేఖ యుల్లము [illegible] గల్లకిల్లుచు నౌరా! యీగీతము నేను రచించినది ఇది తిలోత్తమకుగాక మరియెవ్వరికిఁ జెప్పియుండలేదు. ఆ తిలోత్తమ మరియొకరికిఁ జెప్పి

నట్లు తలంచను. ఈ భక్తురాలు తిలోత్తమకాదుగదా; సందేహమేల, నిరూపించిచూడ దానియాకారమంతయుఁ బొడగట్టుచున్నది. మొదట వికృతవేషముతో నుండుటచే గనిపెట్టలేక పోయితిని. ఈకంఠస్వరము దానిదే ! అన్నన్నా ! తిలోత్తమా ! నీకు నెట్టియవస్థవచ్చెనే ! పాపపు విధీ ! నీవెంతనిర్దయుఁడవురా ! అట్టి మహారాజుకూఁతున కిట్టియవస్థఁ దెచ్చిపెట్టితివి. అని పెక్కుతెఱంగుల నంతరంగమ్మున వగచుచు సంతటితో సంగీతము చాలింపుమని చెప్పి పైవారినందరను దూరముగాఁ బొమ్మని యానతిచ్చి నా భక్తురాలికిట్లనియె.

తల్లీ ! నీవు పాడిన గీతమునకు నా యుల్లము నీరైపోయినది. నేడు నీదర్శనంబున నాకులంబంతయు ధన్యతం బొరసె మరియు నీకులశీలనామంబులు విన నాడెందము మిగుల నుత్సాహమందుచున్నది. నీవిచ్చటి కెట్లువచ్చితివి ? ఇప్పుడు పాడిన గీతమెవ్వరియొద్ద నభ్యసించితివి ? నీని వాసస్థలమెచ్చట ? తల్లిదండ్రులెవ్వరు? నీవృత్తాంతమెఱిగించి నాకానంద మాసాదింపుమని మిక్కిలి వినయముగా బ్రార్థించెను. మంత్రిపలికిన వినయోక్తులకు భక్తురాలు మెచ్చుకొనుచు అయ్యా ! నాపూర్వాశ్రమ వృత్తాంతమేమియు నేను గనుతెఱుంగను. ఇప్పుడు నన్ను భక్తురాలని పిలుచుచుందురు. ఈ విజ్ఞానయోగి శిష్యురాలను. తారకేశ్వరుని సేవించుటయే నాపని. ఇంతకన్న నాకిజన్మమున మఱేమియు లేదని చెప్పగావిని యమ్మంత్రి అప్పటి కంఠస్వరమువలన మరియుం గురుతు తెలిసినది కావునఁ దప్పక తిలోత్తమయేయని నిశ్చయించి యది చెప్పిన మాటలకు మనమున శోక మావేశింపఁ గన్నుల నీరు గమ్ముకొనఁ నాపుకొనుచు నతఁడు మఱల నిట్లనియె.

తల్లీ ! నన్నన్యునిగాఁ జూడవలదని పలికిన యంతలోఁ దెలిసికొని నాలుకఁ గరచుకొనుచు నన్యభావంబునఁ జూడకుము నీపూర్వవృత్తాంతము వినిన మిక్కిలి వేడుకయగుచున్నది. నీకెద్దియేని మనుష్యకృతములగు నాపదలు సంభవించినం జెప్పుము తప్పక వానియన్నియు దొలంగఁజేసెదను. ఆపన్నులరక్షించుటయేగదా రాజధర్మము. నీ సుఖము జూడ నెద్దియో విపత్తు నొంది యిట్టి వైరాగ్యమువూని యున్నదానవని తోచుచున్నది. నాకు జెప్పుటవలన నీకుపకృతియేయగును. ప్రజలు తమయిడుములనొరులకుఁ జెప్పుకొనుటయావశ్యకము నీవీయోగినీవేషమువేసికొని యెన్నిదినములయినది! ఈగుడిలో నెన్నిదినములబట్టియుంటివి. నీగురువెందున్నవాఁడు చెప్పుము. చెప్పుమని మిక్కిలి జాలనగా నడుగుటయు నాభక్తురాలు ఒక్కింత సేపూరకుండి కన్నులనుండి వెడలు నశ్రుకణముల నుత్తరీయంబున నొత్తుచుఁ బుణ్యాత్మా ! ఈనిర్భాగ్యురాలి చరిత్రతో మీకేమి ప్రయోజనము గలదు. దీనిని వినినంత మీస్వాంతమునఁగూడ చింతయుదయించును. నాకెద్దియో యుపకృతి జేయుసంతటి యాదరణతో మీరడుగుచుండ వచింపకుండుట మూర్ఖతగదా సర్వసుఖ పరిత్యాగము జేసిన నాకు మరల సౌఖ్యము

గలుగుననునది కలలో వార్తయే యైనను జెప్పెద వినుండని యల్లన పిశస్వరముతో నిట్లనియె.

దేవా! నేను రామచంద్రనగర ప్రభువైన శూరసేన మహారాజు కూఁతురను. నాపేరు తిలోత్తమ అందురు. నేను జంద్రలేఖ యనుదానితో మైత్రిఁజేసి అదియు నేను నొక్కనాఁడు మాపట్టణ బాహ్యోద్యానవనంబునకుఁ గ్రీడార్థమయి అరగి అందు నిద్రించి యుండగా నన్నుఁ గొందరు దొంగలు మంచముతోఁగూడ నెత్తికొనిపోయి యొకఅరణ్యములోనికిఁ దీసికొనిపోయిరి. ఉదయంబున నేనులేచి చూచువరకు మహారణ్యమును దొంగలు మాత్రము గనంబడిరి. అప్పుడు నేను వెఱచుచు మీరెవ్వరు నన్నేటికి దీసికొని వచ్చితిరి. మీకు గావలసినపని యేమనియడుగఁగా వాండ్రు వెఱవక నాతోనిట్లనిరి.

మేము దొంగలము. బలసింహుఁడు నీతో సహవాసముగాఁ దిరుగుచున్న చంద్రలేఖను మంచముతోఁగూడ తనయొద్దకు దీసికొనిరండని పంపెను. మేమును మీ యిరువురిలో గురుతుఁబట్టలేక నిన్నుఁదీసికొనిపోయితిమి. నిన్నుఁజూచి అతఁడు జడియుచు దీనిని మరలఁ దీసికొనిపోయి యథాస్థానమందుంచి రెండవదానిం దీసికొనిరండని పంపెను. కాని మేము మరల నీమంచము మోచుకొని పోవుచుండగా దారిలో రాజభటుల యలజడి తగిలినది. దానికి వెఱచి యాదారిని విడిచి యీయరణ్యములోనికిఁ దీసికొనివచ్చితిమి ఇక మేమింటికిఁ బోవుటకు వీలులేదు. నీమూలమున మా కాపురములకు నీళ్ళుపోసికొంటిమి. కావున నీదగ్గిరనున్న వస్తువులన్నియు మాకిచ్చివేయుము. నీవిది మొదలు మేము చెప్పినట్లు నడువుము. మేము నిన్నొకచోట కొనినట్లు చెప్పుదుము. ఎవ్వరేని అడిగినచో నట్లు చెప్పుదునని ప్రమాణము చేయుము. లేనిచో నిన్నిప్పుడే సంహరింతుమని పలుకఁగా విని నేను విభ్రాంతురాలనై విధినిదూరుచు నప్పుడు మఱేమియు జేయునది లేక ప్రాణమునందు గల దీపునబట్టి వాండ్రు చెప్పినమాట లన్నింటికిని నొప్పుకొని ప్రమాణము చేసితిని. ఆ చోరులు నా మేననున్న నగలన్నియు నప్పుడే లాగికొని కాలక్రమంబున నా అరణ్యము విడిచి పట్టణములలో సంచరింపఁ దొడంగిరి. నేనును వాండ్రతో బానిసవలె వెంటనంటి తిరుగుచుంటిని.

ఇట్లు గ్రమ్మరుచుండ నొకపట్టణములో నొకవర్తకుడు నన్ను జూచి యా చోరులతో నీ చిన్నది యెవ్వతె అని అడిగెను. వాండ్రువానితో దీని మేము పారశీక దేశములో వేయి బంగారునాణెములకు గొంటిమి. ఎవ్వరికేని గావలసినచో నమ్మివేయుదుము. అని చెప్పగా విని యా వర్తకుడు మిగుల ధనము గలవాడు కావున నప్పుడే యాసొమ్మిచ్చి వేసి నన్నుజూచి బోటీ! నిన్ను నేను గొంటిని. నీవు వీరు చెప్పినట్లి దాసవగుదువా? నీవేమేమి పనులు జేయుదువని నన్నడుగఁగా నంతకుమున్ను నేను వారితో ప్రమాణికముచేసి యున్నదాననగుట నామాటకు సమ్మతించి లోకగర్హితములు గాక సజ్జన సమ్మతములైన పనులన్నియు జేయుదునని పలికితిని.

ఆ వర్తకుఁడందులకు సమ్మతించి అప్పుడే నన్ను దనవెంటబెట్టుకొని యీ పట్టణమునకుఁ దీసికొనివచ్చి తన భార్య కప్పగించెను. ఆ వర్తకుని భార్యయు నన్ను సగౌరవముగాఁ జూచుచు నాకుఁ దగిన పనులే చెప్పి మన్నించుచుండెను. నేనును ఆమె యందు భక్తి విశ్వాసములుగలిగి తల్లిలాగునఁ జూచుకొనుచు నామె చెప్పిన పనులు మనసు కనిపెట్టి చేయుచుంటిని. ఇట్లుండగా నావర్తకుని కుమారుఁడు దేవలుఁడను వాఁడు నన్ను మోహించి యొకనాఁడు తన అభిప్రాయము నాతోఁ జెప్పెను. నేనును వాని మాటలు విని శివశివా అని చెవులు మూసికొని తమ్ముఁడా నేనట్టిపని కొడంబడు దాననుగాను. నీవు నాకుఁ దమ్ముఁడవు. నీతలిదండ్రులను నేను తలిదండ్రులే అని నమ్మియుంటిని. మీ తండ్రితో నేను మొదటనే యిట్టిపనుల కొడంబడనని చెప్పితిని. కావున నీవు సోదరీ భావముంచి అట్టి అభిప్రాయము మరలించుకొనుమని మందలించి తిని. అప్పటి కేమియుం బలుకక యా చిన్నవాఁడు సిగ్గుపడిపోయి మరి రెండు దినములు గడిచినంత నేనొంటిగా నుండుటంజూచి నాయొద్దకు వచ్చి మచ్చెకంటీ! నీవు చెప్పిన మాటలేమియు నాకు నచ్చలేదు. పచ్చవిల్తుఁడు నన్ను విచ్చలవిడి బడలఁ జేయుచున్నవాఁడు. నీ నియమములకేమిలే; నీచేత దాసీకృత్యములు చేయించుట మానిపించి నిన్ను మంచి స్థితిలోనికి రప్పించెద. నేను చెప్పినట్లు చేయుమని పలుకుచు నా చేయి పట్టుకొనఁ బోయెను.

అప్పుడు నేను భయపడుచు వడివడి పరుగుపెట్టి అతని తండ్రి యొద్దకు బోయి దేవలుఁడు చేయుచున్న దుష్కృత్యములెల్ల జెప్పితిని కాని యావర్తకుఁడు తన కొక్కడే కుమారుఁడు గావున వానిని మిక్కిలి మందలింపనేరక నాతో నేను వానిని దండింతునులే పొమ్మని పలికెను. గట్టిగా నట్టిపని చేయలేకపోయెను. పిమ్మటఁ దల్లితో చెప్పితిని. యామెయు వాని నేమియు ననలేక నన్నెప్పుడు వాఁడున్నచోటికి బోవద్దని చెప్పినది.

ఆ మాటలందు విశ్వాసముంచి నేనట్లు చేయుచుండగా మఱి రెండు దినములు పోయిన వెనుక నొకనాఁడు వాఁడు నాకెమరుపడి నన్నుఁ జూచి శిరఃకంపము చేయుచు గానిమ్ము, నీవు నేనడిగిన వార్త యెల్లరకు వెల్లడిచేసితివిగదా వారు నన్నేమి చేసిరి. ఇప్పటికైన నా ప్రజ్ఞ తెలిసినదా. ఈ మాటైనను సమ్మతింతువా అని పలుకుచుండఁగనే అవలకుఁ బాఱిపోయి యా వర్తక యిరుగు పొరుగు వారితో జెప్పగా వారును నావర్తకుఁడు మిగుల భాగ్యవంతుఁడగుట నతనితో నేమియుఁ జెప్పలేకపోయిరి. అప్పుడు నాదురవస్థ అంతయుం జింతించుకొనుచు ఛీ! నావంటి మూఢురాలీ లోకములోలేదు. మహారాజ వైభవమంతయుఁ బోయినను స్వదేశము విడిచినను, నౌకరి యింట దాసినై యున్నను నాకింకను జీవితాశ వదలకున్నది ఆహా! ఇంక నేను బ్రతుకుట యేమిటికో తెలియకున్నది ప్రారబ్ధశేషమింకను మిగిలియున్నది కాబోలు అనుభ

వింపక తీరునా? ఔరౌరా! నా విద్యయు నా రూపము వీరింట దాసీ కృత్యమునకు వినియోగించెనే! అని అనేక ప్రకారములం దలపోసి నాఁటిరాత్రి బలవన్మరణము చేయుటకు నిశ్చయించుకొంటిని.

అంత నర్ధరాత్రంబున నింటివారందరు నిద్రఁజెందియుండుటఁ దెలిసి యిల్లు వెడలి యీ దేవాలయములో నూతిసంతకమున్న చూచి యున్నకతంబున నందు దేవసన్నిధానమున మృతినొందిన పుణ్యమని తలంచి మెల్ల మెల్లగా నిచ్చటికి వచ్చితిని. ఈ గుడి తలుపులు రాత్రులఁగూడ మూయకయే యుండును. నేను లోనఁ బ్రవేశించి యానూతిగోడ పైకెక్కి దూకుటకుఁ జేతుల పైకెత్తి భగవంతుని స్మరించు నంతలో నొకమాట జ్ఞాపకము వచ్చినది. అయ్యో! నే నిప్పుడు చచ్చుటకు సిద్ధముగానుంటిని. ఇట్టి సమయమున సీతారకేశ్వరస్వామికిఁ బ్రదక్షిణము చేసివచ్చిన ముక్తి గలుగునుగదా! అట్టి పని నిమిషములో చేసి మరల వచ్చెదంగాక అని తలంచి యానూతి గోడదిగి యుత్తరపు దిక్కుగాఁ బ్రదక్షిణము జేయఁబోయితిని.

# బలదేవుని కథ

ఆవైపుననున్న మంటపములో నగ్గి ప్రేల్చెడి వెల్తురుననెద్దియో మాట్లాడుచున్న జనులసందడి యొకటి వినంబడినది. దానికి నేను సంకోచింపుచు నాదారిం బోయినచో నన్నుఁ బల్కరింతురను వెఱపున నటుపోవక వారు నిద్రబోయిన వెనుక పోవుదమను తాత్పర్యముతో నచ్చటఁ బొంచియుండ వారిమాటలు వినవచ్చెను.

శిష్యా! వినుము సంసారము పుత్రదారధనాది సంగమూలకంబై యున్నయది.

ఉ. దేహము వాయుసంచలిత దీపిక పుత్రకళత్ర మిత్రసం
దోహము స్వప్నకాలమున దోచెడిసందడి భూరిభోగ స
న్నాహము జంతమునుం బ్రతిమ నాట్యము సంపద యింద్రజాలమీ
యైహిక సౌఖ్యమేమిసుఖ మంచుదలపగనొఁ గుమారకా.

మఱియును—

సీ. కామరోగాది దుష్కరశత్రువర్గ ప్రతాప ప్రధానముధనము
జన్మపరంపరా సంపాదితానేక ఘనకర్మజాలవర్ధనముధనము
కైవల్యసంప్రాప్తికారణ వైరాగ్య ధర్మమార్గావరోధనముధనము
నసిలాపగుణపుంజసంశ్రయా రూపదారుణనిగళబంధనముధనము.

గీ. గలిగి గర్వంబు వొట్టిదుఃఖంబుమదికిఁ
బెనుచు నజ్ఞానపావ కేంధనము ధనము
స్వప్నలబ్ధ పదార్థంబు చందమునను
దలఁచి చూడంగ వట్టిదండసము ధనము.

చ కొడుకులు గల్గుదాక నొక కొన్ని దినంబులు చింత నందనుల్
బొడమిన నాయువున్బలము బుద్ధియు విద్యయు జాలగల్గంగా
గుడుగనిచింతగల్గి తనునోలిభజింపనిచింత తండ్రి కై
వ్పుడుగడుఃజింత సేయుదురు పుత్రకులు శత్రులుగాక మిత్రులే.

వ॥ దీనికి దృష్టాంత మొక్కటి చెప్పెదవినుము. నేను బూర్వాశ్రమున జగన్నాథంబున నివసించి జగన్నాథస్వామి నారాధింపుచు మాలికలంగట్టి స్వామి కర్పించుచు నవియే అమ్ముకొని కాలక్షేపము చేయుచుంటిని. ఇట్లుండగా ముందు సంతాన మొకమైనందున దాని గురించే గొప్ప విచారమొకటి గలిగినది. దానికై యుప వాసములు నియమములు దానములు మొదలగు కృత్యములెన్నియో చేసితిని. కొంత కాలమునకే వ్రతమహాత్మ్యముననో యొక కుమారుఁడు గలిగెను. వాఁడు పుట్టిన కొద్ది నాళ్ళకే తల్లి మృతి బొందినది. వాఁడు కంతువసంత జయంతుల మీరియుండిన రుచి గలిగి యుండుటచే రుచికుఁడని పేరు పెట్టితి నట్టి వాని నెచ్చటికిఁ గదలనీయక నింటనే యుంచి మాలికలు గట్టుపని నేరిపితిని. ఆ పనిలో వాఁడు నాకన్న నెక్కువ కీర్తి సంపాదించెను వాఁడొకనాఁడు సాయంకాలమునఁ బూవుదండల నమ్మివచ్చెదనని పోయి మరల నింటికి రాలేదు. తరువాత నేనుఁబోయి యాగ్రామమంతయు వెదకితిని. యెక్కడను జాడలేదు గొడ్డు పీగికన్న బిడ్డగావున మిగుల విచారించుచుఁ నిద్రా హారములుమాని సంతతము వానినే ధ్యానించుచుఁ జివరకు బలవన్మరణము సేయ నిశ్చ యించితిని. నాయుద్యమం బెఱిఁగి యాప్తుఁడైన యొక వృద్ధభూసురుండు నాయొద్దకు వచ్చి ఇలదేవా! నీవు పుత్రమోహంబున బలన్మరణము నొంద నిశ్చయించినట్లు తెలిసి నది. అట్టిపని మాత్రమెన్నఁడును సేయకుమీ. నీవు భక్తుఁడవు గదా యింతకు మున్ను జేసిన పుణ్యము పోవుటయేకాక చిరకాలము నిరయములో నుండవలసివచ్చును. అని మంచి మాటలచే నా యుద్యమము మాన్పెను. నాటినుండి నేను నిట్టి యవధూత వేషముబూని పెద్దలవలన నాత్మజ్ఞానము సంపాదించి విజ్ఞానయోగి అను పేరుతో దిరుగుచుంటి. శిష్యా! ఇట్టి శోకమంతయు నా కుమారుని మూలముననే కదా వచ్చినది. మొదటనే యతఁడు కలుగకుండనిచో దుఃఖమే లేదు.

ఉ. కోరకు మేపదార్థమును గోరినవచ్చునె రానివస్తువుల్
గోరకయున్న రావె తనకున్ లభియింపఁగనున్న యర్థముల్

గోరినవానిచేఁ గలిగి కోల్పడుచో వెతగాన సజ్జనుల్
గోర రనాస్థఁ బ్రాప్తములు గొందురుకుందురు వస్తుహానికిన్.

శా. ప్రారబ్ధంబగుమేననేయనుభవం బొచుండఁ దత్సాక్షియై
యారూఢస్థితి సర్వమున్నఱచి సద్వ్యాప్తులం జిత్సుధా
ధారాసావసుఖాస్తి సర్వగత శుద్ధబ్రహ్మమేనంచు శం
కారాహిత్యమువూనుమీ యనియె మోక్ష ప్రాప్తికిన్ బాలకా.

వ. ఈ రీతి నుపదేశించు నయ్యోగిపుంగవుని వచనంబు లమృతబిందువుల వలె నా చెవుల సోకినంత నేనత్యంత సంతోషముఁ జెంది యోహో ! నీవీ మరణో ద్యోగము మానుమని భగవంతుఁడు నాకీరూపమున నుపదేశించెను గాబోలు. ఇది యుప ద్రుతియై యుండవచ్చును. బలవన్మరణమువలన నరక ప్రాప్తియగునఁట. అచ్చటనేగాక పరమందు గూడ నిడుములం గుడువవలయునా ! కానిమ్ము. నాలుగు దినము లెట్లో కన్నులు మూసికొనినఁ బోవును. పడిన దానికన్న నెక్కుడనుభవింతునా ? ఈ యోగి వాక్యములే నాకు గురూపదిష్టములైనవి. నేను మా యింటివారు లేవకుండఁ బోవలయునని తలంచుచు నప్పుడే యా ప్రయత్నము మాని యింటికిఁ బోయితిని.

ఆహా ! దైవము నా బుద్ధి నెంతలో మార్చెనో చూడుడు. "బుద్ధిః కర్మానుసారిణి" అని పెద్దలు చెప్పుదురు నా పుణ్యమువలనఁ నేను పోవువరకు మా యింటివారెవ్వరును లేవలేదు దేవలునిం దలంచుకొనినంత నాకు వారి యింటికి మరలఁ బోవలయునని మనసు కలుగలేదు. గాని సొమ్మిచ్చికొనిన వర్తకుని మోసముచేయుట కిష్టము లేకపోయినది. నా రాకపోకలెవ్వరును గ్రహింపలేదు. నేనుఁ బూర్వమువలెనే పనులు చేయుచుండ నొకనాఁటి యర్ధరాత్రంబున దేవలుఁడు నేను బరుండియున్న యింటిలోనికిఁ గత్తిదీసికొని వచ్చి నన్ను లేపి యిప్పుడు నీవు సమ్మతింతువా ? లేకున్న నిన్నీకత్తితో ద్రేయనాయని యడిగెను. నే నప్పుడు భయపడుచు దేవలుఁడు నన్నుఁ జంపుచున్నాఁడో యని యరచితి.

ఆ రొద విని యాప్రాంతమందే పరుండియున్న వాని తలిదండ్రులు తటాలునఁ జనుదెంచి వానిచేతులం బట్టుకొనిరి. వాఁడు పరహంకారముఖముతో నన్ను విడువుఁడు. ఈ రండనుఁ జంపినంగాని నా కోపము దీరదని పలుకుచుఁ దనచేతులు లాగికొనఁ జొచ్చెను. అప్పుడు వాని తండ్రి పట్టుకొనలేక చేతులు విడచెను. ఆ విసరున చేతిలోనున్న కత్తి మిక్కిలి వాడికలది కావున వాని మెడకుఁ దగిలి తల తెగి పడిపోయినది. అప్పుడు వాని తలిదండ్రులు మిక్కిలి శోకించుచు ననుఁజూచి అమ్మా నీవు మా కొంప తీసితివి. నీ మూలముగా మా వంశనాశనమైనది. నిన్నిందులకే కాఁబోలు పెంచితిమి. నీకుఁబదివేల నమస్కారములు నీ యిష్టము వచ్చినచోటికిఁ బొమ్మని నిందించుచుఁ బలికిన నేనును అయ్యో ! నేనేమి జేసితిని. వాని దుర్బుద్ధియే వాని మరణము

నకుఁ గారణము. నన్నూరక నిందించెదరేల? మీ యనుమతి లేనిదే పోఁగూడదని యుంటి మీకిష్టమేని నిప్పుడే పోవుచున్నానని పలికి వారి యిల్లు వెడలిపోయితిని.

అప్పుడు నాకు మఱియొక చోటికిఁబోవుట కిష్టంలేక తిన్నగా, నీయాలయము లోనికి వచ్చి యీ విజ్ఞానయోగి నాశ్రయించితిని. అయన నన్ను శిష్యకోటిలోఁ జేర్చు కొనియెను. నిత్యము నయ్యోగిపుంగవుని బోధామృతమువలనఁ దృప్తినొందుచు సాయంకాలమున నీతారకేశ్వరుని గానము సేయుచు హాయిగాఁ గాలము గడుపు చుంటిని. భక్తురాలని పేరు పెట్టి నిత్యము స్వామి ప్రసాదమే నాకిచ్చునట్లు ధర్మకర్తగా రానతిచ్చిరి. ఇదియే నా వృత్తాంతమని పలుకఁగా విని మంత్రిరూపముతో నున్న చంద్రలేఖ తికోత్తమ యవస్థకు మిక్కిలి వగచుచు బలసింహుఁడు చేసిన కపటో పాయమునకు వెఱఁగందుచు రహస్యముగాఁ దిలోత్తమకుఁ దన వృత్తాంతంబు చెప్ప వలయునని నిశ్చయించి కర్తవ్యమెద్దియని యాలోచించుచున్న సమయములో ద్వార పాలకుఁడు వచ్చి అయ్యా! విదేశ బ్రాహ్మణుఁడెవ్వఁడో తమ దర్శనము చేయుటకై ద్వారమున వేచియున్నవాఁడు. తమతో నేదియో మనవి చేసికొనునఁట, ప్రవేశమునకు సెలవేయనుటయు నామంత్రి బ్రాహ్మణుల కవసరమేల రమ్మని చెప్పుమని యానతిచ్చెను.

అప్పుడా ప్రతీహారి యాబ్రాహ్మణుం దీసికొనివచ్చి మంత్రి ముందరవిడిచి వారే ప్రభువువారని చూపించెను. మంత్రియు నాబ్రాహ్మణుని జూచినతోడనే ముఖము వికసింప నమస్కరించి యూర్చుండ నియమించి యాగమనకారణంబడిగెను. అప్పుడా బ్రాహ్మణుఁ డాశీర్వదించి అయ్యా! నావృత్తాంతము వినుడు. నాపేరు గౌతముఁడు. నాకాపురము జగన్నాథము. నేను రుచికుఁడను మిత్రుని వెదకుటకై బయలుదేరి యనేక పురములు చూచుకొనుచు ఢిల్లీరాజధానిఁ జేరితిని. అందు దైవానుగ్రహమున నా మిత్రుఁడు కనబడియెను. వానిని వెంటఁ బెట్టుకొని యచ్చటనుండి బయలుదేరి నాలుగు దినములక్రిందట నీయూరు చేరితిని. ఇందుండి మా దేశమునకు నోడమీఁదఁ బోవలసి యున్నది. నేటి సాయంకాలమునఁ బ్రవహణము విడుతురఁట. విదేశాగతుల నెక్కుడుగఁ బరీక్షించినంగాని యాజ్ఞాపత్రికలనియ్యమని మీక్రింది యధికారులు చెప్పుచున్నారు. మేము మాదేశము విడిచి చాలాకాలమైనది ఎట్లయిన మాప్రయాణము నేడు సాగునట్లాజ్ఞా పత్రికల నిప్పింపఁ బ్రార్థింపుచున్నాఁడ. నిదియే నాకోరికయని చెప్పిన విని మంత్రి వేషముతో నున్న చంద్రలేఖ ఆశ్చర్యసాగరమున మునిగి యొక్కింత తడవొర లెఱుం గక ధ్యానించుచు సంతోషము మనంబునఁ బొంగుచుండ నాహా? కాలమే మంచిదైనఁ గూర్చును. ఓర్పుగలిగిన సుఖములు గూడ, దుఃఖములు వచ్చినట్లు ప్రయత్నమునవే వచ్చుచుండునని పెక్కు తెరంగులఁ దలంచుచు నాసంతోషము దెలియనీయక గౌతముని జూచి యిట్లనియె.

ఆర్యా! మీరు నేఁడే యోడనెక్కి మీ దేశమునకేగఁదలంచు కొంటిరేని మిమ్ము నేను స్వయముగాఁ బరీక్షించెదను. మీ మిత్రుని దీసికొని మాయింటికి రండు.

పొందు. మీ నిమిత్తము కొంచెమాలస్యమైనను బ్రవహణము నిలుపునట్లు చేసెదను. బ్రాహ్మణులకీపాటి యుపకారముఁజేయుట యబ్బురము కాదని యేమేమో చెప్పి తన గృహము జూపుటకై యొకభటుని నతనివెంట నంపి తరువాత భక్తురాలిం జూచి అమ్మా! నీవృత్తాంతము వినినచో నెట్టివారికిని జాలి పొడమకనదు. నీవు రాచబిడ్డవై యిట్టి నీచవృత్తిమైవర్తించుట న్యాయముకాదు. మీతండ్రికి నుత్తరమువ్రాసి నిన్ను మీ దేశమున కనిపెదను. అంతవఱకు మాయింటనంతఃపుర స్త్రీలలోఁ గలిసియుండువుగాని రమ్మని యుక్తియుక్తముగా బోధించి యొప్పించెను.

అప్పుడా మంత్రి యింటికిఁబోయి భక్తురాలిం దీసికొనిరమ్మని యొకపరిచారి కనుఁ బంపెను. భక్తురాలు మంత్రి తన్ను జేసిన అపూర్వ గౌరవమునకు మిక్కిలి సంతసించుచు నందలమెక్కి వారి సౌధమునకుఁ బోయినది. ఆలోపల జంద్రలేఖ పురుష వేషమును దీసి మునుపటివేషముతో నొక అంతఃపురమునుండి యాభక్తురాలి నచ్చటికి రప్పించుకొనియెను. అప్పుడు చంద్రలేఖంజూచి భక్తురాలు ఓహో! యీమె మంత్రిభార్య కావలయును. చంద్రలేఖ పోలిక అగుపడుచున్నదేమి? అక్కలికి యిక్కడికేమిటికి వచ్చును? ఒకవేళ నన్ను వెదకుచు వచ్చినదా! అని పెక్కుగతులఁ దలంచుచు నిలువంబడియున్న భక్తురాలింజూచి చంద్రలేఖ సంతోషము పట్టజాలక ప్రాణసఖీ! నన్ను మరచిపోయితివా? పల్కరించవేమియని యట్టెలేచి యా చెల్వం గౌఁగలించుకొనినది.

తిలోత్తమయుఁ దత్కాలోచితమైన వచనములచేఁ జంద్రలేఖకు శోకమిబ్బడింపఁ జేసినది. ఇరువురు కొంతసేపు చిరకాలవియోగశోకం బభినయించుచు నొండొరుల వృత్తాంత మెఱింగించి యాశ్చర్యమందఁ జొచ్చిరి. చంద్రలేఖ తిలోత్తమకుం దన వృత్తాంతమంతయుంజెప్పి సఖీ! మనకిప్పుడు కాలము మంచిదైనది. విను మల్లనాఁడు నీ వెదకువచ్చిన దివ్యపురుషుం డిక్కడికివచ్చెను. వాని నీ కిప్పుడు చూపెదనరయుము. వాని వృత్తాంతము కొంత నేనెఱిఁగియుండియుఁ జెప్పితిని కాను. అతనిచేత నంతయుం జెప్పించెదనని పలుకుచుండఁగనే యా విదేశపురుషు లిరువురువచ్చి ద్వారమున నిలిచి యున్నారని యొక యాంతరంగిక సఖురాలువచ్చి చెప్పినది. వారి నాలోపలకే తీసి కొనిరమ్మని దానినే యంపినది. అదివోయి ముహూర్తమాత్రములో వారిరువురును లోపల బ్రవేశింపఁజేసినది. అప్పుడు గౌతముఁడును రుచికుఁడును నందు బురుషులెవ్వరును లేక స్త్రీలు మాత్రమే యుండుట దూరమునందు చూచి దారితప్పితిమని వెరచుచు దిరిగి పోవుటకుఁ బ్రయత్నించుచున్నంతఁ జంద్రలేఖ సఖురాలు అయ్యా! పోకుఁడు పోకుఁడు మారాణి మిమ్ములోపలకుఁ దీసికొనిరమ్మనిరని చెప్పినది.

ఆ మాటవిని వారు సంశయాకులిత హృదయులై యల్లననప్పల్లవపాణులున్న

నెలవునకుఁబోయిరి. మునుపటికన్న నద్భుత తేజమున మెరయుచున్న రుచికునింజూచి చంద్రలేఖయుఁ దిలోత్తమయుఁ వెరగుపడుచు మాట్లాడవలయునని తత్తరపాటుజెందుచు నెట్టకేలాపుకొనియున్న సమయంబున గౌతముఁడు చంద్రలేఖంజూచి గురుతుపట్టి యబ్బురపాటుతో బోఁటీ! యిచ్చటికెప్పుడు వచ్చితివి? నేను గౌతముఁడ నితఁడు నా మిత్రుఁడు రుచికుఁడు జ్ఞాపకమున్నదా అని అడిగిన విని అమ్మించుబోఁడి లేచి వారికి నమస్కరింపుచు నందున్న పీఠములఁ గూర్చుండ నియమించి యల్లన నిట్లనియె.

గౌతమా! నీవు నన్ను గురుతు పట్టగలవో లేవోయని మాట్లాడితినికాను. పాపము నీవీ రుచికుని నిమిత్తము చాలా శ్రమపడితివి. ఈకలంబెందు గనఁబడెను. విశేషములేమి. చెప్పుమని యడిగిన అమ్మగువ నతండిట్లనియె. చంద్రలేఖా! మావృత్తాంతము చాలగలదు నీవీ వీటి కెప్పుడువచ్చితివి. ఈ మంత్రిగారికిని నీకును సంబంధమెట్లు కలిగినది. నీవృత్తాంతము ముందుజెప్పుమని యడిగిన జంద్రలేఖ తాను జగన్నాథము విడిచివచ్చినది మొదలు నాఁటితుదనుక జరిగిన కథ అంతయు జెప్పి మరియు నిట్లనియె.

ఆర్యా! నీ మిత్రుని చరిత్ర మింద్రజాలమువలె నున్నది. జగన్నాథములో నంతర్ధానమై రామచంద్రనగరములో దిలోత్తమ నుత్తలపెట్టి ఢిల్లీనగరములో నీకుఁ గనంబడెను. రెక్కలుగట్టుకొని తిరిగెడి వారైన నిట్టిచిత్రములు చేయలేరు. మమ్మతడు మరచినను మేమితని నిమిత్తమే యిడుముల బడుచున్నారము. ఈ చిన్నదియే తిలోత్తమ. ఇతని నిమిత్తమై యిట్లు జోగురాలైనది. కానిమ్ము. దైవికమునకు వగచినం బ్రయోజనములేదుగదా! తదీయవృత్తాంతము వినమా శ్రవణము లుత్సుకత నొందుచున్నవి. అనిన విని రుచికుండు విస్మయశోక సంభ్రమంబులు చిత్తంబుత్తలపెట్ట నల్లన నిట్లనియె.

చంద్రలేఖా! మీరు నానిమిత్తము మిక్కిలి యిడుములంగుడుచు చున్నారు. ఇందులకు మీకు కృతజ్ఞుఁడనై యుండెదను నా వృత్తాంతము వినుడు. నాఁటి రాత్రి నీ యుద్యానవనములోనికిఁ బోయి తలుపులు వైచుకొన్నది నీవు చూచితివికదా! తరువాత నేను నలుమూలలు బరికించి యెందునిలిచినసుం దెలిసికొందునని తలంచి యే లతా వితానములచే దట్టముగ నల్లుకొనఁబడిన నొక యశోక పాదపమునెక్కి చిట్టచివర కొమ్మల సందున నాకుమరుగు పిందివలె నణఁగియుంటిని.

# జయంతుని కథ

ఇంతలో సమీపమున నెవ్వరో మాట్లాడుచున్నట్లు ధ్వని వినఁబడినది. అదిరిపడి తలపైకెత్తి చూచితిని. మెరపుతీవంగల కాంతులు ప్రోగుపడి నామీద బడు చున్నట్లు తోచిన విస్మయముతోఁ బరిశీలించునంత నాకాంతి మండలము నేనున్న ప్రాంగణదండకేవచ్చి యల్లన నిలువఁబడినది. అప్పుడు నాకది కనకమణి స్యందనమని తెల్లమైనది. పిమ్మట నాకందున్న వారి మాటలుగూడ నిట్లువినఁబడియె. తిలోత్తమా! మన పయనమున కంతరాయము గలుగఁజేసి గంధవహుండే తత్ప్రసూన వాసనా విశేషం బాకర్షణముగ నిచ్చి నాసాపర్వంబు గావించుచు నిచ్చటికిఁ దోడ్కొని వచ్చె గదా! ఈ యుద్యానవనము జూడుము. నీమాటలం ద్రోచి పోవుదమనుకొంటిని గాని యేతదాగమనము సార్థక్యమే యైనది. వేగమపోయి నీ యిచ్ఛకు వచ్చిన బూవులం గోసికొనిరమ్ము లెమ్ము. అనుటయు నొకతరుణి మరల వానితో జయంతా! నే నెంత సంతసమునులేక నిన్నూరక నింతదూరము దీసికొని వత్తునా! ఇది అద్భుతసౌరభ్యము వలె బొడకట్టినది. ఆహా! మన దేవలోకమువలె భూలోకమునను మంచి పుష్పజాతులు గలిగియున్నవే! అందు నేనొంటిమైఁ బోవలేను. నీవుకూడ రావలయునని పలికినది.

అప్పుడతండు బోఁటీ! వెఱవకుము. ఇది యర్ధరాత్రము. ఇందెవ్వరును లేరు. యథేచ్ఛముగాఁ బూవులు గోసికొనవచ్చును. నేనును వత్తునని పలుకుచు మెల్లన లేచి యాచిగురుబోఁడి పాణిపల్లవమును గైకొని ఖేచరత్వమున నాతోఁటలోనికి దిగిరి. ఆ విమానమచ్చటనే యున్నది. నేను వారి రూపములు భాషణములు వేషములుఁజూచి దేవతలని తలంచి దివ్యదర్శనమునకు సంతసించుచు వారుపోయిన జాడఁజూచి మహా సాహసముతో నాకొమ్మలమీఁద నిలువఁబడినంత నాయరదము చేతికందినది.

మెల్లన దానిపై కెక్కి చూచితిని అది రెండంతరములు గలదిగా నున్నది. మొదటిది రత్నస్తంభభూయిష్ఠమై యున్నది. రెండవది రత్నాసనశయ్యా చిత్రవస్తు మండితమై యొప్పారుచున్నది. అది వారు నివసించు తావని యూహించి మొదటియంత రమున రత్నపుఁగంబముల చాటునఁ జిత్రప్రతిమవలె దాగియుంటిని. ఇంతలోఁ బూవులఁగోసికొని వారిద్దరు మాటలాడుకొనుచు వచ్చి యావిమానమెక్కిరి. అది యేమి మహిమయో కాని యాయరదము వారెక్కిన తోడనే మరఁ ద్రిప్పినట్లు రివ్వునఁ గదలి వాయువేగముగఁ బైకి నడువఁదొడంగినది. దానికిఁ జక్రములుగాని రెక్కలుగాని యేవియునులేవే యట్లునడుచు చుండుట దేవతామహిమ అని యూహించి నేనం దుండి భూలోకము చూడ నేమియుం గనఁబడినదికాదు. అంతయు నలికికొని పోయి నట్లున్నది. ఇంచుకయుఁ గదుపులేదు. స్తంభమునఁ గౌఁగలించుకొని కూర్చుంటిని.

అప్పుడు పుష్పముల నాఘ్రాణించుచుఁ తిలోత్తమ జయంతునితో మనోహరా ! ఈ విరులు మిగుల వింతగానున్నవి ఇట్టివి మనలోకములో నున్నవియా ! మనుష్యులు మనకంటెఁ దక్కువవారని చెప్పెదరే ! వారికిట్టి భోగ్యవస్తులేటికి; వారును మనవలెనే సౌఖ్యము లనుభవింతురేమో ? నీవెప్పుడైనను చూచితివా అని అడుగ నతఁడు నవ్వుచు బువ్వఁబోఁడీ ! మనుష్యులు మాత్రము సామాన్యులనుకొంటివా యేమిఁ వారిలో భోగమునను రూపమునను బ్రభావమునను మనల నతిశయించువార లనేకులు గలరు ఇంతయేల నీలో మిగుల సొగసు కత్తెయగు నూర్వశి భూలోక చక్రవర్తియైన పురూరవుని వరింపలేదా ? మాతండ్రి యహల్యమూలముననేకదా సహస్రాక్షుండను నభిఖ్య వహించుట. అందు జరామరణ వ్యాధులు క్షుత్పిపాసలును గలిగి యున్నవి. మనకవిలేవు ఇదియే మనకును వారికినిఁగల తారతమ్యము. ఇందున్న వృక్షజాతులన్నియుఁ బ్రతినామముచేత నందొప్పుచున్నవి. ఒక సంగీత వృక్షము మాత్రము భూలోకములోలేదు. తక్కినవన్నియుం గలవు. అని యీరీతి యిష్టగోష్ఠి వినోదమునం బోవుచున్నంత నాప్రాంతమందు వడిగాఁ బారిపోవుచున్న కింపురుష లకును వారి కెదురపడిన సిద్ధులకును నిట్టిసంవాదము జరిగినది.

సిద్ధులు—కింపురుషులారా ! కడువేగముగాఁ బారిపోవుచున్న వారేమి ? స్వర్గమున నేమైనను విశేషములు జరుగలేదుకద ?

కింపురుషులు—అయ్యో ! మీకింకనుఁదెలియలేదు కాఁబోలు ఇప్పుడు స్వర్గమున గొప్ప యలజడి జరుగుచున్నది. పాపము మనయింద్రుని కిట్టి యవస్థ యెప్పుడును రాలేదు.

సిద్ధులు—అఁ ! ఏమేమీ ? ఇంద్రునకే ! యెవ్వరివలన ! వడిగాఁజెప్పుడు.

కింపురు—రక్తాక్షుఁడను రాక్షసుడు వరగర్వమునం బ్రబలి పెక్కండ్రు రక్కసులతో వచ్చి స్వర్గమును ముట్టడింప దేవేంద్రుడు వానిబలమెఱింగి బలవద్విరోధమునకు వెఱచి వానికెదు రేగి వినయ పూర్వముగాఁ బ్రార్థించి నందనవనములో విడియఁజేసెను.

సిద్ధులు—అది మంచిపనియే. తరువాత.

కింపురు—ఇంద్రుఁడు వానికిని వానిపరిచారకులకును నప్పుడు చేసిన యుపచారములేమని చెప్పుదుము వానినేమియుఁ బాటింపక వాఁడు పురముచూడవలయు నని బయలుదేరి దేవతాగృహము లన్నియు వాని రాయిడికి వెఱచి మూసియుండుట జూచి యహంకరించి యోరీ ! నేనీయూర విహరింపరాగా దేవకాంతలందరు నుపహారము లియ్యక వంచనమైఁదలుపులు మూసికొనిరే ! ఇదియంతయు నీకపటమే ఇట్టి నీతో మాకు మైత్రి యెట్లనిపలుకుచు సుధర్మకు దారిఁజూపుమని యింద్రునడగెను.

సిద్ధులు—ఆహా ! దుర్జనులెప్పుడైనను సామమునఁ జక్కఁబడుదురా! తరువాత.

కింపురు——ఇంద్రుఁడు కొంతసేపు తడఁబడుచు మరల ధైర్యము దెచ్చుకొని, అప్పటికి రాక్షసులు పోరాదని చెప్పెను. పురుహూతువచనములు వినిన తోడనే రక్తాక్షుఁడు రక్తాక్షుఁడై యేమి యింద్రా! మాకు దేవసభకుఁబోవుటకు నర్హత లేకపోయెనే. కానిమ్ము. నిన్ను బరిమార్చి యీరాజ్యము గైకొనిన నేమిచేయుదువో. అప్పుడైనను దగుదుమా, అని యీరీతి సారెసారెకు ధిక్కరించి పలుకుచుండ నలుక జనించి, యింద్రుడు నుక్కుమెయి రక్కసులతోఁబోరాడ దేవతలఁ బురికొల్పెను. అప్పుడు దేవదానవులకు గొప్పయుద్ధము జరిగినది.

సిద్ధులు——దేవతలకెప్పుడును రక్కసులే హృదయశూలములైరి. తరువాత.

కింపురు——అనంతరమున రక్తాక్షుండు సహస్రాక్షు నోడించి పాశంబులఁ గట్టి జయజయధ్వనులతో తనలోకమునకుఁ గొనిపోయెను. దేవతలు, అనాథులై వాని వెంటనంటి యూరకపోయిరి తరువాత రాక్షసులు చేయుచున్నయల్లరి నేమనిచెప్పుము. కనంబడినవారినెల్లఁ బట్టి వేధింపుచున్నారు. మేమువారియిడుకోడి పారిపోవుచున్నవారము. మీరుగూడ నిప్పుడు స్వర్గమునకుఁ బోకుఁడు వృథగాఁ గట్టుడులు బడియెదరు.

సిద్ధులు——అలాగునా, అయ్యో! పాపము మన యింద్రుని పనియేమగునో కదా! అని వెఱచుచు నంకరు వడిగాఁబారిపోయిరి.

ఆ సంవాదమంతయు మావిమానము ప్రాంతమందే జరిగినది. అట్టి సంవాదము విని జయంతుఁడు తిలోత్తమంజూచి వాల్గంటీ! వీరిమాటలు వింటివా నీవింటికిఁబొమ్ము. నేనారక్కసుని యుక్కుమాపి మాతండ్రిని విడిపించుకొనివచ్చెదను. నేనులేకపోవుటఁగదా యింత పుట్టినది. కానిమ్ము. అని పలుకుచు నాయుధములు ధరించి రౌద్రాకారముతో వడిగా విమానము దిగి యెక్కడికోపోయెను.

అత్తరినతిలోత్తమయు నావిమానము నందనవనములోనున్న విమానశాల లోనికిఁబోయిన నందు దిగఁబోవుసమయమున నన్నుజూచినది. నేనును బురుషులెవ్వరు లేరను ధైర్యముతో స్తంభము మాటునుండి దానికన్నులంబడితి. అక్కన్నియ నన్నుఁ జూచినతోడనే విస్మయమందుచు అయ్యో! తమరెవ్వరు? ఈవిమానముమీఁదికెట్లు వచ్చితిరి. మీరు నివసించు లోకమెచ్చట. మీవృత్తాంతము చెప్పుఁడని యడిగినది. నేనును గొంచెముసేపాలోచించి యింతీ! వినుము. మా కాపురము శ్రీజగన్నాథము, నేను స్వామిభక్తుఁడను, నాపేరు రుచికుఁడందురు. సంతము మాలికలుగట్టి స్వామికర్పించుచుందును. ఇట్లుండ నేను మొన్నను స్వర్గవిషయములన్నియు నొకచోటఁ బురాణములో విని దాని జూడవలెయునని వేడుక పడుచు స్వామిని ప్రార్థించి నిద్రఁ బోయితిని.

భక్తపరాధీనుఁడగు జగన్నాథస్వామి నాకుఁగలలో దర్శనమిచ్చి వత్సా! నీవు చింతింపకుము. నీయభీష్టముతీర్చెదను. రేపటిరాత్రి యీయూరనున్న చంద్రరేఖ యను వేశ్యామణి పెరటితోటలోని యశోకపాదపము నెక్కియుండుము. అప్పటికిఁ

తిలోత్తమాజయంతులు విహారార్థమై విమానములో వత్తురు. నీవప్పుడా విమాన మెక్కుము. దేవలోకమునకుఁ బోయెదవు. దేవదానవయుద్ధకారణమున దేవతలందరు దనుజలోకమునకుఁ బోవుదురు. తిలోత్తమతో నీకు మైత్రి గలుగును. ఆ కాంత యేకాంతముగా నీకు స్వర్గలోక విశేషములన్నియుం జూపునని చెప్పి యంతర్ధానము నొందెను.

నేనునుఁ దద్వచన ప్రకారము జరిగించి మీలోకమునకు వచ్చితిని. స్వామివచనము తప్పదుగదా. నీవు తిలోత్తమ గావచ్చును. ఈ పైకార్యము నీ కతంబున జరుగవలసియున్నది. ఇదియే నావృత్తాంతమని చెప్పితిని. నా మాటలు విని యవ్వనిత తన హృదయంబునం గల భయభక్తి విశ్వాసంబులు మొగంబునఁ గనంబడ నభినయించుచు నోహో! స్వామికార్య మెల్లరకు నాచరణీయమే యగుంగదా? మీకార్యము జక్కఁజేసెదను. ఇంచుక సేపిందు నివసింపుడు. గ్రామవిశేషములరసి వచ్చెదనని పలికి నాయనుమతివడసి యప్పడఁతి వీథిలోనికిఁ బోయినది.

అప్పుడు నందనవనములో నెవ్వరులేరు. రాక్షసభయముచేఁ గాపరులు గూడ పారిపోయిరి. అట్టివనములో నేను యథేచ్ఛముగాఁ గ్రుమ్మరుచు మనోహరములైన పూవులనుగోయుచు మధురములగు ఫలములం భక్షించుచు సంగీతవృక్షముల గానం బాలించుచు నీరీతి గొంతతడవు విహరించితిని. మఱియు నందున్న విరులేరి, చక్కని దండలు గట్టితిని. ఇంతలో తిలోత్తమ యరుదెంచి ఆర్యా! నేను వీటిలోనికిఁబోయి వచ్చితిని. రాక్షసభీతిచేఁ దలుపులన్నియు మూయఁబడి యున్నవి. ఈ పట్టణమంతయు యంత్రములచే సమర్పఁబడియున్నది. యొకచోట కీలుద్రిప్పినచో మార్గము లన్నియుం గప్పఁబడును ప్రతిగృహమునకు మఱుఁగు తెరవుగలదు. అవి మాకు గాక యొరులకుఁ దెలియవు. నీకా విశేషములన్నియుం జూపెద రమ్మని పలుకుచు నేను గట్టిన దండలు జూచి వెఱుగుపడుచుఁ దొలుత నాకు నందనవన విశేషములం జూపినది.

చంద్రలేఖా! ఆ నందనవన విశేషములు చెప్పుటకు నావశమా? అహా! అవ్వనములోని తావి యాఘ్రాణించిన సౌఖ్యమును దలంచికొన్న నిప్పుడు గూడ మేనుగరపు జెందుచున్నది. అత్తోఁట స్వర్గపట్టణమునుండి తూర్పుగానున్నది. అందు మొదట విమానశాలలు తరువాత చిత్రశాలలు పిమ్మట విహారశాలలు, అటుపైన రత్నశాలలు. నడుమ నడుమ ననేకశాలలు గలిగియున్నవి. ఫలజాతులు పుష్పజాతులు క్రొత్తలేకాని చూచినది. మరలిఁ గనఁబడలేదు ఆతోటలోఁ బోవుచుండ నొకదండ వర్షాకాలము పోలిక జలయంత్రములం జిమ్ముచు తుంపురుల బెంపున మేనుదడియుచు. ఒక పొంత హేమంతమురీతి మకరందమిశ్రితమగు శీతలమారుతములఁ జలిజేసియుం చును. ఒకచెంత వసంతము భంగి సర్వసు మనస్సంపూర్ణంబై మలయానిలములు హాయిసేయును. ఒకఛాయ గ్రీష్మము తెఱంగున రవికాంత శిలాదీపికలాపంబులఁ

దాపంబు గలుగఁజేయును. అట్టి వనములోఁ బెద్దతడవు దిరిగితిని కాని యెప్పటికిని తుదయు మొదలునుఁ గనంబడినది కాదు.

మణిశిలలచేత నడుమ విశాలముగా మార్గంబు లేర్పరుపఁ బడియున్నవి. అందు దిశాభాగవిభాగము తెలియదు. పెక్కేల నా చక్కనితోటలో నొక్క నిమిషము వసియించినం జాలదే! బ్రహ్మపదమేల? దాననేకదా భూమియందనేక సుకృతములు చేసినవారు గాని స్వర్గమునకుఁ బోవలేరు నీ కతంబున నాకే సుకృతమును లేకనే యట్టి సౌఖ్యంబు దొరికినది. అంతకుమున్ను రక్కసుల రాయిడికోడి పొదల మాటున దాగియున్న వనపాలికలు తిలోత్తమంజూచి ధైర్యముతో బైటికి వచ్చి నన్నుఁజూచి సంకోచించుచుఁ జేసన్నలఁ జేయుచుండ నవ్వేదండగమనయు, రండు రండు. ఈతం డొక పుణ్యపురుషుండు. రక్కసులెక్కడికోపోయిరి. మన ప్రభువు రక్షాఖుం బరిమార్చి దాగలండని ధైర్యము గరిపిన వారును సంతోషముతో బయల్పడి జయజయధ్వనులు చేయుచు నాట్యములు సేయఁదొడంగిరి.

బోటీ! అచ్చటి పాటల గంధులందరును సన్నని నడుములును గొప్ప పిరుందులును, పలుచనివ్రతువ మొగంబులును, విప్పిన నెమలిపింఛముల చొప్పున నొప్పారు కేశపాశంబులుం గలిగి తారతమ్య మరయరాక యొక్కపోలికనే వెలయుచుందురు. అన్నన్నా! విధి సృష్టికి మేరలేదు సుమీ? దివిజకాంతలంజూచి మనుష్యకాంతలందలంచు కొనినంతఁ బరిహాసాస్పదముగా నుండురు. మిక్కిలి సంతోషముతో నత్తోటలోఁ గుమ్మరుచు నొకచోటఁ బలుతెరంగుల మనోహరస్వరంబులీనుగానంబువెల యింపుచున్న యొక్క మ్రానుంజూచి యాశ్చర్యంబేరియని యడుగఁగా దిలోత్తమయిట్లనియె. అయ్యా! ఇది సంగీతవృక్షము. పెక్కండ్రు వైణికులు పాడినట్లు పాడును. గాలి వీచినకొలది వింతవింతస్వరములు, రాగములు జనించును. మా లోకములో నెక్కుడు విశేషమిదియేయని చెప్పఁగా నేను గాంతా! యీవృక్షమునకు బీజమెట్టిది. దోహద మేరీతి? మాలోకమునంబారిన బ్రతుకునా? దీనివిశేషమెఱిగింపుమనియడిగితిని. అదియుఁ గొంత సేపాలోచించి అయ్యా! యీపాదపము పూర్వము కైలాసమునందుండునది. శివునింబ్రార్థించి విష్ణుడు తనలోకమునకుఁదెచ్చుకొనియెను. తరువాతనందుండి శతానందుండు ముకుందు నడిగి తనలోకమునఁగూడ దీని విస్తరింపఁజేసెను. బ్రహ్మను వేడికొని యింద్రుడీ లోకములో నాటిన మిగుల వ్యాప్తమైనది. అని యావృత్తాంతముజెప్పి యప్పుడతి నన్నుఁ బట్టణము లోనికిం దీసికొని పోయినది

అయ్యారే! అందుఁగల విశేషంబు లెరిగింప నాకేమియుఁ బాటవములేకున్నది. నేనుఁ జూచిన దానిలో సహస్రాంశమైనను నా హృదయంబునందోచదు, తోచిన దానిలో సహస్రాంశమునైనఁ జెప్పనేరుపు లేదు. ఆహా! నేనొక వీథిలో నిలువంబడి చూచితిని. ఎటుచూచినను సౌధములును వీధులునుగానే తోచినవి. ఇది రాజమార్గము, ఇది సౌధ, ఇది భూమి, ఇది యాకసమనియు దెలియ శక్యము గాకున్నది.

మన దేశములో నుసిరి కాయంత మణి దొరికిన నబ్బురముగా నుండును. అచ్చట నున్న శిలలన్నియు మణులే ! రాజమార్గములన్నియు మణిఖచితములగుటచే నందు సౌధములు ప్రతిఫలించి యడుగునఁ గూడ పట్టణమున్నట్లు తోచును.

అట్టి వింతలంజూచి దారి తెలియక నేను దెల్లబోయి చూచుచుండ, నా యండజయాన నవ్వుచు నిలువంబడి యేమియది చూచుచుంటివి నా వెంటరావేయని యడుగఁగా నయ్యో ! నీకును నాకును నడుమ ప్రవాహమున్నది. ఎట్లుదాటఁగలను. ఈ గట్టు దూకుటకు నే నోపుదునా ? ఈ తలుపు మూసియున్నది. ఏలాగున వత్తును. అని యీ తెఱంగునఁ బల్కుచుండ నా చేయి పట్టుకొని నీవు చూచినది మణికాంతి ప్రవాహము కాదు. రమ్ము రమ్ము. ఇది తలుపు కాదు. ప్రతిబింబము భ్రమయక చక్కగా నిదానించి చూడుము. ఇది దేవసభకుఁ బోవు రాజమార్గము. దీని ప్రక్కల నున్న మేడలు మిగుల గొప్పవి వీని విశేషములఁ బరిశీలింపుమని పలుకుచుండ నేనిట్లంటిని.

తిలోత్తమా ! నీ పుణ్యము నా చేయి విడువకుము. ఎడమైనచో నీవును నాకుఁ గనంబడకుంటివి. క్రిందఁగూడ మేడలన్నవా యేమి ? నా కేమియు దారి తెలియదు నిలుసిలు అయ్యో ! ఈ ప్రహరినెట్లు దాటిపోయితివి. ఈ శ్రేణి యెచ్చటనుం గనంబడినదే ? అని యిట్లు బలుకుచుండ అయ్యో ! నీ కెన్నిమారులు చెప్పితిని, ఇది గోడకాదు. మణిశిలాప్రతి ఫలితములగు సౌధములు తగులదు. రమ్మని పలికి క్రమంబున నా వీధులన్నియుం ద్రిప్పినది కాని నా కేమియునుఁ దెలిసినది కాదు. అప్పుడా మేడ తలుపులన్నియు మూయబడి యున్నవి. మొదట నా కెవ్వరును గనంబడలేదు గాని యా మేడఁ మీఁదనున్న సాలభంజికల జూచి దేవకాంతలని భ్రమయుచుండ నవి బొమ్మలని యది చెప్పి నా సందియము దీర్చినది.

అందున్న మానికపు బొమ్మలను గొమ్మలకును భేదముఁ గనిపెట్టుట మిక్కిలి దుర్ఘటనము. తరువాత నా నాతి నాకాభమనంతయు నుడివి చూడుమదె పొడవుగానున్నది. జయలలమను పేరుగల యింద్రునిమేడ దానిదాపున నున్నది శచీ గృహము. ఆ ప్రక్కది జయంతునిది. దానికిఁ దూర్పుదెసగా మెరయుచున్న సౌధము లోనే సుధర్మయను పేరుగల దేవసభయున్నది. అవియే దిక్పాలుర గేహములవి యందలి గృహవిశేషములన్నియు వేరువేర నిరూపించి చెప్పినది. నేను వానివిశేషముల కచ్చెరువందుచు ముందు నింద్రునిగృహములోనికిఁ దీసికొనిపొమ్మని కోరగా నది అక్కా ! ఇప్పుడాగృహము వాకిలి మూయఁబడియున్నది. ప్రచ్ఛన్నమార్గము నేనెరుంగుదును. కాని యందనేక దేవతలు కాచికొని యుందురు. నిన్నుఁజూచి శంకింతురు. కావున నచ్చటికిఁబోనవలదు. ముందు మాయింటికిఁ దీసికొని పోయెదను. చూతువు గాని రమ్మనిపలుకగాఁ సంతసించితిని. ఆకాంత నన్నేకాంతమార్గమునఁ దనయింటికిఁ

దీసికొనిపోయినది. అహాహా ! సద్గృహాలంకారవిశేష మేమని పొగడఁగలవాఁడ. చూచిన తోడనే నాకు విభ్రాంతిగలిగి యదియేయవస్థయో తెలిసికొనలేకపోయితిని.

పిమ్మట నన్నొకగదిలోనికిఁ దీసికొనిపోయినది. ఆగదియలంకారమంగాయఁ జెప్పుటకొక సంవత్సరము పట్టును. అందొకహంసతూలికాతల్పముఁజూపి కూర్చుండు మనుటయు సంతసమునొంది యందు గూర్చుండి యాగది యలంకారములు వెఱఁగు పాటుతోఁ జూచుచుంటిని. ఇంతలో నాతిలోత్తమ జగన్మోహనంబగు వేషంబుగా నలంకరించుకొని నా మంచపుదాపునకువచ్చి నిలువంబడినది. నేను మొదట నాయువతింజూచి మఱియొకతె యనుకొంటిని. అంతలోఁదెలిసికొని మోహాక్రాంతస్వాంతుండనై చూచుచుండ నార్యా! నీవు మాయింటికతిథిగా వచ్చితివి హరిభక్తుండవు. నిన్నర్చించవలసి యున్నది మా సపర్యలనందుము. అని పలుకుచు నామేనఁ జందనమలఁదినది. అయ్యంగరాగంబు పరిమళము భూలోకములో లేదనిచెప్పగలను.

మందారకుసుమదామంబు చిరునగవు మొగంబునకురవణంబై మెఱయ నా మెడలో వైచినది. తన మృదుకరతలస్పర్శంబున నామేను ఝల్లుమన్నది. ఒడలుపరవశమైపోయినది. చంద్రలేఖా ఇఁకజెప్పనేమి యున్నది. దానిచిట్టకంబులు సిగ్గునకగ్గమై యున్న నాచిత్తమును శృంగారలీలాయత్తమును గావించినది.

అప్పుడు నేను దుగువమై దేగునా ? నీయపూర్వ సపర్యలకు నాడెందం బానందము జెందినది. నీవు దేవకన్యవు. నీయర్చనఁగైకొని యూరకుండరాదు. ప్రత్యర్చన జేయవలసియున్నది. ఆ గిన్నెనిటు దెమ్మనిపలుకుటయు నక్కుటిలకుంతల రసికశేఖరా ? నీయభీష్టమెట్లో యట్టుకావింపుము అని పలుకుచు నాగంధభాజనము నా కందిచ్చినది. నేనుగౌతమునితోఁ గూడ శృంగారప్రబంధముల జదివియున్నకతంబున నాగంధము జేతనందుకొని దాని మేనంబూయుచుఁ గళాస్థానములంటి యావాల్గంటికిఁ బులకలు బొడమఁజేసితి. తరువాతఁ జెప్పవలసినదేమిగలదు నీవే గ్రహించుకొనుము.

శ్లో॥ తన్మయఃకిమహంబాలా మన్మయాకిముభావపి
కిమానందమయావేతి నవిజ్ఞాతంపుయాతథా.

అప్పుడు నేను తన్మయత్వము నమ్మువతి మన్మయత్వము నొందుటచే మేమెట్టియానందమనుభవించితిమో మాకేతెలియదు.

శ్లో॥ కిం నాథః నిర్దయతరం భుజకందళీభ్యాం
ద్వాభ్యాంనిపీడయసి మాంన సహిష్ణు రస్మి
యమ్మభువామితి సుఖేష్వపి దుఃఖభాజాం
ధన్యాప్రశృణోతి యదికుట్టమితాక్షరాణి.

శ్లో॥ శ్యామా కపక్కృతికా బదలా మృగీవా
గంధర్వయక్షసుర నిర్జర కన్యకావా
బాలధవాభినవయౌవనభూషితాంగి
సాభామినీభవభుజాంపరమంరహస్యం

దేవకన్యలలో స్వర్గగణ్యయగు తిలోత్తమ సౌందర్యచాతుర్యాదివిశేషములు యౌవనలావణ్యములు క్రీడావినోదములు, మనోహరములని వేరచెప్పవలయునా ? ఆచేడియతో వేడుకలెంతకాలమనుభవించితినో చెప్పజాలను. గడియవలెనైనఁ దోచలేదు. కాని యింద్రుడువచ్చి నాకపటము గ్రహించి నన్ను శిక్షించునేమోయను వెఱవు పానకములోఁ బుల్లవలె నామదికిఁ గలుకుగా నాటుచునే యున్నది.

మఱియు నానెలంత నేనుగోరికొనిన నొక్కనాఁడు దేవసభఁ జూపింప నన్నుఁ దీసికొని పోయినది. అప్పటికి దేవేంద్రుని జాడ యేమియు దెలియలేదు. పురమంతయు నారీతినే యున్నది. అప్పుడప్పుడతి నన్నొక ప్రచ్ఛన్నస్థలమునకుఁ దీసికొనిపోయి యందున్న యొకమరుఁగు ద్రిప్పగా నొక తలుపు తెరవఁబడినది. అమార్గము లోనికిఁ బోయితిమి. అదియొక గుహవలె నున్నది. కాని రత్నకాంతులచేఁ జీఁకటి యెంతమాత్రమునులేదు. నిరాటంకముగా నామార్గమునం బోవంబోవ నాదేవసభ గనంబడినది.

ఆ దారి యింద్రుడు గూర్చుండెడి పీఠము వెనుకకుఁబోయినది. ఆ సభఁ జూచినంత నాస్వాంతమున నేవస్తువునకును మితిలేదని నిశ్చయించితిని. అందున్న ప్రతివిశేషమునుఁ జూచినదానికన్నఁ గ్రొత్తవింతగాఁ గనంబడుచుండెను. అ సభ చతురశ్రముగా యోజనోచ్ఛ్రయము గలిగియున్నది. తూరుపుదెసఁ జింతామణియను పేరుగల యింద్రుని సింహాసనము నవరత్నఖచితమై యున్నది. ఇరుప్రక్కలను రత్నపీఠములు పెక్కురకములవి యొప్పుచున్నవి. దక్షిణోత్తరభాగములయందు దేవతలు గూర్చుండెడు పీఠములున్నవి. ఎదుర రంభాదుల నాట్యము జేసెడు రంగస్థలము మిక్కిలి వింతయగు నలంకారము గలిగియున్నది

దిక్పాలురును, మహర్షులును, బృహస్పతియు, నింద్రుని ప్రాంతమందుగల పీఠములపైఁ గూర్చుందురట. ఆపీఠములు శ్రేణిగా నుక్రమక్రమోన్నతముగాను నుంపఁబడినవి. అ సభాలంకార మదివరకందు నేనుఁ జూచినదానికన్న వింతగానున్నది. పెక్కేల నచ్చట విశేష మొక్కొక్కటి చెప్పుటకుఁ బెద్దతడవు పట్టును చూచినదే పలుమారు చూచుచు, నడిగినదే పెక్కుసారు లడుగుచు, నీరీతి నాయా స్థానములోఁ గ్రుమ్మరుచుండగా నింతలో నాగుప్త ద్వారమున నెవ్వరో మాట్లాడుచున్నట్లు వినంబడి

నది ఆరొదవిని తిలోత్తమ జడియుచు నాచేయిపట్టుకొని చింతామణి పీఠముమాటునకు లాగికొని పోయినది. నేనును భయపడుచు నొకమందసము సందున దాఁగియుంటిని. మేమున్న చోటునకు గుప్తద్వారము దాపుననే యుండుటచే నచ్చటివారి మాటలు మాకీరీతి వినంబడినవి.

విజయుడు—నందా! ఈ రహస్యకవాటము తెరవబడియున్నదేమి శత్రువులెవ్వరేనిఁ దెలిసికొని లోపల దూరలేదు కదా! నిన్ను సంతతము నిచ్చటఁగాపుగా నుండమని మన ప్రభువు నియోగించెను గదా యేమి చేయుచుంటివి?

నందుడు—విజయా! ప్రమాదము వచ్చినది. కాపాడుము నేను సురాపానమత్తుండనై రతికేళిఁ జొక్కి యిక్కడకు రామరచితిని. ఈ సంగతి మనయేలికకు దెలిసెనేని శిక్షించును. నీవు గుప్తముగా నుంచుమీ.

విజయుడు—కరచినదానికి పగలినం బ్రయోజనము లేదుకదా దానికేమి తెరచియుండుటకు గారణమాలోచింపుము. ఇప్పుడు ఇంద్రుడుగూడ వచ్చుచుండిరి. వెంటనే సభకు వేంచేయుదురట. సిద్ధముగా నమర్చి యుండవలయును.

నందుడు—మనమే మరచియుండవచ్చును. ఈసంగతి శత్రువులకెట్లు తెలియును. మన దేవేంద్రుని కెట్లు విజయము గలిగినదో చెప్పుము.

విజయుడు—విను మతనిం గట్టితీసికొనిపోయి రక్తాక్షుండొక బందీగృహములో నుంపించెను.

నందుడు అయ్యో! పాప మెంతవారి కెట్టి అవస్థవచ్చినది. తరువాత.

విజయుడు—ఇంతలో జయంతుడుపోయి యా ర్కేదిమ్మరి యేమరుపాటుగా నున్నతరి వానిపైబడి సంహరించెను. పిమ్మట రక్కసులందరు పారిపోయిరట.

నందుడు—ఓహో! మన జయంతు డెంతపరాక్రమము చేసెను! మొదట గ్రామములో లేడాయేమి?

విజయుడు—లేడు. ఎచ్చటికో విహారార్థ మరిగెను.

నందుడు—కృష్ణమూర్తివచ్చి సహాయముచేసెనని యొకవదంతి పుట్టినదేమి?

విజయుడు—అదియు నుండవచ్చును. శ్రీహరికటాక్షములేక యెట్టివారికిని జయము కలుగదుగదా.

నందుడు—ఇప్పు డీసభకువచ్చి యేమిచేయుదురు.

విజయుడు—దిగ్విజయ విశేషములం జెప్పుకొని సంతసింతురు.

నందుడు—అట్లయినం ద్వారగారమ్మ. పీఠములన్నియు జక్కగా సవరింతము.

అని యారీతి నొండొరులు సంభాషించుకొనుచు వచ్చి యాపెద్ద గుమ్మము తలుపులు తెఱచిరి. అప్పుడు నేనును దిలోత్తమయును నా పెట్టెపాటున నణగి యుంటిమి. మఱియు నేను భయపడి తిలోత్తమతో మన మవ్వలకు బోవలదా? అని పలికినంత నానోరు మూయుచు మాటాడవలదని సంజ్ఞచేయుచు నన్ను బట్టుకొనినది. అంతట భేరీధ్వనులు వినబడినవి. ఆ ధ్వనుల వలన నాగుండెలు పగిలినవి. పిమ్మట మేళములతో జయజయధ్వను లేపార వాసవుడా సభాభవనమునకు విచ్చేసెను. మే మెవరికి గనంబడుటలేదు. కాని అందరును మాకు గనంబడుచుండిరి. అది రహస్యస్థలమని యెఱుగుము. కావున దిలోత్తమ నిర్భయముగా నుండుమని నాకు బోధింప దొడంగినది.

# ఇంద్రుని కథ

పిమ్మట నింద్రుడు తన సింహాసన మలంకరించిన తరువాత దేవతలు, మునులు వారివారి ప్రదేశమ్ములం గూర్చుండిరి. అప్పుడు బృహస్పతిలేచి యా రక్కసునివధవిశేషము లుగ్గడింపుచు జయంతుని పరాక్రమమునుగురించి కొంతసే పుపన్యసించెను. అచ్చట నున్నవారందరు తమకు దోచిన ప్రకారము క్రమముగా నుపన్యాసము లిచ్చిరి. పిమ్మట రంభాదుల నాట్యవినోదము జరిగినది. అట్లు కొంతసేపు దేవేంద్రుడు సభజేసి తన విజయమును గురించి నుతియించుచు దేవతలకు గానుకలిచ్చి వారి వారి నివాసములకనిపి తానును వైజయంతమునకు బోయెను. పిమ్మట నా సభాద్వారము మూయలేదు. అచ్చట ద్వారపాలకులు పిచ్చుకత్తులతో గాచికొని యుండిరి. మాకా దారినిబోవుటకు వీలులేకపోయినది.

అప్పుడు తిలోత్తమ పెక్కు తెరంగుల నంతరంగమునం దలపోయుచు ప్రతీహారులకు గనబడకుండ నాగుప్తద్వారము దాపునకు నాతోగూడ బోయినది. అంతకుమున్న మేము వచ్చిన ద్వారమును విజయునందు ననుమానపడి బిగించి లోపల బీగమువైచిరి. దానింజూచి తిలోత్తమ గుండెపైడ జేయివైచుకొని అమ్మో! ఇక మనకు బ్రదుకులేదు ఈ ద్వారమునకు దాళమువైచిరి. మరియొక దారినిబోవుట శక్యము గాదు. ఇంద్రుని యానతిలేక పెద్దగుమ్మమున జీమకయినను రాకపోకలు గలుగుట

కష్టము. ఇప్పుడు మనలను జూచినచో శంకింతురు. ఎన్నిదినము లీమాటున నుందుము. నాకుగూడ నవ్వలకుబోవుట దుర్ఘటము. ఈ సభలోనికి వచ్చువారికి బోవువారికిని లెక్కయున్నది. ఆ మార్గమునరాక నేను బోయినచో నెట్లు లోపలికి బోయితివని యడుగకుందురా! అడిగినప్పు డేమిచెప్పుదును. అని పెక్కుతెఱంగుల దలపోయుచు నంతలో గన్నులఁదెఱచి ఆఁ! జ్ఞాపకము వచ్చినది. రుచికా! మనకొక యాధార మున్నది. రేపు రాబోవు శుక్రవారమున నీయూరిలో శ్రీపుష్పయాగమను నుత్సవము చేయుదురు. ఆ యుత్సవమునకయి రాత్రి పార్వతీపరిణయమను నాటక మీసభలో నాడుదురు. అప్పుడు మిగుల సమ్మర్దముగా నుండును. ఆ సందడిలో నెట్లయిన దాటి పోవచ్చునని పలుకుచు మరల భీతినభినయించుచు నయ్యో! దీనిలో నాకొక యుపద్రవము బొడగట్టుచున్నదే ఆ నాటకము బృహస్పతిగారు రచించిరి. అందులో నే నొక భూమికను, ఊర్వశి పార్వతివేషము వైచును. నేనామె చెలికత్తెయైన జయవేషము వైచుటకు నిరూపింపబడితిని. కథాసరణియంతయు నిదివఱకే వర్ణించితిని. ఆ నాటకములో భూమికలుగానున్న వారందరు రేపటిరాత్రి బృహస్పతిగారి యింటికి బోవలయును. అప్పుడే నాపరీక్ష వచ్చును. దీని కేమిచేయుదును. అని పెక్కు తెఱంగుల జింతింప దొడగినది.

దాని యధైర్యమునుజూచి నేనును విచారింపుచు మనంబున మా కులదైవ మగు జగన్నాథస్వామిని ధ్యానింపుచుంటిని. అదియు దుఃఖావేశమున మేను తెలియక పడియున్నది. అప్పుడు నాకు మిక్కిలి యాకలిగా నుండగా నాసభలో నలంకారమున కయి వ్రేలగట్టిన ఫలములను కొన్ని తిని యాకలి యడంచుకొంటిని అట్టి విచారముతో నాదినము గడపితిమి. మరునాడు తిలోత్తమ తనకు వాటిల్లిన యిడుమును గురించి విచారింపుచుండగా నింతలో భేరీధ్వని యొకటి వినబడినది. ఆ రవము చెవియొగ్గి విని యోహో! ఇంద్రుడుగారిప్పుడు సభకు వచ్చుచున్నారు. ఎద్దియో కారణమున్నది. లేకున్న నసమయమున నిచ్చటికిరారు. ఎంతయో గొప్ప కారణముండినగాని క్రొత్త వేళల నోలగము సేయరు. ఆయన యాస్థానసమయము లన్నియును మాకు దెలియును. కావున నిప్పుడేమేమి చెప్పుకొనియెదరో వినవచ్చును. సావధానముగా నుండుము. తల మాత్రము పైకెత్తకుము అని పలికినది.

ఇంతలో దేవేంద్రుడు బృహస్పతి దేవతలు విచారముఖములతో సభకు వచ్చి వారివారి స్థానముల గూర్చుండిరి. రంభాది దేవకాంతలు వచ్చిరి గాని నృత్యగీతాది వ్యాపారములుమాని నిశ్శబ్దముగా నెదుర నిలువబడిరి. పిమ్మట దేవేంద్రుడులేచి యెల్లరు వినునట్లనియె. ఆచార్యా రక్తాక్షుని పుత్రుడు విరూపాక్షుడను వాడు సంగర

మునుపోడి పారిపోయినవార్త మన మెఱిగినదేకదా ? ఇప్పుడు వాడు సేనలం గూర్చుకొని మనపట్టణము ముట్టడించుటకై వచ్చుచున్నవాడని యొకకిం వదంతి పుట్టినది. దాని నిజము దెలియుటకయి చారులం బంపితిని. మనము జేయవలసిన శ్రీకృష్ణయోగోత్సవము చేయదగినదా లేక ప్రస్తుతము మానదగినదాయని యడుగగా బృహస్పతిలేచి యిట్లనియె.

దేవేంద్రా! విరూపాక్షుడు మిక్కిలి బలవంతుడగును. అట్టి ప్రయత్నము చేసినను జేయవచ్చును. అట్టి వదంతి వచ్చినని త్రోసివేయరాదు మనప్రయత్నములో మనముండవలయును. ఈ యుత్సవము మరియొకప్పుడు చేసికొనవచ్చును. మనవీటి మార్గములన్నియు గట్టిపట్టాజ్ఞ యిప్పింపుము అని బృహస్పతి చెప్పగా విని దేవతలందరు నాయాలోచన యుక్తముగానున్నదని యొప్పుకొనిరి. అప్పుడు దేవేంద్రుడు స్వర్గపుర వాకిళ్ళన్నియు మూసివేయుటకును దేవసైన్యమంతయు నాకముచుట్టును గాపుండునట్లును, ఆజ్ఞయిచ్చి యంతటితో సభ ముగించి యింటికిబోయెను. వెంటనే యచ్చటనున్న ద్వారపాలురు సభా సింహద్వారము తలుపులు బిగించి ప్రచ్ఛన్న మార్గమునకు వచ్చిరి. మేమంతకు పూర్వమే వేరొకమందసము మాటునకు బోయితిమి. కావున మమ్మును జూడకయే యాతలుపు తెరచుకొని మరలమూసి వారు పోయిరి.

అప్పుడు తిలోత్తమ సంతసించుచు నన్ను జూచి ఆర్యా! మనయందు దైవానుగ్రహము గలిగియున్నది. విరూపాక్షుని మూలమున మన మీసభలో నుండి దాటిపోవచ్చును. ఈ గుప్తద్వారము తలుపున తాళము వైచియుండలేదు. కాని నందుడనువాడు సంతతము దాపున గాపుండును. కాన నేను వానిని మోహపెట్టెదను. నీవు నావెనుక నుండుము. నందుడందు గాపుండినచో వానినెద్దియో మాటలనండడిని దూరముగా దీసికొనిపోయెదను. ఆ సమయమున నీవు బైటికి వచ్చి యందున్న భిత్తి మాటున నిలువుము. పిమ్మట నేను గలిసికొని తీసికొనిపోయెదనని చెప్పి మెల్లన నన్ను గుప్తద్వారము దాపునకు దీసికొని పోయినది.

అచ్చట దడవి యొక మరపట్టుకొని త్రిప్పగా నాతలుపులు తటాలున దెరవబడినవి. అప్పుడందున్న నందుడు ఎవ్వరువారని కేకలువేయగా తిలోత్తమ పైకిబోయి నందా! నేను తిలోత్తమను నన్ను లోపలబెట్టి తలుపులు వైచితివేమి! నన్ను జూచుటలేదా యని చెప్పినది. అప్పుడా నందుడు విమర్శించి ఏమీ! నీవు మొదట సభలోనికి బోయితివా ? నిన్ను నేజూడలేదె ? నీవిషయమయి కనబడలేదని యందరు చెప్పుకొనుచున్నారే ? నీమాట దబ్బరగా నున్నదని పలుకగా నది యాహో! నందా! నీభార్య బాగున్నదా! దానికిని నాకును మిక్కిలి స్నేహము. నీతో నామాట యెప్ప

దైనం దెప్పునా ? నీవు నాకు ఆపకి బావ వగుదువు. మాయక్క నడిగితినని చెప్పుము. మరియొక రహస్యమున్నది. చెవిలో జెప్పవలయు నిటురమ్ము. ఎవరికిని జెప్పవుగదా ? నాచేతిలో చేయివేయుమని పలుకగా నందుకు నవ్వుచు మరదలా ! అది యేమి రహస్యము చెప్పుమని పలుకుచు తిలోత్తమ యొద్దకుం బోయెను.

అదియు వాని క్రమక్రమముగా దూరముగా దీసికొనిపోయినది. అది యంతయు నేను వివరములోనుండి చూచుచునేయుంటిని అతడు దూరముగాబోయిన వెంటనే బయలువెడలి యది చెప్పిన గోడ మాటున దాగితిని. వానిచెవిలో నేమి చెప్పినదో వాడు మిగుల సంతోషింపుచు వచ్చి యాగుమ్మమును మూసి యచ్చట గాపుండెను. తిలోత్తమయు నందా ! ఈ గుమ్మమును భద్రముగా గాపాడుచుండ వలయు జుమీ ? యని పలుకుచు మెల్లన నాయొద్దకు వచ్చి నన్ను వెంటబెట్టుకొని రహస్యముగా దనయింటికి బోయినది.

ఆహా ! అప్పుడునాకు మృత్యుముఖమునుండి వెలువడినట్లుగా నున్నది. పిమ్మట నాకొప్పు చెలికత్తియలంజేరి తాను వెళ్ళిన తరువాత నేమి జరిగినదని యడుగగా నిట్లనిరి. అమ్మా ! నీవు పోయిన వెనుక మొదట జయంతుడు వర్తమాన మంపెను. తరువాత బృహస్పతి పంపున నిన్ను బిలుచుటకు రంభ వచ్చినది అప్పుడు మేము ఇంటిలో లేదనియు యెప్పటికి బోయినదో మాకు దెలియదని చెప్పితిమి. తరువాత నింద్రుడు వార్త నంపెను. నీవిషయమై బృహస్పతివారు మిక్కిలి కోపముజేసి యింద్రునితో జెప్పిరట ! ఇంతలో విరూపాక్షుని యల్లరి వచ్చుటచే నీ ప్రశంస యడుగునబడినది. ఇదియే యిచ్చటి వృత్తాంతమని చెప్పిన విని తిలోత్తమ భయపడుచు విచారముఖముతో నంతఃపురమునకు నన్ను దీసికొనిపోయినది.

ఇంతలో వీథిలో నెద్దియో చాటించుచుండిరి. ఆ వార్త తెలిసికొనివచ్చి పరిచారిక అమ్మా ! విరూపాక్షుని గురించి చెప్పినవార్త యంతయు నసత్యమట. రేపు పుష్పయాగోత్సవము జరిగింతురనియు నగరమార్గంబులన్నియు దీర్చబడుననియు యథేష్టముగా నెల్లరు వినోదింపవచ్చుననియు చాటించుచున్నవారు అని చెప్పినది. ఆ మాట వినినతోడనే తిలోత్తమ రేపు పుష్పయాగోత్సవము జరిగిన నాటకమాడుదును. నన్ను విగిలేని నెచ్చటికిని పోయితినని చెప్పుదును ? ఏమి చేయుదునని యాలోచింపుచు నా పజ్జం గూర్చుని యెద్దియో చెప్పుచుండు సమయమున పరికత్తె వచ్చి జయంతుడు వచ్చుచున్నాడని చెప్పినది.

ఆమాట వినినతోడనే యప్పడతి లేచి నన్నొక మూలదాచి యతనికెదురేగి యుచితమర్యాదల దోడితెచ్చి యాతల్పమున గూర్చుండబెట్టినది. అతడప్పుడు తిలోత్తమా ! నిన్ను నిప్పటికి జూచితిని. పార్వతీపరిణయ నాటకములో నీవొక పాత్రము

వటకాదా? సరిచూచుటకయి నిన్నను బృహస్పతిగారి యింటికి బోలేదటే. దాన గోపము వచ్చి యాయన మాతండ్రితో జెప్పెను. నేను దొందరగా బోయితిని. తరువాత నీవేమి చేసితివో చెప్పుమని యడిగిన జయంతునకు దిలోత్తమ యిట్లనియె. జయంతా ! నావృత్తాంతమేమని చెప్పుదును. నీవు దారిలో నన్ను విడిచిపెట్టిపోయితివికదా ! నేనును విమానశాల దగ్గిరకు బోవువరకు నక్కడొక రక్కసుడు నన్ను బట్టుకొని బలత్కారముగా దీసికొనిపోయెను.

నేనెన్నియో కేకలు పెట్టితిని కాని నామొర నాలించువారు లేకపోయిరి. వాడు నన్నొక పర్వతదుర్గమునకు దీసికొనిపోయి యందొక గుహాముఖమున నునిచి తనతో భోగింపుమని చెప్పెను. నేనును సమ్మతింపక వానిని బెక్కుతెఱంగుల నిందింప దొడంగితిని. అప్పుడు వాడు రోషకలుషిత హృదయుడై కన్నులెఱ్ఱంజేయుచు దనచేత నున్న చంద్రహాసము ఝళిపించుచు నీవిందులకు సమ్మతింతువా ! లేక నీశిరము ఖండింపనా యని యడిగెను.

నేనప్పుడు భయపడి యోహో ! తరువాత జూచుకొనవచ్చు నీ గండము గడచినం జాలునని యూహించి ఓరీ ! నేను నీయభీష్టము దీర్చెదను కాని నీవిప్పు డశుచిగానుంటివి. ఇట్టి సమయంబున గ్రీడింపరాదు. స్నానముచేసివచ్చి వార్చి నాయొద్దకు రమ్మని పలుకగా వాడు సంతసించుచు నా చంద్రహాసమందుంచి యందున్న చిన్న కాలువ కభిముఖుండుగా బోరగిలంబడి చేతులతో నెత్తిమీద నీళ్ళు పోసుకొనుచుండెను. ఆ సమయమునుచూచి నేను మిక్కిలి సాహసముతో నా చంద్రహాసము గయికొని వాని కంఠముమీద గట్టిగా వయిచితిని. ఆ దెబ్బతో బాసికలతెగి కొంతదరియవల దొర్లి దొర్లి వెల్లువలో గొట్టుకొని పోయినది

వానినట్లు సంహరించి నేను స్వర్గమునకు వచ్చు దారిగానక చింతించుచు నాపర్వత శిఖరమెక్కి క్రుమ్మరుచుండ విహారార్థమయి కింపురుష మిథునమొకటి యచ్చటికి వచ్చినది. నేనప్పుడా మిథునము కడకుబోయి నాపేరు జెప్పితిని. వారును గురుతుపట్టి నన్ను దమ విమానముపై నెక్కించుకొని యప్పుడే బయలుదేరి యీయూరి తోపులో దిగబెట్టిపోయిరి. పిమ్మట నేనింటికి వచ్చితి. ఇదియే నావృత్తాంతము. బృహస్పతిగారును దేవేంద్రుడుగారును గోపముజేసిన నేనేమి చేయగలదానని చెప్పినది.

ఆ మాటలువిని నేను దాని సమయస్ఫూర్తికి వెఱగందుచు స్త్రీల మాయ లిట్టివిగదా యని శంకించుకొనుచు దానియిడుమల కన్నిటికి నేనేగదా కారణమని గర్హించుకొనుచు నావచుగున నణగియుంటిని. కలికీ ! ఇంకొక్కటి వినుము విహారార్థమై పోయినసంగతి మా తండ్రికిం దెలిసినచో నన్ను నిందించును. నీవుక్కి మీరహస్యము

మాత్రము బయలుసేయకుము తిగిలాగిన తొలక గదలినట్లు నీవృత్తాంతము మూలమున నాగుట్లు వెల్లడియగుచున్నది. నీవార్త మఱియొకలాగున చెప్పుచు మొదటికథ తెలియనీయక నందనవనమునకు విహారార్థమై పోవునప్పుడు రక్కసుడు చెఱగొనిపోయెనని నుడువుము అని చెప్పి యతం డరిగిన వెనుక రంభోర్వశులు వచ్చియున్నారని పరిచారిక వచ్చి చెప్పినది. అప్పుడు వారికెదురేగి తీసికొని వచ్చినది.

వారిరువురు దానిం గౌగలించుకొనుచు ఏమే ప్రాణసఖీ ? నిన్నెవ్వడో రక్కసుడు చెఱగొని తీసికొనిపోయెనట. మాకు తెలియలేదే యెంత ప్రమాదము నీవు నిన్న బృహస్పతిగారి యింటికి రాకున్నవేమోయని యూహించితిమి ఈమాట తెలియక యాయన నీవూరక రాలేదని కోపముజేసెను. అని చెప్పిన తిలోత్తమయు వారికి దగినట్లుత్తరము చెప్పినది నేనొక సందుపుంక వారిద్దరిని జూచితిని. చంద్రలేఖా ! వారి సౌందర్య మేమనిచెప్పుచు. వారేకదా లోకములో సౌందర్యమునకు నవసానభూతులని జెప్పదగినవారు. వారింజూచినప్పుడుగదా కన్నులు గలిగినందులకు ఫలము ! వారి యవయవము లీరీతిగా నున్నవని చెప్పనవసరములేదు. శాస్త్రములో నుత్తమమత్తకాశినుల కెన్ని లక్షణములు చెప్పబడెనో యంతకన్న కొన్ని మిన్నగానే యున్నవి.

నేను దదేకదృష్టిగా వారియవయవము లన్నియు విమర్శింపుచుంటిని. వారు మరల తిలోత్తమతో సఖీ ! యీరాత్రి నాటకములోనికి వత్తువా ? నీభాగము మఱి యెవ్వరు వర్ణింపలేదు. ఆ నాటకమునకు దిక్పాలురందరును వత్తురట మనము చక్కగా వినిపింపవలయునని పలుకగా దల్లిదిప్పుచు తిలోత్తమ వారి కనుగుణ్యమగు మాటలం జెప్పినది. అట్టి సమయమునందు మఱియొక పరిచారికవచ్చి అమ్మా ! ఇంద్రుడుగారు నిన్ను రమ్మనమని వర్తమానము బంపిరి. దేవదూతవచ్చి వాకిట నిలువబడియున్నవాడని చెప్పినది.

ఆ మాటలువిని తిలోత్తమ అక్కలారా ! మీరు పదుడు నేను దేవేంద్రు నొద్దకు బోయివచ్చెద. రాత్రి తప్పక నాటకములోనికి వత్తునని పలికి ముందుగా వారిని సాగనంపి పిమ్మట నాయొద్దకువచ్చి యిట్లనియె. అనఘా ! నీవు వీరిమాటలన్నియు వినుచుంటివికద. ఇప్పుడింద్రుడు వార్తనంపెను. నేనుబోయి యిప్పుడే వచ్చెదను. ఇచ్చటనే యుండుము. ఈలోని కెవ్వరును రాకుండ దాళము వైచిపోయెదను. నీకేమియు భయములేదని పలికి కదలిపోయినది. నేనును నవ్వనిత లేనిసమయమందు నిముషమొక యుగముగా దలంచుచు నేమియుదోచక యాసౌధములో నలుమూలలు గ్రుమ్మరుచు నన్నుయెవరేని వత్తురేమోయని వెఱచుచు నేమాత్రము రొదయైన నదియే

వచ్చుచున్నదని తొంగిచూచుచు నీరీతి నొకయామము గడిపితిని. ఇంతలో నాయింతి నూపురములు నిగుడవచ్చి తలుపు తీసినది. నేను నెమరేగి సభావిశేషము లేమని యడి గిన నిట్లనియె.

ఆర్యా ! వినుము నావార్త కుమారునివలన దేవేంద్రుడు విని నాకు వర్త మానము బంపెను. నేను వెళ్ళినతరువాత నాదరపూర్వకముగనే నాకథయంతయును విని తానుగూడ విచారించెను. తరువాత నీరాత్రి నాటకములోనికి బొమ్మనికూడ నాన తిచ్చెను. ఇంతవరకు జక్కగనే యున్నది కాని మఱియొక చిక్కు తటస్థించునని యోజించు చున్నదాన నాతో నతడు మాట్లాడుచున్న సమయమున విజయుడను సుధర్మాభవన ద్వారపాలుడు వచ్చి దేవేంద్రా ! నమస్కారము నేను సభాద్వారపాలు డను. ఈరాత్రి నాటకమాడుదురని యూసభయంతయు బరిశోధించి యలంకరింపు చుండ జింతామణిపీఠము వెనుక నీకాగితము దొరకినది. ఇందున్నది మనలిపికాదు. మనుష్యలిపివలె దోచుచున్నది. ఒట్టిది యీ సభలోనికి వచ్చుటకు గారణమేమో దేవర వారే యాలోచింపవలయునని పలుకుచు నా యుత్తరము చేతికిచ్చెను. దానింబుచ్చుకొని సకలభాషావేదియయిన దేవేంద్రుడు చదువగా బూవులదండలకయి నీకెవ్వరో వ్రాసి నట్లున్నది. అప్పుడు దేవేంద్రుడు సందేహమందుచు నోహో ! ఈయుదికుడెవ్వడు ఎచ్చటి జగన్నాథము ఈయుత్తరమీసభలో నుండుట మిగుల జిత్రముగా నున్న దేయని పెక్కుగతుల దలపోయుచు రెండవద్వారపాలకుడయిన నందునికి బృహస్పతికిని తక్ష ణమే సందేశము బంపెను. అంతవరకు విని నేను భయపడుచు నింద్రుని యనుమతి వడసి యిచ్చటికి వచ్చితిని.

ఆ యుత్తరము నీవచ్చట మరచితివి కాబోలు. ఇంక మనగట్టు బట్టబయలు కాకమానదు. నందుని నిర్బంధించి యడిగినచో నాసంగతి చెప్పునేమో దానింబట్టి క్రమముగా నిజము లాగికొందురు. ఇదియుంగాక దివ్యజ్ఞానసంపన్నుడగు బృహస్పతి తలచుకొనిన నిజము దాగునా అందులకే బృహస్పతికిగూడ వర్తమానముచేసెను. ఇక నీవిచ్చటనుండిన మాటదక్కదు లెమ్ము నిన్ను భూలోకమునకు దీసికొనిపోయి డింపి వచ్చెదను. నీవు సుఖముగా నుండినజాలు. నా కర్మము నాయది మఱియు నీకొక్క మేలు గూర్చెదను. భూమిలో నొక రాజకుమారిత నాపేరనే యొప్పుచు రూపలావణ్యా దుల నన్నుబోలి సామాన్యుని బెండ్లియాడనని పట్టుపట్టియున్నది. మొన్నటి ప్రయాణ ములో నేను దాని వృత్తాంతము వింటిని. దానికి నీవుదగినవాడవు దానిమేడమీద నిన్ను దించిపచ్చెదను. దానితో సుఖముగా నుండుము లెమ్ము. మరల నేను వేగిరముగావచ్చి నాయిందున కంపుకొనవలయునని పలుకగా విని అయ్యో ! యెంత ప్రమాదము వచ్చి

నది నిష్కారణముగా నిన్నిడుముంబెట్టినవాడనైతినే కటకటా ! యని పలుకుచు గన్నులనీరు గార్చినంజూచి యా చిగురుబోడియు విచారించుచు నేనేమిచేయుదును. నన్ను మించిన యాపద రాబోవుచున్నది. నిన్ను విడుచుట నాకు బ్రాణములవిడుచుటకంటె గష్టముగానున్నది. అయిన నీకు మంచిసౌఖ్యము గలుగజేసెదను. లెమ్మని పలుకుచు నన్ను బ్రచ్ఛన్నముగా విమానశాలయొద్దకు దీసికొనిపోయి యొక విమానముపై నెక్కించి యరగడియలో భూలోకమునకు దీసికొనివచ్చినది

నన్నొక మేడదాపునకు దీసికొనిపోయి యల్లదిగో! ఆమేడమీద దిలోత్తమ యను రాజపుత్రికయున్నది. ఆ చిన్నది విద్యారూపసౌకుమార్యంబుల నన్ను మించి యున్నది. నీకు దానివలన సుఖంబుగలిగెడిని పొమ్ము. నేను పోయివచ్చెద అనుజ్ఞ యిమ్మని పలుకుచు ముద్దాడి విడచినది. తిలోత్తమయు నవ్విమానము దీసికొని స్వర్గమునకు నిర్గమించినది. పిమ్మట నేనామేడమీద సఖులతో గూడ వీణవాయించుచున్న యాయించుబోడింజూచి మోహించితిని. అమ్మగువయు నాయభిప్రాయమెరిగి చెలికత్తెయలకు సన్న సేసినది. కాబోలు నా ప్రోయాంద్రదందరు తొందరగా దలయొకపనిమీద బోయిరి. పిమ్మట జెప్పనదియేమి యా మానినియు నేనును మూడహోరాత్రము లేక దేహమెట్లెట్లవర్తింపుచు గామక్రీడలం దేలితిమి. పెక్కేల నాదివసములో గులశీల నామంబు లొండొరుల నడుగుట నక్కేళీవిలాసంబులనడుమ నవకాశము దొరికినది కాదు. అట్లు మూడుదినములు కామకేళిం దేలి మూడవనాటిరాత్రి మృదుతల్పంబున నలసి సొలసి యక్కలికియు నేనును గాఢనిద్రా వశంవదులమైతిమి.

ఆహా ! దైవప్రయత్న మెట్టిదో చూడుము. అమ్మరునాడుదయమున లేచి చూచువరకు నేనాశయ్యయందులేను. నన్నెవ్వరో యెచ్చటికో తీసికొనిపోవుచుండిరి. యడిగితిని. వారు కొంతసేపటికి మేము దేవదూతలమనియు నింద్రుని యానతి నిన్ను స్వర్గమునకు దీసికొనిపోవుచున్నారమనియు జెప్పిరి. వారిమాటలు విని నేడు స్వర్గమున నెట్టియుపద్రవము పుట్టునటో ! తిలోత్తమమాట నిజమేయైనది. దానినేమి బాధించుచుండిరోకదా ! కటకటా ! ఇంద్రుడు నన్నేమిచేయించునో యని పెక్కు తెఱంగుల దలపోయుచు వారితో నిట్లంటిని.

అయ్యా ! దేవదూతలారా ! మీకు వందనములు సేసెదను. ఇంద్రుడు నన్నేమిటికి దీసికొనిరమ్మనెను. దేవలోకములో నావార్త వచ్చుటకు గారణంబేమి ? మీతో నింద్రుడు నన్ను దీసికొని రండని చెప్పినప్పు డచ్చట నెవ్వరుండిరి. మరియు నేమేమిప్రసంగము జరిగినది నిక్కమువక్కాణింపుడు. మీకు నార్తులరక్షించిన పుణ్యము

కలుగునని వేడుకొంటిని. కాని వారేమియు మాటాడరైరి. ఏమాటయు జెప్పకయే వారు నన్ను స్వర్గమునకు దీసికొనిపోయిరి. నేనును దేవేంద్రునితో నేమని చెప్పుదును. తిలోత్తమమాట జెప్పినను నాకు తప్పు. చెప్పకున్న నొక తప్పు. అచ్చట నేమి జరిగినదో తెలియదు. ఇంతచింతయేల దైవమేమి తోపించిన నట్లు చెప్పెదనని తలచుచు స్వర్గ పట్టణమువీధినుండి పోవుచుంటిని.

ఆ సమయమున నింద్రుడు శివపూజ సేయుచున్నవాడు కావున నవసర మైనది కాదు. అంతవరకు నన్ను నారొక బందీగృహములో నుంచిరి. అదియు భూ లోకములోనున్న కారాగృహమువలె దుర్గంధాంధతమస్సంవృతంబైయుండక యున్నత మగు ప్రహరిచే నొప్పుచు లోన నొక భవనముచుట్టును మిక్కిలి వింతలగు పుష్ప జాతులు ఫలజాతులుంగలిగియున్నది. మనలోకములో రాజభవనమైనను నట్లుండదు. అచ్చట దప్పుచేసినవారిని దానిలో నుంతురట. ఎట్టి శిక్షయో చూతుము గోడమీద వ్రాసిన ప్రకటనను బట్టి యది కారాగృహమని తెలియబడినది.

వారు నన్నట్లు దానిలోబెట్టి కొందరు ద్వారమునందు గావలియుండి మరి కొందరు పురందరుని కావర్తమానము తెలియబరచుటకు బోయిరి. అట్టిసమయమున నేనేమియుంతోచక యత్తోటలో గ్రుమ్మరుచుంటిని. అప్పువ్వులతోటలో నేను సంచ రింపుచున్న సమయంబున నంతలో నంతరిక్షమునుండి యొకచిలుకవచ్చి నాక్రేమోలం వ్రాలినది. దాని నుద్యానవనశుకమేయని యంతశ్రద్ధగా బరీక్షించితికాను. అదియు నన్ను విడువక నేనెచ్చటికిబోయిన నచ్చటికి వచ్చుచుండుటజూచి విమర్శింప దాని ముక్కున నెద్దియో పత్రికయున్నట్లు కనంబడినది. అప్పుడు దానిని పెంపుడుదానిగా గురుతుపట్టి పట్టుకొనబోయిన నదియు నేను జూచుచుండ దనముక్కున నొక్కిపట్టి యున్న యుత్తరమును నాక్రేమోలవైచి కొంచెముదూరముగా నెగిరిపోయినది.

ఆయుత్తర మెద్దియోయని నేను బుచ్చుకొని విప్పినంత నది దేవభాషకాక మనుష్యలిపితోడనే యున్నది. దానింజదువగా నిట్లున్నది. ఆర్యా! నీవు వచ్చినది మొదలు నాకేమియు స్థిమితములేదు. ఇంద్రుడు బృహస్పతికిని నందునికిని వర్తమానము సేసెనని మున్ను నీకు జెప్పియుంటినికదా? వారిరువురును వచ్చినతరువాత నతండా యుత్తరము గురువుగారికి జూపించి యిది మనసభలో నుండుటకు గారణమేమియో యాలోచింపుమని యడిగెను. అతండును దానిం జదువుకొని యోహో! యిది భూలో కములోనున్న శ్రీజగన్నాధపురస్థుడగు రుచికుడను మాలికాకారునికి నొక వారకాంత తనకు గొన్నిపూవుదండలు కావలయునని వ్రాసినటులున్నది. ఈయుత్తర మిచ్చట నుండుట శంకనీయమేయని పలికెను. నింద్రుడు నందుని నిర్బంధించి యోరీ! మేము

లేనప్పుడీసభ కెవ్వరైన వచ్చిరేమో యదార్థము చెప్పుము లేకున్న నిజము తెలిసికొని
నిన్ను శిక్షింతునని యుగ్రముగా బలుకగా వాడు రహస్యము నిలుపలేక వెఱచుచు
స్వామీ! నన్ను రక్షింపుడు నిక్కము చెప్పెదను. నేను కొంచెము మయిమరచి
యున్నప్పు డెవ్వరో గుప్తమార్గమున లోనికిబోయియుందురు. ఆ ద్వారము తెరవబడి
యున్నది. కారణము తెలిసినదికాదు. మరియు దిలోత్తమ మొన్నను లోననుండి గుప్త
మార్గమునవచ్చినది. ఇంతకన్న నాకేమియు దెలియదని చెప్పెను.

ఆ మాటలు వినినతోడనే యింద్రుడు మరియు వెఱగందుచు నోహో!
యిది మిక్కిలి చిత్రముగానున్నది. తిలోత్తమ రక్కసునిచే జిక్కి యెక్కడికోపోయి
యుండగా మనసభలో బ్రచ్ఛన్నమార్గమున నెట్లువచ్చినది. నీమాటయేమియు దార్కా
ణముగాలేదని పలుకుచు నాదలి నిక్కువమరయ నాకుసందేశముపంపెను నేను వెఱ
పుతో నాపురుహూతునొద్దకుంబోయితిని. అతండు నన్ను జూచి నందుడుజెప్పిన మాట
లన్నియుంజెప్పి మొన్నను నీవు గుప్తమార్గమున సుధర్మనుండి వచ్చితివాయని యడి
గెను. అయ్యో! మీరు నన్నట్లడుగుట కాశ్చర్యముగానున్నది. రక్కసునిచేజిక్కి
మిక్కిలి యిక్కట్టుజెందియున్న నేనెట్లి సభకువత్తును. వీనిమాట మీరెట్లు నమ్మితిరి.
ఇదియేమియు నే నెఱుగనని చెప్పితిని.

పిమ్మట నావ్యవహారి యాచార్యుని మొగమును జూచుచు నిది యేమి
చిత్రము. నందునిమాటలు పాటింప దగినట్లు తోచవు. తాను బోవువరకు గుప్త
ద్వారము తెరచియున్న దనుమాట యెంత నిక్కువమో విచారింపవలయును. ఈ
యుత్తర మెట్లువచ్చినదని యడిగిన దిలోత్తమ వచ్చినట్లు చెప్పుచున్నవాడు తిలోత్తమ
కును నీయుత్తర మందున్న రుచికునికిని సంబంధమేమి. దీనికెద్దియో కారణముండ
వచ్చును. గురువర్యా! ఇందలిసత్యము తెలియుట మనకు మిక్కిలి యావశ్యకమై
యున్నది. ముందు నీవా రుచికుడను వాడిప్పు డెచ్చట నున్నవాడో చెప్పుము. వాని
నిందు రప్పించిన నంతయును దెలియనగునని యడుగగా నతండు జ్యోతిష సిద్ధాంత
శాస్త్రమునుబట్టి లగ్నమునుగట్టిచూచి నీవున్నచోటు నిక్కముగా జెప్పెను. తరువాత
నిన్నుదీసికొనివచ్చునట్లు దేవదూతల కాజ్ఞయిచ్చెను. వారు నీకొరకు వెళ్ళినతరువాత
బురుహూతుడు మరియు నందుని దర్కించి యడిగిన వాడు అయ్యా! నామాట దబ్బర
కాదు. తిలోత్తమ లోపలినుండి వచ్చినది. లోపలి కెప్పుడు పోయితివని యడుగగా
నన్ను లోపలబెట్టి యరయక తలుపువైచితివని యెద్దియో గొడవ బెట్టినది ఇదియంతయు
దాని నిర్బంధించి యడిగినం దేటబడును దీనినప్పుడు చూచినవా డొక్కడుగలడు
వానిచేత సాక్ష్యమిప్పించెదనని చెప్పగా మంచిదని యొప్పుకొని యింద్రుడు వాని
నప్పుడే రప్పించి యడుగగా వాడిట్లనియె దేవా! గుప్తద్వారము దాపున నందుడును

తిలోత్తమయు నెద్దియో యేకాంతమాడుచుండ నేను జూచితిని. అప్పుడు మరియెవ్వరు నచ్చటలేరు. ఇరువురు మాటలాడుకొనుచుండ బోవుట తప్పని నేను దరికిబోక వేరొక మార్గమునం బోయితిని. తరువాత నొకప్పుడు నందునితో నీవు మొన్నను తిలోత్తమతో నెద్దియో రహస్యముగ మాటాడుచుంటి వది యేమని యడిగితి.

అతడది వేరొక సంగతియని నా కుత్తరము జెప్పెను. ఇదియేనేనెఱుగునది యని యాసాక్షి చెప్పెను. అప్పుడింద్రుడు శిరఃకంపనముజేయుచు మంచిది నందా! మరియుం దర్కించినంగాని నీ మాటనమ్మము. మరియెవ్వరేని యప్పుడు చూచితిరేమో యీ పురమున నరసిరమ్ము. పొమ్మనిపలుకగా వాడు వగచుచు నప్పుడు పట్టణములోనికి బోయి కనంబడినవారినెల్ల నడుగుచు గొంతసేపటికి నలుగురు మగువల దీసికొని వచ్చి యింద్రు నెదురబెట్టి అయ్యా! మొదటవాడు నాకు స్నేహితుడని త్రోసిపుచ్చిరి. ఈ కాంతల నే నెన్నడు నెఱుగను. వీరినడుగుడు. అని చెప్పగా విని యింద్రుడు నాసుందరుల మీరీనడుమ నెక్కడనేని యీయూరిలో తిలోత్తమంజూచితిరా యనియడుగగా నందు ముందుగా నిరువురు పడతు లతనికి మ్రొక్కుచునిట్లనిరి.

దేవా! మేము నందనవనపాలికలము. దేవరవారిని రక్కసుడు జెఱగొని పోయినప్పుడు మేమువెఱచి పొదరిండ్లలో దాగియుండగా తిలోత్తమ యొక చక్కని పురుషునితో నీ వనములో విహరించినది. అప్పుడు మేము దగ్గరకుబోయి యితడెవ్వడని యడిగిన నవ్వుచు నొకపుణ్యపురుషుడని జెప్పి వానితోగూడ బట్టణములోనికి బోయినది. ఇది మాకన్నులార జూచితిమని జెప్పిరి. వారిమాటలుసత్యములని యింద్రునికి దోచినవి. తక్కుంగల చక్కెరబొమ్మలును తిలోత్తమ యొకచక్కని పురుషునితో వీధింబడి పోవుచుండ గొన్ని దినముల క్రిందట మేము చూచితిమని చెప్పిరి.

అప్పుడు దేవేంద్రుడు మిక్కిలి కోపముతో నన్ను బిలిచి యేమే! తిలోత్తమా! నీవేమో యుత్తమురాలవనుకొంటిని. వీరి మాటలన్నియును వింటివా? దీనికి నీవేమి చెప్పెదవు? ఎద్దియో పన్నితివే? ఈ మర్మమంతయు నీయందున్నది. నిజము చెప్పుము. ఆ రుచికుడెవ్వడు? స్వర్గమున కెట్లు వచ్చెను అని నన్నడుగగా నేను సమ్మతింపక వారు చెప్పిన మాటలన్నియు నసత్యములనియు నవి యేమియు నేనెఱుగననియు వారెవ్వరిని జూచి నేనని భ్రమసిరో, నేను మొదట జెప్పినదే సత్యమనియు రూఢముగా బలికితిని. అంతట నింద్రుడు కన్నులెఱ్ఱజేసి నన్ను జూచుచు తిలోత్తమా! నీకున్న మర్యాదయంతయు బోగొట్టుకొనుచున్నదానవు. కానిమ్ము. ఆ రుచికునే యిచ్చటికి రప్పించి యడిగెద నప్పుడైనను నిక్కము తెలియకపోదని పలుకుచు మమ్ము నందరిని పొండని యానతిచ్చి యంతఃపురమునకు బోయెను.

తరువాత జయంతుడీ వార్త యంతయు విని నాయొద్దకువచ్చి గుచ్చి గుచ్చి యడిగెను. కాని నే నేమియుజెప్పక మొదట జెప్పినదే సత్యము పలికితిని. నీవు వెళ్ళిన తరువాత జరిగిన విశేషమిది. ఇటుపైన నాభారమంతయు నీమీద నున్నది ఇక నన్ను ముంచినను యుద్ధరించినను నీవేకాని మఱియెవ్వరును లేరు. నీ జగన్నాథస్వామి యనుగ్రహమిప్పుడు కనబడవలయును. నామాటలేమియు ననత్యము గాకుండునట్లు చెప్పవలయు. శోకావేశముచే వ్రాసితిని. తప్పులుండిన క్షమింపవేడెదను.

నీ ప్రియురాలు,

తిలోత్తమ.

అనియున్న యుత్తరమును పలుమారు చదువుచు దాని యధైర్యమును గురించి యెదదబొరమిన దుఃఖసముద్రము పైకి వెడలుచున్నదో యన నటుల జటిల ముగా నయనములనుండి యశ్రుజలంబులుగార నాయుత్తరమును తడిపితిని.

ఆ చిలుకయు నెంత తెలివి గలదియో చూడుము. నేనాయుత్తరము చదివి నంత సేపును దూరముగానుండి ముగించినతోడనే నాదాపున వ్రాలి ప్రత్యుత్తరమిమ్మని యడిగినట్లు నటింప దొడంగినది. దాని యభిప్రాయమును గ్రహించి నేనాయుత్తరము మీదనే నీవిందులకు జింతింపకుము. మనపాల జగన్నాథస్వామి గలడు. నీ కెంత మాత్రము నవమానము రానీయను. నీయుత్తరము చూచి మిక్కిలి పరితపించుచున్నవాడ. నిది త్రికరణపూర్వకముగా జెప్పినమాట నమ్ముము సంతోషముగా నుండుము. ఇంత కన్న వ్రాయుట కవకాశము లేదని యొక ఫలరసముతో వ్రాసిమడచి యాయుత్తర మాచిలుక ముక్కున కందిచ్చితిని. అప్పతంగ మప్పత్రిక మప్పినట్ల ముక్కునం గరచుకొని రివ్వున నెగిరిపోయినది. ఇంతలో దేవదూతలువచ్చి యింద్రుడిప్పుడు సభ జేసియున్నవాడు. మనమచ్చటికి బోవలయునిమ్మని పలుకుచు నాక్షణము నన్ను దేవ సభలోనికి దీసికొనిపోయిరి.

అప్పుడు దేవేంద్రునిం జూచి నేను సాష్టాంగ నమస్కారము చేయుచు సభ్యుల కందరకు మ్రొక్కి మోడ్పుచేతులతో నెదుర నిలువబడితిని. ఆయన ప్రక్కను బృహ స్పతిగారు కూర్చుండిరి. నన్ను జూచి యాసభ్యులందరు నాశ్చర్యపడుచున్నట్లు వారి మొగములం జూడ నాకు దోచినది. తరువాత దేవగురుండు దేవేంద్రుని యనుమతి నా కిట్లనియె. నీవెవ్వడవు ? నీపేరేమి ? నీ కాపురమెచ్చట ? నీ వెప్పుడైన నింతకు బూర్వ మీ స్వర్గమునకు వచ్చితివా? యని యడుగగా నేనిట్లంటి. అయ్యా ! నాపేరు రుచిరుడు. నా కాపురము శ్రీజగన్నాథము. స్వామి భక్తుడైన బలదేవుని కుమారుండ. నేను మిక్కిలి

పుణ్యాత్ముడను. నాకీ స్వర్గదర్శనంబు తొలుత స్వామిదయవలన లభించినది ఇప్పుడు మీదయవలన లభించినది. నన్నిచ్చటికి రప్పించిన కారణమేమియో యానతీయుడని వినయముగా బ్రార్థించితిని.

నా మాటలకు వెఱగందుచు బృహస్పతి వెండియు నిట్లనియె. రుచిరా! నీవు మొదట స్వర్గమునకు నెట్లు వచ్చితివి ఎచ్చటెచ్చట గ్రుమ్మరితివి ఇందెవ్వరిని గంటివి. నిక్కము వక్కాణింపుము. నీకు బారితోషికం బిప్పింతునని పలుకగా నే నిట్లంటి అయ్యా! నా వృత్తాంతమంతయుం జెప్పెద వినుండు. అసత్యమాడ నాకేమియు నవసరములేదు. మాతండ్రి బలదేవుడు. శ్రీజగన్నాథంబున వసియించి పూవుదండలుగట్టి స్వామికర్పించుచు సర్వదా యతని ధ్యానించుచు బరమభక్తుడై కాలము గడుపుచుండెను. మాతల్లి పుత్రలేమిం జేసి యొకనాడు తన్ను బుత్రులకై మిక్కిలి వేధించిన స్వామినారాధించి యాయవసరంబున నన్నుగనియె నన్ను మిక్కిలి గారాముగా బెనుచుచుండగా నేను క్రమంబున బదియారేడుల ప్రాయముగలవాడనైతిని. అప్పుడు మాతండ్రి నాకు పెండ్లి చేయవలయునని ప్రయత్నము చేయుచుండెను. అంతకుపూర్వ మొకనాడు పురాణము చెప్పుచుండ స్వర్గవిశేషములన్నియు విని యున్నవాడ గావున నేను దేవకన్యకలను గాని మానవకన్యకలను బెండ్లియాడనని మా తండ్రితో జెప్పితిని.

అతండు నన్ను మందలించుచు నోహో! నీ మాటలు మిగుల చిత్రములుగా నున్నవి. మానవులకు మానవులుగాక దేవతలెట్లు లభ్యమగుదురు. స్వర్గము లోకాంతరమే! మనకు బోవుటకైన శక్యముకాదు. నీ వెఱుగక యిట్టిమాట పలుకుచున్నవాడవు. నీకు మనుష్యకాంతలలో చక్కనిదానిని వరించి పెండ్లిజేసెద బెండ్లియాడుమని యెంతయో బోధించెను. నేను మాతండ్రి మాటలకు సమ్మతింపక నాయనా! నీవేమి చెప్పినను సరిపడదు. మనుష్యకాంతలలో శాస్త్రసిద్ధమైన సౌందర్యము గలవారే లేరు. ఉండినను విద్య యుండదు. అదియు గలిగినను శీలముసున్న. ఇన్నియుం గలిగినను నస్థిరయౌవనలుగదా? దేవకన్యల కీదుర్గుణము లేవియుం గలిగియుండవు. పెండ్లియాడిన వేల్పు చేడియనే బెండ్లియాడవలయు లేకున్న బ్రహ్మచారిగా నుండవలయుగాని యీ మానవ నీచజాతి పొలతులం గైకొనుటకంటె హైన్యమున్నదా (ఏకానారీసుందరీవా దరీవా) ఉండిన మంచిసుందరియగు భార్యగలుగవలయు లేనిచో నడవులలో గుహలోనుండుట శ్రేయము. నావివాహ విషయమై నీవేమియు బ్రయత్నింపవద్దు. నీబుద్ధులేమియు నేను వినువాడను గానని నిస్సంశయముగా బలికితిని.

పిమ్మట మాతండ్రి తాను జెప్పియు నొకరిచేత జెప్పించియు నెన్నియో ప్రయత్నములు సేసెనుగాని నాయుద్యమము మాన్పింప లేకపోయెను. లోకములో బుత్రులంగాంచుట వంశము నిలుచుటకు గదా! వీడు వివాహమాడనినాడు మదీయ వంశాంతమగు నేనేమి చేయుదు. వీడెవ్వరు చెప్పినను వినకున్నవాడని పెక్కుగతుల జింతించుచు నొక్కనా డంతఃకరణంబున దన యిష్టదైవమగు జగన్నాథస్వామిని ధ్యానించి నిద్రవోయెను. భక్తపరాయణుడగు నారాయణుండతని స్వప్నములో సాక్షాత్కరించి బలదేవా! నీవు చింతింపకుము, నీకుమారుని యభీష్టమును దీర్చెదను. రామచంద్రనగరములో దిలోత్తమయంశంబున దిలోత్తమయను రాజపుత్రిక పెరుగుచున్నది. దానిం బెండ్లి జేయుము తన్మూలముగా నతండు స్వర్గసౌఖ్యమనుభవింపగలడు. నీవు కోరినంత నీపుత్రున కా ధాత్రీపతి తనపుత్రికనిచ్చి వివాహము గావించును. నీ వంశము మిగుల ఖ్యాతికి రాగలదని బోధించి యంతర్ధానము నొందెను.

మా తండ్రియు నిద్రమేల్కొని మేల్కలగనినందులకు సంతసించుచు నన్నుజేరి తనస్వప్నవృత్తాంత మంతయుం జెప్పెను. స్వప్న మందైన నసత్యమాడని మాతండ్రి మాట నేన నమ్మి యుత్సాహముతో సతితిలోత్తమం బెండ్లియాడుటకు సమ్మతించితిని. వెంటనే యతడా రాజునొద్దకు బోయి ప్రార్థించిన సమ్మతించి శీఘ్రకాలములో నాకన్యకనిచ్చి వివాహము చేసెను. ఆ కాంతయు సాముద్రిక శాస్త్రలక్షణంబుల నేకొరంతయులేక నాయభీష్ట ప్రకారము చక్కదనము గలిగియున్నది. కావున నేను మిక్కిలి సంతసింపుచు జగన్నాథస్వామిని బెక్కుగతుల వినుతింపుచు నాయింతితో గొన్నిదినము లిష్టోపభోగముల గాలముగడిపితిని.

అంత నొక్కనాడు నేను స్వర్లోకదిదృక్షా కౌతుకంబుమనంబున దీపింప మాతండ్రితో నిట్లంటి. తండ్రీ! నీవు నాతో మొదట స్వర్గసౌఖ్యములు నీకు ముందు గలుగును. తిలోత్తమం బెండ్లియాడుము. ఈరీతి స్వామి యానతిచ్చెనని నాకు బెండ్లి చేసితివి. స్వామిమాట యసత్యమైనట్లు తోచుచున్నది. స్వర్గవిశేషములు నాకిప్పటి కేమియుం దెలియలేదు. ఇక నేను భార్యనువిడిచి సన్న్యాసినై తిరిగెదను. వలదని మొదటనే చెప్పితిని. నన్ను మరపించి పరిణయము సేసితివి. నేను జెప్ప లేదనుకొనవద్దు. ఇప్పుడే లేచిపోవు చున్నవాడనని బాల్యచాపల్యంబున బలికితిని.

పుత్రవత్సలుండైన బలదేవుడు నామాటలువిని విచారింపుచు నాయనా! నీవు తొందరపడకుము. భగవద్వచనమెప్పుడును దబ్బరకాదు. మరికొన్ని దినములు నిరీక్షింపుము. నీవిషయమై మరల స్వామి నారాధించి తెలిసికొనియెదనని నాకు బోధించి యారాత్రి చక్రపాణి నాత్మసన్నిధానము గల్పించుకొని నాయందలి ప్రేమాతిరేకం

బునం జేసి పలుదెరంగుల ధ్యానించి నా రక్షాదక్షుండగు నాపుండరీకాక్షుండు మరల స్వప్నములో గనంబడి తరువాత నాచరించవలసిన కృత్యము లన్నియు బోధించి యంతర్హితుండయ్యెను.

మరునాడు లేచి మజ్జనకుడు మఱియుచు నాకడ కివచ్చి వత్సా ! నీయభీష్టము స్వల్పకాలములో నెరవేరును. కొన్నిదినములలో రక్తాక్షుండను రాక్షసుండు స్వర్గమును ముట్టడించి సహస్రాక్షు నక్షీణ బలంబునబట్టి చెరగొనిపోవును. అప్పుడు స్వామి గుడి వెనుక కొక విమానమువచ్చునట. నీవు సిభార్యతో దానిమీద నెక్కిన స్వర్గమునకు బోగలవు. దానంజేసి అచ్చటివిశేషములన్నియుం జూడగలుగునట. ఈలాగున రాత్రి నాకు స్వప్నంబున హరి యానతిచ్చెను. కావున నీవు సంతోషముగా నుండుమని నాకు బోధించెను.

నేను నట్టి అవసరముచేచియుండ అతడు చెప్పిన సమయమునకు నాగుడి యొద్దకు విమానము వచ్చినది నేను తిలోత్తమతో గూడ నద్దివ్యయాన మెక్కితిని. అదియు దృటికాలములో స్వర్గమునకు దీసికొనిపోయినది. మాతండ్రి చెప్పిన ప్రకారము మేము మొదట నందనవనములో గొంతసేపు క్రీడించితిమి. అప్పుడెవ్వరో కొందరు కాంతలువచ్చి తిలోత్తమా ! యీతండెవ్వడేయని నా భార్య నడిగిరి అదియు నవ్వుచు నీతడొక పుణ్యపురుషుడని యుత్తరము చెప్పి నా మొగము జూడ నేను దానితో వాల్గంటి ! నీవు తిలోత్తమ యంశంబున బుట్టితివి. నీకును దానికిని నామరూపంబుల నించుకయు భేదము లేదని తోచుచున్నయది నిన్నా తిలోత్తమవే యనుకొని యిట్లడిగిరి. కానిమ్ము దీన నీకు గొరతయేమి ? సంశయింపక నీవును తగినట్లుత్తరము చెప్పితివి. భళిభళి ! యని పలుకుచు గొంతసేపా చిలుకలకొలికితో నవ్వనములో విహరించితిని.

మేమీయూర జూడవలసిన విశేషములన్నియు భగవద్వచన ప్రకారము మా తండ్రి నాకు బోధించియున్నవాడు కావున తరువాత అత్తోటలోనుండి పట్టణములోనికి వచ్చితిమి. అప్పుడు పట్టణమంతయు జనశూన్యముగా నున్నది. నిరాటంకముగా నలు మూలలు గ్రుమ్మరి మాతండ్రి చెప్పినరీతి అతిప్రయత్నముతో వెదకి సుధర్మయొక్క గుప్తద్వారము గనుగొని అక్కీలుద్రిప్పిన దలుపువచ్చినది. అప్పుడచ్చట నెవ్వరును లేరు. మేమా మార్గమున లోనికిబోయి అచ్చటి విశేషములన్నియుం జూచి మరల నా దారినే బైటికి వచ్చితిమి.

నా వెనుకవచ్చుచున్న తిలోత్తమను ద్వారములో నెవ్వడో నిలిపి యీ యూరనున్న తిలోత్తమే అనుకొని యెట్లు లోపలను బోయితివని యడిగెనట. అదియు వానికి దగినట్లి యుత్తరము చెప్పి నాయొద్దకువచ్చినది. పిమ్మట మేమిరువురము కొంత సేపు స్వర్గములో విహరించి అటు పైన మరల నా విమానమెక్కి భూలోకమునకు

టోయి యందు మా అత్తవారియింటియొద్ద గొన్ని దినంబులుంటిని. అంత నొక్క నాడుదయంబునలేచి చూచువరకు దేవదూతలు నన్ను బట్టుకొని తీసికొనిపోవుచుండిరి. మీరెవ్వరు నన్నెచ్చటికి దీసికొనిపోవుచుంటిరని అడుగగా మేము దేవదూతలమనియు నింద్రుసియానతి స్వర్గమునకు దీసికొని వెళ్ళు చున్నారమనియుం జెప్పి క్రమంబున నన్నిచ్చటికి దీసికొని వచ్చిరి.

ఇదియే నా వృత్తాంతము నేను వెనుకజూచిన సభ యిదియే. నా పూర్వ పుణ్యమువలన రెండవసారి జూచుట లభించినది. అప్పుడు దేవర వారి దర్శనము కాలేదు. అంతకన్న విశేషమిప్పుడు గలిగినది. నేను గృతార్థుడ నన్నెల్లకాల మిచ్చట నుండులాగున అనుగ్రహింపుడని అనేక విధములు బ్రార్థించితిని. నామాటలన్నియువిని ఇంద్రుడు వెఱగుపడుచు బృహస్పతి మొగము జూచి గురువర్యా! వీరి చరిత్రమును వింటివా? మిగుల విచిత్రముగా నున్నదే? ఇది అంతయు నిక్కమే యగునా? పరి శీలించి పక్షాంతిపుడగుటయు నాయాచార్యుండు నవ్వుచు దేవేంద్రా! వీడెంతవాడు కాకున్న రెండుసార్లు స్వర్గమున కెట్లు వచ్చును. జగన్నాథస్వామికి వీని తండ్రి భక్తు డగును. వీని పూర్వపుణ్యము మంచిది. ఈ యుత్తరము వీనిదే. ఇచ్చట మాటిసోయిన వాడు కాబోలు. వీనినిక భూలోకమున కనుపుమని పలికెను.

అప్పుడు దేవేంద్రుడు గురుని మాట మన్నించి యోహో! హరిదయా పాత్రుడైన వీనికి మనము సత్కారములు సేయవలయును. లేకున్న నాయనకు గోపము వచ్చుచు తన భక్తుల నవమానపరుచుటకు యతడు సహింపడు. అతండలిగె నేని మన యైశ్వర్యమంతయు దృటిలో నశించును. పాపము తిలోత్తమపై నిష్కార ణము నింద మోపితిమి అసతి చెప్పిన దంతయును సత్యమే. నందుని దూషింపరాదు. కావున నిప్పటి కెవ్వరు నపరాధులు కారు అని పలుకుచు నా మొగముపై దృష్టి బర గించి యిట్లనియె.

రుచికా! నీవు మిక్కిలి పుణ్యాత్ముడవు. మరియు మాకును బ్రభువైన హరిభక్తుడగువాని కుమారుడవు. నిన్ను గౌరవము చేసి యిందుండి పంపవలయును. కావున నీ యభీష్టమైన కార్యమొక్కటి దెలుపుము. దానినిచ్చి నీ వలసిన చోటున కంపెదమని పలుకగా నేనిట్లంటి. దేవా!

సీ. ముజ్జగంబులనెల్ల ముదమొప్పనేలునా
హరి కిద్రగజన్ము నిందరయగంటి
నద్దికి నుపమానభూతుడౌ సురపురో
హితునితో నేడు భాషింపగంటి

అతిశయసత్ప్రభావాఢ్యులై మించు ది
క్పతుల సాన్నిధ్యంబు బడయగంటి
బహుజన్మకృతపుణ్య పరిపాకమునగాని
గనలేని స్వర్గంబు గాంచగంటి

గీ. అందమునకెన్నగా బరమావధియన
బరగు నప్సరజాతి వైభవమునెల్ల
జూచి యానందమును గంటి జోద్యముగను
శ్రీజగన్నాధు సత్కృపాదృష్టివలన.

త్రిలోకాధినాధులైన మీ దర్శనము దొరికినది. ఇంతకన్న నాకు మించిన యభీష్టమేమి కలదు. అయినను గోరికొనియెదను. మీ లోకములో నేను జూచిన వస్తువులలోనెల్ల సంగీతవృక్షము మనోహరముగా గనంబడినది. దాని భూలోకములో వ్యాపకము చేయవలయునని యుత్సాహముగా నున్నది. ఇదియే నా కోరిక. మరియు నా భార్య తిలోత్తమవలె నుండెనని స్వామి యానతిచ్చెను గదా? ఆ నిదర్శనము చూచుటకై తిలోత్తమ నొకసారి యిచ్చటికి రప్పింపుడు. చూచి సంతసించెదను. ఇంతకన్న నాకేమియు నక్కరలేదు. మీదయయుండినం జాలునని పలుకగా దేవేంద్రుడు మరల నా కిట్లనియె.

రుచికా! నీవు కోరినది యసాధ్యమైనదియే యైనను నీకిచ్చెదనని పలికితిని కావున మరియొకలాగున జేయుట తగదు. నీ వా విత్తనమును భూలోకములో నీకిష్టమైనచోట నాటుము. అది వృక్షముగా బెరిగి మనోహరముగా బాడుచుండును. పుణ్యాత్ములు కానివారికి దాని గానమేమియు వినంబడదు. వారి కది కంటక తరువుగాగున దోచుచుండును. పెద్దకాలము పుడమిలో నీ పేరున నొప్పుచుండును. పుడమిలో బుణ్య పాపవిచక్షణ దాని మూలమున దెలియబడునని పలుకుచు నప్పుడే యా విత్తనము తెప్పించి నా చేతికిచ్చి దోహద ప్రకారమంతయుం జెప్పెను.

మరియు దిలోత్తమ మాట జ్ఞాపకము జేయగా నచ్చటికి రప్పించి తిలోత్తమా! నిన్ను నిష్కారణము దూరితిని. నీ మాటలలో నసత్యమింతయును లేదు. నందుడు చెప్పినది నైతమును సత్యమైనదే! ఈ రుచికుడు మనము లేనప్పుడు భార్యతో గూడ నీ లోకమునకు వచ్చి క్రీడించెనట. వీని భార్యపేరు తిలోత్తమయట. రూపమున నీకును దానికి నించుకయు భేదము లేదట. దానిని జూచి యిచ్చటి వారలు నీవేయని భ్రమసిరి. ఈ రహస్యమంతయు నీ రుచికునివలన దెలిసినది. నీవు చింతింపకుము. నిన్ను జూడ వలయునని యీతడు కోరిన రప్పించితినని పలుకుచు నింద్రుడిదియే యిచ్చటి తిలోత్తమ యని నాకు జూపెను.

నేనును సానురాగముగా జూచితిని. అదియును ప్రేమాతిశయమును దెలిపెడు. చూపులు నాపై బరగింపుచు ఆర్యా! నీకు నమస్కారము. నన్ను రక్షించి నా నింద బాపితిరి. నీ యుపకారమునకు బ్రతి యెన్నడును జేయలేను. సంతతము నీ స్మరణ జేసికొను చుందును. నన్ననుగ్రహింపుమని యెల్లరు విన దేవసభలో నన్ను గొనియాడినది.

నేను దాని మాటలు విని మిక్కిలివిస్మయము నొందితిని. అని చెప్పి ఆహా! స్త్రీ లెట్టి మాయవారో చూచితివాయని పరిహాసము సేయగా జంద్రలేఖ నవ్వుచు బౌను. నీవీ మాటాడినందులకు నాకు మిక్కిలి వింతగా నున్నది. త్రిలోకప్రభువైన దేవేంద్రుని సభలో బుద్ధిమంతులకెల్ల నుపమానభూతుడగు బృహస్పతి వినుచుండ నసత్య మాడి నమ్మించిన సాహసుడవు. తిలోత్తమచేసిన సాహసమునకు వెఱగుపడుచుంటివి? యెంతటైన సాహసులు మగవారు గాని యాడువారా? ఆ తారతమ్య మానక విదారింపవచ్చు దరువాయికథ జెప్పుమని యడుగగా రుచికుడిట్లనియె.

చంద్రలేఖా! వినుము నన్నట్లు స్తుతియించిన తిలోత్తమం జూచి నేను స్తుతిసహింపమి సూచింపుచు నన్ను నీ వింతగా బొగడుటకు నీకు నేనేమి యుపకృతి జేసితిని. జరిగిన యదార్థము జెప్పితిని కదా! దీన నీ సౌజన్యము దేటయగుచున్నది. నీకును నా భార్యకునింతయును భేదము లేదు. నీ నామరూపంబుల సామ్యతను బట్టి నీకును మాకును బాంధవ్యము గలిగియున్నది. దివ్యదర్శన మెవ్వారికి ముదము గలుగ జేయదు? అని మరియుం బెక్కుగతుల మరల నుతియించితిని. ఇంతలో దేవేంద్రుడు నన్ను జూచి రుచికా! ఇక నీవు పోవలసిన తావు దెలుపుము. దేవదూతనిచ్చి పంపెదను. తిలోత్తమా! నీవిక నివాసమునకు బొమ్మని పలికిన నత్తిలోత్తమ యెట్టకేంకా ప్రదేశము నుండి కదలి నడుమనడుమ నెద్దియోమిషమీద నన్ను జూచుచు బ్రాణంబు లన్నియు నీమీదనుంచి పోవుచున్నదాననని సంజ్ఞజేసి యింటికి బోయినది.

నేనును నాలోచించి దేవా! భూలోకములో నాకు బ్రాణమిత్రుడు గౌతము డనువాడు గలడు. వాడిప్పుడెచ్చటనుండునో నన్నచ్చట విడిచివచ్చునట్లు మీదూతల కాజ్ఞ యీయవలయునని కోరితిని. ఇంద్రుడాతని యునికి బృహస్పతిని బ్రశ్నపూర్వకముగా నడిగి తెలుసుకొని తనదూతలతో జెప్పినంత వారు నన్ను గన్నులు మూసి కొమ్మని త్రుటిలో భూమిలోనున్న ఢిల్లీనగరంబునకుం దీసికొనివచ్చి యొకయింటి ముంగల విడిచిపోయిరి. నేనును గన్నులు తెరచి చూచువరకు నాయింటిలోనుండి నా మిత్రుండు గౌతముడు వెలుపలకు వచ్చెను. వానింజూచి నేను గురుతు పట్టితిని. నన్ను వాడానవాలుపట్టలేక విభ్రమముగా జూచుచుండ నేను వానిం గౌగలించుకొని పేరు చెప్పితిని.

వాఁడును కన్నుల నానందబాష్పములుగార నన్ను బెద్దతడవు గాఢాలింగనము చేసికొనియెను. ఇట్లు కొంతసేపు మేమిరువురము నన్యోన్యదర్శన సంజాతకౌతూహలంబున మేనులుపరించి కంఠంబులు డగ్గుత్తికవార నెట్టకేలకు సన్ననియెలుంగున గుశలప్రశ్నములు వేసికొంటిమి. మేము విడిచిపోయినది మొదలు నాటివరకు జరిగిన కథలన్నియు నొండొరులకు జెప్పుకొని యప్పుడే యచ్చటనుండి బయలువెడలి మా దేశమునకు బోవుచు నీయూరు జేరితిమి. తరువాతకథ నీవె యెరిగినదేకదా? ఇదియే నావృత్తాంతము దైవకృత్యమువలన బ్రాణతుల్యులైన మిత్రు సంధర నిచ్చటం గంటి నని పలుకగావిని యందరు నాశ్చర్యపారావారవీచికలం దేలుచు రుచికుని యదృష్టమును వేతెఱఁగుల బొగడదొడంగిరి.

అప్పుడు చంద్రలేఖయు వానిం జూచి ఆర్యా! చెఱకుదినిన నోటికి జెండు రుచింపనట్టుల దేవకాంతా రతిసౌఖ్యంబు లనుభవించిన నీకు మాయందేమి మక్కువ యుండును? నీకొరకు మేమూరక పెక్కుడుమ్ముల గుడిచితిమి. ఆ తిలోత్తమ నిచ్చట నుండనీయదు. ఎప్పుడో మరల స్వర్గమునకు దీసికొనిపోవునని తోచుచున్నది. నీయభిప్రాయమెట్లుండెను జెప్పుమని యడుగుటయు దానిం రుచికుం డోదార్చుచు నిట్లనియె.

బోటి! నీవెప్పుడు నట్లు తలంపకుము. మీరు రూపంబున దేవకాంతలను మించినవారు. మనుష్యులకు మానవకాంతలు భార్యలైన యుక్తముగా నుండును. తిలోత్తమ నన్నెప్పుడు స్వర్గమునకు దీసికొనిపోవదు. అచర్య గతించిపోయినది. స్వర్గమునకుపోవుట సామాన్యమను కొంటిరాయేమి? అప్పుడు యుద్ధసమయముగనుక నిరాటంకముగా దిరిగితిమి. కాని యితరసమయములయందు నింద్రుని యనుమతిలేక గాలియైనం గదలుటకు వీలులేదు. ఇక మిమ్ములవిడువనని ప్రమాణము చేయుచున్నవాడ. మీరు నాకై పడిన బాధలం దలచుకొనిన మిగుల దుఃఖమగుచున్నది అని పలుకుచు వారి నిరువురను వేరువేర నక్కున జేర్చుకొని మన్నించుచు వారుపొందిన దుఃఖమును పోగొట్టెను. తరువాత విజ్ఞానయోగిగానున్న తనతండ్రి నచ్చటికి రప్పించుకొని యతనికి దనవృత్తాంతమంతయుం జెప్పి యింతింతనరాని యానందము గలుగజేసెను. పిమ్మట జంద్రలేఖయు రుక్మాంగదునికి నతనివృత్తాంతము దెలుపుచు నతం డాశ్చర్యపడుచుండ దాను ధరించెడు దుస్తులు చూపించి నమ్మకము కలుగజేసినది.

రుక్మాంగదుడు వారందరిని తనదేశములో నుండుమని యెంతయో ప్రతిమాలికొనియెను కాని రుచికుండు తండ్రియాజ్ఞవలన దన జన్మభూమియగు జగన్నాథమునందే యుండుటకు నిశ్చయించుకొనెను. అంత రుక్మాంగదుడు వారికందరికి దగు బహుమతులుజేసి చంద్రలేఖకు బుత్రికకుంబోలె కొన్ని గ్రామంబులరణముగానిచ్చి మన్నికతో నప్పుడప్పు డచ్చటికి వచ్చునట్లొడబరచి యనురాగపూర్వకముగా బంపెను. చంద్ర

లేఖను దిలోత్తమను గాంధర్వవివాహంబున భార్యలుగా స్వీకరించి రుచికుండుతొలుత నోడనెక్కి వారందఱితో రామచంద్రపురనగరమునకుపోయి పుత్రికావియోగచింతాకుల స్వాంతుడగు శూరసేనమహారాజునకు సమాచారంజెప్పి మున్నుగాను సంతోషముతో గొన్నిదినము లందుండెను. అందు పూవుబోడి చంద్రలేఖం గలసికొని మిగుల నాదరించినది.

శూరసేనుడు పుత్రహీనుడు కావున తనరాజ్యమునకు రుచికునే యధీశ్వరునిగాజేసి పట్టముగట్టెను. రుచికుండు తనకు రాజ్యమువచ్చిన తక్షణము గౌతమునికి మంత్రిత్వాధికారమిచ్చి యతనికిగూడ యొక చక్కనికన్యం బెండ్లిజేయించెను రుచికుడు స్వర్గమునుండి తెచ్చిన సంగీతవృక్షబీజమును శ్రీజగన్నాథములో స్వామిగుడి యావరణలో నాటింపవలయునని యుత్సాహముగలిగి యొకనాడు యిరువురుభార్యలు గౌతముడు సేవింప చతురంగబలముతో వెడలి జగన్నాథమునకుబోవుచు నొకనాటి రాత్రి నిన్న నీవు చూచినచోట బసజేసిరి.

మరునాడు బయలువెడల సమయములో గానవృక్షబీజము మిక్కిలి సూక్ష్మమైనది గనుక పెట్టెలో నమరించబోయిన చేయిజారి నేల బడినది. తరువాత దానికొరకు నెన్నియోప్రయత్నములుచేసి వెదకిరిగాని కనంబడినదికాదు. బుద్ధిమంతుడయిన రుచికుడప్పు డాభూమి యంతయు నీరుచల్లించి దానికిజేయవలసిన దోహదము జేయించెను. అప్పుడది మొలకెత్తి క్రమముగా పెరిగి వృక్షమయినది. రుచికుడక్కడనే మంచిసౌధములు గట్టించి సంవత్సరమున కొకమాసము లిరువురుభార్యలతోవచ్చి యచ్చట నివసించి క్రీడించువాడు. అతడు పెద్దకాలము పుడమిపాలించెను.

గోపా! నీకు వినంబడినగాన మాసంగీతవృక్షమువలనం జనించినది. నీవు మిగులపుణ్యాత్ముడవు కావున నీకా గీతము వినంబడినది. యితరుల కాపాట యేమాత్రము వినబడదు. ఆ తరు వితరులకుజూడ గంటకద్రుమమువలె దోచును. అవృక్షము నాటి నేటికి పెక్కుసంవత్సరములయినది. దానివృత్తాంత మెఱింగినవా రెవ్వరు నిప్పుడు లేరు. మణిమహిమచే నాకు దెలిసినయ్యది. ఈకథయు బుణ్యప్రదమయినదే. విన్నవారికి నభీష్టసిద్ధియగు. ఇప్పుడు నీసంశయము తీరెనదా? యని చెప్పినవిని యాగోపకుమారుడు సంతసించుచు నయ్యా! మీయక్కటికము నాయందు బరిపూర్ణముగా నుండినప్పుడు నన్ను దురితములంటునా! ఈకథ నాకు మిగుల సంతోషముగలుగజేసినదని పలికెను. పిమ్మట భుజించి కొంత విశ్రమించి గోపాలుండు గావడి యెత్తుకొని తోడరా నచ్చట గదలి క్రమంబున నగ్గురుశిష్యులు దరువాయి మజిలీజేరిరి.

— : ● : —

# కాశీమజిలీ కథలు

## రెండవ భాగము

### 17 వ మజిలీ

పదియేడవ మజిలీ ప్రదేశము గొప్పపట్టణము అందు విశాలముగానున్న సత్రంబున బసజేసిరి. స్వాములవారు స్నానముచేసి జపముజేసికొనుచున్న సమయము నందు శౌనకుడు పురవిశేషముల చూచు తాత్పర్యముతో నంగడికి బోయెను. ఆ విపణి మార్గము మిక్కిలి విశాలముగను రమ్యవస్తువులు గలదిగా నుండుటచే నచ్చటివింతలం జూచి క్రమక్రమముగా దూరముగా బోవుచుండెను. పోవంబోవ బట్టణపుకోట గనంబడి నది. అది మిక్కిలి యెత్తుగాను వెడదవుగా నుండుటచే దానిచుట్టు తిరిగిరావలంపుతో బోయిన పెద్దతడవు పట్టినది. మరియుం గోటకు ముమునకు బోయినంత నచ్చటి వింత లన్నియు నతని స్వాంతమున కచ్చెరువు గలగజేసినవి.

మరియొకచోట మంటపములో నెర్దముగావైచిన దూలమున దళ్కిందుగా నిరువుర నినుపగొలుసులతో వ్రేలగట్టియుంచిరి. వారినట్లుకట్టి చిరకాలమైనను జీవించిన మనుష్యులవలె నున్నారు. ఆ పక్కనున్న శిలమీద "దుర్జనులకు బుద్ధివచ్చుపని" యని వ్రాయంబడియున్నది ఆవిశేషముజూచి శౌనకుడు అచ్చటనున్నవారిని వ్రేంగట్టిన పురుషులెవ్వరనియు నేమితప్పుచేసిరనియు నడిగెను. కాని యెవ్వరును చెప్పినవారు లేకపోయిరి.

ఆవింత పలుమారు పరిశోధించి వాడు కడువేగముగా సత్రమునకుబోయి భోజనముచేసి తనరాక నిరీక్షించియున్న మణిసిద్ధునిగాంచి నమస్కరించి యెదుర నిలువబడినంత నయ్యతి కోపమిశ్రితమైన స్మితముతో నిట్లనియె. గోపా! నీకింతభయము లేకపోయినదేమి ! నీకొఱకెంతసేపు కాచియుండుము. ఎచ్చటికి బోయితివి ? భోజనము మాట మరచిపోయితివా యేమి ? యెద్దియోయొకగొడవబెట్టుకొని తిరుగుచుందువు. ఈ దినంబెద్దియేని వింతగనంబడినదికాదా చాలులేలెమ్ము అని పలుకగా వాడు నించుక సిగ్గుతో నవ్వుతో నిట్లనియె.

స్వామీ! నేను భోజనముకొరకు మీవెంట రాలేదు. దేశ విశేషములరయు తలంపుతోగదా వచ్చితిని. మరి వానింజూడ బోవక యేమిచేయుదును ? ఈపట్టణము మిక్కిలి పెద్దదిసుండి. అంగడిలో నెన్నివిశేషములు చూచితి ననుకొంటిరి. ఇందున్న కోటలో దులయగు దాని నిదివరకు మనము చూచియుండలేదు. ఆకోటముంగర

మంటపములో నిరువురు బురుషుల నినుపగొలుసులతో దల్లక్రిందుగా వ్రేలగట్టిరి. వారు చచ్చిరికదా వారిశరీరములు చెడక చిరకాలమట్లె యున్న వెట్లు? అది దుర్జనులకు బుద్ధి వచ్చు పనియట ఈ దినమున నేను జూచు విశేషములలో నిదిమిక్కిలి యబ్బురము గలుగజేయుచున్నది. వారెవ్వరు? ఏమితప్పు జేసిరి? ఈవృత్తాంతము ముందుగ జెప్పకతప్పదు. నాయందు గోపము సేయకుడు ఈకథ వినినతరువాతగాని నాకు భోజనము రుచింపదని పాదంబులపైబడి యెక్కుడు దీనత్వముతో వేడుకొనుటయు నయ్యతిపుంగవుండు నవ్వుచు నిట్లనియె.

నీవు జాగుచేసినప్పుడే యెద్దియో గొడవతో వచ్చెద వనుకొంటిని. దాని వృత్తాంతము జెప్పెదనని నే నెక్కడికి బోవను. భోజనము చేయుము. సావకాశముగా జెప్పెదనని పలికి యెట్టకేలకు వాని నొప్పించి భోజనానంతరము నొకచోట సావధానముగా గూర్చుండి యమ్మాణిక్య ప్రభావంబున దద్వృత్తాంతమంతయు గరతలామలకముగా దెలిసికొని యిట్లని చెప్పదొడంగెను.

# ధర్మపాలునికథ

తొల్లి మాళవదేశంబున ధర్మపాలుండను రాజు విహారభద్రుడు విజయకేతు వను మంత్రులతోగూడి కౌశాంబియనుపట్టణము రాజధానిగా జేసికొని ధర్మంబున రాజ్యము సేయుచుండెను. అతనిపత్ని సునంద. ఆసుందరియు బతియెడ భయభక్తి వినయ విశ్వాసములుగలిగి సతీధర్మమించుకేనియు దప్పక వల్లభునకు శుశ్రూషజేయు చుండును. అతడొకనాడు పేరోలగంబుండి మంత్రుల నిరువురంజూచి రాజులకు దండనీతి నెరింగిన గలుగులాభమేమని యడిగిన నందు ముందు రెండవ మంత్రియైన విజయకేతుడులేచి నమస్కరించుచు దనకు బ్రభువునందుగల వినయవిశ్వాసములు తేటబడునట్లు యుక్తియుక్తముగా నిట్లనియె.

దేవా! అగ్నిశోధితముగాక హేమము ప్రకాశించనట్లు నీతిపాటవము లేని వాని బుద్ధిబలమనామకమైయుండును బుద్ధిబలములేని వాడెంత యున్నతుడైనను పర్వతమువలె దనపైకెక్కిన వారినైనను గుర్తెరుగకుండును సాధ్యసాధనముల విభజించి నడచుటకు సమర్థుడు కానేరడు. నియమములేక వ్యాపారముల జక్కజేసుకొనలేని వాని బనులు స్వీయులుగూడ నవమానింతురు. అదియునుంగాక నతనినియామకులోనైన ప్రజలు వర్తింపరు. అతిక్రాంత శాసనులగు ప్రజలు స్వేచ్ఛావిహారులై సర్వవ్యాపారముల యందు సంకరులగుదురు. నిర్మర్యాదమైనలోక ముభయలోకముల దానుచెడుటయేకాక

రాజునుగూడ చెరుచును. కావున నాగమదీపమునఁజూచి నడచిరేని లోకయాత్ర సుఖముగా జరుగును. త్రికాలచర్యలం దెలిసికొనుటకు శాస్త్రచక్షుస్సు దివ్యమైనది కదా ? విశాలమగునేత్రములు గలిగియున్నను అదిలేని వారర్థదర్శనముల గ్రుడ్డివాడేయగును. కావున బాహ్యవిద్యావ్యాసంగమువిడిచి రాజు కులవిద్యయైన దండనీతి నభ్యసింపవలయు. దానంజేసి మిక్కిలి ఖ్యాతిగలిగి సంకల్పసిద్ధుడై ప్రజల వశపరచుకొని సుఖముగా రాజ్యము సేయును. ఇదియే దండనీతివలన గలుగులాభమని విజయకేతుడు చెప్పగా విని రాజు సంతసించుచు దరువాత విహారభద్రుని మొగము జూచెను.

అప్పుడు సకలతంత్ర దుర్నయోపాధ్యాయుడగు విహారభద్రుడు లేచి రాజుగారికి మ్రొక్కుచు దేవా ! మదీయవిజ్ఞాపనముగూడ నవధరింపుడు. లోకములో దైవానుగ్రహమువలన నెద్దియేని యైశ్వర్యము గలిగినచో ధూర్తులు దాంబికవచనములచే ప్రభువుల భ్రమపెట్టి స్వప్రయోజకత్వము వెల్లడిచేసికొనుచున్నారు మరికొందరు యోగులమని శిఖాయజ్ఞోపవీతములదీసి యనశనవ్రతము బూనితిమని చెప్పుచు నాశాపాశమునుమాత్రము విడువలేక సర్వస్వమును స్వీకరింతురు. కొందరు అల్పులనైనను జక్రవర్తినిజేయుదుమనియు కొందరు శస్త్రములేకనే శత్రువుల సంహరింతుమనియు నీగీతి ననేక విధముల దాంబికములఁబన్ని రాజుల నమ్మించి వారు చెప్పినట్లు చేయించుచుందురు.

ఇప్పుడు విజయకేతుడు చెప్పినదండనీతి యట్టిదియు చెప్పినదే. అందలి విషయములను సంక్షేపముగా జెప్పెద వినుడు. త్రయీవార్తాఅన్వీక్షకీ దండనీతి అను నామములచే రాజ్యవిద్య నాలుగువిధములుగా జెప్పంబడియున్నది. అందు త్రయి వార్తాన్వీక్షకులు మూడును గొప్పవి వాని నారలటుండనిండు. నాలుగవది యగు దండనీతిని విష్ణుగుప్తుండు సంక్షేపముజేసి యారువేలశ్లోకములుగా రచించెను. అట్టిదాని నధ్యయనము చేయుమనిగదా వీరియభిప్రాయము. అలాగుననే చదువుదము. దానికొఱకు శబ్దశాస్త్రముగూడ జదువవలయును. ఇదియంతయు బూర్తియగువరకు ముదిమియేవచ్చును. మరి సుఖపడుట యెన్నఁడు ?

మరియు రాజకుమారు డుదయంబునలేచి దంతధావనము చేసికొని ప్రథమభాగంబున న్యాయవ్యయంబులం దెలిసికొనవలసినది ద్వితీయభాగంబున సన్నోన్యము గలహించెడి ప్రజల పరుషవచనములచే కర్ణముల బాధింపవలయును. తృతీయభాగంబున వీరభటుల దిగ్విజయయాత్రావిశేషములు వినవలయును. మరియు స్నానభోజనాది వ్యాపారములచే ముగియునుగదా ! చతుర్థంబున సర్వగ్రహణమునను బంచమమున మంత్రిచింతచేతను మహాయాస మనుభవింపవలయును. షష్ఠభాగమున మంత్రియైనను విహారమైన జేయదగినది సప్తమమున జతురంగబల ప్రత్యవేక్షణాయాసము నొందవల

యును. అష్టమమున బ్రాహ్మకమచింత ఈరీతి పగలు వెళ్ళించదగినది. మఱల రాత్రి ప్రథమభాగంబున సంధ్యోపాసనయు గూఢపురుషనియోగము ద్వితీయభాగమున శ్రోత్రియుడువోలె భోజనానంతరము స్వాధ్యాయనము జదువవలయునట తృతీయము దూర్యఘోషములచే గడుపవలయును. చతుర్థపంచమభాగముల నిద్ర తిరుగా షష్ఠ భాగంబునలేచి శాస్త్రచింతయు గార్యచింతయు జేయవలయును. సప్తమమున దూతాది ప్రేషణము. అష్టమమున బురోహితాది ఋత్విక్సంఘము దయచేసి స్వప్నఫలముల జెప్పుచు హోమము దానము తర్పణము చేయవలయును. దీనికంతయు బంగారమే కావలయును. బ్రాహ్మణులనగా బ్రహ్మకల్పులు వీరికి దానమిచ్చినచో నైశ్వర్యములు వృద్ధియగును. ఇంతకు మున్నెచ్చటను దానము పట్టనివారు పుత్రవంతులు వీరికిచ్చిన సకలారిష్టములు నశించునని యిట్లుపలుకుచు గిట్టపట్టుదురు.

ఈరీతి రాత్రింబగళ్ళు వెళ్ళించువానికి సుఖలేశమైనను గలుగునా ! వాడు రాష్ట్రమునేమి రక్షించుకొనును. దండనీతియందు జెప్పిన రీతియిది. ఇట్టి శాస్త్రము ననుసరించినంగాని సంపదలు నిలువవట అది పట్టి ప్రల్లదము. లోకమువలననే యనుభవము తెలిసికొనదగినదిగాని శాస్త్రప్రయోగము లేదు. శిశువు సహితము తల్లియొక్క లాలనచేత నుపాయముగా బాలు గుడుచుకొనుచుండును. కావున యథేష్టముగా నింద్రియసుఖముల ననుభవింపదగినదే. విషయాభిలాషల జయింపదగినది. అరిషడ్వర్గము విడువవలయును సుఖమందిచ్చ యుంచగూడదు అని యుపదేశించెడి పండితులు గూఢ దివాణములలో దొంగిలించిన ధనమంతయు వేశ్యలపాలు జేయుచున్నారు. వీరి మాటయేల ! పరాశర ప్రభృతులు మాత్రము విషయాభిలాష విడిచిరా ! శాస్త్రప్రకారము వారుమాత్రము నడచిరా ? సుఖదుఃఖములు వారికి మాత్రము తప్పినవియా ! కావున దీనిలో నేమియునులేదు. రాజా ! నీవిట్టి డాంబికపు మాటలు నమ్మకుము. ఉత్తమజాతిని బుట్టితివి. తొలిప్రాయమున సుందరశరీరము నపరిమితైశ్వర్యము గలిగి యుంటివి. ఈ వైరిమాటల నమ్మి విద్యాగ్రహణ ప్రయాసమునకు బోకుము. నీకోశ గృహములోనున్న ధనము మూడు తరములదాక సరిపడును. పెక్కేల రాజ్యభారమంతయు సమర్థునగు వానియందుబెట్టి యచ్చరలంబోలియున్న శుద్ధాంతకాంతలతో గ్రీడింపుచు సంగీత పానగోష్ఠీవిశేషముల శరీరలాభమును సార్థకమును జేసికొనుము అని బోధించెను

ఇట్లు మంత్రులిద్దరు నుపన్యసించిన విని యారాజు శిరఃకంపపూర్వకముగా నవ్వుచు నోహో ! మీరిరువురు హితోపదేశము చేయుటచే గురువులయిరి. మీ యుపన్యాసము శ్రవణానుకూలముగానే యున్నది. అని చెప్పుచు లేచి అంతటితో సభ జాలించి యంతఃపురమునకు బోయెను. తరువాత గపట్క్రియా దక్షుడయిన విహార

భద్రుడు సంతతము రాజునకాబోధయే చేయుచు క్రమంబున నతని చిత్తము నిజాయత్తముగా జేసికొనియెను.

క్రమక్రమముగా ధర్మపాలుడు విహారభద్రుని యాలోచనకు లోనయి రాజకీయవ్యవహారములన్నియు నతనిమీఁద వేయించి విజయకేతుని నించుకేనియు మన్నింపక తాను సంతతము నంతఃపురమున గాంతోపభోగములతో గాలక్షేపము చేయుచుండెను. అవ్విధమంతయు గ్రహించి విజయకేతు డొకనాడాత్మగతంబున నిట్లు తలంచె. అహా! యీరాజు మిగుల మూర్ఖుడయి వీని మాటలచే జెడిపోవుచున్నవాడు. ఈరాజు చేష్టలుమాత బూర్వపురీతిని గనంబడుటలేదు. పూర్వమువలె నాతో నవ్వుచు మాట్లాడడు. కన్నెత్తిచూడడు. నాతో రహస్యములు జెప్పుట మానివేసెను. మంచిపనులకు నన్ను నియోగింపక నీచకార్యములకు బంపుచున్నవాడు. నా కుశలమేమియు దెలిసికొనడు. నాపన్నులయిన వారిని మన్నించుటలేదు. నా శత్రువులయెడ విశ్వాసము జూపుచుండెను. నామాటకు బ్రత్యుత్తరమయిన నీయడు. నేను దాపుననున్నను మఱియొకరితో వేఱొకరిని నిందించును. ఇదియంతయు విహారభద్రుని యుపదేశమహిమయే గదా అహా! చిత్తజ్ఞానాను వర్తులగువార నర్హులయినను రాజులకు బ్రియులగుదురు. సమర్థులయినను దద్భావబహిష్కృతులయినచో ద్వేషులగుదురుగదా.

శ్లో॥ సులభాఃపురుషాలోకే సతతం ప్రియవాదినః।
అప్రియస్య పథ్యస్యవక్తా శ్రోతాచ దుర్లభః॥

అనినట్లు ప్రియవాదులనేకులు గలరు గాని యప్రియమును నపథ్యమునగు వాక్యములను జెప్పువాడును వినువాడును గూడలేడు. ఈతని రాజ్యము స్వల్పకాలములోనే శత్రువుల యధీనము కాగలదు. నేనేమి జేయువాడ. చిరకాలము నుండి యాశ్రయించియున్న యీ దివాణమును విడిచిపోవుటకు మనసొప్పకున్నది. కానిమ్ము నేనేమి నోరు మెదల్పక మూగవానివలె నెట్లో కాలము వెళ్ళించెదనని యూహించి యారీతినే నడుచుకొనుచుండెను.

అట్లు ధర్మపాలుడు కామతంత్రుడై రాజ్యమును దుర్మంత్రి యధీనముచేసి సంతతము నంతఃపురమందే వసించుచుండ నొకనాడు చోళదేశపు రాజుయొక్క మంత్రిపుత్రుడు దుర్వినీతుడనువాడు గూఢపురుషులతో గూడికొని కౌశాంబికివచ్చి మిక్కిలి విచిత్రములగు క్రీడలచేత విహారభద్రుని వశము చేసికొనెను. ఒకనాఁడా దుర్వినీతుని వెంటబెట్టుకొని విహారభద్రుడు రాజసభకువచ్చి రాజునకు వానిం జూపుచు నిట్లనియె. దేవా! ఈతడు చోళదేశపు రాజుయొక్క మంత్రి చంద్రపాలితుడనువాని కుమారుడు, దుర్వినీతుడనువాడు పేరు మిగుల శూరుడు. రాజుతోద్వేషించి యెప్పటనైన గొలువుచేయుటకు వచ్చినాడు మనరాజు సహజశత్రుడుగదా! శత్రువునకు

శత్రువు మిత్రుండగు నితండట్టి యూహతోడనే మనయొద్దకు వచ్చెను. వీడు పెక్కు విద్యలయందు ప్రవీణుడు. ద్యూతక్రీడయందును వేటయందును వీనికిగల పాటవము మఱియొకరికిలేదు. వీనికి మన యాస్థానములో దగిన యుద్యోగ మిప్పించవలయును. వీడుండినచో శత్రువులు భయపడుచుందురని యెన్నియో బోధించుచున్న విహారభద్రుని మాటలువిని సైరింపలేక రెండవ మంత్రియగు విజయకేతుండిట్లనియె. నరేంద్రా! నన్ను మీ రేయాలోచనయు నడుగకున్నను నాకు దివాణము మీదగల విశ్వాసమూరకొననీయక చెప్పుచెప్పుమని యూరక ప్రేరేపించుచున్నది. వినుండు. వీడు మనకు సహజశత్రువగు చోళదేశపు రాజుగారి మంత్రిపుత్రుడు అట్టివాని బరీక్షింపక కోటలోనికి రానీయవచ్చునా? వీడు మనకోటగుట్టు దెలిసికొనుటకయి వచ్చియుండవచ్చును. ఉద్యోగపు నెపమున, కొన్నిదినములుండి రహస్యములన్నియు దెలిసికొని వెళ్ళినచో మనమేమిచేయగలము? మీకు నామాటలేమియు హితముగా నుండవు. నీతిమాట దలపెట్టవలసిన పనిలేదుగదా! నీతిశాస్త్రములో శత్రుపక్షమువాడు వచ్చినపుడు వానింబట్టుకొని బందీగృహమున నుంచవలయునని యున్నది. మీ పెద్దమంత్రి యట్టితంత్రమున కొండబడునా? నేను జెప్పవలసినమాట జెప్పితిని. తరువాత మీ యిష్టము వీనిని మాత్రమునమ్మి విడిచిపెట్టగూడదని ముమ్మారు పలికెను.

అప్పుడు విహారభద్రుడు పకపక నవ్వుచు నోహో! ఈతండు రాజునకు క్షేమముగోరువాడును మేమందరము కోరనివారము కాబోలు. ఇక వీనిబుద్ధిబలము కొనియాడదగినదే! నేను జేయబూనినపని కాదనుట వీనికి సహజము. కానిమ్ము దాన నాకు జెడిపోవునది యేమియున్నది. మనగుట్టు దెలిసికొనుటకు నీతడు రావలయునా? కోట ముట్టడించునప్పుడు మనగుట్టు నిలుచును కాబోలు. ఈదుర్మంత్రములతో బ్రయోజనములేదు. వీనిని మనయొద్ద నుంచుకొనకతప్పదు. నేనభయహస్తమిచ్చితిని. వీనివలన మనకు శత్రువుల మర్మములు దెలియవచ్చును. అని నిర్భయముగా బలుకుచున్న పెద్దమంత్రిమాటలు కాదనలేక యాధాత్రీపతి యందులకు సమ్మతించినట్లు సూచించుచు నంతఃపురమునకు బోయెను.

అప్పుడు విహారభద్రుడు విజయకేతు నాక్షేపించుచు దుర్వినీతుని దనకు సహాయుడుగా నుండునట్టి యుద్యోగమిచ్చునట్లు వ్రాసెను. దుర్వినీతుడును క్రమంబున నయ్యాస్థానములో నగ్రేసరుడయి రాజుతో సప్తవ్యసనములును మిక్కిలి యుత్తమములని చెప్పి యతని చిత్తమును దదాయత్తమగునట్లు చేసెను. రాజు దుర్వృత్తి కుద్యోగించుచుండ నాసక్తింబూన ద్యూతక్రీడ యధికమైనది. చౌర్యము తన్మూలక మగుటచే దానిమాట చెప్పనేల? పానగోష్ఠియన్నిటికిని మొదటిదే కదా! కామప్రవృత్తి లోకమునకు స్వభావసిద్ధమయినదే.

ఈరీతి గ్రమక్రమముగా బ్రజలు భయమువిడిచి దుర్వ్యాపారములకు దొడంగుచుండిరి. మందలించువారు లేమింజేసి బలవంతులల్పుల వస్తుక్షేత్రాదులహరింప దొడంగిరి. దానంజేసి ప్రజల కొండొరులకు గలహము నధికమయినవి. వర్ణాశ్రమ ధర్మముల విడిచి సంకరులై ప్రవర్తింపదొడంగిరి. ఆరీతి రాజ్యంబంతయు గ్రమక్రమంబున క్షీణదశకు వచ్చుచుండుట జూచి దుర్వినీతుడు మిగుల సంతసించుచు రహస్యముగా దనదేశమునుండి యుత్తరప్రత్యుత్తరములు దెప్పించుకొనుచుండెను. విజయకేతుడొక నాడా రహస్యము దెలిసికొని యొక యుత్తరమును సంగ్రహించి రాజునకు జూపించి దుర్వినీతుని కుచ్చిత మంతయు దెలియజేసెను. కాని సురాపాన మత్తుండగు నా రాజున కతనిబోధ యేమియు దలకెక్కినదికాదు.

దుర్వినీతుడా పట్టణములో నొకచోట స్థలము సంపాదించి దానిచుట్టును సున్నతమగు ప్రహరిపెట్టి రహస్యముగా దానిలోని సేనలం జేర్చుచుండెను. విజయకేతుడా వృత్తాంతమంతయుఁ దెలిసికొని పట్టణపాలక పట్టమహిషి సునందకిట్లు వ్రాసెను. అమ్మా! నీపతి విహారభద్రుని బోధకులోనై రాజతంత్రములేమియుఁ జూచుటలేదు. రాష్ట్ర మంతయు భ్రష్టమై పోవుచున్నది. అదియుంగాక శత్రుపక్షపాతి యగు దుర్వినీతుని దెచ్చి యింటిలోబెట్టిరి. వాడు కుచ్చితపు వ్యాపారమున నుండి చోళదేశమునుండి సేనల రప్పించుచున్నాడు. ఎప్పుడో హఠాత్తుగాఁ గోట బట్టుకొందురు. రాజ్యహానియే కాక మానహానియుఁ గూడ గాగలదు. దుర్వినీతుడు చోళదేశపురాజు మంత్రి పుత్రుఁడు ఈ సంగతి నేనేమి చెప్పినను నీపతి వినిపించుకొనడు, నీవు పట్టమహిషివి గాన నీకుఁ దెలియపరచితిని ఇచ్చట నా మాట వినువారెవ్వరును లేరు. దుర్వినీతుని యిల్లు పరీక్షించినచో శత్రుసేనలు గనంబడును. రాబోవు ననర్థమునకుఁ బ్రతికార మిప్పుడే చేయవలయునుగదా? నీవు గూడ నశ్రద్ధ చేసినచో శత్రువులువచ్చి పైబడుదురని వ్రాసి యాయుత్తరము దాసీజనమువలన నామెకందజేసెను. విద్యావతియుం రూపవతియు, గుణవతియునగు నాయువతి యాయుత్తరమునుఁ జదువుకొని విజయకేతుని సుగుణసంపత్తి నంతకుఁ బూర్వమే వినియున్నది కావున నతని వినయ విశ్వాసములకు సంతసించుచుఁ బ్రమత్తుండైయున్న ధర్మపాలునకారాత్రియంతయు నీతిబోధఁ జేసి యంతకుఁ బూర్వముకలిగిన దుర్బుద్ధియంతయుం బోగొట్టిఁ విహారభద్రుని యందసూయయు విజయకేతునందుఁ బ్రీతియుం గలుగునట్లు చేసినది.

అంత మరునాడుదయంబున నారాజు అహంకార ముఖముతో సభకు వచ్చి మంత్రులరప్పించి యిప్పుడు రాష్ట్రస్థితి యెట్లున్నదనియడుగగా విహారభద్రుఁడు పూర్వమువలెనే యెద్దియో చెప్పబోయెను. కాని వాని మాటలన్నియు ననర్థమూలములుగాఁ దోచినందున వినిపించుకొనక పట్టణమంతయుఁ జూడవలసి యున్నది. కావున

నశ్వమును సిద్ధపరపింపుమని విజయకేతుని మొగము జూచి చెప్పెను. అతండది గ్రహించి రాజుబుద్ధి మరల్చినందులకు సునందాదేవిని మిక్కిలి మెచ్చుకొనుచు నపుడే యొక యుత్తమాశ్వమును జీను కట్టించి సిద్ధపరచెను.

రాజు మంత్రులిద్దరను దుర్వినీతుని వెంటరమ్మని యా హయమెక్కి కొంత వరకుఁ బురవీధులందిరిగి తరువాత దుర్వినీతుని గృహమెక్కడ యని యడిగెను. దాని కతఁడు భయపడుచుఁ దన యిల్లు చూపింపక వేరొక గృహము చూపెను. అప్పుడు రాజు విజయకేతుని మొగము చూచుటయు నతఁడది గ్రహించి దేవా! ఇది దుర్వినీతు నిదికాదు. మఱియొకరిది. వెనుకఁగొన్ని దినములిందుండెను. కాని యిప్పుడు లేదు. వేరొక చోట గొప్ప భవనముగట్టెను. చూపించెదరండని పలుకుచు నప్పుడే రాజు సేనా నివేశమునకుఁ దీసికొనిపోయెను.

రెండవ కోటవలె నొప్పుచున్న యతని గేహము చూచి యారాజు విస్మయము జెందుచు విహారభద్రుని జూచి కన్ను లెఱ్ఱజేయుచు నచ్చట గుఱ్ఱమును దిగి యాద్వారము దాపునకుఁ బోయి తలుపులు తీయింపుమని దుర్వినీతునిఁ జూచి చెప్పెను. అప్పుడతండు తడబడుచు అయ్యా! దీని తాళముచెవి నాదగ్గర లేదు. దీనిలో నెవ్వరును లేరని చెప్పగాఁ గోపముచేయుచు నప్పుడే తాళము పడఁగొట్టించి తలుపులు తీయించెను. నాలుగైదువేల మంది యాయుధములతో నుండిరి. వారింజూచి రాజు భయమును క్రోధమును సంభ్రమము మనంబున నావేశింప దుర్వినీతునిం గాంచి యీ సైన్యమెవ్వరిదని యడుగఁగా నతండిది దేవరవారిదే యని చెప్పెను.

ఆ మాటవిని రాజు వెంటనే తలుపులు వేయించమని యాజ్ఞాపించెను. దుర్వినీతుఁడు అర్థముగా పలువంబడి లోపల వారికేదియో సంజ్ఞఁజేసెను. అప్పుడందు లోని వారందరు నాయుధములు సవరించు కొనుచుండిరి. ఆ విధము దెలిసికొని విజయకేతుఁడు తొందరపడుచు నచటనున్న రాజభటులతో బలాత్కారముగాఁ దలుపులు మూయుడని యాజ్ఞాపించగా విని వారును ద్వారములో నిలువబడియున్న దుర్వినీతునిఁ గూడ లోనికిఁ ద్రోసి తలుపులు మూసిరి.

అప్పుడు రాజు విహారభద్రునిఁజూచి దుర్వినీతుని యవినీతియంతయుం దెలిసినదా! ఇదియంతయును నీకతమున వచ్చినది. నిన్నేమి చేసినను ద్రోహములేదు. కానిమ్ము. ఇప్పుడు వచ్చిన యుపద్రవము దాటించుకొని తరువాత నీ పని కనుగొనియెద నని పల్కుచు విజయకేతుం జూచి అయ్యా! మనసేనలన్నియు నెచ్చటనున్నవి! వేగము సన్నాహము సేయింపుము ఇప్పుడు తప్పక యుద్ధము జరుగఁగలదు. ఇదియంతయు [illegible]దేశపురాజు వసురక్షితుని కపటోపాయమని తోచుచున్నది అతఁడు మనకు సహజశత్రువు. మనలనెట్లయినను జయింప వలయునని కోరుచున్నాఁడు. ఇప్పుడు బలగములు గూర్చుకొని వచ్చునని తోఁచుచున్నది. ఇంతలోనివారు వైరి

రాకుండ నెద్దియేని యాలోచింపుము నీవు బుద్ధిమంతుఁడవు. వెనుకటి కోపమెంచ కొనకుమని పలికిన నతఁడు విచారించుచు అయ్యో! నే నిప్పుడేమి సేయువాఁడ సేన లెచ్చట నున్నవియో తెలియదు. ఈ లోపలవాండ్రు బైటికి వచ్చిరేని నిలువలేము. కర్తవ్యమేమియని యాలోచించుచు నచ్చటఁ గొందరిని గావలియుంచి యప్పుడే పుర మంతయుఁ జాటింపఁజేసెను.

ఆ చాటింపువలన సిద్ధముగా యున్న సైన్యమువచ్చి కోటముంగిటనిలచెను. దానిలోఁ గొంత సేనను దుర్వినీతు నింటిచుట్టును నిలిపెను. తరువాత దేశములోనున్న వాహినికి వార్తలనంపెను. ఇంతలో నావోళదేశప్రభువగు వసుమిత్రుఁడు ఆవార్తవిని మితిలేని సేనలం గూర్చుకొని యా యూరుముట్టడించి భేరీవాయించెను. ఆ ధ్వనివినిన తోడనే రాజు గుండియలు బెదిరినవి. కోటతలుపులు మూయించిరి. బురుజులమీఁదను గోడలమీఁదను ఆయుధములతో యోధులు నిలిచిరి. ఈరీతి నోపినంతవరకు వ్యూహము పన్నించి విజయకేతుఁడు రాజునొద్దకుఁ బోయి నమస్కరించి యిట్లనియె.

దేవా! వసుమిత్రుడు చతురంగబలములతో వచ్చి పట్టణము ముట్టడించి నాడు. వారిసేనలో మనసేన నాలుగవవంతైనను లేదు. కోటనిలుచుట గష్టముగా నున్నది. యోపినంతవరకుఁ బోరుదము. కాని కోటలోనున్న ప్రచ్ఛన్నమార్గము తలుపులు తీయుంపుడని చెప్పగా రాజువింగల శోకాక్రాంతుడగుచు నట్టియేర్పాటు చేయించెను. అప్పుడది చూచి యంతఃపురకాంతలెల్ల గొల్లుమని యేడ్వసాగిరి. అప్పటికి రాజునకు మూడేండ్ల ప్రాయముగల యొకకుమారుఁడుండెను. మరియు నతని పట్టమహిషి తొమ్మిదినెలలం గర్భముతో నున్నది. అట్టి సమయములో నెట్టియవస్థ వచ్చెనో చూడుము. వారట్లు సంభాషించుకొనుచున్న సమయములో రణభేరీధ్వనులు సమీపముగా వినిపింప దొడంగినవి.

అప్పుడు శత్రుసైన్యము గ్రామములోఁ బ్రవేశించి కోటముట్టడించినట్లు తెలియవచ్చినది. దానికి మిక్కిలి భయపడుచు రాజును మంత్రియుఁ నాయుధంబులు ధరించి బురుజులపైనెక్కి శత్రుసైన్యము నంతయు జూచి యధైర్యపడియు నంతలో ధైర్యము తెచ్చుకొని పగతుర కోటదరికిఁ జేరకుండునట్లు కొంత సేపాయుధములఁ బ్రయోగించిరి. దానంజేసి వారి గోట చాపునకుఁజేరుట గష్టమైనది. గుట్టంతయుఁ దెలిసిన దుర్వినీతుఁడు కోటదుర్గముల నెఱిగియుండుటం జేసి వాఁడువురు లేచి రెండవ వెడద సేనలం దీసికొనిపోయి కోటపై తుపాకులఁ గాల్పించెను.

ఆ చప్పుడులకు వెఱచి కోటలోనున్న స్త్రీలు తల్లడమందుచుఁ బొబ్బిరి. రాజును మంత్రియు నోపినకొలది దుపాకులఁగాల్చుచుండిరి. కాని సముద్రమువలె నావరించి యున్న సేన నంతను నొందింప లేకపోయిరి. అప్పుడు శత్రుసైన్యము హద్దుమీరి

రెండవదానిని లోపలఁ బ్రవేశింపఁ దొడంగుటయు విజయకేతుఁడు విచారించి సత్వర ముగా నిరువురదాదులతో రాజపుత్రునితో రాజపత్ని సునందను బ్రచ్ఛన్నమార్గమునఁ గోటవెడలించెను. ఆసమ్మర్దములో రత్నవతియను దాదియు సునందయు నొకమార్గము నను రాజపుత్రునెత్తుకొని నింబవతియను దాదియొకమార్గంబునఁ బోవుటచే నొకరిజాడ యొకరికిం దెలిసినదికాదు. తరువాత రెండవదారినివచ్చి శత్రుబలము గోటలోఁ బ్రవే శించుటఁజూచి రాజుపారిపోవుటకుద్యోగించుచున్న సమయమున దుర్వినీతుఁడు వీరభటు లతో వచ్చి యతనిం బట్టుకొనియెను.

అప్పుడు రాజు దుర్వినీతునింజూచి యోరీచెడుగ! ఇట్టిద్రోహముచేయుదు వనుకొనక నీకుద్యోగమిచ్చినందులకు గదా యిట్టి యుపద్రవము దెచ్చిపెట్టితివి కానిమ్ము దైవము నీకెప్పటికైన నాపదలు గలుగఁజేయకుండునా? నీవుమాత్రమెల్లకాల మిట్లుం దువా? మోసముసేసి హఠాత్తుగావచ్చి జయించుట బంటుతనముకాదు. కాల వ్యవధి నిచ్చిన నీపౌరుషము గనుఁగొని యుందును. కానిమ్ము మాకిప్పుడు చెడుకాలము వచ్చి నది. విజయకేతుని మాటలువినక విహారభద్రుని నమ్మినందులకు మంచిప్రాయశ్చిత్తమే యైనది. అని యీరీతిఁ బెక్కుగతుల దుర్వినీతుని నిందించెను. కాని దేనికి వాఁడు సమాధానము జెప్పక యతని పాదములకును జేతులకు నిగళంబులు దగిలించి తీసి కొనిపోయెను.

అప్పుడు వసురక్షితుని సేనలో జయజయధ్వను లెసంగినవి. పిమ్మట విజయకేతునికై ప్రయత్నములు సేసిరికాని యతఁడెందునుఁ గనఁబడలేదు. పిమ్మట వసురక్షితుడు దుర్వినీతుని కొంత బలముతో నాకోటలోనుండ నియమించి తాను మంత్రియు ధర్మపాలుని తీసికొని బలములతో నింటికిఁబోయి యతనినొక చెఱసాలలోఁ బెట్టించెను. ఆహా! అవినీతుఁడగువారి కాపదలు రాకమానునా! ఇంతకు నది కాలమహిమ కాక వేఱొకటికాదు.

# అదృష్టదీపుని కథ

వత్సా! రాజపత్ని సునంద పుత్రునెత్తుకొని యిరువుర దాదులతో నరణ్య మార్గంబునం బడిపోయెనని చెప్పితినిగదా! వారిలో నింబవతియనుదాది రాజకుమారు నెత్తుకొని ముందుగా వడివడి పదుగెత్తుచు శత్రువులు వెనుక వచ్చుచున్నారేమోయని తిరిగితిరిగి చూచుచు నొకపగలును రాత్రియు నడచి మఱునాడు సూర్యోదయము వేళ కొక మహారణ్యములోనికిఁ బోయినది. రాత్రియంతయు మిగుల శ్రమపడి నడచినది

కావున యుదయంబునఁ గదలలేక రాచపట్టినక్కునం బెట్టుకొని యొక చెట్టునీడం బండుకొని నిద్రఁబోయినది.

ఇంతలో నాచెట్టు తొఱ్ఱలోనుండి యొకకృష్ణసర్పమువచ్చి యా నింబవతిం గరచి దానిప్రక్కలో నాడుకొనుచున్న చిన్నవాని శిరముపై బడగపట్టి యాడందొడంగి నది. ఆ దాదియు సర్పగరళము తలకెక్కినంత ద్రుటిలోఁ బ్రాణములు విడిచినది. అయర్భకుఁడు దాది యెంతసేపటికిని లేపోవుటచేత నదలుచు గొంతెత్తి యేడువ సాగెను. ఇంతలో నాప్రాంతమందుఁ బశువులు గాచుకొనుచున్న గొల్లపిల్లవాండ్రు ఆదారినివచ్చి యాపామును బాలకునింజూచి వెఱచుచుఁ గఱ్ఱతో సర్పమును బెదరించిరి.

అదియు దండతాడనభీతిచేఁ బాఱిపోయి వివరములో దూరినది. పిమ్మట నాబాలుకు నింబవతి నోటినుండిఁ వెడలెడు నురుగునుఁ జూచి యది పాముగరచి చచ్చెనని యూహించికొని యా డింభకు నెత్తుకొని సంతోషముతో నా ప్రాంతమందే యున్న తమ పల్లెకుఁబోయి పెద్దల కావృత్తాంతమంతయుం జెప్పి యా బాలునిఁ జూపించిరి. ఆపల్లెలోఁ పెద్దగొల్ల పింగళకుఁడను వాఁడా వార్తవిని తనకు సంతతి లేదు కావునఁ దానాబాలునిఁ బెంచుకొనియెదనని చెప్పి యప్పాపనిం దెచ్చి తనయింటం బెట్టుకొని వెన్నయు మీగడయుఁబెట్టి గారాబముగాఁ బెనుచుచుండెను. అపిల్లవాని కులగోత్ర నామంబులెవ్వరికిఁ దెలియవు మరియుఁ బింగళకునితల్లి తలపై సర్పమునీడఁబట్టిన వాఁడదృష్టవంతుఁ డగునని చెప్పఁగా వానికి దండ్రి యదృష్టదీపుఁడని పేరుపెట్టెను.

అదృష్టదీపుని కయిదేడులు ప్రాయమువచ్చినతోడనే యాపల్లెలోనున్న బడిలోఁ జదువవేసిరి. ఆబడిలోఁ జదువుచెప్పువానికి నక్షరములుపలుకుబడిమాత్రము తెలియును. అచట వాఁడే మిగుల పండితుఁడు. అదృష్టదీపుఁడట్టి చదువును స్వల్పకాలములో గ్రహించి క్రమక్రమముగాఁ దనబుద్ధిబలముచే జారుకుగా వ్రాయుటయుఁ జదువుటయుఁ నేర్చుకొనియెను. రత్నము బొగ్గులలోఁ బెట్టినను సహజమైన కాంతిని విడుచునా! ఆపిల్లవాని కేడెనిమిదేండ్ల ప్రాయమువచ్చినప్పుడు పింగళకుఁడు కొంత మంది బాలురజతయిచ్చి తనపశువులవెంట నడవికిఁ బంపుచుండును. అదృష్టదీపుఁడును తోడిబాలురతోఁ బశువుల వెంట నడవికిఁబోవుచు సాయంత్రము దనుకఁ బశువులమేపి రాత్రికింటికివచ్చుచుండును.

రాత్రిసమయములం దదృష్టదీపునికి పింగళకుని తల్లి మిగుల వృద్ధురాలు పూర్వపురాజుల చరిత్రలు కథలుగాఁ జెప్పుచుండ సంతోషముతో వినుచు నతండడవిలో నున్నను లోకమర్యాదలన్నియు జక్కఁగా గ్రహించెను. విశాలమైన నేత్రములు, చంద్రబింబమువంటి మొగము, విండ్లవంటి బొమముడులు, చక్కనిచెక్కులు, నాజాను బాహువులు, సింహసంహననము గలిగి యదృష్టదీపుఁడు మసిపాతనుఁగట్టిన మాణిక్యము వలె నగ్గొల్లవాని యింటిలోఁ బెరుగుచు నడవికిఁబోయి పశువులం గాచుచుండెను. అత

సికిఁ బదియేడుల ప్రాయమువచ్చినప్పుడు బాలురతోఁగూడ నడవికిబోయి యొక నాఁడాత్మగతంబున నిట్లు తలంచెను.

ఆహా! మాయవ్వ చెప్పుచుండెడి కథలనుబట్టిచూడ నీభూమియందనేక విచిత్రములగు పట్టణములను గ్రామములు రాజులు సేనలు రథములు, గుఱ్ఱములు మొదలగునవి యెన్నియేనిఁ గలిగి యున్నట్లు తోఁచుచున్నది. ఈ యడవిలోనేమియుఁ గనంబడవు భూమిలోనొకఁడు సేవకుఁడు నొకడు సేవ్యుండుగా నుండుటకుఁ గారణ మేది? మనుష్యజాతి యంతయు నొక్కటియేగదా! అది వీరివీరి బుద్ధిబలమునుబట్టి వచ్చి యుండవచ్చును. మా పల్లెలోని వారిచర్యలన్నియు నేను జూచుచుంటిని. ఒక్కని కైన బుద్ధిబలమున్నట్లు తోఁచదు. వారి యాకారములును వికృతముగా నున్నవి. నేనట్టి వారికిఁ బుట్టియు నట్టిరూపము గాక వేఱొకరీతి నుండుటకుఁ గారణమేదియో యుండ వచ్చును. ఈ పల్లెలోనున్న వారిలో నొక్కనికైనను నా పోలికలేదు. ఇప్పుడు నా బుద్ధిబలముచేత నీయూరంతయు నాయధికారమునకు లోఁబడునట్లు చేసికొనియెద నని తలంచుచు నచ్చటనున్న బాలుర నందరంజేరి యిట్లనియె.

బాలకులారా! మనమీయడవిలో నూరక తిరుగుచుండనేల! నేనొకయుపాయము జెప్పెదను. నేను జెప్పినప్రకారము మీరందరు వినియెదరాయని యడిగిన వారెల్ల నొడంబడిన పిమ్మట మరల నిట్లనియె. ఈభూమిని పాలించెడు రాజునకొక మంత్రియు భటులు గలిగి యుందురు. ఆరాజు క్రమప్రకారము ప్రజలపాలించు చుండును గదా అలాగుననే మనముగూడ బాలించుకొందము. నేనురాజును, మీరు మంత్రులు, మీరు పరిచారకులు, మీరు ప్రజలు- ఈరీతి నిర్ణయించిన యీయడవిలో నాడు కొందము. ఈయాట మిగుల విచిత్రముగా నుండునని పలికిన నందరు వానిమాటకు సంతసించిరి.

అప్పుడు వారందరిచేత నొక విశాలమగు మఱ్ఱిచెట్టుక్రింద చక్కగా బాగు చేయించి యడవికఱ్ఱలచే నెత్తుగా నొక మంచె సింహాసనములాగున గట్టించెను. దాని చుట్టును మంత్రులకును సామంతులకును లేఖకులకును దగినట్లు దారువులతోనే పీఠముల గట్టించెను. చుట్టును ఆవరణము, ద్వారము, ద్వారపాలురు మొదలైనరాజసభాలక్షణము లన్నియు గలుగునట్లు మ్రానులతో గట్టించెను. ఆబాలకులలో గొందర మంత్రులగాను మరికొందర లేఖకులగాను గొందర ప్రజలగాను వారి వారి బుద్ధిబలమునకు దగినట్లు నిర్ణయించి తాను రాజుగా నాసింహాసనమునగూర్చుండి వారువారు చెప్పదగినమాట లన్నియు నుపదేశించుచు నదృష్టదీపు డయ్యడవిలో రాజ్యము సేయుచుండెను.

నిజముగా రాజునకు ప్రజలు జడిసినట్లా బాలకులందరు వానికి జడియు చుందురు. తానురాజుగానుండి యాపరిచారకులలోనే పశువులు గాచుటకు దినమునకొక్క నికి పంతువేయుచుండును. దానంజేసి తక్కిన బాలుర కందరకును దీరుబడిగా నుండు నది. మరియు నేరములు నిరూపించుచు శిక్షల విధించుచు దీరుపులు వ్రాయుచు నుట్కో

గము లిచ్చుచు జనుల జెప్పుచు ధర్మములం బలుకుచు జట్టముల రచించుచు నిజమైన రాజువలె రాజ్యము చేయుచుండెను. ఈరీతి ప్రతిదినము నుదయమున వచ్చి సాయంకాలమువరకు నాడుకొనుచు రాత్రికింటికి బోవువారు. తమ పెద్దలెప్పుడైన నదవివస్తువులం దీసికొని పట్టణప్రాంతములకు బోయినప్పుడు ఆపిల్లలు వ్రాసుకొనుటకు గాగితములను గలములందెచ్చి యిచ్చువారు కావున నవి యన్నియు నదృష్టదీపుడు తన రాజ్యాధికారమునకుగాను వినియోగము చేయుచుండెను.

అది మిక్కిలి భయంకరమైగ యరణ్యమగుటచే నచ్చటికి నెన్నడును నితరమనుష్యులు వచ్చువారుకారు. అచ్చటికి మిక్కిలి దూరములోగాని దాపున పట్టణముగాని గ్రామముగాని లేదు ఇట్లుండగా నొకనాడు సింధుదేశపురాజు వేటవేడుకచే నయ్యడవికివచ్చి యచ్చోట శిబిరములు వేయించి రెండుమూడుదినములుండి వేటాడెను. ఆ వార్త నదృష్టదీపుడు బాలురచే దెలిసికొని వెదురుబియ్యము, తేనె, ముత్తియములు, చారపప్పు, చామరములు మొదలగువస్తువులు సంగ్రహించి యవియన్నియు మూటగట్టించి విజ్ఞాపనపత్రికాపూర్వకముగా నొక గోపబాలునిచేతికిచ్చి యంపెను

ఆయుత్తరము జదువుకొనిన నిట్లున్నది. మహారాజు సింధుదేశ రాజుగారికి నమరావతీచక్రవర్తి యదృష్టదీపమహారాజు చేయు విజ్ఞాపనము. తాము మా యడవికి వచ్చుటచే మిక్కిలి సంతోషమైనది. ప్రస్తుతము వచ్చి మీదర్శనముచేయుటకు నవకాశము చిక్కినదికాదు. మేము మీ మైత్రినిగోరి మాజ్ఞాపకార్థ మీయడవివస్తువుల బంపితిమి. మీరు మాకీ యడవిలో వసించినందుల కీయవలసినపన్ను స్వీకరింపుము. సర్వదా తలంచుచుండవలయును. ఇవియే పదివేల విజ్ఞాపనములు.

—అమరావతీచక్రవర్తి, అదృష్టదీపమహారాజు.

అనియున్న యుత్తరమును జదువుకొని నిజముగా నట్టిచక్రవర్తి యున్నాడు కాబోవుననుకొని చక్రవర్తిశబ్దమునుబట్టి తనకంటె నతడే యధికుడని తలంచుచు దన కాయనజేసినమర్యాదకు మిక్కిలి సంతసించి యాకానుకల స్వీకరించి మరల నొక యేనుగయు రెండులొట్టియలు నాలుగు గుఱ్ఱములు మణిఖచితమగు నొకపతకమును గొన్ని చీనాంబరములు లెక్కించి మీరు వ్రాయించినయుత్తరమును బంపించిన కానుకలు నందినవి. మిక్కిలిసంతోషించి యావస్తువులు మీజ్ఞాపకార్థము సంతతము, దాపున నుంచుకొనియెదను. మమ్ముగూడ మీరు మరువగూడదు తిరిగి యీ వస్తువుల నంపితిమి మన్నింపవలయు సర్వదా వార్తల దెలుపుచుండవలయునని వ్రాసి యావస్తువులతో నుత్తరమిచ్చి తమభటుల నా గొల్లపిల్ల వానివెంట నంపెను.

అదృష్టదీపు డట్టియుత్తరముతో నాకానుకను నందుకొని సంతోషించుచు నంతకుబూర్వమే పెక్కెండ్ర రాజులపేరులు వినియున్న వాడు కావున నప్పుడే నేపాళదేశపురాజు పేర నారీతినే యుత్తరము వ్రాసి సింధుభూపతియిచ్చిన వస్తుసాహసము

లన్నియు గానుకగా గోపబాలురకిచ్చి యంపెను. నేపాళదేశపురాజు ఆ వస్తువాహనములు స్వీకరించి మీతో మైత్రి నంగీకరించితినని సగౌరవముగా తిరుగ నుత్తరము వ్రాయుచు నావస్తువులకు రెబ్బడిగా మరల వారిచేతి కిచ్చియేయంపెను. ఆ గోపకులు పట్టివస్తువులన్నియుందెచ్చి యదృష్టదీపున కిచ్చిరి. వాని మొత్తమును అతడప్పుడే యుత్తరముతో విదర్భదేశపు ప్రభువునొద్ద కనుప నావైదర్భుడును సంతసింపుచు దానికి రెండు రెట్లధికముగా మరల నంపెను.

ఈరీతి ప్రతి భూపతికిని బంపుచుండ నదృష్టదీపుని పేరు భూమియంతయు మిగుల విఖ్యాతిగా వ్యాపించినది మరియు వేలకొలది గుఱ్ఱములు, నేనుగులు, లొట్టియలు, రత్నభూషాంబరములు కానుకలుగా వచ్చుచుండుటయు వానిలో గొన్నిటి నమ్మించి దానవచ్చిన విత్తంబుపెట్టి ప్రతిరాజధానిలో నదృష్టదీపునిపేరిట సత్రములు వేయించుచుండెను. క్రమంబున వచ్చుచున్న గోపాలకుల కందరికిని మంచి దుస్తులిప్పించి గుఱ్ఱమును, నేనుగులు నెక్కుపాటవము నేర్పించెను.

ఒక్కొక్కరాజు నొద్దనుండి వచ్చిన కానుకలు లక్షలకొలది నుండుటచే వానిలో సగము సగముగా విభజించి యిరువురు రాజులకు బంపుచుండెను. మఱియు నాయారాజధానులలో బర్వదినములయందు దానధర్మములక్రింద గొంతసొమ్ము వ్యయపరచుచుండెను జగంబంతయు నదృష్టదీపుని పేరు వ్యాపించినది. కాని యతం డెచ్చటనుండునో మాత్రమెవ్వరికిని దెలియదు. అతడు కానుకలుగా వచ్చు ధనము వెంటనే వినియోగము చేయుటగాని మరియొక రాజుగారికి బంపుటగాని చేయును. దానిలో గాసైనను ముట్టలేదు. యథాప్రకార ముదయమున బసవుల వెనుక నడవికి వచ్చి యచ్చట పిల్లలతో నామ్రిచెట్టుక్రింద దారు పీఠమున గూర్చుని యావేడుక రాజ్యము సేయుచుండెను.

ఈరీతి రెండుమూడు సంవత్సరములు జరుగువరకు పుడమిలోనున్న రాజు లందరు మిత్రులయిరి. ప్రతిసంస్థానములో నతనిపేరే చెప్పుకొనదొడంగిరి. పెక్కేల ! ప్రజలు వాడుకమాటలతో గూడ కష్టలం జూచినప్పు డదృష్టదీపునంతవానిం బెండ్లి యాడుదుస్థలే యనియు మీ యదృష్టదీపునివలె వచ్చుచున్నబాధలనియు నతండటుల గర్వ పడడ కదృష్టదీపుడాయేమి యనియు నీరీతి నతని ప్రస్తావన దెచ్చుచుందురు. ఒక నాడు పుడమిగల మహారాజులందరు విశ్వేశ్వరమహాదేవుని మహాపూజామహోత్సవము నకు గాశికివచ్చిరి. అప్పుడందరును గలసి మాటలాడుకొనుటలో ప్రతిరాజును నదృష్ట దీపుడు తనకు మిత్రుడనియు నతని పరిచయము తమకు నెక్కుడుగా నున్నదనియు చెప్పదొడంగెను. ఆ యుత్సవమునకు నదృష్టదీపుడు గాశికి వచ్చునేమోయని యనేకులు జూడవచ్చిరి. కాని యతనిజాడ యేమియు గనంబడినదికాదు.

కాశీలో నదృష్టదీపుని సత్రములు నాలుగు గలవు. ఒక్కొక్కమారే లక్షల కొలది ధనమిచ్చియున్నవాడు కావున దాని వడ్డివలననే రాత్రింబగళ్ళు నిరభ్యంతరముగా

వేలకొలది భుజించుటకు నుపయుక్తముగా నున్నవి. పురమిలో నదృష్టదీపుని పేరనున్న సత్రములన్నియు నారీతిగానే వేయబడినవి. కావున వానిలో నేకొదవయు నుండదు. యజమానుని యవసర మెప్పటికిని దివుగా గలుగదు. సత్రాధికారులు గూడ నా యదృష్టదీపు డెచ్చటివాడో యెట్టివాడో యెవ్వడో గురుతెఱుగరు. రాజులందరు నొండొరు లతని ప్రశంస చేయుటచే వెఱగందుచు నతం డెచ్చటివాడనియు నమరావతీ రాజధాని యే దేశములోనిదనియు నతనికెంత దేశమున్నదనియు నత డెంత బలవంతుడనియు ప్రశంసింపజొచ్చిరి. కాని యతని నిజస్థితి యిట్టిదని యొక్కనికిని దెలిసినదికాదు.

అప్పుడు రాజులందరు సభజేసి మనకందరకు మిత్రుడైన యదృష్టదీపుని వృత్తాంతము దెలియకుండుట యుచితముగా నుండలేదు. ఇప్పుడు తప్పక యతని చరిత్ర దెలిసికొని మనమందరముపోయి చూడవలయును. అతడు మిగుల సుగుణవంతుడు అతని సుగుణ సంపత్తి యంతయు నతడు వ్రాసిన యుత్తరములబట్టియే తేటమగుచున్నది. అతని సత్రము లీయూరిలో బెక్కుగలవని చెప్పుచున్నారు. సత్రాధిపతులకు వానిసంగతి తెలియకమానదు. వారి రప్పించి యడుగుదమని యూహించుచు నప్పుడే వారికి వర్తమానము చేసిరి. సత్రోద్యోగస్థులును సత్వరముగా నా సభకు వచ్చిరి. వారిం జూచి మీరున్న సత్రములెవ్వరివని యడుగగా నదృష్టదీపమహారాజు గారివని చెప్పిరి. అతండెందున్నవాడని మరల ప్రశ్న వేయ నదిమాత్రము మాకు దెలియదని యుత్తరము జెప్పిరి.

అట్లయిన మీకు విత్తమెవ్వరు పంపుచున్నారనగా మొదట నొక్కమారుగానే యెల్లకాలము సరిపడునట్లు వారి యుద్యోగస్థులు వచ్చియిచ్చిరని చెప్పిరి. ఆ మాటలు వినినతోడనే యారాజులందరు మిక్కిలి యద్భుతమందుచు వెండియు భూమి యొక్క పటమును దెప్పించి యందుగల దేశములన్నియు వేరువేర నిరూపించి చూచిరి కాని యమరావతీ రాజధానిగల దేశ మెందును గనంబడినదికాదు. కానుకలు దెచ్చినప్పు డక్కింకరుల నతని నివాసము నడుగకపోయితిమే యని పశ్చాత్తాపపడుచు నతని వృత్తాంతము దెలియుటకై పెక్కుతెఱంగుల బ్రయత్నించుచుండిరి.

తరువాత వారందఱు విఫలప్రయత్నులై యీసారి యదృష్టదీపుడెవ్వరికేని గానుకలు పంపినచో నా వచ్చిన భటులవెంట మన కింకరులంగూడ నంపి యతని దేశము తెలిసికొనివచ్చునట్లు చేయుదమని నిశ్చయించుకొని తమ తమ దేశములకు బోయిరి. మరియు నొక్కనా డదృష్టదీపుడు పాండ్యదేశ ప్రభువగు మలయధ్వజ మహారాజుగారికి బదివేలు గుఱ్ఱములు, నారువేల యుష్ట్రంబులు, రెండువేల యేనుగులు, లక్ష వెలజేయు రత్నహారములు, పదివేల వాహనంబులు మరియు జీనిచీనాంబరములు కానుకగా పంపినం జూచి యారాజు విభ్రాంతుండగుచు నోహో! యదృష్టదీపుడు నాకుం గానుకగా నిచ్చిన వాని మొత్తమునకు నాయైశ్వర్యము సరిగానుండునో లేదో ఇట్టివి నేనీ రాజుగారికి మరల నేమియంపుదును! అమ్మహాత్ముని యైశ్వర్యమేపాటి

యదియుండదా ! ఆయన దర్శనముజేసిన ధన్యులగుదుము. మరల నివియే పంపుచు మరికొన్ని యేనుగులమాత్ర మధికముగా నిచ్చువాడ. నేనుగూడఁబోయి యమ్మహా పురుషుని పాదములంబడి యపరాధము జెప్పుకొనియెదనని తలంచి యా కానుకలు దెచ్చిన కింకరులతో నిట్లనియె.

రాజభటులారా ! మీరాజుగారుచేసిన సత్కారమునకు నేను మిక్కిలి సంతసించితిని. ఆయనకు బ్రతిసత్కారము నేనేమియు జేయలేను. స్వయముగావచ్చి యాయన పాదంబులం బడియెద, ఆయన ప్రసిద్ధి జగంబంతయు నిండియున్నది. అట్టివారి దర్శనము చేయుటకంటె పుణ్యమున్నదా ఆదేశ మెచ్చటనున్నది ? అయ్యమరావతికి బోవుమార్గమెట్లు? నాకు రాజుగారిదర్శనము జేయింతురా ? యని యడుగగా నాకింకరులిట్లనిరి. దేవా ! ముందుగా నేను వచ్చుచున్నానని యాయనపేర యుత్తరము వ్రాసి యాయన యనుమతి వడసిపోవలయును. మీకట్టి యుత్సాహము గలిగి యున్నచో నుత్తరము వ్రాసి మా చేతికిండు మేముపోయి ప్రత్యుత్తరము తీసుకొని వత్తుమని చెప్పగా నా రాజు సమ్మతించుచు నారీతి ప్రార్థనాపూర్వకముగా నుత్తరము వ్రాసి యా వస్తువాహనములతో గూడ దమభటుల గొందర బంపి ప్రత్యుత్తరము తెమ్మని యాజ్ఞాపించెను.

అదృష్టదీపుడు తన భటులకు జేయవలసిన కృత్యములన్నియు నంతకు పూర్వమే బోధించియున్నవాడు. కావున వారందరలో గొందరు ముందుగాబోయి మలయధ్వజుని దూతలు వచ్చుచున్నట్లు చెప్పిరి. అదృష్టదీపు డప్పు డాలోచించి యోహో ! పెక్కెండ్రు రాజులు నన్ను జూడవలయునని ప్రయత్నించుచున్నట్లు దెలియుచున్నది. నా గుట్టు బయల్పడినచో నిదివరకు వ్యాపించిన కీర్తియంతయు గళంకమై పోవును. కనుక నీరీతియంతయు గట్టిపెట్టి కొన్నిదినములు ప్రచ్ఛన్నముగా నుండుటయే యుత్తమమని తోచుచున్నది. ఇప్పుడా భటుల నిచ్చటికి రానీయగూడదు.

అని తలంచుచు మలయధ్వజునిపేర నదృష్టదీప మహారాజుగారిప్పుడు తీర్థయాత్రకు బోయినారనియు గొలదిదినములలో వచ్చుననియు వచ్చిన తరువాత మేముత్తరము వ్రాయుదుమనియు నప్పుడు రావలయుననియు నొకయుత్తరము మంత్రి వ్రాసినట్లు వ్రాసి దానిమలయధ్వజుని కింకరులకెదురుగా దీసుకొనివెళ్ళుమని పంపెను. మరియు మలయధ్వజుడిచ్చిన ద్రవ్యమంతయు దానధర్మముల క్రింద నొక్కదినమున పుణ్యక్షేత్రములలో బంచిపెట్టవలయునని కింకరుల కాజ్ఞాపించె. ఆయుత్తరముల జూచికొని మలయధ్వజుని దూతలు అదృష్టదీపుని దాతృత్వమునకు విస్మయమందుచు నతనిని లేనప్పుడు పోవుటయేలనని యచ్చటనుండియే మరలి తమ పురమునకు వచ్చి యావర్తమానములన్నియు నన్నియు నద్భుతముగా జెప్పియతని నాశ్చర్యసాగరంబున నిమగ్నునిజేసిరి.

ఎంత మహారాజయినను అంతద్రవ్యము నొక దినములో పంచి పెట్టుటకు సమ్మతించునా! అప్పటికి నదృష్టదీపునికి బదునెనిమిదేడుల ప్రాయమువచ్చినది. అంత దనరూపము జూచుకొని యాగోపకులకంటె మిక్కిలి వ్యత్యయముగా నుండుటచే ననుమానము జెందుచు నొకనాడు తనకు గథలు చెప్పుచుండెడి ముసలిదానియొద్దకు బోయి మెల్లన నిట్లనియె అవ్వా! నీవు నాకు జెప్పెడికథలచే లోకమేమియు జూడకున్నను జూచినట్లె పొడగట్టుచున్నది మరియు నొకసారి దేశముగూడ జూడవలయునని యభిలాష గలుగుచున్నది. ఒక్కొక్కటి యడిగెదను. రహస్యమైనను దాచక చెప్పవలయును. నేను పుట్టిన దినము, ప్రదేశము దెలిసికొన నవసరమైయున్నది. ఎవ్వరినడిగినను జెప్పిరి కారు. నీవు పెద్దదానవు. నీకు జ్ఞాపకముండకమానదు. నీకు నాయందు మొదటనుండియు నక్కటికము పెంపుగదా? యని పలుకగా నదివిని యోహో! యితండక్కటికము పెంపుగదా యనుచున్నాడు పెంపుసంగతి తెలిసినది కాబోలు. నిక నేను మాత్రము దాచనేల? నా కొడుకు వీనితో నా సంగతి చెప్పవలదని బోధించెనుగాని దీనంజెడిపోయిన దేమున్నది.

అని నిశ్చయించుకొనుచు బాబూ! నీవు మా యింట బుట్టలేదు. మా పిల్లవాండ్రందరు నడవికి బోగా నచ్చట నొక మర్రిచెట్టు క్రింద బాముగరచి యొక స్త్రీ చచ్చియున్నదట. ఆమె ప్రక్కలో నీవు దాని లేపుచు నేడ్చుచుంటివట. ఆపాము నిన్ను గరువక సర్పమునెత్తి నెత్తిమీద గొడుగుగా బట్టుచున్నదట. అదిచూచి బాలకులాయరగమును బెదిరించుచు నిన్నెత్తుకొని మాయింటిలోనికి దీసికొనివచ్చిరి. మాపింగళకుడదివిని యపుత్రకుడుగావున నిన్నింట బెట్టుకొని పెంచుకొనుచుండెను. అప్పటికి నీకు మూడుసంవత్సరములు ప్రాయముండును. ఇప్పటికిపదునైదు సంవత్సరములు దాటినవి. దీనింబట్టియూహించు కొనుము. జరిగిన వృత్తాంతమంతయుం జెప్పినది. చేతగాసులేక జగమంతయు దనకీర్తి వ్యాపింపజేసినదిట్టి యొక గొల్ల దానియొద్దనుండి రహస్యము తెలిసికొనుట యేమియాశ్చర్యము.

అదృష్టదీపుడట్టి మాటలు విని మిగుల విచారింపుచు నయ్యో! పాముగరచిచచ్చినది మా తల్లికాబోలు. నన్ను దీసుకుని యొంటరిగానడవికి వచ్చుటకు గారణమేదియో గదా! మా తండ్రి యేమయిపోయెనో? యే కులమువారో నాకు మరి యెవ్వరేని బంధువులు గలిగి యుందురేమో యీవిషయము నాకెట్లు దెలియును. దేశములన్నియు దిరుగుచుండ నెప్పటికేని తెలియక మానునా? కూపస్థకూర్మమువలె నీ యడవిలో నుండనేల నొకసారి యెట్లయినను దేశయాత్ర చేయుటయే యుచితమని తలంచి తన కత్యంత మిత్రుడయిన బలభద్రుడను బాలునితో జెప్పి యింతకుమున్ను కానుకలుగా వచ్చిన గుఱ్ఱములలో నుత్తమమయినదాని దాచికొని యుండుటచే నొకనా డెవ్వరికిని దెలియకుండ బలభద్రునితో నడవికి బోయినట్లే పోయి యా గుఱ్ఱమెక్కి యొక మార్గమునంబడి పోయెను.

ఆదారింబడి పోవఁబోవ గొన్నిదినముల కొకపట్టణము గనంబడినది. అది విదర్భదేశపు రాజధానియయిన ధర్మపురము. దాని ననంతవర్మయనురాజు పాలించుచున్నవాడు. అప్పీటిలో విదేశస్థులకు నివసింపఁదగినది యదృష్టదీపుండుంచిన సత్రమే. కావున నతండును బౌరులవలన నదియున్నచోటు దెలిసికొని యా మిత్రునితో గూడ నచ్చటికి బోయెను. అశ్వారూఢుడై యతండట్లు వెళ్ళినతోడనే యచ్చటి సత్రాధికారులు వాడుకప్రకారము నెదురుగా బోయి యర్ఘ్యపాద్యాదులచే నర్చించి యల్లునికి జేయునట్లుగా నుపచారములచేయ దొడంగిరి. ఆ రీతినంతయు మొదట సత్రమంచునపుడు అదృష్టదీపు డేర్పరచినదే. అతండట్టి పద్ధతులతో వ్రాసిన పత్రికల యందొకచోట గట్టంబడి యున్నవి. దానిఁజదువుకొనుచు నతడు మిక్కిలి సంతోషించుచుండెను. తాను జూచుచుండగనే యనేకులా సత్రములోనికి వచ్చిరి. సత్రాధిపతులు వారినెల్ల నట్టి మర్యాదలతోనే తోడి తెచ్చిరి. సత్రములో సతతము నదృష్టదీప మహారాజు పేరు ప్రమోగుచునే యుండును. అతనిపేరు పద్యములచేత గీతములచేత రచించి యనేకులా గోడలమీద వ్రాసిరి మఱికొందరు విగ్రహములు వ్రాసి క్రింద నదృష్టదీపుడని విలాసముల వ్రైచిరి. ఈరీతి నందెచ్చట జూచినను తనపేరే వ్యాపించి యున్నది. ఆ సత్రములో గుటుంబములతో వచ్చియున్న బ్రాహ్మణులందరు సంభాషించుకొనుచుండ నిట్లు వినఁబడియె.

రామశాస్త్రి - వెంకటశాస్త్రిగారూ! తమరిచ్చటికి వచ్చి యెన్ని దినములయినది. యింకనుగొన్ని నాళ్ళుందురా ?

వెంకటశాస్త్రి - రామశాస్త్రిగారా! తమరెచ్చటనుండి వచ్చుచున్నారు. నేను గుటుంబముతో వచ్చి యారు మాసములైనది. మఱికొన్ని దినములుండెదను. ఆయదృష్టదీపమహారాజు సత్రము వేసెను గదా! యెంతకాలముండినను నేలోపములేదు. ఇంటికన్న గుడిపదిలమనునట్లు మనయిండ్లలో నేమియున్నది. ఆహా! ఆ మహారాజు యెచ్చటనుండెనో కాని ఎంత పుణ్యాత్ముడండి! ఆయనయుంచిన సత్రములన్నియు నీతీరుననే యున్నవి. ఎన్నిదినములుండినను బొమ్మను మాటలేదు.

రామ - ఆయన సత్రములు మీరేమి చూచితి. నేను జూచిన వానిలో నిది యెంత. నేనాయనను జూడవలయునని యెన్నియో దేశములు తిరిగితినికాని యెచ్చటను గనంబడలేదు. ఎచ్చటజూచినను ఆయన ప్రఖ్యాతిమాత్ర మొక చోటకంటె మఱియొక చోట నెక్కుడుగా నున్నది. నేను సమస్త శాస్త్రములు జదివితిని నన్ను జూచినంత నాయన సంతోషించుచు జక్రవర్తిగా జేయడా ? ఆయన యీవికి మేరలేదు. మనసు విసియున్న కర్ణదధీచి శిబివిక్రమార్కాదులను మించిపోయినాడు. మొన్న రామేశ్వరములో సమ్మహాసుభావుడు చేయించిన దానములకు నెంతసొమ్ము వ్యయమైనదో

లెక్కింప శక్యమా? మొన్ననొక బ్రాహ్మణుడు నూరేనుగులతో బోవుచు దారిలో నొకచోట నాకు గనంబడెను. అతని వృద్ధ దరిద్రుడుగా నంతకుబూర్వము నేనెఱుగుదును. కావున నీయేనుగు లెక్కడివని యడిగితిని. అప్పుడతండు నన్ను గురుతుపట్టి రామశాస్త్రి గారా! అయ్యో! ఎంత పొరబాటు చేసితిరండి! మీరుకూడ రామేశ్వరము వచ్చినచో నెంతో ద్రవ్యము దొరుకునుగదా? అదృష్ట దీపమహారాజుగారు పదివేనుగుల్కింపట ననేకకోట్ల ధనము పంచి పెట్టిరి. నేనంతయు నైన తరువాత బోయితినిగాని నీయేనుగులు మాత్రము దొరికినవి. మొదటనున్న బ్రాహ్మణులకు మితిలేని ద్రవ్యమిచ్చిరి. ఈలాగున జరుగునని యెవ్వరికిని దెలిసినదికాదు. లేనిచో నీ భూమిలో నున్న బ్రాహ్మణులందరు నచ్చటికి రాకపోవుదురా? ఆహాహా! అచ్చటికి వచ్చిన బ్రాహ్మణులందరు గుబేరులైరి. అమ్మహారాజు పుణ్యమేమని నుతియింపుదు నాయేనుగుల బోలుకొనిపోయెను. అట్టి పుణ్యాత్ముడిప్పుడు తీర్థయాత్రకు వెళ్ళినట్లు ప్రతీతిగా నున్నది. అందువలన నేనును ప్రతి తీర్థమునకును బోవుచున్నాను.

వెంకట - దేనికైనను ప్రాప్తముండవలయునుగదా! నేను చిర కాలమునుండి యీ దరిద్ర దేవతచే బాధింపబడుచున్నాను. అయ్యయ్యో! రామేశ్వరమైన బోయితిని గానే? అట్టి బుద్ధి నా కేలబుట్టును.

అని యిట్లు తన సంగతి వారిరువురు మాట్లాడుకొనుచుండగా విని యదృష్ట దీపుడు సంతోషించుచు వారి కేమైన నీయవలంచికొని నను తనయొద్ద నేమియు లేక పోవుటచే జింతింపుచు నా సత్రములోనే యొకచోట బసజేసియుండెను. మఱియు నా పట్టణములో దమవారి జాడ యేమైన దెలియనేమో యని కొన్ని దినములందుండి నిత్యము సాయంకాలమునందు బలభద్రునితో గూడ వీధులవెంబడి విహారార్థమై తిరుగు చుండెను.

ఇట్లు తిరుగుచు నొకనాడాయూరి దేవాలయములో సాముద్రిక శాస్త్రవేత్తయగు సన్యాసియుండుట విని యాయన యొద్దకు బోయి స్తుతివాక్య పురస్సరముగా నమస్క రించి హస్తముచాపుచు రేఖలం జూపి తల్లిదండ్రుల విషయము సోదర భావమును గురించి ఫలము చెప్పుడని వేడుకొనియెను. అప్పుడా సన్యాసి యతని హస్త రేఖల జూచి విస్మయ మందుచు అహా! నా జన్మావధిలో నిటువంటి చేయి జూడియుండలేదు. సాముద్రిక శాస్త్రములో జెప్పిన యుత్తమ పురుష లక్షణము లన్నియు నీ యందు యున్నవి. నీవు సామాన్య వేషముతో నుండుటకు నాకు మిక్కిలి యాశ్చర్యముగానున్నది. అదృష్టదీపునికి వచ్చినంత ఖ్యాతి నీకు రావలసియున్నది. నీ తల్లిదండ్రులిప్పుడు బ్రతికియున్నవారు. నీ కొక సోదరుడుండవలయు నెక్కడ నీవొక్కడవె యీ భూమి యంతయు బాలింపదగి యున్నదని చెప్పెను.

ఆ సన్యాసి మాటలు విని యతండదరి పడుచు అయ్యో! నా తల్లిదండ్రు లెక్కడనున్నవారో కదా? పాముగరచి చనిపోయినది మాతల్లి కాదు కాబోలు. నాకొక తమ్ముడుగూడ గలిగియున్నవాడట. అట్టి వాడెప్పుడు గనంబడునో? ఈ సన్యాసి మాటలు తథ్యములు. అని తలంచుకొనుచు నా సన్యాసితో స్వామీ? మీ దయయుండిన నా కేకొదవయు లేదని చెప్పి యతనిచే ననుజ్ఞాతుడై యింటికి బోయెను.

# కాంతిమతి కథ

ఆ సమయంబున నాపట్టణపు రాజకుమారియ కాంతిమతియను కన్యామణి చెలికత్తియ చతురికయనునది యందు గూర్చుండి యా సన్యాసి చెప్పిన మాటలన్నియు వినుచుండెను. అచ్చతురికయు దన ప్రాణసఖురాలి కనుకూలుడగు భర్త లభించునో లభింపడో యా సన్యాసిని దెలిసికొను తాత్పర్యముతో నచ్చటికి వచ్చినది. కావున నట్టి మాటలు వినినతోడనే యదృష్టదీపుని బరీక్షించి చూచి యతని సౌందర్య విశేషమున కచ్చెరువందుచు నితండే కాంతిమతికి దగినవాడు. వీని వెంట రహస్యముగా బోయి కులశీలనామంబులు దెలిసికొనివచ్చెదంగాకయని నిశ్చయించి యట్లు చేసినది. అతని వెంట రహస్యముగా రెండు మూడు దినములు తిరిగి యతని చర్యలన్నియుం గ్రహించి తరువాత గాంతిమతి యొద్దకు బోయినది.

అక్కాంతిమతియు దాని ముఖవిలాసముల గనిపెట్టి యేమే చెలీ! ఇన్నాళ్ళు చేసితివేమి? యాస్వాములవారి దర్శనమైనదా? మాటాడుటకవసర మిచ్చెనా? మన సంగతులన్నియుం జెప్పితివా? ఆయన యేమి సెలవిచ్చెనో చెప్పుము. మన కోరిక సఫలమెప్పటికైన నగునా? వేగము జరిగిన విశేషములన్నియుం జెప్పుమన నది ముసిముసి నగవులు నవ్వుచు గాంతిమతి కిట్లనియె. భర్తృదారికా! మనకు సన్యాసి యేమియు జెప్పనక్కరలేదు. భగవంతుడు తానే తీసికొనివచ్చెను. నీయభీష్టదేవతలు ప్రసన్నులైరని చెప్పగా విని యవ్వనిత తొందర పడుచు చెలీ! ఎట్లెట్లూ వేగము చెప్పుము. నీ మాట వినుదాక తాళకుంటినే యని యడుగ నది మరల నిట్లనియె.

బోటీ! నేనా సన్యాసియొద్దకు బోవువర కొకచక్కని కుమారరత్న మయ్యతిచేత జేయిజూపించు కొనుచుండెను. అతని చేతిరేఖలు చూచినతోడనే నాలుక గరచుకొనుచు నాసన్యాసి పిక్కిలి వెఱగుపడి నీవీ భూమండలమంతయు నేలగలవనియు నదృష్టదీపునంత ఖ్యాతి సంపాదింతువనియు జెప్పెను. అక్కుమారుని సౌందర్య మింతింతయని చెంతునా నంత జయంతాదులకన్న మిన్నగానున్నవాడు అహా! వాని యవ్వనము, పొంకము, లావణ్యము, సౌకుమార్యము, చూచితీరవలయుంగాని చెప్పిన దెలియదు. అట్టివాడు నీకు దగినవాడని నిశ్చయించి మరియు నాతనివృత్తాంతము

దెలియగోరి ప్రచ్ఛన్నముగా నతనివెంట రెండుమూడునాళులు తిరిగితిని. ఒకనాడు వానికిని వాని మిత్రునకిని జరిగిన సంవాదమిట్లున్నది.

మిత్రమా ! పుడమియంతయు నీకీర్తి వ్యాపించినది. నిన్ను మాత్ర మెవ్వరు నెరుగరు. నీచాతుర్యము మిగుల గొనియాడదగినదే. నీవు మిగుల పుణ్యాత్ము డవని యాపుడు పలుకగా విని యాప్రోడ బలభద్రా ! నేనెంతవాడనైన నేమిలాభ మున్నది. నాతల్లిదండ్రులును సోదరుడు గనంబడినప్పుడుగదా నాఖ్యాతికి సార్థకము. అడవిగాచిన వెన్నెలవలె నాబాల్యము నౌన్నత్యమును జూచి మెచ్చువారెవరు ? ఆహా ! తలిదండ్రులచే మన్ననల నెందువారెంత పుణ్యాత్ములోకదా యని పలుకుచు విచారింప దొడంగెను. దీనిబట్టి చూడనతండెవ్వడో విఖ్యాతిగల పురుషుడువలె దోచు చున్నది. కారణాంతరమున ప్రచ్ఛన్నవేషముతో దిరుగుచున్నవాడని తలంచెదను. అతడు తప్పక నీకు నగినపురుషుడు. నీవువానిం జూచితివేని విరహవేదన జెందగల వని పలుకగా విని యాకాంతిమతి రాగవివశహృదయయై సంభ్రమముతో నిట్లనియె.

చెలీ ! యాభాగ్యశాలి నాకెట్లు కినంబడును. వాని నాకు జూపి నీవాక్యము లన్వర్థములు చేసికొనవా ! యేది యుపాయము వానిందర్శింప నాహృదయము తత్తర మందుచున్నయది. యేమిచేయుదము ? వేగము చెప్పుమని యత్యాతురముగా బలుకు టయు నచ్చతురిక నవ్వుచు నోహో ! సఖీ ! నీవాతనింజూడకయే యింత తొందర పడుచునుంటివి ! చూచినతరువాత నన్నెంత వేసెదవోకదా ! కానిమ్ము ముందుగా నతని యాకృతి జిత్రపటంబున వ్రాసికొనివచ్చెదను. దానింజూచిన తరువాత నీకు నింపుగా గనంబడినచో నతనింజూచు ప్రయత్నము చేయుదమని పలుకుచు గాంతిమతి యనుమతి వడసి తూలికయు బటమునుగొని యదృష్టదీపుడున్న చోటికి బోయినది.

ఆ సమయమున నతండు బలభద్రునితో నిష్టగోష్ఠి మాటలాడుచుండెను. అతనియొద్దకు మెల్లనబోయి నమస్కరించుచు ఆర్యా ! మిమ్ము నీయూరిలో పదిదిన ములనుండి చూచుచుంటిని. మిమ్ముజూచినపుడెల్ల మీవృత్తాంతమించుక దెలిసికొన వలయునని యభిలాషకలుగుచుండెకాని యెప్పుడును ప్రశ్నావకాశము దొరికినదికాదు. నేడిదియే పనిగా నిచ్చటికి వచ్చితిని. నాకు జిత్రపటములు వ్రాయునేరుపు గలిగి యున్నది. చక్కనివారి పటములు వ్రాసి యమ్ముకొనుచుందును. నాకిదియే జీవనము. మీయాకృతిజూడ ననన్యసామాన్యమై యున్నది. మీరూపము వ్రాయవలయునని యుత్సాహముగానున్నది. నా విజ్ఞాపనము మన్నింపవలయునని వినయముగా బ్రార్థించిన నతండు నవ్వుచు నిట్లనియె.

బోటీ ! మా కాపురము కాశీపురము. నా పేరు హరిదాసు. నే నీయూరు విహారార్థమై వచ్చితిని. సామాన్య మానవుడైన నా రూపము వ్రాసికొనిన నీకేమి లాభము దొరకును. ఈ ప్రయాసము నీకేల నని పలుకగా విని యది యతని నప్పటి నుండి ఖచర్యలం బట్టి మరుగుపెట్టి పలికి నట్లూహించుచు నార్యా ! నాకిది ప్రయాసము

కాదు. సంతోషమైన పనియే పీవలన గొప్పలాభము పొందవలయునను తాత్పర్యము తోనే యిట్టిపని కుద్యోగింపుచున్నదాన ననుగ్రహింపుడు. ఒకనిముషము మాత్రము స్థిరులై యుండుడని పలుకుచు నతండొదంబడి యట్లు నిలుచున్న యాతని యాకృతి నచ్చుగ్రుద్దినట్లు వ్రాసి యతనికి జూపినది.

ప్రతిబింబమువలెనున్న తన యాకారము జూచికొని యదృష్టదీపుడు దాని శిల్పనైపుణ్యమునకు మెచ్చుకొనుచు నాఫలకము దాని చేతికిచ్చెను. అమ్మగువయు నగు మొగముతో దానినందుకొని కడు వేగముగాబోయి కాంతిమతిచేతి కా పటమిచ్చినది. దానింజూచినతోడనే కాంతిమతి మూర్ఛపోయి కొంతకు దెలిసికొని చతురికా! నిజముగా నతండిట్లుండెనే లేక నన్నాడించుటకిట్లు వ్రాసితివా! యిట్టి రూపముగల పురుషుం డుండుట కథలమాటకాని సత్యమగునా! ఏమే చెప్పుము. చెప్పుము. నీకన్న నా కెవ్వరు. ఇట్టి సమయములో నాతో బరిహాసమాడకుము. నేసి పాదంబులకు మ్రొక్కెదనని మిక్కిలి పరాకించుచు పలుకుచున్న యాజవరాలిం జూచి యాచతురిక నవ్వుచు జవ్వనీ? నీతో నేను పరిహాసమాడుదునా? నిజముగా నతనియాకృతి యంతయును వ్రాయుటకు నలవడినదికాదు అట్టిసంగులు నాయొద్దలేవు. పోలిక మాత్రము వ్రాసితిని. అతని చక్కదనం బింతయని చెప్ప శక్యమా? తొందరపడకుము. నీకతనిం జూపెదనని పలుకగా నాచిలుకలకొలికి మరల నిట్లనియె.

అయ్యో! నీవెన్నడో చూపెదనని పలికిన నేను దాళగలనా? యెప్పుడు చూపెదవో నిజముగా జెప్పుము. స్వాంతమున గంతుసంతాపమంతకంత కగ్గలమగు చున్నది. లెమ్ము లెమ్ము ఇప్పుడేపోయి వానిందీసికొనిరమ్ము. నీకు మంచిపారితోషిక మిత్తునని మిక్కిలి సత్వరముగా బలికినపిని, కలికి! నీతొందరచూడ నాకు వింతగా నున్నది. అతనినిదీసికొని వచ్చుటకు పైపైనున్నవాడను కొంటివాయేమి? నాతో మాట్లాడుటయే దుర్ఘటమైనది నేనట్టి కారణము వన్నబట్టి యందులకొడంబడెను. కానిమ్ము మరలబోయి నాచూపినంత యుపాయములబన్ని వానిం దీసికొని వచ్చెద. ననుజ్ఞ యిమ్మని పలికి కాంతిమతి చిత్రపటముసుగూడ తీసికొని యతనియొద్దకు బోయినది.

దానించూచి యదృష్టదీపుడు నవ్వుచు ఏమే మరలవచ్చితివి? వ్రాయుటలో మరియేదైనను మఱచిపోయితివాయేమి? విశేషము లెట్టివని చనవుగా మాటాడుటయు నచ్చతురిక కృతపరిచయుడైన యతనితో మెల్లన నిట్లనియె. అయ్యా! నేను దమ యనుగ్రహమువలన నా చిత్రఫలకము నద్ది యనేక పటములు తీసితిని. పెక్కండ్రు కొనగలరు. యేశంకయు జేయలేదు. మారాజుగారికి గాంతిమతియను యధార్థనామము గల కూతురుగలదు అరుస్సకుక విద్యావయోరూపవిశేషంబుల ననపద్యయై యున్నది. నేనిచ్చిత్రఫలకమును గొనియెదరాయని దాని యొద్దకు దీసికొనిపోయితిని. అయ్యతివయు దానిని బరీక్షించిచూచి నేను జెప్పినమాటనమ్మక యిట్టిపురుషుడు లేడనియు నీబుద్ధికుశ

లతచే నట్లు వ్రాసితివనియు నాతో బంతమాడినది. నేనెంతజెప్పినను నొప్పుకొనినదికాదు. అందుమూలమున మాయిరువురకు వాదముగలిగినది. నిజముగా నట్టిపురుషుని జూచియే వ్రాసితినని నేనును యిట్టిసుందరు డీలోకమున లేడని యచ్చేడియయును బెద్దతరవట్టు పట్టుదలతో వాదులాడికొంటిమి. తుదకిట్టు వానిజూపితివేని నీకు వేయిదీనారములు పారితోషికమిత్తునని యమ్మత్తకాశిని నాతో యొత్తి పలికినది.

అట్టి శపధ మారాచపట్టి చేసినతోడనే నేను మిగుల సంతోషించుచు మీయొద్దకు బయలుగెత్తుకొని వచ్చితిని. అన్నా ! ఆ సొమ్మంతయు మీరిచ్చినట్లు సంతోషించెదను. నన్నుగురించి కొంచెము శ్రమపడవేడెదను. మాబోటిదీనుల మొరవినుట మీవంటి యుత్తములకు సహజ ధర్మముగదా? ఒక్కసారి యాచక్కెరబొమ్మ కన్నులం బడినంజాలును. ఆసొమ్ము నాకుదక్కును. అక్కలికంతియు మిక్కిలి చక్కనిది. చూడు డిదిగో? దాని యాకృతిసైతము దీసికొనివచ్చితినని తనచేతిలోనున్న యాచిన్నదాని పటమును వానికి జూపించెను.

దానింజూచినతోడనే యతనికిగూడ చిత్తవిభ్రాంతి గలిగినది. అంతలో దెలిసికొని యవ్యామోహము వెల్లడికానీయక యోహో ! యిట్టి మోహనాంగి భార్యగా నుండినప్పుడుగదా సౌందర్యవంతునికి సాఫల్యముగలుగును. ఇది నన్ను మాయ జేయుటలేదుగదా ? నిక్కముగా నిట్టి సుందరీమణులుందురా ? కానిమ్ము. నాకు దానిం జూపింతునని చెప్పుచున్నది. పిమ్మటనే యాలోచింపవచ్చును. అని తలంచుచు దన హృదయమునందున్న యభిలాష ప్రకటనగానీయక దానితో నల్లన నిట్లనియె.

చతురికా ! నీవతి చతురవు. ఎట్లువ్రాసినను వ్రాయగలవు. సంతతము నంతఃపురములలో గ్రుమ్మరుచు మీకాంతిమతికి నన్నెట్లు చూపెదవు? ఇక్కడకువచ్చునా? ఈ పటమువిషయమై నాకును నట్టి యనుమానముగలిగియున్నది కానిమ్ము. తీసుకొని వచ్చితివేని నాసంశయముగూడ విడగొట్టినదానవగుదువు. పొమ్మని పలుకగా నద్దూతిక మరల నిట్లనియె. అయ్యా ! మీకు సర్వమును తెలియును. మీమాట కాదనుటకు నాకు సామర్థ్యమున్నదియా? ఆ కాంతిమతి నిచ్చటికి రమ్మనినచో ముచ్చటతో వచ్చుట కెంతమాత్రము సందియములేదు. కాని లోకోపవాదమునకుఁ గొంచెము వెఱవవలయును గదా! మగవారనిన స్వతంత్రులు. మీ రంతఃపురమునకు రానవసరములేదు. ఆచిన్న దాని మేడక్రిందనుండి వెళ్ళినచో నాకొమ్మ మిమ్మును జూచును. పిమ్మట నాయభీష్టము నెరవేరగలదు. అని వేడుకొనగా నతడు కాంతిమతిని జూచుటకు దనకు మిక్కిలి యుత్సాహము గలిగియున్నది గావున దనవలపు వెల్లడిగానీయక పరోపకారమునకై యొడంబడువానివలె సమ్మతించెను.

తరువాత నచ్చతురిక యారెండుచిత్రఫలకములు సరిగాబట్టుకొని యతనికి జూపుచు అహా! యీరెండుపటములు నెంతవింతగా నున్నవియో చూచితివా యని పలి

లెను. ఆతడు దాని యభిప్రాయము గ్రహించియు నెఱుగని వానివలె నీవు మిగుల నేర్పుగా వ్రాసినప్పటికింపుగానుండ కెట్లుండునని యుత్తరముజెప్పెను. అద్దూతిక సంతసించుచు సాయంకాలమునకు గాంతిమతి మేడక్రిందుగాబోవునట్లతనిచే నొప్పించుకొని యామార్గము గుఱుతుజెప్పి యప్పుడేపోయినది.

అంతట నయ్యదృష్టదీపుడు దాని మాటలధోరణియంతయుం జూచి యా చిన్నది తన్ను వలచియుండెనట్లు గ్రహించి యాసంగతు లన్నియు బలభద్రునితో ముచ్చటించుచు నెట్టైనను మేలేయని యది చెప్పినచొప్పున సాయంకాలమునకు జక్కని వేషముతో నామేడక్రిందనుండి యిటునటు మూడుసారులు తిరిగెను. అప్పుడు పైనుండి కొన్నిపూవు లతనిమీద బడినవి. దానికి వెరగందుచు దలపైకెత్తి చూడగా జంద్రబింబమో యన నొప్పుచున్న చక్కని మొగంబొకటి గనబడినది. దానినట్లు రెండు మూడుసారులు చూచుచు మరల తలవంచుకొనుచు నింతలో నితరులామార్గమున నడచుచుండిరి కావున నిలుచుటకు వీలులేక మరల నింటికిబోయెను. అవెంటనే యా చతురిక చనుదెంచినజూచి యారాజకుమారుడు మందహాసముసేయుచు సుందరీ! నీయభీష్టము తీరినదా! అనిన ప్రకారము నీకు రాజకుమార్తె సొమ్మిచ్చినదా యని యడుగగా నది తలయూచుచు నిట్లనియె. ఆర్యా! మిమ్ము వృథాశ్రమ పెట్టినందులకు జింతించుచున్నదానను. ఎంతవారికైనను సొమ్ము విడుచుట గష్టముగదా! అమ్ముద్దియ యెద్దియో వంకబెట్టి పన్నిదము గెలువవలయునని తలంపు గలిగియున్నది దూరముగా నుండుటచే మిమ్ము బరిశీలించుటకు వీలుపడినదికాదట. ఆచిత్రఫలకమును మిమ్మును దగ్గరనుంచుకొని చూచునప్పుడుగాని నమ్మదట. దీనికి నేనేమిసేయుదును. అట్టిపని యెట్లుతటస్థించునని నేను దానినే యడిగితిని దాని కప్పున్నది కొంతసేపాలోచించి నేను రేపు ఉద్యానవనములోనికి వత్తుననియు నప్పటికి దీసికొనిరమ్మనియు జెప్పినది. ఆవార్త దేవరవారికి విజ్ఞాపన సేయుటకై వచ్చితిని. నన్నుగురించి యిందొక్కసారి శ్రమపడవలయును. మీయుపకార మెప్పటికి మరచువానను కానని ప్రార్థించినది.

దానిమాటలువిని యతండోహో! కొంచెము చనువిచ్చిన నెక్కుడు చొరవ చేయుచుంటివే! పాపము దీనురాలుగదా యని యొకసారి మాటవినినచో వెండియు నమ్మని నిర్బంధించుచుంటివి. శుద్ధాంతకాంతల చెంతకు మేము వచ్చినచో భూకాంతు డెఱింగిన శిక్షింపడా? ఇదియుంగాక ద్వారరక్షకులు శంకింపరా! మాకంత శ్రమపడ వలసిన యవసరమేమని తన హృదయమున నవ్వనితంజూడ వేడుకయున్నను బోప నీసున దాసితో నిష్టములేనివానివలె బలికెను. ఆ మాటలకది యించుక గొంకుచు అయ్యా! ఇప్పుడు మీరు దానితో నామాట దబ్బర అగుటయేకాక ద్రవ్యనష్టము గలదు. మీరు మునుపడిన ప్రయాసమున కించుకయు సార్థకములేదు. నాయందు దయయుంచి యొక్కసారి రావలయును మిమ్ము ద్వారరక్షకులు శంకింపకుండ నేను

దీసికొనిపోవుచును. అయ్యుద్యాన సౌధమునకు రెండుద్వారములు గలవు. రెండవదారిం బోయిన నెవ్వరును జూడరని ప్రతిమాలుచు బలికినది.

అతండట్టికేల కిష్టములేక సమ్మతించువానివలె నభినయించుచు గానిమ్ము ఈమాపుగాక మరల రమ్మనినచో రానుసుమీ ! అని పలుకుచు నచ్చటి కెప్పుడు బోవలయునని అడిగెను. అప్పుడది మఱియిప్పుడే పోవుదమురండు. ఆ చిన్నదాసికన్న ముందుగా బోయి అందులోనుండము. పిమ్మట నాసుందరి రాగలదని పలుకుచు నతం డొడంబడిన వెనుక రహస్యముగా చని వెనుక నతనిం దీసికొనిపోయి యాయుద్యాన వనంబునంగల మేడలో ప్రవేశపెట్టినది. ఆపట్టణములో రాజుగారికి క్రీడావనములనేకము లున్నవి. వానిలో నది మిక్కిలి చిన్నదియు మారుమూల నుండినదియు నగుటచే నందు దరుచు రక్షకపురుషులుండరు. ఎప్పుడేని రాజపుత్రిక విహరింప దానిలోనికి వచ్చుచుండును. అదృష్టదీపుడట్టి మేడలో బ్రవేశించి అందలివిశేషము లన్నియుం జూచుచు జతురికతో మీరాజకుమార్తె యెప్పుడు వచ్చునని అడిగెను.

అదియు మదవతీమదనా ! మీరీసదనంబునం గూర్చుండుడు. నేనుబోయి యామదవతిని వేగమ తీసికొనివచ్చెద మఱియిచ్చటికి వచ్చినట్లు తెలియకయే అక్కలికి జాగుచేసినట్లు తలంచెను అంతకనుక మీరీ చిత్రఫలకముల తారతమ్యం బరయుచుండు దని పలికి యా ప్రతిమనిచ్చి అచ్చటనుండి కదిలి గుప్తముగా రాజకుమార్తె మేడమీదికి బోయినది. ఇంతలో నా రాజకుమారుం డా కాంతిమతి చిత్రఫలకమును జూచుచు దాని సోయగంబంతయు నాపాదమస్తకపర్యంతము వర్ణించి యచ్చెరువందుచు శిరఃకంపము జేయుచు ముద్దుపెట్టుకొనుచు గ్రమక్రమంబున మన్మథావస్థకులోనై మదను విరితూపుల దన హృదయము జుమఝుమకున నాదింప నేమియుం దోచక యారాజపట్టి రాక నిరీ క్షించుచు గడియ యుగముగా నెంచుచు తన మోహవిభ్రాంతి దెలిసికొనియు జిత్త మాపలేక తత్తరపడుచుండెను.

అంతలో నుత్తమాశ్వంబుల బూన్చిన శకటంబుమీద నప్పైదలిం దీసి కొనివచ్చి అచ్చతురిక మెల్లన రెండవ ద్వారంబున లోపలకు బోయినది. ఆ బండి చప్పుడు వినినతోడనే రాజకుమారుని హృదయము బెదరుతో గూడిన ముదమును జెందుచుండ సాత్త్వికభావలక్షణము లన్నియు మేనంబొడగట్టినవి. ఆ సమయమున జతురిక కాంతిమతిని వెంటబెట్టుకొని యామేడపై కెక్కినది. అతండట్టితరి నేమియుం దోచక పీఠమునం గూర్చుండి విలాసముగా నెడమకాలు గదుపుచు నచ్చట నున్న వింతలు చూచువానివలె దృష్టి ప్రసారములు నలుమూలలకు నెరయజేయుచుండెను. అక్కాంతిమతియు నల్లంతదవ్వున నాతని జూచి లజ్జావశంబున దలవాల్చుచు నచ్చటనే నిలువంబడగా నప్పుడు చతురిక దాని చేయిబట్టుకొని రమ్ము రమ్ము. నేను చిత్ర ఫలకములో వ్రాసిన పురుషుండితడే చూడుము. ఇంతకేని భేదము గనంబడిన నాకియ్య కొనినవిత్త మియ్యవద్దని పలుకుచు నతనియొద్దకు లాగికొని పోయినది.

కాంతిమతియు నడుమనడుమ బెదరుచూపులచే నతని సోయగము చూచుచు అయ్యో! బాగకుము. ఆకుము, తాకుము. నీ సొమ్మిచ్చెదనులే. అని పలుకుచు బలాత్కారము సేయుదానివలె నభినయించుచు నెట్టకేలకు నారాజకుమారుని యొద్దకు బోయి నిలిచినది. అతండును విలాసదృష్టుల దానిం జూచుచు చతురికా! తొందరపడి యెదవేల నూరకొనుము. పరీక్షకులే వచ్చి చూతురు. అని పలుకుచు దనయొద్దనున్న తన చిత్రపట మాచతురిక చేతి కందిచ్చుచు గాంతిమతి పటమును దానుగైకొని తత్తారతమ్య మరయుచుండెను. కాంతిమతియు నతని ప్రతిబింబమును జూచిచూచి విస్మయము బొంది మరల నతని మొగముజూచుచు మొగమున శృంగారచేష్ట లభినయించుచు దరువాత నా వ్రాత జూచి మొగము ద్రిప్పుచు నీరీతి గొంతసేపు మఱియొక మిషచే మనంబునం బుట్టిన యభిలాష లడచికొని వింతనగవుతో జతురికా! నీవు గెలిచితివి. నీకియ్యకొన్న విత్త మిచ్చివేసెదను. అని పలికి మరల నొకమారతని మొగమున దృష్టి నెరయ జేసినది.

పిమ్మట నదృష్టదీపుడును దానిం జూచి చతురికా! నీవు నాకు జూపినపటము తథ్యమైనదని యిప్పుడు నమ్మితిని. నీవు సత్యవచన వగుదువని పలికి యూరకుండెను. అప్పుడొక నిముష మా మువ్వురు చిత్రప్రతిమలవలె జలింపక నిశ్శబ్దముగా నుండిరి. తరువాత నా చతురిక వారి చిత్రఫలకములు రెండును సమముగా బట్టుకొని అదృష్టదీపునితో నయ్యా! యీ రెంటిలో నేది చక్కదనముగా నున్నదియో నాకు దెలియకున్నది. మీరు బుద్ధిమంతులు నిరూపించి చెప్పుడని అడిగిన నతం డొకింత నవ్వుచు నోహో! నన్నిట్లడుగ నేల? స్త్రీ పురుష భేదముగల యీరెంటికిని సామ్యమెప్పుడును గలిగియుండదు. దేని కదియే చక్కగా నున్నదని పలికెను.

పిమ్మట నాకొమ్మ కాంతిమతి దగ్గరబట్టి అడుగగా నప్పుడదియు సిగ్గు పెంపున నేమియుం బలుకనేరక సన్నని యెలుంగున బోటీ! నీవు పన్నిదము గెలిచితివికాని చిత్రఫలకమును నార్యపుత్రునికి సరిగా వ్రాయలేకపోయితివి. ఇదియే నీ యందుగల న్యూనత. ఈ రెంటికి దారతమ్యములు చిత్తానుగుణ్యములై యున్నవి. అది పరమేశ్వరునికి గాక యొరులకు జెప్పక శక్యమా? అని తెలిసియు దెలియనట్లు పలికినది. అంత నా రాజనందనుడు చతురికం జూచి యింతీ! నేను వచ్చి తడవైనది. నీవు మిక్కిలి ప్రార్థింప నింతదూరము వచ్చితిని నాకొరకు నామిత్రుడు బంభద్రుడు వెదకుచుండును. ఇక బోవచ్చునాయని యడుగగా నది మందహాసము సేయుచు అయ్యా! నీవు నా కార్యము చక్కజేసితివి. నీవృత్తాంతము సమగ్రముగా విని నీకెద్దియేని నా యోపిన యుపకారము సేయదలచికొంటిని. నీ పేరేమి? నీవు రాజకుమారుడవా? ప్రచ్ఛన్నముగా నీయూర విహరించుటకు గారణమేది? నీదేదేశమని యడుగగా నతడిట్లనియె. ఏమెప్పుడు

అసత్యములు పలుకు వారము కాము. నేను మొదట జెప్పినదే నిక్కువము. ఈ విష యమై సారెసారెకడుగకుము. నీవు నాకు జేయవలసి కొనిన యుపకార మెద్దియో చెప్పుము. నేను వ్వరగ బోవలయునని యనియు పలుకుచుండగనే సాయంకాల చిహ్నము తెలుపు భేరీవాయించిరి

అప్పుడా యింటి ద్వారరక్షకులు వచ్చి తలుపుతట్టుచు చతురికా ! సాయం కాలపు భేరిని వాయించుచున్నారు ఇక తోట తలుపులు మూయుదుము. భర్తృదారిక శకటములో నంతఃపురమునకు బోవలసి యున్నది. గావున వడిగా బోవలయునని పిలి చిరి. ఆ మాటలు విని యదృష్టదీపుడు వెరచుచు జతురికం జూచి యిప్పుడు నేనెట్లు మా యింటికిబోదునని యడిగెను. అప్పటికి వారికి గోటలోనికి బోవక దీరదు గనుక నది సమ్మతించుచు కానిండు మీతో ముచ్చటింపవలసిన సంగతులు పెక్కుగలవు. అవి యన్నియు నిమ్మట జెప్పెదను. ఇప్పుడి దారింబొండు మిమ్మెవ్వరు నడ్డపెట్టరని పలుకుచు రెండవగుమ్మము నుండి యతని నాయిల్లు వెడలించినది. పిమ్మట గాంతి మతియు జతురికతో గూడ నాతలుపులు తెరచుకొనుచు నిల్లువెడలి బండియెక్కి యతి వేగముగా నింటికి బోయినది.

అట్లుపోయి యక్కాంతిమతి యంతఃపురమున నేకాంతముగా జతురికతో గూడ శయ్యాతలంబున మేనుజేర్చి యిట్లు చింతించెను. చతురికా ! నీ చాతుర్యమంతయు నెచ్చట దాచితివి ! అక్కుమారరత్న మెదురుగనున్నప్పుడేమియు మాట్లాడలేకపోయితివే. నాహృదయంబున నెన్నియో కోరిక లూరుచున్నవి. నేనేమి చేయుదును ? ఈ దుర్మా ర్గపు సిగ్గు నన్ను మాటాడనిచ్చినది కాదు. అయ్యో ! దొరకిన ఫలము చెడిపోయినదే తాలున బోయి వానిం గౌగలింపక యెద్దియో యాలోచించుచు దెల్లబోయి యూర కుంటిని. అన్నన్నా ! నా యభిప్రాయమయిన వెల్లడి చేసితిని కాదేమి ? చివరికతని యభిలాష నైతము మనకు దెలియలేదు మంచిపని చేసితిఁలే ? ఏమేమో చెప్పబోయి యేమేమో చెప్పితిని. నా యొద్ద నెన్నియో యుక్తులు పలుకుచానవు. నాకీ సిగ్గేదము లేనిచో నా చమత్కార మంతయు జూపకబోవుదునా ? కార్యము చెడగొట్టితిని. ఇంక నెప్పుడో చెప్పెద ననుకొను నంతలో సాయంకాలమైనదేమి ? మన మా మేడలో నెంతసేపుంటిమి. నిమిషమూత్రమైన దోచలేదే ? అబ్బబ్బా ! మేనంతయు భగ్గున మండిపోవుచున్నదేమి ? ఇట్టి బాధ యిదివరకు నే నెప్పుడు ననుభవించి యెఱుగను. అతనికి మనయందిష్టమున్నదా ? అతండైనను సాహసింపలేక పోయెనేమి ? ఒకవేళ నరండు నీకుపకారము సేయవలయునని ఆత్రుర్యముతో వచ్చెనేమో ? నీవు భ్రమ పెట్టి తీసికొని వచ్చితివి. నిజము చెప్పితివి కావు. ఇదియు నీతప్పే ! ఈ రాత్రి నే నెట్లు వేగించుదాన ? మనము నిజముగా వానిం జూచితిమా ? అది స్వప్నమా ! మన మిప్పు డెచ్చటనుంటిమి ? ఇది రాత్రియా పగలా ? నా కేమియు దెలియకున్నది. సఖి! మనమచ్చట గొంతసేపు నిలువక వచ్చితిమేమి ? అదియా. తెలిసినది. పోసీ ఆరాత్రి

నచ్చట నుండిన బాగుండును సుమీ! మనముండినచో నతండుండునా చెప్పుము? అట్లు చేయవలసినది. అంతలో దొందరపడి వచ్చితిమి. నీ బుద్ధియంతయు నప్పుడు మొద్దుపడిపోయినది. ఈ రాత్రి మరల నచ్చటికి బోవుదమా పోయిన నేమి లాభము? ఆ పురుష సింహం బప్పుడే యింటికి బోయెను గదా? ఉదయమున నేమి చేయుదము. మరల నతండు కనంబడునో లేదో? కటకటా! నేనుదయమువరకు దాళగలనా? ఈ రాత్రి యెట్లైన నతని దీసికొని వత్తువేని ప్రాణములు నిలుచును. లేకున్న ప్రాణములు విడుచుచున్నదానను. విరహవేదనయన నెద్దియో యనుకొంటిని. ఇప్పటికి తెలిసినది. అక్కటా! ఇట్టి యవస్థ శత్రువులకైన రావలదు. హా! పురుషసింహా! యని యనేక ప్రకారముల నున్మత్తవలె బలవరింపుచు నుస్సురనుచు నా మంచము మీదబడి కొట్టుకొనుచున్న యాచిన్నదానిం జూచి చతురిక యిట్లనియె.

కాంతిమతీ! నీ వెంతో ధైర్యశాలివనుకొంటి నంతయు నిప్పుడు తెలిసినది. ప్రథమసమాగమము ననే తెలిక వడనేల నని నే నూరకుంటిని. ఒక రాత్రికే తాళలేవా? అట్టిదాన వప్పుడేమిటి కూరకొంటివి. ఎదుర నన్ను నిందింపుచున్నదానవే? కానిమ్ము. ఇంత బేలవని తెలియక యశ్రద్ధచేసితిని. ఈ రాత్రి యెట్లో వేగింపుము. ఉదయంబున వానిందెచ్చి నీతల్పంబునం జంచెదనని చెప్పి శైత్యోపచారములు చేయ దొడంగినది. కాని యేమియు నుపయోగము లేకపోయినది.

మేన నలందిన చందనమంతయు ధూళియైపోయినది. అవయవములం జుట్టిన బిసతంతువులు పెళపెళ్ళ విరిగి పోయినవి. తప్తాయన పాత్రంబునం బోసిన జలంబువలె తనువునం జిలికిన పన్నీరంతయు జాడలేక హరించినది. ఈరీతి లోనికాకచే దాజేయు నుపచారము లించుకేనియు బనిచేయకుండుట జూచి యా చతురిక దాని కంతుసంతాపమున కాశ్చర్యమందుచు జిన్ననాటనుండియు నెన్నడేని యిట్టి వికారములు కనివిని యెరుగని యా చిన్నదానికి నిన్నె యెట్లభ్యస్తము లయ్యెనో యని వెరగందుచు నోపినంతనట్లు నుపశాంతి జేయుచు నెట్టకేల నా రాత్రి దానితోడ వేగించినది.

సూర్యోదయమైనతోడనే యాచతురిక కాంతిమతికి గొన్ని రహస్యములు బోధించి తాను మరల నన్నష్టదీపుడున్న యింటికి వచ్చి యచ్చట రహస్యముగా నొక చోట దాగి వారనుకొను మాటలు వినుచుండెను. అన్నష్టదీపుడు మిత్రునితో బలభద్రా నేనెంత తెలివిహీనుడనో చూచితివా? హస్తగతప్రాయమైన ఫలము స్వీకరింపక త్రోసివేసితిని. దైవమెద్దియేని సంప్రాప్తమగునట్లు చేయునగాని తినిపించునా? మంచి సమయము మించిపోయినది. సాహసము చేయలేకపోయితిని. అయ్యో! యీ సంతాప మెట్లు సహించుకొందును. మిత్రమా సూర్యోదయమయినట్లున్నది చూడుము. మనము నమంచి యన్ని రాత్రులైనది. ఒక్కటియే? పెక్కుబాగున దోచుచున్నదే యని బహు విధంబుల బలవరింపుచున్న యా రాజపుత్రుని వాక్యములు విని చతురిక మిక్కిలి

సంతోషింపుచు గాంతిమతి సంటిన స్మరపిశాచము ఈ చిన్నవానికిగూడ నావేశించి నది. మేలు మేలు. ఇక నా సఖీమణి యభీష్టము ధృతికో నెరవేర్చెదనని తలంచుచు వారున్న యింటి తలుపులు తట్టుచు బాలభద్రా! బాలభద్రా! యని పిలిచినది.

ఆకంఠధ్వని గురుతుపట్టి యద్భుతదీపుడు మిగుల సంతోషముతో బాల భద్రా! చూడు మెవ్వరో పిలుచుచున్న వారని పలుకగా వాడులేచి తలుపు తెరచి ద్వారములో నున్న చతురికంజూచి వయస్యా! నిన్న నీతో మాట్లాడిన చేడియ వచ్చిన దని చెప్పెను. అప్పుడతండు లోనికిదీసికొని రమ్మని చెప్పిన బాలభద్రుండట్లు చేసెను. మంచము మీద గూర్చుండి చతురిక కొక గద్దె వేయించి చతురికా! నేడు ప్రొద్దుననే వచ్చితివేమని యడిగెను.

అదియు అయ్యా! మరేమియు గార్యము లేదు. నిన్న మీతో మాట్లాడుట కవకాశము చిక్కినది కాదు. నన్ను గురించి మీరు మిక్కిలి శ్రమపడిరి. కృతజ్ఞత జూపించుకొనుటకై వచ్చితిని. మరియు మా రాజపుత్రికయు మీతో ముచ్చటింప వలసియున్నదని చెప్పినది. దేనికిని నిన్న వేళచాలినది కాదు ఈ దినము సావకాశ ముగా మాటలాడుకొనవచ్చును. ఇప్పుడే యప్పడతి మరియొక యుద్యానవనమునకు బోయియున్నది. మిమ్ము నచ్చటికి దీసికొని రమ్మని నన్ను బంపినది నిన్నటి దినం బున దా నేమియు దమకు నతిథిపూజ సేయలేదట. దానికి నార్యపుత్రుని చిత్తంబున మరి యొక రీతి దలంపు గలిగెనేమో యని భ్రాంతి బరితపించుచున్నయది. ఆ యుద్యాన వనము మిక్కిలి విశాలమైనది. అరణ్యమును బోలియుండును. అందు సుందరములగు మందిరములు గలవు. ఇప్పుడే దేవర యచ్చటికి విచ్చేయవలయునని ప్రార్థించిన నతండు చిరునగవు మొగమునందొలుక నల్లన దానితో నిట్లనియె

చతురికా! నీవు కృతపరిచయురాలవగుటచే నీమాట నేను ద్రోయలేకున్నాను. నీ కృతజ్ఞత్వమునకు మిక్కిలి సంతోషించితిని. మీ రాజపుత్రిక నాకు సపర్యలు చేయ లేదని సందియ మందవలదని చెప్పుము. దర్శనమాత్రముననే యర్చితుడ నైతిని. మరల నన్నేల శ్రమ పెట్టెదవు? రాజభటరక్షితమగు నాయుద్యాన వనమునకు బోవుట దుర్ఘటము గదాయని యర్ధాంగీకారముతో బలుకుచున్న యాచిన్నవాని చేయిపట్టుకుని యచ్చతురిక రండు. రండు. తక్కిన వాని గురించి మీకేమియు చింతింపవలసిన యవసరములేదు. అవియన్నియు మేము చక్కబెట్టుకొనియెదము. మన మిప్పుడే పోవలయును. మన కొరకు రాజపుత్రిక నిరీక్షించుకొని యుండునని పలుకగా నతండు అయ్యో! ప్రాతః కృత్యములు నిర్వర్తించుకొని పెండలకడ భుజించివత్తునని పలికెను.

అప్పుడచ్చతురిక అయ్యా! అవియన్నియు నచ్చటనే తీర్చుకొనవచ్చును. మీకు విందుచేయవలయునను తాత్పర్యముతోడనే రాజపుత్రిక మిమ్ముదీసికొనిరమ్మ న్నది. ప్రాతఃకృత్యములు మా యింటియొద్ద జరిగించవచ్చును. రండు రండు అని

మిక్కిలి తొందరపెట్టగా నా బలభద్రుడు నింటికడనుండుమని చెప్పి యప్పురుషసింహు డప్పుడే దానివెంట బోయెను.

అచ్చతురిక యారాజపుత్రుని ముందుగా దనయింటికి దీసికొనిపోయి కృతజ్ఞత జూపించుదానివలె సభినయించుచు బన్నీటజలక మార్చినది మరియు జీనాంబరములు గట్టనిచ్చినది. మణివిభూషణములు దెచ్చి స్వయముగా నలంకరించినది. అది యంతయు జూచి యతడు చతురికా! యీవేషము నాకేల? నేను త్వరగా బోవలయును. మీరాజపుత్రిక యెచ్చటనున్నదని యడుగగా నప్పడతి అర్యా! నీవు తొందరపడకుము. రాజపుత్రికను జూపుటకొరకే మీకీ యలంకారము చేయుచుంటిని. ఈ యలంకారములకు మీశరీర మలంకారము దెచ్చుచున్నది. చూచితిరా! యని పలుకుచు నతనిమతికి గుతుకము గూర్చుచున్న సమయమున నశ్వశకటమువచ్చి చతురికా! భర్తృదారిక యుద్యానవనమునకుబోయి నీకొరకు బండి పంపినది. సత్వరముగా రావలయుననుటయు నది నీవుపొమ్ము నేనీబండినెక్కి యిప్పుడే పోయెదనని చెప్పి యప్పరిచారిక పోయిన తరువాత నవ్వృష్టదీపుని మేనంతయుబట్టు మేలిముసుగువైచి స్త్రీపురుషవివక్షత దెలియకుండ నాబండి యెక్కించినది.

అప్పురతం డిట్టట్టనక యదిచెప్పినట్లు చేయుచు నాబండిలో గూర్చుండెను. పిమ్మట నమ్మదితయు సమోదముతో శకటమెక్కి వడిగాదోలి యుద్యానవనములోనికి దీసికొనిపొమ్మని యాబండితోలువాని కాజ్ఞాపించెను. ఆబండివాడు అది చెప్పినప్రకారముగా వడిగా గుఱ్ఱముల నడిపించుచు దృటిలో నాయుద్యానవనములోనున్న విలాససౌధమునకు దీసికొనిపోయెను.

అచ్చట జతురిక రాజపుత్రునితోగూడ లోపలకు బోయినది. అంతకు బూర్వమే వారేర్పరచుకొనియున్నవారు కావున నామేడలో నితరు లెవ్వరునులేరు. ముందు తలుపులు బిగించి యాచతురిక యాతనిని మేడ యెక్కించి యాముసుగు దీయుచు రాజపుత్రికయున్న గదిలోనికి దీసికొనిపోయినది.

అతనిరాకచూచి యాచిన్నది సంతోషముతో మేను గరవుజెంద దత్తఱిల్లుచు బంగారు పళ్లెరముతో నివాళిదెచ్చి యెదురవచ్చెను. అక్కాలికి తొలుత నతనిపాదంబులం గడగి తడియొత్తుచు గర్పూరపునివాళియిచ్చి లజ్జావశంబున నూరకున్నంత జతురిక దానిం జూచి భర్తృదారికా! సవతిథిపూజ చక్కగా జేయుము. సిగ్గుపడి యూరకుండిన నతిథికి గోపము వచ్చునుసుమీ? యని పలుకగా నక్కాంతిమతి యాన్నపసూతి చెట్టపట్టుకొని అర్యపుత్రా! మీరాకచే మాగృహము పవిత్రమైనది లోపలకు దయచేసి మమ్ము గృతార్థులంజేయుడని పలుకుచు నల్లన దీసికొనిపోయి యంతకమున్న యమర్చియున్న సయ్యపైగూర్చుండబెట్టి తానాదాపున నిలువంబడియెను.

ఇంతలో జతురికవచ్చి మచ్చెకంటీ! నీవిచ్చట నిలుపబడితివేల? అతిథి నర్చింప దల్పుమత్తుగానున్నది. నీవుగూడ దానిమీద గూర్చుండి పూజింపుము. ఇట్టి

సమయములో సందియమంద గూడదని పలుకుచు దానినెక్కించి చందనపుగిన్నె చేతికందిచ్చినది. అప్పుడాపడతి యాగంధమతని మేనబూయబోవగినది కాని యతడించుక సంశయించువానివలె నభినయించుచు నించుబోడీ! చాలుచాలు నీసపర్యకు సంతసించితిని నాకు జెప్పవలసినసంగతులేమైనం గలిగిన నుడువుము నేను వేగముగా బోవలయుననగా విని యాచతురిక వాని కిట్లనియె.

అక్కా! చల్లకువచ్చి ముంతదాచనేల? మిమ్మూరక బోయెదననిన బోనిత్తుమా? మీరేమియు మాటాడగూడదు. మేముచేసినట్లొడం బడుడని పలుకుచు గాంతిమతిం జూచి రమణీ! నీవు సంశయింపకుము మేనంతయు జక్కగా గంధ మలందుమని పలికిన నక్కలికియు నట్లుచేయుచు జివర జెక్కులకుగూడ రాచినది అప్పుడచ్చతురిక కాంతిమతిం జూచి యోహో! నీవు అతిథికి మంచిమర్యాదయే చేయుచుంటివి ఆయనమాత్ర మూరకొనునా? నీకు దగినట్లు మరలజేయును చూడుమని యాగంధపు గిన్నె యాతనిచేతికందిచ్చినది. అతం డదియందిపుచ్చుకొని సాహసముతో గాంతిమతి జెక్కులయందు నొక్కి రాచెను.

అప్పు డయ్యురువురకు మేనం బులకలు బొడమినవి కంప మావిర్భవించినది చెమ్మటలు గ్రమ్మినవి మరియు జిత్తభవుండే వారికి బురోహితుండై పాణిగ్రహణోత్సవమునకు సంకల్పము జెప్పదొడంగెను. పిమ్మట నెద్దియో మిషబన్ని చతురిక యవతలకు జారినది. అప్పుడక్కాంతిమతి మొగంబున నించుక కినుక యభినయించుచు అయ్యో! అతిథి యింటికివచ్చెనని మర్యాదజేయుచుండ నిట్టిపనులు చేయవచ్చునా? ఈగంధమిట్లెయుంచి మా పెద్దలకు జూపించెద నుండుడు అని బెదరించిన నతడు నవ్వుచు ఔను నేను జేసినదితప్పే? మరల దుడిచెదగాకయని పలుకుచు తుడుచువానివలె నభినయించుచు జెక్కులు నొక్కుచు నీరీతి గొంతసేపు కేళీవిలాసములు చూపుచు——

శ్లో॥ కంఠాశ్లేషం శిష్యగాఢం మృదుకరజచయం గండపాళీనితంబే
పృష్ఠేపార్శ్వోదరేవా విథధద్రైః ఖండయన్ దంతవాసః
ప్రేమాచుంబన్ లలాటంవపుషిచ జనయన్ రోమహర్షన్ నితాంతం
సీత్కారాకారి వక్త్రిమతిలఘునఖిసీంద్రావయేత్తాం విదగ్ధః ॥

అని చెప్పినట్లుగా నాపద్మినీకాంత నాద్యంతక్రీడావిశేషంబుల సంతోష వివశం గావించెను.

అంతలో సాయంకాలమగుటయు జతురికవచ్చి యువతీ! మనమింటికి బోవలయును. రేపు మరల రావచ్చును. పోదము లెమ్మని పలుకగా నెట్టకేల కతని కౌగిలి విడదీసికొని అక్కా! నీవు మరల మేలి ముసుగు వైచుకొని మాతోవచ్చి బండిలో గూర్చుండుము. మిమ్ము జతురికయింటియొద్ద దింపెదనని చెప్పి యట్టివేషముతో

సతని దీసికొనిపోయి బండినెక్కినది. చతురికయు నొకప్రక్కను గూర్చుండెను. పిమ్మట బండివాడు బండిదోలుచు ముందుగా రాజపుత్రిక యాజ్ఞ ప్రకారము చతురిక యింటియొద్దకు దీసికొనిపోయెను. అచ్చట మేలిముసుగుతో నదృష్టదీపుడును చతురికయు బండిదిగి యింటిలోనికి బోయిరి. పిమ్మట నా శకటమును గన్యాంతఃపురమునకు దీసికొనిపోయెను.

కాంతిమతియు బండిదిగి యింటిలోనికిబోయి యాహారనిద్రా సమయంబుల సైత మతని క్రీడావిశేషములనే స్మరించుచు నతిప్రయత్నమున నారాత్రి వేగించినది. అంత మరునాడు పూర్వదివసంబువలెనే తాను ముందుగా బండి యెక్కిపోయి తరువాత నచ్చతురిక యింటికి బంపిన నదృష్టదీపునితో నచ్చతురిక దానిలోనెక్కి యుద్యానవనము లోనికిబోయి యక్కుమారు నంతఃపురమునకుం బంపి తాను ద్వారమున గాచి యుండెను.

ఆ యిరువురు యథేష్టగా కామక్రీడా విశేషంబులం దేలుచుండవారి కాదివసంబంతయు నర నిముషములాగైన దోచినదిగాదు. సాయంకాలమైన తోడనే పూర్వపు రీతి వారు మువ్వురును బండియెక్కి యిండ్లకు బోయిరి. ఆ ప్రకారము ప్రతిదినము నుదయమున నా బండియెక్కి యుద్యానవనమునకు బోయి సాయంకాలము వరకు క్రీడించుచు రాత్రికిండ్లకు బోవుచు నారు మాసములజరిగిన నాయిరువురకు నక్కాలమొక దివసములాగైన దోచనదికాదు.

అట్లుండసంత నొక్కనాడక్కాంతిమతి తండ్రి యనంతవర్మ యాస్థానమునం గూర్చుండి రాజకార్యములు విచారింపుచుండ నతని బల్లమీద నొక యుత్తరము గనంబడుటయు నతండది విప్పి చదువ నిట్లున్నది. రాజా! నీవు వట్టిగుడ్డివాడవు. నీ యింట జరుగుచున్న యవమానకృత్యము లేమియు గురుతెలుగకున్నావు. నీవు కూతురు నందుగల మక్కువచే దానినేమియు నాజ్ఞబెట్టక స్వేచ్ఛగా దిఱుగు చుండ నిచ్చితివి. అప్పడది యిప్పుడు నిమ్మటములో ప్రతిదినము నొకపురుషునితో క్రీడింపుచున్నది. ఉదయమునబోయి సాయంకాలమున కంతఃపురము జేరును. ఆ విషయము నీ వేమియు విమర్శింప కుంటివి. యౌవనములోనున్న రాజకన్య లెవ్వరేని గోటదాటి క్రీడింప బోవుదురా! స్త్రీలకు స్వతంత్ర మిచ్చినచో మర్యాద నిలుచునా! తనయ యెడ మక్కువగలిగినచో మిక్కిలి గుడుచుటకును గట్టుటకును బెట్టవలయునుగాని యిట్లు స్వేచ్ఛగా దిరుగనీయరాదు అదియునుం గాక పురుషులకంటె స్త్రీలకు గామమధికము గదా? యౌవనము వచ్చిన మత్పుత్రికంటికి వెంటనే వివాహము జేయకుండినతప్పు నీయదియే. మఱియు నతమణి యిప్పుడు గర్భవతిగూడ నయ్యెనని నాకు దెలిసినది. స్వేచ్ఛవలన నీ కులమునకు గళంకము వచ్చెనని నేను జింతించు చున్నవాడ. నీకు నేను నిట్లంత ప్రసిద్ధముండగాన నింతగా వ్రాసితిని. నామాట నిక్కువమరయ దలంపుకలిగెనేని ఎల్లుండి మాయుద్యానవనమునకుబోయిన నంతయు నీకే విశదము గాగలదు.

ఇంతకన్న విస్తరించి వ్రాయ నవసరములేదు. అనియున్న పేరులేని యుత్తరము ముమ్మారు చదువుకొని చింతాక్రాంతస్వాంతుండై యొక్కింతసేపు ధ్యానింపుచు దల యూచుచు అన్నన్నా ! యీ వ్రాసిన రీతియంతయు యదార్థము యుండవచ్చును స్త్రీ లెట్టిపనులకును సాహసులే కదా.

కానిమ్ము ఇవ్విధమంతయు నేడు పరీక్షించి నిజమైనచో నా కులపాంసురాలను శిక్షించి కులము నిష్కళంకము చేసెదనని నిశ్చయించి యప్పుడే సభజాలించి యంతఃపురమునకు బోయి భార్యం జీరి యింతీ ! మనకాంతిమతి యిప్పుడేమి చేయుచున్నది పనియున్నది. యొకసారిచ్చటికి రప్పింపుమని చెప్పెను. ఆ మాటవిని భయపడుచు నోహో ! పుత్రిక నెప్పుడును చిరంజీవిని యని పిలుచుచుందును గాని పేరుతో పిలుచువాడుకాదు. నేడెద్దియో కారణమున్నది. ఆ చిన్నది యెద్దియేని తప్పు చేయలేదుగదా ? యని తలంచుచు గూతుం దీసికొని రమ్మని యొక పరిచారికం బంపినది. అదియు కన్యాంతఃపురమునకు పోయివచ్చి యమ్మా అమ్మాయిగారుదయముననే యుద్యానవనమునకు బోయినారట. రాత్రికిగాని యింటికిరారట. అచ్చటివారు చెప్పినారని రాజు వినుచుండ జెప్పినది.

ఆరాజప్పలుకులు విని నిప్పు ద్రొక్కిన కోతివలె నా రహస్యము భార్యకును జెప్పక నాటి సాయంకాల సమయమున నుచిత పరివారముతో బండియెక్కి యాయుద్యానవనమునకు బోయెను. ఆ ద్వారమున మరియు బెక్కండ్ర కింకరుల గాపు బెట్టి యా లోపలనుండి క్రొత్తవాడెవ్వడేని వచ్చిన బోనీయక పట్టుకొని యుండుడని యాజ్ఞాపించుచు తా నొక్కరుడ యత్తోటలో ప్రవేశించి వెదకుచు గాంతిమతియున్న సౌధము దాపునకు బోయెను. ద్వారముననున్న చతురిక దూరముగానే రాజుగారిని గురుతుపట్టి తమ గుట్టు దెలిసికొనుటకై యరుదెంచినట్లు గ్రహించి తొట్రుపడుచు వడివడి లోనికిపోయి మన్మథకేళి పారావారవీచికలం దేలియాడుచున్నవారితో మనలను బరీక్షించుటకు రాజుగారు వచ్చుచున్నవారని చెప్పినది.

ఆ మాటలు విని యదృష్టదీపు దదిరిపడి యేమేమి ? రాజుగారే వచ్చుచున్నారా ? అయ్యో ! యేమి చేయుదునని తల్లడిల్లుచు నలుమూలలు వెదకి యా సౌధమువరకు నెదిగియున్న యొక మ్రాను జూచి కాంతిమతి వలదువలదని చెప్పుచుండగనే విడిపించుకొని యాచెట్టుకొమ్మలు వంచిపట్టుకొని మెల్లగా యాధారము చేసికొని యా మ్రాకుమూలమునుండి భూమిమీదికి దిగెను. అప్పటికి గనుచీకటి పడుచున్నది. గావున నరణ్యమువలె లతలచే దట్టముగా నల్లుకొనబడియున్న యాయుద్యానవనములో దాగికొనియున్న వాని నరయుటకు బ్రహ్మతరముకాదు.

ఇంతలో నారాజు మేడ యెక్కుచు దారిలోనున్న చతురికం జూచి యేమే చతురికా ! కాంతిమతి యెచ్చటనున్నదని యడిగెను. అదియు దేవరా ! యీ మేడమీదనేయున్నది. ఇంటికి రావలయునని పయనమగుచున్నదని చెప్పి యచ్చటికి దీసికొని

వేఁపుటను శంకించుచు నటునిటు కొంతసేపు తిప్పినది. కాని యతండచ్చట నిలువక తిన్నగా నయ్యంతఃపురమునకు బోయెను. అక్కాంతిమతియు నప్పుడు శృంగార వేషము తీసివేయు విషయమై నవరించుకొనుచున్నది. గావున దండ్రిని జూచినతోడనే దద్దరిల్లుచు దెల్లబోయి నిలువంబడినది.

అప్పుడు గదిలోనున్న పరిమళవస్తు విశేషములన్నియు జూచి శంకించుకొనుచు బ్రత్యక్షముగా జూచిగాని యనుగరాదని నిశ్చయించి యా మేడనంతయు వెదకెను. ఎచ్చట నెవ్వరు గనంబడలేదు. కాంతిమతి యాకృతిజూడ వేరొకరీతి గనంబడినది. మొగమునంగల దంతనఖ చిహ్నములే సంభోగసూచన సేయుచున్నవి. కాని కూతురు కావున దాపునకుబోయి యంతగా బరీక్షించుటకు వీలుపడినదికాదు. అయ్యెడయుం దయ్యువతిని సంభోగవతిగా నిశ్చయించి కానిమ్ము. ఆ పురుషుం డిత్తోట నెచ్చటనో దాగియున్నవాడు. నేడు చీకటి పడినది. రేపువచ్చి వెదకించి పట్టుకొని శిక్షించెదంగాక యని నిశ్చయించుచు గాంతిమతింజూచి చిరంజీవినీ! నీవింత స్వతంత్రురాలి వైతివేమి ? కోటవిడిచి యింతరాత్రివరకు నిచ్చట నొంటరిగా నుండవచ్చునా ? పో పొమ్ము. పిమ్మట జెప్పెదనని పలికిన నులికిపడుచు సత్తరుణి మఱుమాట పలుకక యప్పుడే చతురికతో గూడ మేడవదలి బండియెక్కి మిత్రునకుంబోవు పరాహమువలె నంతఃపురమునకు బోయినది. ప్రాణములన్నియు నుద్యానవనములోనే యున్నవి

పిమ్మట నయ్యనంతవర్మయు గొంతసేపు ప్రాంతభాగముల నరసి చీకటిలో నేమియు గనంబడమి మరలి ద్వారము దాపునకు వచ్చి యీరాత్రి మొదలు సెలవులేక నీ తోటలోనుండి యెవ్వరికిని రాకపోకలు జరుగనీయగూడదు. అట్టిపని జరుగనిచ్చితిరేని మిమ్ము గఠినముగా శిక్షింతునని ద్వారరక్షకుల కాజ్ఞాపించి కోటలోనికిం బోయెను. ఆ వార్త దూతికాముఖంబున గాంతిమతి విని మిక్కిలి పరితపించుచు జతురికంజూచి, సఖిమణీ ! నేనేమి చేయుదును. రాజుగారి శాసనము వింటివా ? ఉదయమునబోయి నా మనోహరుని బట్టుకొని శిక్షింతురు కాబోలు. అయ్యో ! ఆ తోటకు రేపువారిగూడ లేదే ? ఈ దివసముతో నా యాయుర్దాయము సరిపడినది. వారికేమాత్రము ప్రమాదము సంభవించినను నేను బ్రతుకనని నమ్ముము.

పోనీ మా తల్లితో యదార్థముచెప్పిన నీ యాపద దప్పించునేమో! యేమని యెదవు ఇంతయేల ! గాంధర్వవివాహంబున నతనిని బరిగ్రహించితినని మా తండ్రితో జెప్పుదునా ! నీవు మిగుల బుద్ధిమంతురాలవు. ఉపాయమేదియో యాలోచింపుము. నేనంతరతిసురాలనోకదా ? నా ప్రియుండటుల భయార్తుండై చీకటిలో [illegible]కంపలో దాగియుండ నే నిచ్చటికి వచ్చితిని ఎటులైన నీరాత్రి యా యద[illegible]లోనుండి బయటకు

దీసికొని రావలయును. అంతవరకు నేను భుజింపనని కన్నులవెంబడి ప్రవాహముగా నీరుగారుచుండ వెక్కివెక్కి యేడ్చుచున్న యా చిన్నదాని నోదార్చుచు చతురిక యిట్లనియె.

బోటీ! నీవేటికి చింతించెదవు. నేను దీనికి దగిన యుపాయమాలోచించితిని. ఈ రాత్రి నీ మనోహరునందుండనీయుము. మీ తల్లిదండ్రుల కీవార్త యిప్పుడు చెప్ప రాదు. కోపము దీరినవెనుక క్రమముగా వెల్లడిపరచుదము. ఇప్పుడు నీవు నేను చెప్పి నట్లుచేయుము. మన కార్యమంతయు చక్కబడునని చెవిలో నేదియో బోధించినది. అప్పుడప్పూబోణి యందులకు సమ్మతింపుచు మంచి యుపాయమే యూహించితివని చతురికను మెచ్చుకొనుచు నప్పుడే యొక మందెద్దియో పరిఢించునది దాని మేనవేడి జనింప మూర్ఛపోయినట్లు మంచముపైవ విరుచుకొని పడిపోయినది.

అప్పుడచ్చేటిక యుచ్చస్వరంబున నేడ్చుచు గాంతిమతిని బాముగరచి నదో యని యరచుచు గాంతిమతి తల్లియొద్దకుబోయి యా వర్తమానము జెప్పినది. అప్పుడామె గుండెలు బాదుకొనుచు వడివడి కన్యాంతఃపురమునకు వచ్చి యచ్చట స్మృతిదప్పి నోటినుండి నురుగు వెల్వరించుచు నెద్దియో బాధచే నిట్టట్టు గొట్టుకొనుచున్న కూతురింజూచి శోకపరవశయైన మూర్ఛబోయి తెప్పిరిలి అమ్మా! అమ్మా! యని యనేకసారులు బిలిచియు బ్రతివచనంబుగానక పెద్ద యెలుంగున నేడ్చుచుండెను. ఇంతలో వసంతవర్మ యా వార్తవిని భయపడుచు బదుగురు విషవైద్యులతో నచ్చటికి వచ్చి పుత్రిక యవస్థ యంతయు జూచి పెక్కు తెరంగుల విలపించెను.

ఆ వైద్యులు మంత్రములు వైచుచు నౌషధములను మ్రింగింప బ్రయత్నించిరి కాని పళ్లునొక్కిపట్టుటచే మందులేమియు లోపలకు బోయినవి కావు మఱియు మ్రింగు టకు నెక్కుడు ప్రయత్నము చేయబూనునంతలో చతురిక నేను మ్రింగించెదనని యా మందులు పుచ్చుకొని నోటిలో వైచినట్లభినయించుచు గుప్తముగా దాచి పారవైచినది. ఈ రీతి గొంతసేపు జరిగినతరువాత వైద్యులందరు నేమియుం జెప్పలేక తమయోపిన కొలది ప్రయత్నములు చేయుచున్నామని చెప్పిరి. అప్పుడు రాజును, భార్యయు మిక్కిలి విచారింప దొడంగిరి. ఆ శోకవేగమున రాజు మధ్యాహ్నము తాను గోపము చేసిన సంగతియే మరచిపోయెను.

అప్పుడు చతురిక లేచి స్మృతి నభినయించుకొనుచు రాజపత్నితో అమ్మా! మన కాంతిమతి కేమియు భయములేదు. నాకొక మందు జ్ఞాపకము వచ్చినది. అది మొన్న నొక యోగి మన యుద్యానవనములోనికి వచ్చి పాముకాటునకు నిది మంచి యౌషధమని మాకొక చెట్టు చూపించెను. అది నేను జ్ఞాపకము పెట్టుకొనియున్నాను. పోయి తీసికొనిరానా? యని యడుగగా నా రాజపత్ని అయ్యో! సంశయమేల పరుగిడబోయి తీసికొనివచ్చి నీ నెచ్చెలిం బ్రతికించుకొనుము. ఏ మందులో నే మహిమ యున్నదో యని పలుకుచు నచ్చటికి వెళ్లుటకు తొందరపెట్టెను.

అప్పుడు చతురిక కొంతదూరముపోయి మరలవచ్చి అమ్మా! ఆ తోట లోనికి పోవుటకు రాజశాసనము లేకున్న వీలుపడదు నేను మరచిపోయి వెళ్లుచుంటిని. అయ్యగారు సాయంకాలమున నట్టిశాసనము చేసియున్నారు. కావున నట్లుపోవుటకు నాకొక చీటి నిప్పింపుమని యడిగెను. ఆ మాట విని రాజపత్ని యాక్షేపించుచు ఓసీ! నీకును శాసనము కావలయునే యూరక యాలస్యమగుచున్నది, త్వరగా వెళ్ళుమనుటయు నది సమ్మతింపక యట్టి పత్రిక యిప్పింపకతీరదని చెప్పెను.

అప్పుడు రాజపత్ని వల్లభునితో నామాట జెప్పగా నతండంత విమర్శింపక యీకాంతనుమాత్రము లోనికి పోనీయుడని చీటివ్రాసి యిచ్చెను. అట్టి శాసనపత్రికం గైకొని యచ్చతురిక మిక్కిలి సంతోషించుచు యంత్రప్రదీపహస్తయై వడిగా నతోట యొద్దకుబోయి ద్వారపాలురతో గోటలోజరిగిన యుపద్రవము చెప్పుచు నచ్చీటిని వారికి జూపి లోనికి బోయినది

ఆహా! దాని బుద్ధినైపుణ్య మెంతవింతయైనదో చూడుము. అట్లు లోనికి పోయి యాదీపమువెలుగున నతోటలో నలుమూలలు దిరుగుచు నొక మేడగోడప్రక్కను సోపానముమీద గూర్చుండి తన యవస్థగురించి విచారించుచున్న యదృష్టదీపునింగాంచి తన్నెరింగించి యతనికొరకు రాజపుత్రిక పడుచున్న యిడుమలన్నియు దెలిపిన నతండును కాంతిమతికి దనయందుగల మక్కువను గురించి మిక్కిలి మెచ్చుకొనియెను.

తరువాత నచ్చతురిక తానుదెచ్చిన బట్టలతనికి గట్టనిచ్చి స్త్రీ పురుషభేదము దెలియకుండునటుల మేలిముసుగుగప్పి యా చీటి నతనికిచ్చి దీపము జేతంబట్టుకొని యాదారిం బొమ్మని చెప్పినది అతడట్టి వేషముతో బోవుచు దారిలోనున్న ద్వారపాలుర కాచీటింజూపింపగా వారు మొదట వెళ్ళిన చిన్నదియే యనుకొని యంతగా బరీక్షింపక దానిని విడిచిపెట్టిరి. దానంజేసి యతండు నిరాటంకముగా నింటికిబోయి తన రాకకు వేచియున్న బలభద్రునకా వృత్తాంతమంతయుంజెప్పి యా రాత్రి సుఖముగా వెళ్ళించెను.

అంత నచ్చట దోటలోకి జతురికయు మరికొంతసేపుండి యెద్దియో యొక వేరు త్రవ్వుకొని మొదటనే ప్రచ్ఛన్నముగా దెచ్చిన దీపమును వెలిగించుకొనుచు నా దారింబోవునంతలో ద్వారరక్షకు లడ్డమువచ్చి నీ వెవ్వతెవు! యీ తోటలోని కెటుల పోయితివి. నీవిపుడు పోవలదు నిలువుమని పలుకగా నది నవ్వుచు నోహో మీరు గట్టి వారులే! నే నిప్పుడు మీకు జీటిజూపి లోనికిబోలేదా? ఆ చీటి నెచ్చటనో మరచిపోయి తిని. నేను నిత్యము వచ్చుచున్నదాననే. కాంతిమతి స్నేహితురాలను. ఆ చిన్నది యిప్పుడు పాముగఱచి చచ్చుటకు సిద్ధముగా నున్నది. ఈ వేరుకొరకు నిచ్చటకు వచ్చి తిని. వేగముగా తీసికొనిపోవలయును. లేనిచో రాజపుత్రిక జీవింపదు. రాజుగారు నాపయి గోపము చేయుదురు. నా పేరు చతురిక. నా సంగతి ప్రొద్దున రాజుగారితో జెప్పుడు. వేగము పోనీయుడని చెప్పగా వారు నీ వెవ్వతెవైనను మాకు భయములేదు. నీ మాటలు

చూత వింతగానున్నవి. ఇంతకుబూర్వమే మొదటవచ్చినకాంత మాకు జీటీచూపించి వెడలినది ఈరాత్రియొకతె లోనికిబోయినది ఇరువురువచ్చిన బోనిత్తుమా! నీవు మమ్ము గ్రొత్తవారము గదాయని మాయజేసి పోవలయుననుకొంటివి. నీ విషయమై యనుమానముగానున్నది. ఉదయమువరకు గదలనీయమని రూఢముగా జెప్పిరి.

అప్పుడది కోపించుచు మీరు బుద్ధిహీనులవలె దోచుచున్నారు. నేనెవ్వతె ననుకొంటిరి? ఇప్పుడు క్షణమాలస్యమైనచో రాజపుత్రిక జీవింపదు. ఈ యప రాధము మీమీదబడును. మీ కనుమానమున్నచో నా వెంటరండు. మీ సందియము దీరుతునని పలుకగా నారు సందియమందుచున్నంతలో మరికొందరు రాజకింకరులు వడిగావచ్చి చతురికా! చతురికా! యని పిలువదొడంగిరి. అప్పుడప్పుడతి యాధ్వని విని ఓ! యని పలుకుచు నయ్యో నేనేమి చేయుదును? మీరు నన్ను రానియ్యకున్నవారు. వేరు త్రవ్వుకొని వచ్చితినని చెప్పగా నా కింకరులు ద్వారరక్షకుల మందలింపుచు అయ్యో! దీని నాపుచున్నారేమి? దీని రాకకై రాజుగారు వేచియున్నారు. ఈ మాట తెలిసినచో మిమ్ము శిక్షించును. రాజపుత్రిక చావుబ్రతుకులమీద నున్నది. ఆమెకొరకు నౌషధి దెచ్చుటకు నీమచ్చకంటి యిచ్చటికి వచ్చినది. ఇది కాంతిమతికి మిత్రురాలు. దీని మీ రాటంకము చేయుచున్నారేమి యని యాక్షేపింపగా వారేమియు బలుకలేక మొదట పోయినదే తమ్ము మాయజేసినదని నిశ్చయించుకొని యారహస్య మెవ్వరికి జెప్పక యప్పుడప్పడతిం బోనిచ్చిరి.

పిమ్మట నా కొమ్మయు సమ్మోదముతోబోయి యావేరుదెచ్చిన వార్త యెల్ల రకు దెల్లముచేసి యది యరుగదీసి యాగంధము గాటువైచినచోట నంటించుచు దాని చెవులో నాడుదానివలె నీ మనోహరుడు సుఖముగా కోటదాటిపోయెను. నీవింక స్మృతి దెచ్చుకొమ్మని చెప్పినది. అమృతప్రాయమైన యామాట వినినతోడనే యా చేడియ ప్రాణములు గూడికొనినట్లనభినయించుచు మెల్లమెల్లగా గన్నులుదెరచి చూచుచు దనకు గొంతెము నింపాదిగా నున్నదని సంజ్ఞాపూర్వకముగా జెప్పినది.

అప్పుడందరు చతురిక వైద్యమును గురించి పెక్కు తెఱంగుల స్తుతి సేయదొడంగిరి. తరువాత జతురిక కాంతిమతికి విషము విరిగి రోగము తిరిగినదనియు మాటలాడక నిద్రబోనీయుడనియు నందరితో జెప్పి యట్లు నిద్రబొమ్మని చెప్పినది. కాంతిమతియు సుఖముగా నిద్రబోయి యుదయమున లేచినది. అనంతవర్మ ప్రొద్దున్న లేచి యా యుద్యానవనమునకు బోయి యతోటలో నలుమూలలు మిక్కిలి శ్రద్ధా పూర్వకముగా వెదకించెనుగాని యందు నెవ్వరు గనంబడలేదు. ద్వారపాలుర బరీ క్షించి యడిగెను. వారు రాత్రి జరిగిన మోసము జెప్పినచో దమ్ము శిక్షించునను వెఱ పున నేమియుం జెప్పిరికారు. అప్పుడు రాజు తన శత్రువులెవ్వరో యట్టి యుత్తరము వ్రాసినారని నిశ్చయించుకొని పుత్రికయందుగల కోపమంతయు బోగొట్టుకొని యక్కాంతామణి నెంతేని సంతోషముతో మన్నించుచుండెను.

అదృష్టదీపుడట్లు రాత్రివేళ నింటికిఁబోయి పశ్చాత్తాపము నొందుచు అహా! జగంబంతయు గామహతకునిచే వంచింపబడుచున్నది కదా ?

శ్లో॥ కాంతేత్యుత్పలలోచనేతి విపులశ్రోణీ భరేత్యున్నమ
త్పీనోత్తుంగ పయోధరేతి సుముఖాంభోజేతి సుభ్రూరితి
దృష్ట్వామాద్యతిమోదతేభిరమతే ప్రస్తౌతి ద్వానపి
ప్రత్యక్షాశుచిభస్త్రికాం స్త్రియమహో మోహస్యదుశ్చేష్టితం.

విద్వాంసులుగూడ మాంసాదులచే రచింపబడిన తోలుబొమ్మను జూచి కాంత సుముఖ, సుభ్రూ మొదలగు నలంకారములు గల్పించుచు స్తుతిజేయుచు గ్రీడింపుచుందురు. నేను జగద్విదితమగు ఖ్యాతిని సంపాదించి చివరకీ కాంతమూలమున దొరసివలె నాతోటలో దాగియుండవలసివచ్చినది దైవానుగ్రహమువలన నా లలన దాటించినదికాని లేనిచో గారాగారంబునకు బంపబడియుందును. నాకింత ప్రారబ్ధమేల వచ్చెను. ఆ మచ్చెకంటిం బెండ్లిచేయుమని యడిగినచో సంతసించుచు దండ్రి యూర కుండునా ? మరికొన్ని దినములు దేశము దిరిగివచ్చి తరువాత నడిగెదను. కాంతిమతి రాత్రి నాకొరకుబడినకష్టము తలంచుకొన్న విడిచిపోవుటకు నిష్టములేకున్నది. ఆ చిన్న దానికి జెప్పితినేని వెళ్ళుటకు సమ్మతింపదు. ఇచ్చటనుంటినేని క్రమముగా రాజుగారికి దెలియకమానదు. అప్పుడతని కెట్టిబుద్ధిపుట్టునో ! కావున నిప్పుడు తెలియకుండ పోవు టయే యుచితముగానున్నది. అని యూహించి యొక యుత్తరమిట్లు వ్రాసెను.

కాంతా ! నీవీరాత్రి జరిగించిన కృత్యమున కెంతేని సంతసించితిని. నీవట్టి యుపాయము పన్ననిచో నన్ను బట్టుకొందురు. నన్నుగురించి నీవు పొందిన యాయాస మునకు మిక్కిలి చింతించుచున్నవాడ. నీవు నాతో జెప్పినమాటలు జ్ఞాపకమున్నవి. నేను దప్పక పట్టమహిషిగా నిన్ను స్వీకరింతును. ఇదివరకే మన యిరువురకు గాంధర్వ వివాహమైనది. నా కులశీలనామంబులు నీకు జెప్పకపోవుటకు గారణమున్నది. ఇప్పుడు పేరు మాత్రము తెలియజేయుచున్నవాడ. నేను గొన్నిదినములు దేశాటనముజేసి మరల వచ్చెద నీవేమియు జింతింపకుము. సర్వదా తలంచుకొనుచుండుము. ఈ చిత్రఫలక మును సంతతము సంతికమున నుంచుకొని నన్నుగా భావింపుచుండుము. స్వల్ప కాలములోనే తిరుగవచ్చెద గ్రహింపుము

ఇట్లు, అదృష్టదీపమహారాజు.

అని వ్రాసి యట్టి యుత్తరమును బలభద్రునిచేతికిచ్చి యోరీ ! నేనిప్పుడే పోయి యొకచోట నివసించియుందును. చతురిక యిచ్చటికి వచ్చును వచ్చినతోడనే యీ యుత్తరము రహస్యముగ దానికిచ్చి మరి యేమియు జెప్పక యది యా యుత్తరమును జదువుకొనులోపలనే దానికి దెలియకుండ బయలుదేరివచ్చి నన్ను గలిసికొనుము. మన మిక నీయూర నుండవలదనిచెప్పి యప్పుడే బయలుదేరి వానితోజెప్పిన సంకేతస్థలము

నకు బోయెను. అంత నుదయంబున నచ్చటికి జతురిక వచ్చిన నదృష్టదీపుడు చెప్పిన ప్రకారము త్తరమిచ్చి యది చదువుచున్న సమయములోనే యిదిగో వచ్చెదనని చెప్పి పారిపోయెను.

ఆ యుత్తరము జదువుకొని యా బాలుజూచి యదృష్టదీపమహారాజు ప్రసిద్ధి యంతకు బూర్వము విని యున్నది కావున సన్యాసిమాటలు స్మరించుచు నతండు తప్పక యట్టివాడే యని నిశ్చయించి సంతోష విచారంబులు మనంబునం బెనంగొన వడివడిబోయి యా యుత్తరము గాంతిమతికి జూపినది.

అమ్మత్తకాశిని తత్తరముతో నా యుత్తరమును జదువుకొనిన తరువాత నిరువురకును నీరీతి సంవాదము జరిగినది.

కాంతిమతి- చతురికా ! నిజముగా నతండు మనము ప్రసిద్ధిగా జెప్పుకొనుచున్న యదృష్టదీపమహారాజే !

చతురిక- దానికి సందేహమా ! అతని మొగము చూచినం దెలియదా ? వట్టివాని కంత సౌందర్యము గలుగునా ?

కాంతిమతి-అతడు సౌందర్యముచేతనేగాదు గుణములచేతగూడ గొనియాడ దగినవాడు సుమీ ?

చతురిక-కనుకనే యంత ప్రసిద్ధి వచ్చినది.

కాంతిమతి నాకు మొదటినుండియు నట్టివాడే మగడు కావలయునని కోరికయుండునది నీకును జ్ఞాపకముండవచ్చును. నీతో జెప్పియే యుందును.

చతురిక-ఇంతకును నీ యదృష్టము మంచిది. శకుంతలవలె మంచి మగని సంపాదించుకొంటివి.

కాంతిమతి-నేనే ! నీ వట్లనక యేమందువు ఉత్తముజెప్పుదైన స్వప్రయోజకత్వమును బ్రకటించుకొందురా ?

చతురిక-దానికేమి నీయుపాయము నాదికాదా ? ఇప్పుడు మీ తండ్రి విని నను సంతసించును.

కాంతిమతి- ఇక మనము నిర్భయముగా జెప్పవచ్చును.

చతురిక-మనము జెప్పనక్కరలేదు. నీ గర్భమే చెప్పగలదు.

కాంతిమతి -- [సిగ్గుతో దల వంచుకొని] ఇది నిజమని నిశ్చయించితివా యేమి ?

చతురిక-భవదీయ చూచుకముఖంబుల నీల సితవర్ణంబులే నిశ్చయింపుచున్నవి.

కాంతిమతి- అసుంగాని యీ వియోగభారంబెట్లు సైతును అతండెప్పుడు వచ్చునో ?

చతురిక-అతనితో నీకేమి పనియున్నది? నీకు గావలసినపనియైనదిగదా ?

కాంతిమతి-నాతో బరిహాసములాడక నిజము చెప్పుము. అతండు తిరిగి యిప్పటికి వచ్చి నన్నాదరించునా ?

చతురిక-ఏమిచేయునది రారా యుత్తరమే చెప్పుచున్నది.

కాంతిమతి-దానింజూడ ననురాగసూచకముగానే యున్నది. అతండిట్లు ప్రచ్ఛన్నముగా దిరుగుట కేమి కారణమున్నదియో ?

చతురిక-సన్యాసి చేయి చూచినప్పుడే చెప్పెను. ఆ యోగి మిక్కిలి తెలిసిన వాడు యెద్దియో కారణమున్నది మరియేమియో యననేల నిన్ను వరించుటకే.

కాంతిమతి-కట్టి యుత్సాహముగూర్చిన నీకు ప్రతి యేమి చేయగలను. ఇదిగో ! గాఢముగా నాలింగనము జేసికొనుచున్నదానని యట్లు చేసినది.

తరువాత చతురిక యావార్త మెల్లగా గాంతిమతి తల్లితో జెప్పినది. ఆమె సంతోషించుచు నొకనాడేకాంతముగా నున్న సమయంబున మగనితో నదృష్టదీపుని ప్రశంస వచ్చుటయు నాయన మీ కల్లుడయ్యెనని చెప్పినది. ఆ మాటవిని యతండదరిపడుచు నదియెట్లని యడుగ తనకు గూతురు జెప్పిన వృత్తాంతమంతయుం జెప్పి యా యుత్తరమును జేతి కిచ్చెను. ఆ రాజు మొదట గొంతసేపు నమ్మలేదు. కాని అదృష్టదీపుడంతకు బూర్వము తనకు వ్రాసినయుత్తరము దెచ్చి చూచి యందలి వ్రాలును నిదియు నొక్కరూపున నుండుటచే నమ్మక తీరినదికాదు. అట్టివాడు తనకు నల్లుడగుటయే చాలునను సంతోషముతో గూతునేమియు నిందింపక గాంధర్వవివాహము దూష్యము కాదని శాస్త్రవేత్తలచే దెలిసికొని యయ్యువతి గర్భవతి యగుటకు మిక్కిలి సంతసించెను. పిమ్మట నా రాజపుత్రికను సురక్షితముగా గాపాడుచు నదృష్టదీపుని వార్త దెలిసికొనుటకయి నలుమూలలకు పెక్కండ్ర దూతల నంపెను.

అచ్చట అదృష్టదీపుడు బలభద్రుడు వచ్చినతోడనే యా యూరువెడలి యొక మార్గము సంబడి నడుచుచు గాంతిమతి యొక్క క్రీడావిశేషములన్నియు బలభద్రునితో జెప్పుచు దద్వియోగమునకు మిక్కిలి పరితపించుచుండ బలభద్రుండోదార్చుచుండెను. ఆ రీతి బదిదినములు ప్రయాణము చేసినంత మరియొక పట్టణము గనంబడినది. దానిపేరు పుష్పగిరి. దానిని రాజవాహనుడనురాజు పాలించుచున్నవాడు. అదృష్టదీపుడు మిత్రునితోగూడ నట్టిపట్టణములో బ్రవేశించి తన పేరం బ్రసిద్ధిజెందిన సత్రములో బసచేసెను.

ఆ గ్రామములోగూడ నదృష్టదీపునిపేరు మిక్కిలి వాడుకగా నున్నది. అతండట్టి విశేషములన్నియుం బరీక్షింపుచు గొన్నిదినములాయూర వసియించెను. అదృష్టదీపు డా సత్రములో నొక వేదికపైగూర్చున్న సమయంబున నొక బ్రాహ్మణుం డతనిముఖము సాభిప్రాయముగా జూచెను. అది గ్రహించి యదృష్టదీపుడా బ్రాహ్మణుని గాంచి అయ్యా ! మీదేదేశము? ఇచ్చటికెప్పుడు వచ్చిరి ? ఎచ్చటికి బోయె

దరు. నన్ను విమర్శించి చూచుటకు కారణమెద్దియేనిం గలదా యని యడిగిన నవ్విప్రుండు వానితో నిట్లనియె.

అయ్యా ! మా కాపురము మాళవదేశరాజధానియైన కోళాంబ యను పట్టణము. నేను తద్దేశప్రభువైన ధర్మపాలుని పురోహితుండను నా పేరు విష్ణుశర్మయందురు. మా రాజు కొన్ని సంవత్సరముల క్రిందట శత్రువులచే నోడింపఁబడి బద్ధుండగుటచే నప్పట్టణమును శాత్రవులాక్రమించిరి. నేను మిగుల పండితుండను. నాకు పెద్ద కుటుంబము గలదు. ఆ క్రొత్తరాజు మిగుల దుర్మార్గుఁడగుటచే ధర్మపాలునియందుగల విరోధమునుబట్టి నాకతం డంతకుమున్ను పాటితో శికముగా నిచ్చిన ధనకనక వస్తువాహనాదికమంతయు గొల్లపెట్టుటయే గాక నన్ను గుటుంబముతో గూడ నాయూరినుండి లేవగొట్టెను. పిమ్మట నేనచ్చట రక్షకులు లేమింజేసి మిక్కిలి పరితపించుచు నతికష్టముతో నాయూరు విడిచి కుటుంబముతోగూడ దేశాటనము చేయ మొదలుపెట్టితిని. కుటుంబము పెద్దదగుటచే నెచ్చటికిబోయినను గడుచుట కష్టముగా నున్నది. ధర్మస్వరూపుడైన యదృష్టదీపమహారాజు గారి ఖ్యాతిని విని యాయన దర్శనమైనచో నీ దరిద్రము వాయునను తాత్పర్యముతో నీయూరువచ్చి యీ సత్రములో బ్రవేశించితిమి. భోజనమునకే లోపములేదు. ఎన్ని దినములున్నను పొమ్మనరట. ఇదియు గొంతమేలేయని యింతవసించియుంటిమి. ఆయన తీర్థయాత్రకు వెడలెనని కింవదంతిగానున్నది. ఏ తీర్థమందున్నదియు దెలియదు. బ్రాహ్మణులందరు ప్రతితీర్థమునందు వెదకియున్నారు. అమ్మహానుభావుని దర్శనమైన వానికి దరిద్రముండదు. వాడు కుబేరసంతవాడగును. అతని యీవి యింతింతని పొగడుట శక్యములేదు. ఎప్పటికేని యప్పుణ్యాత్ముని దర్శనము కాకపోవునాయని యాసతో నున్నాడను. ఇదియే నా వృత్తాంతము. మఱియు మీ మొగముచూడ మా ధర్మపాలుని మొగముపోలిక యగుపడుచున్నది. దానంజేసి నిరూపించి చూచితినని చెప్పగా నదృష్టదీపుం డిట్లనియె.

అయ్యా ! మీ రాజుగారినోడించి బద్ధుజేసిన రాజు పేరేమి ? మీ ధర్మపాలునికి భార్యాపుత్రులుకలరా ? యుండిన వారేమైరని యడుగగా నతండు ఆర్యా ! మా పట్టణము ముట్టడించిన రాజు చోళదేశ ప్రభువైన సురక్షితుడు. అతడు కపటముచేసి మా రాజు నోడించెను. అదియు పెద్దమంత్రియైన విహారభద్రుని మూలమున వచ్చినది. మా రాజుగారిభార్య సునందయను సుందరి గర్భభరాలసయై మూడేండ్లప్రాయముగల పుత్రు నెత్తుకొని యాయుద్ధములోనే నెచ్చటికో పారిపోయినది. నాటినుండియు నామెజాడ యేమియుం దెలియకున్నది. వసురక్షితునివంటి దుర్మార్గుడీలోకములో నెచ్చటను లేడని కొంతసేపతని క్రూరకృత్యములు జెప్పదొడంగెను. అదృష్టదీపుడా బ్రాహ్మణుని వచనంబులు విని యించుక శంకించుచు కొనుచు నాతాల్పప్రమాణము వారివారి నామములు వ్రాసికొని గుప్తముగా నుంచుకొనియెను.

ఇట్లు బ్రాహ్మణునితో సద్వృష్టీపుడు మాట్లాడుచున్న సమయంబున బట్టణ విశేషంబులు జూచుటకై యంగడికి బోయిన బలభద్రుడు వచ్చెవడిగా జనుదెంచి యూర్పులు సిగుడించుచు నిట్లనియె. మిత్రమా! నేనిప్పుడంగడివీధి నొకవిశేషమును జూచితిని. ఒక చక్కని చిన్నవానిని బండిమీద నెక్కించి యూరేగింపుచున్నవారు. వానింజూచి నీవనుకొని పేరబోయితిని. కాని చుట్టును విచ్చుకత్తులతోగాచియున్న రాజకింకరుల రాయిడిచే మాట్లాడుటకు వీలుచిక్కకపోయినది.

# ప్రియంవదకథ

అప్పుడు నేను మిక్కిలి తొందరపడుచు నాకింకరులతో నితండేమి యపరాధము చేసినవాడని యడుగగా వారందరు నాకు సమత్తర మిచ్చిరి కారు. పిమ్మట నేనూరకొనక యాప్రాంతమందున్న మ కొందరి నడుగగా వారిట్లనిరి. ఇతండొక బ్రాహ్మణ కుమారుడు. వీనిపేరు హరిదత్తుడట. వీడీపట్టణపు రాజుకూతురు ప్రియంవద యడిగిన మాటల కుత్తరమునిత్తునని యొప్పుకొని యామెయంతఃపురమున బ్రవేశించి తుదకు ఆ చిగురుబోడియిచ్చిన ప్రశ్నలకు నుత్తరము చెప్పలేకపోయెను. మొదటనే యట్టిశాసన మేర్పరచియున్నవారు కావున నిప్పుడితని నురిదీయుటకై యూరేగింపుచున్నవారు. వీనిగురించి మఱియొక రెవ్వరైన నాప్రశ్నలకు నుత్తరమిత్తుమని వచ్చినగాని వీనిని విడుతురు వారు గూడ చెప్పనియెడల నిరువురను నురిదీతురు. ఇదియే వీని వృత్తాంతమని నాతో జెప్పిరి.

ఆ మాటవిని నేను మిక్కిలి పరితపించుచు నిన్నుజూచు తాత్పర్యముతో వచ్చితిని. అన్నా! పాపమా బ్రాహ్మణకుమారుడు నీవలె నున్నాడుసుమీ! తలవాల్చుకొని బండిమీద గూర్చుండియున్నాడు. తెలియక యట్టిపని కెట్లు పూనుకొనెనోకదా! వానిని విడిపించు బుద్ధిమంతుడీ యూరలేకపోయెను. ఆ ప్రశ్నలు నీకేమైన నర్థమగునేమో యని పలుకగా నతం డదరిపడుచు అయ్యయ్యో! బ్రాహ్మణకుమారు నన్యాయముగా నురిదీయుచున్న నీరాజు నేమనదగినది. అతని కూతురింత యన్యాయపు వ్రతమేల పూనినది? కానిమ్ము. నేనిప్పుడేపోయి యాప్రశ్నల కుత్తరము చెప్పెదనని చెప్పి యాబ్రాహ్మణకుమారుని విడిపించెదను. దైవము నాకట్టియూహ తోపించిన దోపించుగాక లేనిచో నిరువురము పరమపదము నొందుదుము. బలభద్రా! నీవేమనియెదవని యడిగిన వాడిట్లనియె.

అన్నా! తొందరపడకుము. ముందుగా నాప్రశ్నముటెట్టివో తెలిసికొని తరు

వాక నాలోచింపుము. లేనిచో వృధాగా జిక్కుపడవలసి వచ్చునని పలుకుచుండగనే లేచి యతఁడు తమ్ముఁడా ! రమ్ము. పోదమా విప్రకుమారుడు చెప్పటకున్నాడని యడిగిన నబ్బలభద్రుండు నతని నప్పుడే యాయంగడికి దీసికొనిపోయెను. కాని యంతలో నారక్షక పురుషు భూసుర తనూభవుని వధ్యభూమికి దీసికొనిపోయిరి. వీధులలో నిలబడి పౌరులు అయ్యయ్యో ! ఎంతచక్కనివానికి మృతి ప్రాప్తించుచున్నదోకదా ? పాపము వీనికి తలిదండ్రులుగాని యన్నదమ్ములుగాని లేరుకాబోలు. ఏ బుద్ధిమంతుడైన వచ్చి వీనికడ్డుపడిన బాగుండును. కటకటా ! ఆ రాజకుమార్తె యింక నెందరినిట్లు జంపునో ! ఇట్టి వ్రతము కూడదని తండ్రియైన బుద్ధిచెప్పరాదా ? అసందర్భ ప్రశ్నముల కుత్తరము చెప్పనాడెవ్వరు అన్నన్నా ! తెలియక యీ బ్రాహ్మణకుమారుడు మోస పోయెను. ఇంతకుముందెవ్వరు నట్టికతినదండనకు వెఱచియే మేము చెప్పెదమనిరాలేదు. ఇంతకు వానికిరీతి మరణము విధించియుంచెను కాబోలు. ప్రారబ్ధ మతిక్రమింప నెవ్వరి తరమని తమకు దోచిన ప్రకారను చెప్పుకొనఁదొడగిరి

అదృష్టదీపు డట్టిమాటలన్నియు వినుచు, "మిత్రగుప్తుఁడనువా డితని ప్రాణ ముల గాపాడుటకు రాజుగారియొద్దకు పోయెను. అంతదనుక హరిదత్తు నురిదీయవలదని చెప్పుము" నీవచ్చుటనుండుమని బలభద్రుని వధ్యభూమికిననిపి తాను రాజవాహను నాస్థానమునకుబోయి యారాజుగారికి నమస్కరింపుచు నిట్లనియె. అయ్యా! మాది కాశీ దేశము. నాపేరు మిత్రగుప్తుఁడందురు. నేను మీ కూతురువేసిన ప్రశ్నములకు హరిదత్తు నిమిత్త ముత్తరమిచ్చువాఁడ. దీనికి నాకు నాలుమాసములు గడువీయ వలయును. ఇప్పుడే హరిదత్తు నురిదీయకుండ నాజ్ఞాపత్రిక బంపుడు. పలుకుటయు నతనిధైర్యము నకు, సాహసమునకు నాసభ్యులెల్లరు మెచ్చుకొనుచు నితండతనికెద్దియో కావలయునని యూహించుకొనుచు వెఱ్ఱిగతులఁ దలపోయుచుండిరి.

పిమ్మట నారాజవాహను డతని తెగువకు వెఱగందుచు నేను దారుణమైన శపథము జేసియున్నాడను. నీవట్టిదాని వినియుంటివో లేదో ! హరిదత్తుని గురించియే యందరు నన్ను నిందింపుచున్నారు. నీవు గూడ సదుత్తరం బియ్యలేకపోతివేని మీ యిరువురను నురిదీయవలసి వచ్చును. నీవు చక్కగా నిదానించుకొనుమని యారాజు చెప్పగా విని యతఁడు మీశపథప్రకారమంతయు వినియే యిచ్చటికి వచ్చితిని. ఆ విష యమై నాకెంతమాత్రము సందియములేదు. వడిగా వధ్యభూమికి నాజ్ఞాపత్రికను బంపు డని తొందరపెట్టుచు బలికెను. పిమ్మట రాజవాహను డతనిపేరు వ్రాసికొని యతని చేత నాలుమాసములలో దిరిగివచ్చునట్లుగా బ్రమాణికము చేయించుకొనుచు నంతవరకు నురిదీయక హరిదత్తుని కారాగృహమున నుంచునట్లాజ్ఞాపత్రిక వ్రాసి యప్పుడే పంపెను.

ఆ పత్రిక చేరినతోడనే రక్షకభటులు హరిదత్తు నురిదీయక మరల దీసికొని వచ్చి బందీగృహములో నుంచిరి. అదృష్టదీపునికి హరిదత్తుని జూడవలయునని యభి లాష గలిగినది కాని యప్పటి కార్యము తొందరవే జూచుట దటస్థించినదికాదు. తరు

వాత నదృష్టదీపు డాప్రశ్నము లేవియని యడుగగా నారాజుగా రట్టి ప్రశ్నములు గల పత్రికను దెప్పించి యతనిచేతి కిప్పించెను.

గీ. ఎన్న భువనేశ్వరీదేవి కెన్ని మొగము?
లవియు నేయేరుచులచేత నమరు! మఱిత
దాలయంబెట? నటఁగు నట్టిలిపియ
దేమి? యది చెప్పుడివిమదీ యేచ్ఛనగిది.

క. వీనికి నదుత్తరము లెవఁ
డైన నొసంగినను వాని బ్రాణాధీశం
గా నెంచెద మదియించెద
బూనుచు నటు చెప్పలేకపోయిన యంతన్.

అట్టి పద్యములు గల యా పత్రికను రెండు మూడుసారులు చదువుకొని తలయూచుచు నారాజు నసుజ్ఞ బుచ్చుకొని యింటికిబోయి తన కెదురుగా వచ్చిన మిత్రునితో నిట్లనియె. బలభద్రా! నాకాయువింక నారుమాసములున్నది. ఈ ప్రశ్నముల కెవ్వడు నుత్తరము చెప్పలేడు. మిగుల నసందర్భముగా నున్నవి. భువనేశ్వరీదేవి యాలయ మెచ్చటనున్నదో యెవ్వరు చెప్పగలరు? అయినను మనయోపినంత ప్రయత్నము చేయుదుము. నీ వెచ్చటనే యుందుము. నేనొకసారి దేశాటనము చేసి వచ్చెదనని పలుకగా నబ్బలభద్రుడు కన్నీరు విడుచుచు నిట్లనియె. అయ్యో! నేను మొదటనే నిదానించుమని చెప్పితిని కాదా! అట్లు చేయక తొందరపడి యొప్పుకొని వచ్చితివేమి? దీని కేమిచేయుదము. ఈ ప్రశ్నల కెవడు నుత్తరము చెప్పలేడట. ఏమి చెప్పినను కాదని యురికీయించునట. నీతో నీ సంగతి యెఱుగక జెప్పితినే. నీ వింత సాహసము చేయుదు వనుకొనలేదు. జగద్విదితముగు కీర్తి వహించి చివరికొక యాడుదాని మూలమున బలవన్మరణము పొందవలసివచ్చెనదా! కటకటా! నేనందులకు సమ్మతింతునా? మనయిప్పు డెవ్వరికి దెలియకుండ మన పల్లెకు బారిపోయిన మనలను బట్టుకొనలేరు. తరువాత హరిదత్తుని సంగతి యేదియో యొకటి యగును. అంతియ కాని మనమూరక వీరికి బ్రాణము లప్పగించవమా యని పలుకుచు దీనాననుడై యున్న బలభద్రునకు నదృష్టదీపుం డిట్లనియె.

తమ్ముడా! నీ విందుల కేమియు విచారింపకుము. దేహమనునది గ్రుక్కెడు ప్రాణముతో నున్నది. ఇట్టి దానికొరకు ననత్యమెట్లు యాడుదును? మన పూర్వులీ సత్యముకొరకు బడినయిడుము లెట్టివో యెఱుంగుదువా! బ్రాహ్మణుని నిమిత్తము శరీరము విడ చుటకంటె సుకృతమున్నదా? ఈ శరీర మెప్పటికైన నస్థిరమైనదే కదా? అదియునుంగాక కాలమెుక్కరీతి నెవ్వరికిని నడువదు. మనము మొంసిదినములలో విత్తమేమియును లేకయే యెంతఖ్యాతి సంపాదించితిమో చూచితివా? ఆ కాలము గతించిన తోడనే కాసునకైన గొరగాకుంటిమి. దర్రిదులయొక్క సహాలాప

ములు వినుచుండ నా చెవులు చిల్లులు పడుచున్నయవి. ఏమి చేయుదును? జీవ
చ్ఛవము లాగున నూరకుంటిని. మనమప్పటివారమేయైన కాలభేదమున బట్టి యిప్పుడు
మఱియొకరమైతిమి. కావున బురుషదేశకార్యము చేయుటకును కర్తగాదు. నాకిప్పుడు
కర్మానుగుణ్యమైనబుద్ధి పుట్టినది. ఏమికానున్నదో యట్లు జరుగక మానదుకదా. దీనికై
విచారింపనేల? పాఱిపోవుట పురుషకారము కాదు. అట్టి పనికి నేనెన్నడు నొప్పు
కొనను. ఈ యారు మాసములలో నా వార్త దెలిసికొనుటకై ప్రయత్నింతము దైవాను
గ్రహము మనయందు గలిగియుండినచో నెట్లు తెలియకపోవును. నీవు ధైర్యముగా
నుండుము.

శ్లో॥ యోమేగర్భ గతస్యాపి వృత్తింకల్పి తవాన్విభుః
శేషవృత్తిం విధానాయ సుప్తఃకింను మృతోథవా.

పుట్టించిన భగవంతుడు తరువాయివృత్తి గలిగించుటకు నిద్రబోవుచున్నాడా?
లేక మృతినొందెనా? యని చెప్పినట్లు మనకిదివరకింత ఖ్యాతి గలుగజేసిన విధి
యిప్పుడు మాత్రమూరకుండునా? మన కెన్నడును నవమానము రాదని నమ్ముము.
ఈ యాపద సైత మెట్లో దాటెదమని పలుకుచు బలభద్రునికి ధైర్యము గలుగజేసెను.

ఆతని మాటలచేత బలభద్రుడు విచారమును విడిచి యెదదను బూని,
మిత్రమా! నీవు జనియించిన సమయము మంచిది. నీవు చెప్పిన ప్రకారము నీకెన్నడు
నవమానము రానిమాట నిశ్చయమే. ఈ యారుమాసములలోను దేశాటనము చేయు
దము. నీతో నేనును వత్తునని పలుకగా నతండు మరల నిట్లనియె. తమ్ముడా!
మనము దేశము తిరుగవలసిన యవసరము లేదు. ఆ ప్రశ్నములీ యూరనుండియే
యరయదగినది. ఆ రాజపుత్రిక నిత్యము చేయు కృత్యములెట్టివో గ్రహింపవలయును.
కావున నీవీనగరములో గుమ్మరుచు ననుదినము నా చిన్నదాని చర్యలం దెలిసికొను
చుండుము. నేనును తగు ప్రయత్నము చేసెదనని పలికి యతండది మొదలు ప్రతి
దినము నట్టి ప్రయత్నము చేయుచుండెను.

అని యీ కథ నింత పట్టు జెప్పువరకు సర్ధరాత్రమగుటయు మణిసిద్ధుండా
గోపాలుని జూచి వత్సా యిప్పుడు నిద్రవేళయైనది. తరువాత కథయు పెద్దదిగా
నున్నది ఈ రాత్రి ముగియులాగున దోచుటలేదు. సంక్షేపముగా ముగింపనా? లేక
యా తరువాయి కథ ముందర మజిలీలో జెప్పనా? యని యడుగగా వాడు కథ
సవిస్తరముగా జెప్పవలయునుగాని ముగింపరాదు. పోనిండు మీకు నిద్రగానుండినం
బండుడు రేపు చెప్పవచ్చునని పలుకుచు నప్పుడు భుజించిలేచి యయ్యతి చంద్రుని
పాదంబులొత్తుచుండెను. అయ్యోగియు నారాత్రి సుఖముగా వెళ్ళించి వేగుజామునలేచి
గోపకుమారుని కావడి యెత్తుమని పలుకుచు మౌనమవలంబించి తనతోవాడు కావడి
మోచుకొని నడచుచుండ నీరెండ ప్రొద్దెక్కువరకే ముందటి మజిలీ చేరెను.

—:●:—

# కాశీమజిలీకథలు

## 18 వ మజిలీ

## భువనేశ్వరిదేవికథ

పదినెనిమిదవ మజిలీ మొదలు శౌనకుడు మణిసిద్ధుని దరువాయికథ జెప్పుమని వేడుచుండ నయ్యోగీంద్రుండు నద్దివసంబున ననుష్ఠానమంతయు సంక్షేపముగా గావించి వంటజేసి భుజించిన వెనుక నొకమనోహర తరుశీతలచ్ఛాయం గూర్చుండి తరువాయికథ నిట్లని చెప్పదొడంగెను. వత్సా ! వినుము. అదృష్టదీపుండా పుష్పగిరిలోనుండి నిత్యము రాజపుత్రిక చేయుచున్న కృత్యముల పరీక్షించుచు దూతికల నరయుచు దాదుల వెదకుచు నంతఃపుర చారిణులతో మైత్రిచేయుచు నీరీతి గొన్ని దినములు గడపినంత నొకనాడు కలహంసికయను దాసికి రాజపుత్రికతో మిక్కిలి మైత్రిగలదని విని దాని యింటి యొద్దకుంబోయి యల్లన నిట్లనియె.

కలహంసికా ! నీవు మిగుల బుద్ధిశాలివని నీయొద్ద గొన్ని విశేషములు దెలిసికొను తాత్పర్యముతో వచ్చితిని. మాది కాశీదేశము. అదృష్టదీపుడను రాజునకు మిత్రుడను. నాపేరు మిత్రగుప్తుడందురు. అతడు తీర్థయాత్రకు బోయిన నతనిజూచు తలంపునబోవుచున్నవాడ. ఈ యూరువచ్చి పదిదినములైనది. ఈ పట్టణంబున బుద్ధిమంతులలో నగ్రగణ్యు లెవ్వరని విమర్శింప నిన్ను మున్నుగా వక్కాణించిరి. దానం జేసి నీ యొద్దకు వచ్చితిని. బుద్ధికసాధ్యముకాని పని లేదుకదా. నేనును నా మిత్రుడు నొకనాడు విహారార్థమై చతురంగబలములతో నొక యరణ్యమునకు బోయితిమి. అచ్చట గొంతసేపు విహరించినంత మిట్టమధ్యాహ్నమగుటయు నది గ్రీష్మకాలమగుటచే నెండకునోడి నేనును నా మిత్రుడును ఆ ప్రాంతమందున్నయొక తాటిమాను నీడను నిలిచితిమి. మా సేనలన్నియు నచ్చటి కనతిదూరములో నున్న యొక మర్రిచెట్టుక్రింద నిలిచినవి. అట్టి సమయములో నా మిత్రుడు పక్కున నవ్వెను. అకారణముగా నట్లు నవ్వితివేమని నేనెంత ప్రీతితో నడిగినను చెప్పడు. యా కారణము నీ వూహించి చెప్పితివేని నీకు నూరువేల దీనారము లిత్తునని ప్రతిజ్ఞచేసెను. నేను నట్టి ప్రశ్నమున కుత్తరముచెప్పుటకు నారుమాసములు మితికోరితిని. అతండిచ్చెను. నేనది మొదలు వేటాటనుచేయుచు ప్రతిపట్టణమునకు బోవుచు నందు బుద్ధిమంతులని పేరు పొందినవారినెల్ల నడుగుచు దిరుగుచుంటిని ఇప్పటికి మూడుమాసములైనది ఎవ్వరును చెప్పలేకపోయిరి. ఇచ్చట నీవార్తవిని నీ యొద్దకు వచ్చితిని. నీ బుద్ధియంతయు విని

యోగముచేసి దీనిని జెప్పితివేని నాకుదొరకు లాభములో నీకు సగము పంచియిచ్చెద నని చెప్పగా విని యా కలహంసిక చిరునగవు నవ్వుచు నిట్లనియె.

ఆర్యా ! మీరు నన్నింత పెద్దజేసి గౌరవింపుచుండ నేనేమని యందును. జగద్విదిత కీర్తియగు సద్ధృష్టదీప మహారాజు మిత్రులైన మీకంటె నేను బుద్ధిశాలి నగుదునా ? మీరు నన్ను జేసిన గౌరవమునకు మిక్కిలి సిగ్గుగానున్నది. నన్నిచ్చటివారు పొగడుటకు నాయందే విశేషమును లేదు. నాకేవిద్య యందును బాండిత్యములేదు. మీ వంటివారు మన్నించుచుండుటయే నా గౌరవమునకు గారణమైనది. నేనంతదానను కాకపోయినను నా యాశ్రమస్థాపన మట్టిదని చెప్పవచ్చును. మా ప్రియంవద రూపమునను విద్యాబుద్ధులచేత నసమాన సాహసమైయున్నది. మీరడిగిన ప్రశ్నమునకు నా కేమియు నుత్తరము దోచలేదు రెండుమూడు దినములు గడచిన తరువాత మీరు మరల నొకసారి దయసేయుదురేని యావిశేషములు భర్తృదారిక వలన దెలిసికొని మీతో జెప్పెద. అప్పటికి యీ ప్రశ్నములకు సులభముగా నుత్తరము జెప్పనని పలుకగా సంతసించుచు సద్ధృష్టదీపుడప్పుడు దాని యనుమతి వడసి యింటికిబోయెను.

అద్ధృష్టదీపుడు మఱి రెండుదినములు గడచిన తరువాత తిరుగా నాకలహంసిక యింటికి బోయెను. అదియు నాతని నుచితమర్యాదల సత్కరించినంత గూర్చుండి దానితో యువతీ ! నీ వయస్య నా ప్రశ్నమునకు కుత్తరము జెప్పినదా యని యడుగుగుటయు నయ్యతివ యతనితో నిట్లనియె.

ఆర్యా ! నేను మఱచిపోయి మిమ్ముల నీదినమ్మున రమ్మంటిని ఆ ప్రియంవదతో నిన్నను మాటాడుటకు నవసరము దొరకినదికాదు. ఆ చిన్నది ప్రతి శుక్రవారమును భువనేశ్వరీదేవి నర్చించుచు సాయంకాలమున గేళీశైలమునకు బోవుచుండును. ఆ దివసమున నామెతో నితరగోష్టి జేయరాదు. నిన్న నట్టివారమగుటచే మీ మాటనడుగుట తటస్థించినది కాదు. మిమ్ము వృధా శ్రమపెట్టినందులకు లజ్జించుచున్న దాననని పలుకగా నతడు నవ్వుచు మరల నిట్లనియె. ఇంతీ ! యింతమాత్రమునకే నాకుశ్రమ గలుగునా ? దీని దెలిసికొనుటకై కాదా దేశమంతయు దిరుగుచుంటిని. రేపు మరల వత్తునులే యని పలుకుచు వెండియు నిట్లనియె.

మచ్చెకంటీ ! నీ నెచ్చెలికి వివాహమైనదా ? పిల్లలెందరు ? వాల్లభ్యము మంచిదగునా ? ప్రతిశుక్రవారమును భువనేశ్వరీదేవి పూజ యెచ్చటజేయును ? కేళీశైలమనునది యెచ్చటనున్నది ? నిన్నుబట్టి యారాచపట్టియు మాకు బంధువురాలే యైనది. ఆ పూవుబోడి వృత్తాంతము కొంత వినవలయునని యుత్సాహముగా నున్నది. గోప్యముగాకున్న నుడివెదవే యనుటయు నదియు బ్రసంగవశంబున నడుగుచున్నాడని యూహించి యా రహస్యమితరుల కెవ్వరికిని దెలియనిదైనను వానికి మెల్లన నిట్లనియె. ఆర్యా ! మా భర్తృదారికకు వివాహమింతవరకును గాలేదు. ఆ లేమ యేమి కారణముననో తానిచ్చిన ప్రశ్నముల కుత్తరము చెప్పువానిం కాని పెండ్లియాడనని

పట్టుపట్టుకొని యున్నది. పాపము కొన్నిదినముల క్రిందట నొక బ్రాహ్మణకుమారుడా ప్రశ్నముల కుత్తరము నేను జెప్పెదనని వ్రాసి లోనికిబోయి చివరకు జెప్పలేక పోయెను.

వాని నురిదీయుటకు రాజు సెలవియ్యగా వాని బంధువులెవ్వరో మరల నారుమాసములు మితికోరినారట. అందుమూలమున వానినింకను నురిదీయలేదు. వాని కుత్తరము జెప్పుట బ్రహ్మతరముగాదు తండ్రి యెన్నియో విధముల బోధించెను. కాని వినినదికాదు. ఆ చిన్నది ప్రతిశుక్రవారము మధ్యాహ్నము యింటియొద్ద భువనేశ్వరీదేవి నర్చించి సాయంకాలమున దప్పక శేషశైలమునకు బోవును. ఆ శైలము మీ పట్టణమున కుత్తరదిక్కున క్రోశదూరములో నున్నది. అంతవరకు మేమందరము కూడా పోవుదుము కాని యాగిరి శిఖర మెక్కునప్పుడు మాత్రము మమ్మెవ్వరిని రానీయక తానొక్కరితయేపోయి కొంతసేపందుండి మరల వచ్చును. ఆ శిఖరము మీద నేమియును లేదు. అచ్చట నేమిచేయునో మా కెవ్వరికిని దెలియదు.

ఒకనాడు సాహసించి యా యువతి యందేమి చేయుచున్నదో చూతమని ద్వారరక్షకుల గన్నొరగి యా శిఖరము మీదికి బోయితిని కాని నాకెక్కడను నక్కలికి గనంబడినది కాదు. ఏ శిలచాటుననో దాగియుండునని యూహించి చూచిన శిక్షించు నను వెరపుతో సత్వరము మరలి గిరిదిగితిని. అమ్మవిఠచేయు కృత్య మిదియే యని చెప్పిన ముదిత హృదయుండై యత డొక్కింతసేపూహించి మరల నత్తరుణితో నాతీ! ఆ తెరవ శుక్రవారమునాడు గాక మరి యెప్పుడేని యక్కొండదండకుబోవునా? యని యడుగుటయు నమ్మదవతి యతనితో నాడుగాక మరి యెప్పుడు నగ్గిరిదరి కరుగదని చెప్పినది అతం డయ్యతివ నుడివిన మాటలన్నియును విని సంతసించుచు బాలతీ నేనీనాటికి బోయివచ్చెద. జేపైనను శ్రద్ధ జేసి యడుగుమీ? యని పలుకుచు నక్కలికిచేత ననిపించుకొని మరల నింటికి వచ్చి నాటి సాయంకాలమున గలహంసిక చెప్పిన గురుతులు చూచుకొనుచు నా విహారశైలముకడకు బోయెను.

ఆ శైలము చుట్టుకొలత రెండు క్రోశములుండును. ఎత్తు పాదక్రోశము గలదిగా నున్నది. అదియు గవోన్నత మగుటచే నెక్కుటకు గష్టములేదు. మార్గములు పెక్కు గలవు. దానియందు చిన్న తుప్పలే కాని పెద్దవృక్షము లేమియును లేవు. పర్వతమును జూచి సంతోషించుచు నా యదృష్టదీపుడు రెండు మూడుసారులు అక్కొండ చుట్టును తిరిగివచ్చి యొక దెసనుండి యమ్మెట్టపై కెక్కెను. ఆ శిఖరము విశాలముగాను సమచతురస్రముగా నున్నది. అచ్చటనైనను చిన్న దుప్పలే కాని మరి యేమియును లేవు. అట్టిచోట నతండు మిగుల శ్రద్ధాపూర్వకముగా నలుమూలలు దిరుగుచుండెను. కాని యెంతసేపు తిరిగినను యేమియు గనంబడినది కాదు.

అంతలో నా యంబరమణి గుంకియు నగ్గిరిదిగి మరల నింటికివచ్చి యచ్చట బంధువులతో ముచ్చటించుకొనుచు నారాత్రి సుఖముగా వెళ్ళించెను. మరునాడుదయ

దయమున లేచి మరల నద్దరణీధరము కడకు బోయి మధ్యాహ్నమువరకు నచ్చటి విశేషములు చూచుచు నింటికి వచ్చి భుజించిన తరువాత వెండియు నక్కొండదండకు బోయి యచ్చటనే క్రుమ్మరుచుండెను. కాని యే విశేషము కనంబడినది కాదు. అప్పు డతండు కలహంసిక చెప్పిన పర్వతమిది కాదేమోయని యనుమానింపుచు నచ్చటి గురుతులన్నియుం జూచుకొని రాత్రికింటికి వచ్చి భుజించిన వెనుక కలహంసిక యింటికిబోయెను.

అదియు నతనింజూచి సంతసించుచు సత్కరించి ఆర్యా! మీ రాకకు నేను వేచియున్న దానను. మీరడిగిన ప్రశ్నము మా రాజపుత్రికతో జెప్పితిని. అదియు నవ్వుచు నీపాటిమాట కింతదూరము రావలయునా? యని పరిహాసము చేసినది. నేనును సంతసించుచు నించుబోణీ! వడిగా జెప్పుము. నేను బోయి యాతని కెఱింగింతునని తొందరపెట్టగా నక్కలికి అట్లయిన నతండీ ప్రశ్నల కుత్తరము జెప్పినందులకు నీ కేమిచ్చునో తెలిసికొని రమ్ము. తరువాత జెప్పెదనని పలికినది. నేనును సమ్మతించితిని. మరియు నత్తరుణి మీరు అపుష్పదీపునకు మిత్రులని చెప్పినంత నెద్దియో ధ్యానించి తలపంకించుచు నాతో మరేమియు జెప్పినది కాదు. తరువాత నేను వచ్చితిని. దీనికి మీరేమిచ్చెదరో చెప్పుడని పలుకుటయు. నతడు సుందరీ! నీకు సందేహమేల నాకు దొరకిన దానిలో సగమిత్తునని మొదటనే చెప్పితిని గాదా? నా కతండా సొమ్మిచ్చిన వెంటనే నీకు దెచ్చి యిచ్చెదను. వడిగాబోయి తెలిసికొని రమ్మని పలుకుచు మరియు నిట్లనియె. తరుణీ! నిన్నను నేను విహారార్థమై యీ పట్టణమున కుత్తరము దెసకు బోయితిని అచ్చట రెండు మర్రి వృక్షములు పొడవుగా నెదిగి యున్నవి. వానినడుమగా నొకచిన్న మెట్టయున్నది. అదియే యగునా నీవు చెప్పిన ప్రియంవద యొక్క కేళీశైలమని పలికిన నక్కలికియు నౌ నదియే మీరచ్చటికేటికి బోయితిరి? నేనట్లు జెప్పిన సంగతి యెవ్వరితోనైనను జెప్పెదరుసుడీ! అన నయ్యో! అట్లు చెప్పుటకు నేనంత మూర్ఖుడ ననుకొంటివాయేమి. ప్రసంగవశమున నడిగితిని గాని నాకు మాత్ర మీ గొడవ కావలయునా? యని నుడువుచు మరల రేపు వచ్చెదనని జెప్పి యింటికి బోయెను. మరునా డుదయమున లేచి మరల నగ్గిరిదరికరిగి యందు నానావిధములగు రుప్పలు సందులు గొందులు మొదలగునవి మిక్కిలి శ్రద్ధతో చూచెను. కాని యెచ్చటను నేఱుదయు గనబడినది కాదు. మరల మధ్యాహ్నమింటికి వచ్చి భోజనము జేసి వెండియు నా కొండదాపునకు బోయి రాత్రివరకు వెదకెను.

అప్పు డతండు మిక్కిలి పరితపించుచు అయ్యయ్యో! నేను రాజవాహనునితో బలికిన మితి సమీపించుచున్నది. ఇప్పటికేమియుం దెలియలేదు. వృధగా బ్రాహ్మణ కుమారుని నురిదీయుదురు. నా చావునకింతయేని విచారము లేదు. వాని రక్షించెదనని వచ్చి చివరకు నాకు శక్యమైనది కాదని చెప్పుటకంటె హైన్యమున్నదా? నేనెప్పుడో వారివలన జంపబడనేల! అంతకు బూర్వమే మృతినొందిన యుక్తము గా

నుండును ఇది మొదలింక నేను భుజింపను. ఈ రాత్రిగూడ యిచ్చటనే యుండెదను. ఇక నాకు బట్టణములోనికి బోవలసిన యగత్యమేమున్నది? రాత్రివేళ నిందేమైన విశేషములు కనంబడునేమో చూచెదగాక యని యనేక ప్రకారముల దలపోయుచు నారాత్రి యింటికిబోక యచ్చటనే యుండి యప్పర్వతశిఖరమంతయు మరల బరికించెను. కాని క్రొత్త విశేషము లేమియు గనంబడలేదు.

తరువాత విరక్తి బూని యుదయంబున లేచి మరియొక దేశము పోవలయునని నిశ్చయించుకొని యొక సమభూమిం బరుండి వానిం గురించియే ధ్యానించుచు గాంతిమతిం దలంచుకొనుచు దన పూర్వ ప్రఖ్యాతి యంతయు స్మరించుకొనుచు దన యప్పటి స్థితిగురించి చింతించుచు ముందు కర్తవ్యమెద్దియని తర్కించుచు నా హృదయంబునం బెక్కు కల్పనలు జనియింప నతం డాలోచింపుచుండ నంతలో నిద్ర పట్టినది. ఆ నిద్రలో నెద్దియో యద్భుతమైన స్వప్నము వచ్చినందున దటాలున మేల్కాని వెల్లకిలం బరుండుకొని కన్నులు దెరచి చూడగా నెదురదివ్యభవనమొకటి కనబడినది. అదియు నవరత్నదీపములచేత వెలుంగుచు గన్నులకు మిరుమిట్లు గొల్పుటయు నతండు కన్నులు మూసికొని యొక్కింతసేపుండి మరల విప్పి చూచెను. మరల నా రీతినే కనంబడినది. దానికి వెఱగందుచు నోహో నాకు స్వప్నములో స్వప్నమువచ్చుచున్నదే! నే నింకను నిద్రబోవుచున్నానాయేమి యెదుట గనంబడుచున్న సౌధమెవ్వరిది? నే నిప్పుడెచ్చట నున్నాడను. పట్టణములో నుండినా? కాదు శేషశైలమున రాత్రి బరుండితిని. అట్లయిన నీమేడయెక్కడిది? నిజముగా నేను శేషశైలమున బరుండలేదు. ఇలాగున స్వప్నము వచ్చినది కాబోలు అయ్యో! భ్రమజెందుచున్నానేమి? నేను రాత్రి యింటికిబోక పర్వతశిఖరమున బరుండినమాట నిక్కువమే? నాకాకలి యగుచున్నది. ఇప్పుడు కనబడు మేడ కలలోనిదే. అన్నా! దీనిమాత్రము కలయని యెట్లు నమ్ముదును. నాకు మెలకువయున్నట్లు నా కన్నులే చెప్పుచున్నవే! ఈ కన్నులు దెరచితిననుకొనుటయు స్వప్న భ్రాంతియే కాదు గదా! ఇదిగో! యిప్పుడు లేచుచున్నానని పెక్కుతెఱంగుల నంతరంగమున దలపోయుచు దటాలునలేచి కూర్చుండెను. అప్పుడంతకుమున్ను గనంబడుచున్న మేడ గనంబడక సుధాప్రకారము శిఖరిదారుణియే కనబడినది. తరువాత నతం డది కలయని నిశ్చయించి యాసౌధశోభావిశేషమున కచ్చెరువందుచు నయ్యారే! నాకెంత స్వప్నము వచ్చినది. నిజముగా నట్టి మేడలుండునేమో, యింక కొంచముసేపు లేవక యట్లేయుండిన నిద్రమెలకువ రాకపోవునుగదా యేల తొందరపడితిని అని పెక్కుతెఱగుల దలంచుచు కొంతసేపచ్చటనే యిచ్చుండి ధ్యానించుచు మరల శయనించెను. అట్లు పండుకొన మరల జూచు వగను మునుపటి గనంబడిన సౌధము వెండియు బొడగట్టినది. అతడప్పుడు మిగుల

నాశ్చర్యమందుచు నౌరా! ఇది మిగుల వింతగా నున్నది. నిద్రలో స్వప్నము వచ్చుట సహజము. జాగ్రదవస్థలో స్వప్నము వచ్చుట యెచ్చటను వినియుండలేదు. ఇది చిత్త విభ్రమమేమో తెలియదు. కానిమ్ము యెద్దియైన నీవింత జూచెదంగాక యని మరల లేచినంత నది కనంబడినదికాదు.

అత్తరినతండది మరల స్వప్నమని భ్రమపడి విరక్తితో తిరుగా బరుండెను. పరుండి కన్నులు తెరచిచూడ మునుపటి మేడ గనంబడినది దానంజేసి యతనిహృదయమున సంతోష సాధ్వససంభ్రమములు జనించినవి. ఒక్కింత నిదానించి చూచుచు నతండిచ్చట నెద్దియో గారడియున్నది ఈచిత్రము పరుండిచూచిన గనంబడుచున్నది. లేచిచూడ గనబడదు. మొదట స్వప్నమని భ్రమపడితిని. కాని యిప్పుడది కానట్లు స్పష్టమైనది ఇది యెద్దియేని పిశాచమహాత్మ్యమా? యని యూహింతమన్నను నిట్టి చిత్రములు కలుగునని యెప్పుడును వినియుండలేదు. దీనికెద్దియేని కారణ ముండవచ్చును. పరుండియే యూహించెదనని నిశ్చయించి యప్పటి చూచుచుండెను.

అంతం దల్లింత సేపు పరుండిచూచినను అచ్చిత్రసౌధము దృష్టి గోచరమగు చునేయున్నది. ఇక యది యంతర్ధానము కాదు. స్థిరపడినది! దీనిలోనికిబోయి చూచి వచ్చెదనని తలంచుచు లేచినంత నన్నిశాంత మంతర్ధానమైనది అతడు మిక్కిలి వెఱగందుచు నోహో! ఇప్పుడు నాకు దెలిసినది. ఇది నిజముగా స్వప్నమే పరుండిన తోడనే కొంచెము నిద్రపట్టును. దానిలో నిట్టి కలవచ్చుచున్నది. కానిచో బరుండినప్పుడు గనబడుచున్న వింత లేచినప్పుడేల కాన్పించదు ఇదియే నిక్కువమని తలంచి తిరుగ బరుండెను. అత్తరి గ్రమ్మరనమ్మందిరము ముందు సుందరముగా బొడచూపిన నతడు మెండుగా వితర్కించుచు మేనెల్ల గిల్లుకొని యదికలగాని యట్లు నిశ్చయించుకొని దాని గురించి పలుదెరంగుల నాలోచించుచు నేకారణమును నిశ్చయింపలేక చివరకు దనకు బిచ్చియెత్తినట్లు నిర్ధారణ చేసికొనియెను.

అంతలో మరల నాలోచించుకొని అయ్యో! నాచిత్తము స్వస్థతగానే యున్నదే నా చర్యలన్నియు దలంచుకొనియున్న నిదానముగా స్ఫురించుచున్నవి. నామనస్ఫూర్తి పూర్వమువలెనే యున్నది. ఇది యెద్దియు కాదు. దైవకల్పితము. భువనేశ్వరీదేవియాలయమునకై నేను శ్రమపడుచుండ భక్తవత్సలుడగు పరమేశ్వరు డాయాలయమును దెచ్చి యిచ్చట బెట్టెను. ఇది నిక్కువము కావచ్చును. అట్లయినను స్థిరముగా నుండవలయునుగాని దృశ్యాదృశ్యముగా గనంబడుచుండనేల? మేలుమేలు. ఇట్టియద్భుతము గనంబడునని యెన్నడును దలంచనైతిని. ఈ చిత్ర మెవ్వరికేని నేనుజెప్పిన నమ్ముదురా? భళీ! భళీ! అయ్యారే! యని యాశ్చర్యపారావార నిమగ్న చిత్తుండై విస్తృత నిమేషములగు చక్షుస్సులచే నా ప్రాసాదమును జూడదొడంగెను.

అతడు విరక్తిచే పట్టినేలనే పరుండి యున్నవాడు కావున నట్టిసమయములో నతనితలలో జీమపట్టుటయు నదినపడి యుంచుక లేచి తల్లద్రిప్పి చూచినంత నచ్చట

నేమియుం గనంబడినదికాదు. తరువాత ననుమానముదీరక తలనానినచోటు చేతితో దడుముగా నచ్చటొక పచ్చనిచెట్టు కనంబడినది. దానిపూవులు రత్నములవలె మెరయుచున్నవి. ఆకులును మరకత మాణిక్యముల పోలికరంగు లీనుచున్నవి. అదియు జిన్నమొక్కగనుక యతని క్రిందబడి నలిగిపోయినది. అది మొదట జూచినప్పుడు గనంబడక తడవినతోడనే చేతికి దగిలి కన్పట్టుట కతండు వితర్కించుచు నదితన తలక్రిందబడి నలుగుట సైతము పరిశీలించుచు చేయి విడిచినంత నదిమరల నదృశ్యమైనది. అతండచ్చట తిరుగ జేయిపెట్టి తడుముటయు క్రమ్మక్క గ్రక్కున గరమునకు దగిలి గోచరమైనది. అప్పుడతండది యొకయోషధీవిశేషమని నిశ్చయించి యిందాకటి చర్యలన్నియు దీనిమహిమయని యాలోచించుచు నియ్యోషధి నంటుచుం గూర్చుండి చూచునంత నన్నికాంత మంతర్ధానముగాక యట్లేయున్నది. అత్తరి నతని చిత్తమున బొడమిన సంతోషమేమని చెప్పందును. అపరిమితానందము జెందుచు నోహో! తెలిసినది. ఇదియొక యోషధి. దీనినంటినప్పుడు తత్ప్రసాదము గనంబడును లేనిచో నదృశ్యమగుచున్నది. నేను బరుండినప్పుడీలత నా తలకు దగులుచున్నది. కావున నామీద గనంబడుసది. లేచినప్పుడు దదృశ్యమైనది. ఈ సంగతి దెలిసికొనలేక పెక్కుపోకలం బోయితిని. నేనుకాదు. మరియెట్టి బుద్ధిమంతుడైనను నిటు జరిగినప్పుడు విభ్రాంతి నొందకమానడు. దీమకట్టుటచేత నీ సంగతి తెలిసినది. కాని లేనిచో పెద్దతడవిట్లే భ్రమించుచుండును. అదియుంగాక తల క్రింద నోషధీలతయున్నదని యెట్లూహింతును. నాకీభ్రాంతి బోగొట్టినది పిపీలికము. దానిఋణము నేను దీర్చుకొనజాలనని యూహించుచు నాలతావిశేషమును విడువక తన మొలలోనున్న కత్తిందీసి దాని మొదలంటంగోసి చేతితోం బట్టుకొని మెల్లంగా లేచెను.

అప్పుడతని కుడికన్నును భుజమును దొడయు నదరం దొడంగినవి. ఆ శుభసూచకములం గనిపెట్టి యతండు సంతసించుచు దనకుం గనంబడుచున్న మేడయొద్దకుం బోయెను. రత్న కాంతులచేం జీంకటి యించుకయు లేనందున నందలివిశేషములన్నియుం దేటయగుచున్నవి. దానితలుపులు దెరచియే యున్నవి. ఆ ద్వారమున కిరుప్రక్కలను రత్నములతోం జెక్కిన ద్వారపాలకా విగ్రహములున్నవి. ఆ ప్రతిమలం జూచిన నెట్టివానికి మోహము జనింపకమానదు. మొదట నతండా విగ్రహములనుజూచి నిజముగా స్త్రీలనుకొని యెద్దియో యడుగం బోయెను. నిదానించి చూడంజూడ బొమ్మలని తెలిసినది. తరువాత నతండా గుమ్మమున లోనికిం బోయెను. మణిస్తంభములచే ప్రకాశించుచున్న యమ్మందిరాభ్యంతరమునం బ్రవేశించినంత నతనికి దిగ్భ్రమయైనది. అందుం బెక్కుగదులు రత్నకవాటములచే మూయంబడి యున్నవి. వానినింతలన్నియుం జూచుచు సాహసముతో నొక గది తలుపు తెరచి చూచెను.

విశాలమగు నాగదిలో నుసిరికాయలకన్న పెద్దవగు వజ్రముల రాసులు వేనవేలు గన్నులకు మిరుమిట్లుగొలుపు కాంతులతో నొప్పుచున్నవి. ఆ వజ్రనికరముల

మిగమిగలకు వెఱచుచుఁ గన్నులు మూసికొనుచు నాతలుపులు తటాలున మూసెను. మఱియు రెండవగది తలుపు తెరచినంత నందు వైడూర్యరత్నములరాసు లసంఖ్యాకము లుగా నున్నవి. అతఁడు దోసెడు రత్నములు దీసి కొంగున మూటఁగట్టెను. ఈరీతి నందున్న గదులన్నియుం బరీక్షింపఁ బ్రతియఱయందును వేరువేర నవరత్నముల జాతులు బంగారు నాణెములు ; వనిధుల బంచ లోహములు గలిగియున్నవి. వానిం జూచినంత నతఁడు స్వాంతమున జింతింపనరాని సంతోషము జెందుచు నోహో ! ఈ సొమ్మంతయు నాయధీనమైనదో లోకమునఁ గల యాచకులను పేదలేకుండఁగఁ జేయక పోదునా ? యని తలంచుచు మఱియుం గొంతసేపందున్న విశేషము లన్నియుం జూచుచుండెను.

ఆ లోపలఁ దిరుగుచుండ నొకమూల సోపానములు గనంబడినవి. వాని ననుసరించి పైకినడువనడువ మఱియొకయంతస్థు కనంబడినది. అందు మొదట నద్భుత మయిన తేజఃపుంజముగాక మఱి యేమియుం గనంబడలేదు. దానికి వెఱచి యతండు కొంతసేపు కన్నులు మూసికొని నిదానించి చూడంజూడ నాకాంతి యంతయు సూర్య కిరణములచే మంచు విరియునట్లు క్రమంబున నణగిపోయినది. పిమ్మట నలుమూలలు దృష్టిప్రచారము బరగించినంత నాగోడలన్నియు రత్నమయములై యున్నవి. మఱియు నచ్చట రత్నకంబళి యాస్తరణగాఁ బరువఁబడియున్నది. ఆ యంతరములోనున్న విశే షములన్నియుం జూచుచుఁ బోవఁబోవ దూరపుముఖముగా నొప్పుచున్న యొక బంగారు విగ్రహము బొడఁగట్టినది. పరిశీలించి చూడఁగ నదియొకశక్తివలెఁ దోచినది. ఆ విగ్రహమునకు రెండుచేతులు, మూడుతలలు గలిగియున్నవి. దానిం జూచువారికి వెఱపుగలుగక మానదు.

అతండు మనంబునం బుట్టిన సాధ్వసము నడంచుకొనుచు నా విగ్రహమును తర్కించి చూడఁగా వెనుకను మరల మెట్లు గనంబడినవి ఆ సోపానమార్గమున మరలఁ బైకెక్కఁగా వేరొక యంతరము దర్శనీయమయిన యలంకారములతోఁ జూడనయ్యె. అందొక మహాశక్తి యైదు ముఖములును, పదిచేతులునుఁ గలిగి జగములన్నియుఁ బాలించు సామర్థ్యమును సూచించు తేజంబున నొప్పుచు దయాదృష్టి ప్రసాదములు వెదజల్లుచున్నట్లు గనఁబడినది మఱియు నమ్మహాదేవి ముఖములయందును పంచవర్ణ ములు గలిగియున్నవి ఆమె పీఠమున భువనేశ్వరీదేవియని వ్రాయఁబడి యున్నది. అమ్మహాదేవి భువనేశ్వరీదేవియని తెలిసినప్పుడతని మనంబునం బొడమిన యానంద మేమని యందును. అప్పుడతని మనంబునం బెక్కుతలంపులు పుట్టినవి. మఱియు విమర్శింప నద్దేవి వెనుకటి గోడయందిట్లు వ్రాయఁబడియున్నది.

గీ. జలనదృశౌషధీలత యొకసిచేత
జిక్కునాడె యిందు రక్షింపఁబడుచు

తనయనిధులకు నధికారి త్రిత్రియంవ
దా ప్రియుండు సతండెవో తథ్యముగను.

అనియున్న పద్యమును ముమ్మారు చదువుకొని మనంబున నించుక విన్న దనంబుదోప అయ్యో ! ఈ లిపియందు నా కప్పియ బోటదియున్నదే. నేనిప్పుడు పడు చున్న యిడుములన్నియు హరిదత్తుని కొరకేకాని నా నిమిత్తముకాదు. ఇందులో ప్రియం వదా ప్రియుండు లభదొరకిన వాడేయని యున్నది పాపమా హరిదత్తు దాసబడిన పద తిని నేనెట్లు స్వీకరింతును ! అయినంగాసిమ్ము. ఎంతవరకు వచ్చినప్పు దాలోచించు కొనవచ్చును ముందుగా సిమ్మహాదేవికి నమస్కరించి తదువాత కృత్యముల నాలో చించుకొనియెదంగాక యని నిశ్చయించుకొని కన్నులమూయుచు బరాకున తన చేతిలో నున్న యోషధి లతను క్రిందనుంచి సాష్టాంగముగా నమస్కరింపుచు మనంబున నిట్లు ధ్యానించెను.

శ్లో. మదాపదపహారిణీం మణిఘృణీలసన్మేఖలాం
మనోజ్ఞముఖపంచక ప్రకటితాధిక ప్రాభవాం
కృపాకలితవీక్షణా ముఖిలలోక సంరక్షణీం
త్రిలోచనకుటుంబినీం భువననాయకీం భావయె

అని కొంతసేపు భక్తిపూర్వకముగా ధ్యానించిలేచి కనులు దెరచి చూచు వరకు నక్కొండ శిఖరముగాక మరేమియుం గనంబడలేదు. అప్పుడతండదరిపడుచు నాకసమువంకజూచి నక్షత్రములు గనంబడినవి. భూమివంకజూడ ఐచ్చికయు రుప్పలు శిలలు గనంబడినవి. అట్టి సమయంబున నతనిచిత్తమున నెట్లుండునో తలంపుము మహార్తకాలమతం డున్మత్తునిక్రియ నేమియుం దోపక విభ్రాంతచిత్తుండై అహా ! యేమి యీ మాయ యిప్పుడు నాకు గనంబడినదంతయు గల యగునా ! మాయ యగునా ! నా చేతిలో నున్న యోషధీలత యేమైనది ? క్రింద బెట్టితినే ? అట్లు పెట్టి నట్లు కలలోనే వచ్చెనేమో ? నాకేమియుం దెలియకున్నది. అయ్యో! కలకాదు, నిక్క నము. నేనా యోషధిని పరాకున నేలబెట్టి అమ్మవారికి మ్రొక్కితిని కాదా; దానంతేసి యామేడ యదృశ్యమైనది. కానిమ్ము అదియు నిచ్చటనే యుండునని నిశ్చయించి యా ప్రాంతభాగమంతయు వెదకెం గాని యెచ్చటను నతనిచేతి కా యోషధి తగిలినది కాదు.

అప్పుడది యతండు కలగా నెంచి తాను సంతతము భువనేశ్వరీ దేవా లయమును గురించి ధ్యానించుచుంట నదియట్లు కలలో గనబడినది ఆ సంగతులే ప్రియంవద కుత్తరము చెప్పెదను. సమ్మతించిన సమ్మతించుగాక లేకపోయిన మది యుంచు సంతగన్న నేమి చేయును. కానున్నది కాకమానదుకదాయని నిశ్చయించి యా రాత్రి తాను జూచిన సంగతులన్నియు స్మరించుకొని వెఱగందుచు నెద్దియా లలంచు

కొని యొడిజూచుకొనునంతలో నందుబూర్వము తాను సంగ్రహించి మూటగట్టిన
బోసెడు రత్నములమూట గనంబడినది. ఉత్కృష్టకాంతులచే నొప్పుచున్న యా దివ్య
మణులంగాంచి తల పంకించుచు నోహో ! ఇది దేవమాయకాని మణేమియుంగాదు.
వీనిం బట్టి కలగానియట్లు స్పష్టపడుచున్నది.

కలలోగన్న వస్తువు లెప్పుడేని మేల్కాంచిన గాన్పించునా! యోషధీమహిమ
యొండె దేవతా మాయ యొండె గావలయును ఎట్లయినను మేలే యగుంగాక యని
యాలోచింపుచు నెట్టకే నా రాత్రి గడపెను. ఉదయంబున మదంబుబొదల లేచి యా
గిరి దిగి మణిప్రభలచే దనమేనంతయు వింతకాంతిచే మెరయుచుండ నా రత్నము
లన్నియుం బదిలముగా మూటగట్టికొని పట్టణములోనికివచ్చి ముందుగా గలహంసిక
యింటికరిగెను. అమ్మచ్చకంటియు నా చిన్నవానింజూచి సంతసించుచు సత్కరించి,
యార్యా ! నేను మీరాక వేచియున్నదాన. మీరిచ్చిన ప్రశ్నమునకు మా రాజపుత్రిక
యుత్తరము చెప్పినది. తాటిచెట్టు నీడంగూర్చుండి మీరాజుగారు నవ్విన కారణమువినుడు.
మర్రిచెట్టు విత్తనము మిక్కిలి చిన్నది. తాళవృక్షము విత్తనము మిక్కిలి పెద్దది. బీజ
మల్పమైనను నీవటవృక్షము మిగులవ్యాపించి నా సేననంతయు నెండదగులకుండ నీడ
యిచ్చి కాచుచున్నది. ఈ తాళవృక్షము బీజాధిక్యముకలదియైనను నిరువుర నిల్చుటకు
దగిన నీడ నియ్యలేకపోయెనే ! సృష్టివైచిత్ర్యమెంత వింతగా నున్నదని మీ రాజుగారు
నవ్విరి. ఇదియే కారణము అని ప్రియంవద జెప్పినది. ఈ సంగతి వారికిజెప్పి మీ
కిచ్చిన కానుకలో నాకుగూడ బంచియిండు. వేగమ పొందని పలుకగా సంతసించుచు
నతండా రాజపుత్రిక బుద్ధికౌశల్యమునకు మెచ్చుకొనుచు నొక్కింతసేపు ధ్యానించి
మరల దాని కిట్లనియె.

కలహంసికా ! నా మిత్రుడిప్పుడెచ్చటనో యున్నవాడు. అతని యొద్దకు
బోయి వచ్చునరికి మిగుల నాలస్యమగును. ఈ ప్రశ్నలవిషయమై నీవు మిగుల శ్రమ
పడితివి. మీ ప్రియంవదయైనను నీ నిమిత్తమేకదా యుత్తరమిచ్చినది. ఇప్పుడు నిన్ను
రిత్త పొమ్మనుట ధర్మముకాదు. నా యొద్ద ప్రస్తుత మీ రత్నములు మాత్రమున్నవి.
వీని నీకు బారితోషికముగా నిచ్చుచున్నవాడ. గైకొనుమని పలుకుచు దనయొడిలోనున్న
రత్నములుదీసి యక్కలహంసిక దోసిటిలో బోసెను. కన్నులకు మిరుమిట్లు గొలుపు
కాంతులతో నొప్పుచున్న యా రత్నములంజూచి యా చిగురుబోడి వెరగందుచు
నతడు మహాప్రభావసంపన్నుడుకాని సామాన్యుడు కాదని నిశ్చయించి యతనికి
నమస్కరింపుచు ననుమతి వడసి యప్పుడే యా మణులం దీసికొని ప్రియంవద
కడకు బోయినది.

తరువాత నన్నృపదీపుడు తాను రాత్రిజూచిన విశేషములు బలభద్రునితో
జెప్పుటకు మిక్కిలి తొందరపడుచు వడిగా నింటికి బోవుచుండెను. ఇంతలో రాజ
కింకరులు కొంద ఱెదురుపడి యాతని విమర్శించిచూచి దొరకితివి. హరిదత్తా ! ఎచ్చ

టికి పోయెదవని నిర్బంధింపుచు, గారాగార ప్రాయమైన యొక సౌధమునకు దీసికొని పోయిరి. అదృష్టదీపుకు వాంఛతో నేనేమి యపకారము జేసితిని. నేనుబెట్టిన మితియు మీరలేదే. అప్పటికి నేను రాకపోయినచో నన్ను నిర్బంధింపవలయునుగాని యిప్పుడే యిట్లు ఆటంకబెట్టితిరేల ? ఇదియునుంగాక నేను మిత్రగుప్తుడను. హరిదత్తుయని పిలుచుచున్నారేమి ! హరిదత్తుడెచ్చటికేని బారిపోయెనా ! యని యడుగగా నాతనికి నాకింకరు లిట్లనిరి.

నీ మాయమాటలను మేము నమ్మము. నీవు తప్పక హరిదత్తుడవే ఇదిగో నీ యాకృతిగల చిత్రఫలకమును జూచికొనుము. నీకును దీనికిని యించుకయు భేదము లేదు. నీవు మమ్ముల మాయజేసి పారిపోయితివి. నీకతంబున మాకు మాటవచ్చినది. ఈసారి నీకు మరణము తప్పదు. నీ విషయమయి రాజుగారికి మిక్కిలి కోపముగా నున్నది. నిన్ను మున్నుజెప్పిన మితివరకు నిలుపునని తోచదు. పారిపోయిననేరము పెద్దదిగదా ? ఇక నీయిష్టదైవమును ధ్యానించుకొనుమని పలుకగా విని యతండు వెఱగందుచు నోహో ! ఇది మిగుల చిత్రముగానున్నది. నన్ను హరిదత్తుడని మీరు భ్రమ జెందుచున్నారేమి ? అతండు నా పోలికనున్నవాడు కాబోలు. ఔను మొదట బలభద్రుడుగూడ నట్లే చెప్పెను. పోనీ వానికొరకు నేను మునుపే ప్రాణములు విడువదలంచుకొని యున్నానుగదా ఇప్పుడతండు తప్పించుకొని పారిపోయెను కాబోలు. మంచినేర్పరియే ? ఎట్లయినను బ్రాహ్మణకుమారుడు బ్రతికినం జాలుగదా యని యూహించుచు గాలముహిమ కచ్చెరు వందుచుండెను.

అచ్చట గలహంసిక యదృష్టదీపుడిచ్చిన రత్నములను దీసికొని ప్రియంవదయొద్దకుబోయి యమ్మణులం జూపుచు నతని చరిత్రయంతయు జెప్పినది. అప్పు డప్పడతి యనూనములగు రత్నంబులంజూచి యాశ్చర్యమందుచు దానితో నిట్లనియె. కలహంసికా ! నీవు చెప్పినప్పుడు మొదట నేను నమ్మలేదు. ఈ మాత్రపు దాసికే యింత ధనమిచ్చునా ? యని నిరసించితిని. నీవు మిక్కిలి నిర్బంధముజేయగా నొప్పితిగాని యంత శ్రద్ధజేయలేదు. అదృష్టదీపుని ప్రసిద్ధి మనము వినుచున్నారము కదా. అతని మిత్రుని దాతృత్వము సైతము కొనియాడదగియే యున్నది ఈ రత్నములు వెలగట్టించిన గోటికి దక్కువ యుండవు. మాతండ్రి రాజ్యమంతయు నింత లేదని తోచుచున్నది. సాక్షిపలమున్నదిగాని యట్టివాని గైకొనిన జక్కగా నుండును. అతండు మిక్కిలి చక్కనివాడనియుం జెప్పుచుంటివికదా ? నా ప్రశ్నముల కుత్తరము జెప్పువాడీలోకమున లేడు. నా యౌవనమంతయు వృథగా బోవుచున్నదని వెడ నిట్టూర్పులు నిగుడ నిక్కుచున్న యాచిలుకలకొలికింజూచి కలహంసిక యిట్లనియె.

అమ్మా ! పెక్కు దినములనుండి నిన్నొకవిశేష మడుగవలయునని తలంపు గలిగియున్నది గాని నీకేమి కోపము వచ్చునో యని సందేహించుచు నూరకొంటిని.

ఇప్పుడు నీవే యీ ప్రసంగము దెచ్చితివి కావున దెగువఁబూని యడుగుచున్నదాన దప్పైన సైరింపుమీ ? నీకిట్టి వ్రతమేటికి బూనితివి ? ఇది స్వకల్పితమా ? పితృనిర్దిష్టమా ? ప్రాణతుల్యనగు నాకు జెప్పినం దప్పులేదుగదా ? యని గ్రుచ్చి గ్రుచ్చి యడిగిన నమ్మింతఁబోడి యించుక ధ్యానించి యల్లన నిట్లనియె ప్రియసఖీ ! స్త్రీలయొద్ద రహస్యము నిలువదని యూహించి నీతో నింతకుముందు జెప్పలేదుకాని లేకున్న నీయొద్ద రహస్యము లున్నవియా ? మా కులదేవత భువనేశ్వరీదేవియట. నేను భువనేశ్వరీదేవి వరంబున బుట్టితిని. బాల్యమునుండియు మాతండ్రి నన్ను గారాబముగాజూచి పెంచుచుండెను. అతనికి నేనొక్కతెనే పుత్రికనగుట సంతతము నన్నే జూచుకొని యానందించుచుండెను.

ఇట్లుండ నొకనాడు త్రికాలవేదియగు నొక యోగి మాయింటి కతిథిగా వచ్చెను. మా తండ్రి యయ్యోగీంద్రుని నుచితసత్కారములచే నర్చించి యతని స్వాంతమునకు మెప్పువచ్చునట్లుపచారములు పెక్కుగావించెను అమ్మహానుభావుడు మజ్జనకుని భయభక్తి వినయ విశ్వాసములకు సంతసించుచు గొన్నిదినము లందుండెను. అప్పుడు మా తండ్రి యాయనకు శుశ్రూషకుగాను నన్ను నియోగించెను. నేనును నతని చిత్తానువృత్తి మెలంగుటంజేసి యయ్యతికి నాయందు మిక్కిలి వాత్సల్యము గలిగినది. మరియు నతండు వెళ్ళబోవు సమయమున మా తండ్రి నన్నుజూపుచు, మహాత్మా ! మీ శిష్యురాలికి దగిన వరుండు లభించునా? యని యడిగెను.

అతండు నవ్వుచు నన్నుజూచి బాలా ! నీకు పెండ్లి యాడవలయునని యభిలాషయున్నదా ? యని యడుగగా నేను నెఱిగియు నెఱుగని ప్రాయంబున నుండుట బట్టి యించుక సిగ్గుతో దలవంచుకొనుచు మీయనుగ్రహంబు బడిన పెండ్లి యాడెదనని చెప్పితిని. నా ముద్దు పలుకుల కతం డలరుచు నెద్దియో ధ్యానించి మన మిచ్చుచున్న ప్రశ్నము వ్రాసియిచ్చి పట్టీ ! దీనికి సదుత్తరమిచ్చువానిం గాని పెండ్లి యాడకుము. ప్రతిశుక్రవారము భువనేశ్వరీదేవి నర్చించుచు సాయంకాలమున నీ యూరి కుత్తరము దెసనున్న శైలశిఖరమున కరుగుచు నచ్చట కొంతసేపు క్రీడించి వచ్చుచుండుము. సార్వభౌముడుగాని యీ ప్రశ్నమున కుత్తరము జెప్పలేడు దానంజేసి నీ కనుకూలుడగు వరుండు లభించునని పలుకగా విని మా తండ్రి అయ్యా ! ఎప్పటికేని నట్టివాడు దొరకునా యని యడుగగా నతడు నవ్వుచు వానికేమి యుత్తరము జెప్పక నా చెవిలో నెద్దియో చెప్పి నన్ను దీవించుచు నెక్కడికేని బోయెను అప్పుడు మా తండ్రి నన్ను నీ చెవిలో జెప్పిన సంగతులేమియని యడుగగా వాటిని జెప్పుటకు గురువు నాజ్ఞ లేదని చెప్పితిని. దానింబట్టి యతడూహించుకొని సంతసించుచు నట్టి ప్రకటన దేశమంతయు వ్యాపింపజేసెను. ఇదియే దీని వృత్తాంతము. అమ్మహానుభావుని వచనం బమోఘంబని యాశతో నుంటిని. నేటివరకు నెవ్వడును చెప్పినవాడు లేదు.

కొందరు వంచకులు నన్ను జూడవలయునను తాత్పర్యముతో మేము చెప్పె దమని వచ్చి యెద్దియో ప్రేలిన సరిపడునా ? వానికి తగిన ప్రాయశ్చిత్తము సేయం బూచితిని. అదృష్టదీపుని మిత్రుడును మహోన్నతుడువలె దోచుచున్నవాడు. కావున నట్లుండనిఁకాని యతి వచనము తలంచుకొనిన భయమగుచున్నది. ఈ రత్నములం జూడ మనుష్యలోక సంబంధములుగా దోచదు. వీని మా తండ్రికి జూపిన నతనికేమి తోచునోయని అనేక ప్రకారముల నా రత్నప్రభావమగ్గింపుచు దానితో ముచ్చటింపు చుండెను. ఇట్లిరువురు మాట్లాడుకొనుచున్న సమయంబున నొక దాది యుత్తరముఁ గది దెచ్చి, భర్తృదారికా ! దీని నయ్యగారు మీ కిమ్మనిరని పలుకుచు నొక యుత్తరము ప్రియంవదకిచ్చినది. ఆమె దానిని బుచ్చుకొని విప్పి చదివిన నిట్లున్నది.

పట్టీ ! హరిదత్తుఁడను బ్రాహ్మణకుమారుని నీ విదివరకు విని యున్నదానవు కదా. అతని నొక కారణముచేత నురిదీయుటకు నారుమాసములు గడువిచ్చితిని ఆ చిన్న వాడును బ్రముచ్చువలె మొన్నను రక్షక పురుషులకు దెలియకుండ బందీగృహమునుండి పారిపోయెను. కాని దైవవశము చేత మరల వారికే చిక్కెను. వాని నా యొద్దకు దీసికొని వచ్చి యతడు చేసిన అపరాధాంతరమును దెలియపరచుచు వెంటనే యురిదీయుట కుత్తరము దయచేయవలయునని వాండ్రు ప్రార్థించిరి. నేనును వెంటనే అట్టియాజ్ఞ యియ్యఁదలచుకొనుచు దీనికి నీవేమి చెప్పెదవని అతని నడిగితిని. అతండు కొంతసేపు ధ్యానించుచు నెద్దియో గొణగ చెప్పబోయెను. కాని మరల నరచుకొనుచు తుదకు నాతో నిట్లనియె. దేవా ! మీ యధికారములో మీరేమి చేసినను సాగునుగదా మితియిచ్చి మరల నింతలో నురిదీయుట కేమి కారణమున్నది. నేను బారిపోయితినని గదా మీరు జెప్పుచున్నారు. ఆ మాటయెంత నిక్కువములో యాలోచింపక యాజ్ఞ యిచ్చెదనని నేనేమి చెప్పుదును. కానిమ్ము. నీ కూతురిచ్చిన ప్రశ్నలకిప్పుడు ప్రత్యుత్తర మిచ్చుటకు సిద్ధముగా నుంటిని నన్నొకసారి యామె యొద్దకు దీసికొని పొండని యడిగెను. దానికేమియు జెప్పక నీ యభిప్రాయము దెలిసికొనుటకయి యుంటిని. దీనికి నీవేమి చెప్పెదవో వ్రాయుము. అని యున్న యుత్తరము చదువుకొని యమ్ముదిత పెదవి విరచుచు గలహంసిక కిట్లనియె.

కలికీ ! అతని తెలివి మొదటనే తెలిసినది. ఇంతలో నతనికి సూక్ష్మబుద్ధి యెచ్చటనుండి వచ్చినది. ఊరక దావలేక కాలక్షేపము చేయుటకై యట్లనుచున్న వాడని యూహించెదను. మరల రప్పింపనేల ? దీనికి నీవేమనియెదవని యడుగగా నక్కలహంసిక యిట్లనియె. అక్కా ! నీవాలాగున చెప్పరాదు. ఎప్పటికేబుద్ధి తోచునో ? అతండు చెప్పిన సంగతులు వినియే పైకార్యము జరిగింపు కొనవచ్చును. బ్రహ్మహత్యాదోషమున కింతయేని వెరవక మీ తండ్రియంత సాహసము చేయు

చున్నవాడేమి. అయ్యయ్యో! వినినంత నా మేనగంపము జనింపుచున్నదేయని పలుకగా బ్రియంవద దానితో బోటీ! రాజధర్మము మిగుల సూక్ష్మమైనది. అతండట్టి ప్రతిజ్ఞబట్టి యున్నవాడు. ప్రతిజ్ఞాభంగము సైతము పాపహేతువని పెద్దలు చెప్పుదురు.

ఆ మాటల సంగతి మనకేటికి. ఇప్పుడు నాకొకటి తోచుచున్నది. వానినిప్పటికి రప్పించుటకంటె నాతడిచ్చు నుత్తరములు వ్రాయించి తెప్పించుకొనిన యుక్తముగా నుండునని తోచుచున్నది. అవి యుచితముగా నుండిన మనము ధన్యులమే కదా? లేనిచో వానినేమి చేయవలయునో అప్పు చేయుంతునని పలికి అక్కలికి కోపించి యా మాటలే మరల జీబిలో వ్రాసి తండ్రికంపినది. ఆ రాజవాహనుండా చీటిం జదువుకొనుచు దనయెదుట నున్న యా రాజకుమారుని కా సంగతి జెప్పెను. అప్పుడతండు వారి నడిగి చిత్తరువు వ్రాయు సామాగ్రిం దెప్పించుకొని తాను జూచిన విషయములన్నియు దేటయగునట్లు వ్రాసెను. ముందుగా బుష్పపురి నొకచోట వ్రాసి దాని కుత్తరముగా గోశైలము దాని శిఖరము మీద మూడంతరములు గల భువనేశ్వరీ దేవాగారము లిఖించెను.

మఱియు నాయాయాయంతరంబులం గల విశేషములన్నియు దేటతెల్లముగా వ్రాయుచు పైభాగమున భువనేశ్వరీదేవి విగ్రహమును దాను చూచిన ప్రకారమైదుముఖములు ఐదిచేతులు, వాని రంగులును వచ్చుపడునట్లు అద్దేవి పీఠమున భువనేశ్వరీ దేవియనియు వెనుక గోడమీదనున్న పద్యము నుచితస్థానముల వ్రాసెను. మరియు నాయాచోటుల సంజ్ఞలు దెలియుటకయి అక్షరములతో గూడ వ్రాసెను. ఆ రీతి దాను చూచిన రహస్యమంతయు జిత్రఫలకమున వ్రాసి యెవ్వరును జూడకుండ మడచి అది యా రాజుగారికిచ్చెను.

అతండును గుప్తముగా దానిని గూతురి సంతఃపురమున కనిపెను. ప్రియంవదయు గలహంసికతో అప్పుడెద్దియో ముచ్చటింపుచు దాది తనయొద్ద తెచ్చిపెట్టిన చిత్రఫలకమును మొదట నంతశ్రద్ధగా జూడక సఖురాలి ప్రోత్సాహమున నెట్టకేనారుటమును విప్పి చూచినది. మున్ను సన్యాసి తనకు జెవిలో జెప్పిన విషయములన్నియు నందుంచుటచే విభ్రాంత స్వాంతయై అక్కాంత యొక్కింతసేపు వితర్కించి మేసంతయు గగుర్పాటున గ్రక్కున లేచి బిగ్గర గలహంసికం గౌగలించుకొనియెను. అదియును ముదము జెందుచు, మదవతీ! మన భాగ్యదేవత ప్రసన్నురాలయ్యెనా యేమి? వడిగా జెప్పుము. నాకు శ్రోత్రానంద మాపాదింపుము లెమ్ము. విశేషములేమి అని అత్యాతురముగా నడుగుటయు నచ్చేడియ యెట్టకే సంతోషమాపుకొనుచు గలహంసికకిట్లనియె.

చెలియా! కలయో నిజమో కాని యా పటములో నేను గోరిన యుత్తరములున్నవి. నా పూర్వపుణ్య ఫలంబిప్పటికి సఫలమైనది గాబోలు. చూడుమిదిగో! ఈ

పటములోని విశేషములన్నియు యతి జెప్పినకే ? ఇంతకు బూర్వ మీ రహస్యము లేరికిం జెప్పలేదు. గుప్తముగా వ్రాసి దాచి యుంచితిని. చూతువుగాని రమ్మని యొక మందసము దాపునకు బోయి అందున్న యొక గ్రంథములో జ్ఞాపకార్థమై సంక్షేపముగా సంజ్ఞాపూర్వక లిపితో నున్న యా విశేషములను దానికి జూపెను. కలహంసికయు ప్రియంవదయొక్క గాంభీర్యమునకు సంతసించుచు ఇంచుబోడీ ! నీవీ రహస్యము నాతో జెప్పక యిన్నినాళ్లెట్లు దాచితివో కాని యే సంగతియు నీతో జెప్పక నేనొక నిముషమైనను తాళలేను సుమీ ? యని పలుకగా కక్కలికి యులికిపడి, అక్కా ! నీ వట్లనుచున్నావేమి ? యతీశ్వరు డెవ్వరితోడను జెప్పవలదని యాన బెట్టియున్నవాడు. కావున దాచితినిగాని లేకున్న నేను మరల నీతో జెప్పక నిలువగలనా అని పలుకు టయు సంతసించి యాత్రమున గలహంసిక యిట్లనియె.

రమణీ ! ఈ మాటలకేమి ముందరికార్య మాలోచింపుము. ఈ హరిదత్తు నంతకు బూర్వము నీవు జూచితివిగదా ! రూపంబున నీ కనుకూలుడైనవాడే యగునా అని పలికిన నక్కలకంఠియు సుత్కంఠతో దైవ మనుకూలకాలంబున మరియొక లాగున నెట్లు జేయును. అయినను నీవు ముందు నాకు బదులుగా బోయి యీ హార మతని మెడలో వైచి యిచ్చటికి దీసికొనిరమ్ము. దానసర్వము విదితమగునని పలుకుచు హరిదత్తుడు నా ప్రశ్నలకు సదుత్తరము లిచ్చెను. అతండు నా ప్రాణేశ్వరుడు. త్రికరణములచేత హరిదత్తుని నేను వరించితిని. తరువాత కృత్యములు నిర్వహించుటకు దేవరయే ప్రమాణమని యొకపత్రిక వ్రాసి తండ్రి కిమ్మని చెప్పి కలహంసిక నంపెను.

మిక్కిలి సంతోషముతో నాయోషామణి యాస్థానమునకు బోయి అందు రాజకింకరులచే నావృతుడై యున్న అదృష్టదీపుని, నతని గురించి విచారించుచున్న యా రాజవాహనునింజూచి యాశ్చర్యమందుచు రాజుగారికి నమస్కరించుచు ప్రియం వద యిచ్చిన యుత్తరము చేతికిచ్చి హరిదత్తు డెచ్చటనున్నవాడని యడిగెను. రాజ వాహను డా యుత్తరమును జదువుకొని యపరిమితానందము నెందుచు నెదుర నున్న నదృష్టదీపుని నిరూపించి యితడే హరిదత్తుడు చూడుము కలహంసికా ! నేటికి మా వంశము పవిత్రముచేయ వచ్చెనని పలుకుచు నతని గౌగలించుకొని, అనఘా! నిన్ను మేమిదివరకుబెట్టిన యిడుమలన్నియు సైరింపవలయు. నీ మహిమ యెఱుంగలేక నిన్ను మానవ సామాన్యుండవని తలంచి వృథా శ్రమబెట్టితిమి. నిన్ను నా కూతురు వరించి నట్లుత్తరము వ్రాసినది. నీవు మా కల్లునవైతివని పలుకుచు నతని మిక్కిలి గౌరవించి తమయర్ధసింహాసనమున గూర్చుండబెట్టుకొనియెను.

కలహంసికయు నతనింజూచియు వెఱగుపడుచు, అయ్యో! ఇది యేమివింత. ఇతండు మిత్రగుప్తుడనువాడుకాడా ? హరిదత్తుడనుచున్నారేమి ? ఇతడింతకుముందు నాతో మాట్లాడిపెళ్లెనే. బాగుబాగు. పురుషసింహా ! పేరుమార్చిన లాభమేమియున్నది.

మొదటినుండియు నీమాట లనుమానముగానే యున్నవి. సామాన్యుడు నీవు దెచ్చిన రత్నముల ముట్టుట కర్హుడగునా? తెలిసినది రమ్ము. అంతఃపురమునకు బోదము. నిన్ను జూచుటకై మా రాజపుత్రిక తొందరపడుచున్నదని యదృష్టదీపుని జూచి పలుకుచు నతని మెడలో ముత్యాలహారము వైచినది. అప్పుడు అచ్చటనున్న వారందరు జయ జయ అను శబ్దములతో గరతాళముల వైచిరి.

అదృష్టదీపుడట్టి సమయములో నేమియు బలుకక ప్రియంవదను హరిదత్తునికి వివాహముచేసి అతనికోరిక తీర్చెదనని మొదట శపథము చేసియున్నవాడు కావున నంతఃపురమునకు బోవుట కిష్టపడక హరిదత్తుని వెదకుటయందు దలంపుగలిగి యా రహస్యమేమియు వెల్లడించక సంతసం బభినయించుచు రాజవాహనునితో నిట్లనియె. దేవా! ఇప్పుడు ప్రియంవద నన్ను జేసిన గౌరవమున కెంతయు సంతసించితిని. ఆమె యానతి చొప్పున నీ యొప్పులకుప్ప నన్నంతిపురికి రమ్మని నిర్బంధించు చున్నది. కాని నా యాశయ మొక్క టరయవలయును. నేనిప్పటికి దీక్షలో నుంటిని. అది యిక పదిదినములకు ముగియును. అంత దనుక శుద్ధాంతమునకు బోరాదు. ఇప్పటికి సెలవిచ్చితిరేని తిరుగ దీక్షావసానంబున వచ్చువాడనని సహేతుకముగా నుడివిన విని రాజవాహనుడేమియు జెప్పలేక నిక్కముగా దలంచి యావార్త ప్రియవదకుం జెప్పుమని కలహంసిక కానతిచ్చెను.

ఆ పోదయు నా రాజకుమారునితో నెద్దియో ముచ్చటింపదలచి అభిప్రాయము సూచించుటయు అతండది యవసరము కాదని తిరిగి సూచించెను. పిమ్మట నక్కొమ్మయు అతనికి ప్రియంవద యందంత అనురాగములేదని గ్రహించియు వెల్లడిచేసినచో నా చిన్నది చింతించునని తలంచి యించుక శంకించుకొనుచు మెల్లగా గన్యాంతఃపురమునకు బోయెను. అదృష్టదీపుడు తన విడిదకుం బోవుటకు బయనమగుటయు రాజు అతండిచ్చగింపకున్నను బలవంతముగా నుత్తమాశ్వముల బూన్చిన శకటంబుపై నెక్కించి చుట్టును జయ జయ ధ్వనులతో రాజభటులు పరివేష్టింప రాజవైభవముతో బంపెను. ఆ వార్తవిని పౌరులందరు సంతోషముతో నతనిపై పుష్పములు జల్లదొడంగిరి. అతనినందరు హరిదత్తుడను బ్రాహ్మణకుమారుడనుకొనిరి, గాని అదృష్టదీపుడని యొకరును నెఱుంగరు.

అట్టి వైభవముతో నదృష్టదీపుడు బలభద్రుడున్న చోటికిబోయి తనరాకకై వేచియున్న యా చిన్నివానినిగాంచి గౌగిలించుకొనియెను. బలభద్రుడును నతని వైభవమంతయుం జూచి సంతసించుచు తత్కారణమడిగి తెలిసికొని మృతుండుజీవించినం బొదమునంత మురిపెమందుచు నతని యదృష్టదేవతను నేతెఱంగున నభినుతించెను. తరువాత నదృష్టదీపుడు అప్పరివారమునంతయు యథాస్థానమునకనిపి బలభద్రునితో నేకాంతముగ గూర్చుండి యిట్లు వితర్కించెను. తమ్ముడా! నేనిప్పుడు మృత్యుముఖంబునుండి వెల్వడితిని. కాని మఱియొక చింత యంకురించినది. పాపము హరి

దత్తుడు బ్రియంవదకై ప్రాణత్యాగమునకైనను దెగించి చిక్కులం బడెనుగదా? అతిని రక్షింపు తలంపుతో నేనడ్డుపడి దైవకృపచే నాయిక్కట్లు దాటించితిని.

నేను హరిదత్తుడనియే యెల్లరు భ్రాంతి పడుచున్నవారు. అతడు నేను నొక్కరూపని దీసిందేటబడుటయేకాక నీవుసైతము చూచినదేకదా? మొదటినుండియు బ్రియంవదను హరిదత్తునితో గూర్పవలయుననియే నా తలంపు. అట్టికాంత నిప్పుడు నేనెట్లు పెండ్లియాడుదును. వారు నన్నట నిర్బంధింపగా దీక్షాకైతవంబునం దాటించుకొనివచ్చితిని. బ్రాహ్మణాధీనను చేసినది మరల స్వీకరింపవచ్చునా! కావున నెట్లయిను హరిదత్తునితో నీమతగాళినిం గూర్పవలయు. అతండిప్పుడెచ్చటికి బారిపోయెనో తెలిసికొని తీసుకొనిరావలయును. ఇదియే మనము చేయదగిన కార్యము. రూపసాదృశ్యమువలన తనసి సన్నుగా భావించి మన్నింతురు. ఇదియే నా నిశ్చయము. దీనికి నీవేమనియెదవని యడుగుచు దాను క్రీడాశైలంబున జూచిన విశేషములన్నియుం జెప్పెను.

అప్పుడా బలభద్రుడు మిక్కిలి యాశ్చర్యమందుచు నతని ధార్మికబుద్ధికి మెచ్చుకొనుచు జితేంద్రియత్వమునకు శిరఃకంపము చేయుచు దుదకదృష్టదీపుడు చెప్పినప్రకారము హరిదత్తుని వెదకి తీసికొని వచ్చుటయే యుత్తమమని యొప్పుకొనియెను. పిమ్మట వారిరువురు తిరుగవచ్చుటకు గడువేర్పరచుకొని యారాత్రియే చెరియొక మార్గంబునంబడి పోయిరి.

# హరిదత్తుని కథ

అందు బలభద్రుడు క్రమంబున బట్టణములను, బల్లెలను, గ్రామంబులను వెదకికొనుచు నొకనాడు సాయంకాలమునకు ధర్మాపురముచేరెను. పూర్వపరిచితమగు నదృష్టదీపుని సత్రములో బసజేసి యాపట్టణ విశేషములరయు తలంపున సాయంకాలమున రాజమార్గంబునంబడి పోవుచుండ బూర్వపరిచితుండగు నొక మిత్రుండెదురుపడి యోహో! బలభద్రా ఎచ్చటనుండి వచ్చితివి? ఇంత కాలము కుశలముగా నుంటివా? యని యడుగగా నతండును తగురీతి బ్రత్యుత్తరమిచ్చి, మిత్రమా! హరిదత్తుడను బ్రాహ్మణకుమారుడీ యూరు వచ్చిన జాడ నీకేమైనం దెలియదు కదాయని అడిగెను.

అతండు నొక్కింత ధ్యానించి యోహో! మెల్లగా మాట్లాడుము. అతని నీవెరుంగుదువా యేమి? అతని గురించి యీ యూర గొప్పవితర్కముగా నున్నది. ఇప్పుడు నేను తొందరగా బోవుచుంటిని రేపటిదినంబున మా యింటికి వత్తువేని యా విశేషములన్నియు సావకాశముగా వక్కాణించెద. ఆ కథ ప్రకాశముగా జెప్పుకొన కాదు. ఇంకను రహస్యములో నున్నది. అని పలుకుటయు నెట్లెట్లూ కొంచెము బాధ

చెప్పుమని బలభద్రుం డడుగుచుండగనే యతండు వడిగా నెచ్చటికోపోయెను. తరువాత బలభద్రుడు సంశయాకులితచిత్తుండై యున్మత్తుని క్రియ కొంతసేపా ప్రాంత భాగముల గ్రుమ్మరి చీకటిపడిన కొంతసేపటికి మరల సత్రములోనికి వచ్చెను.

సీ. ఒకచోట శ్రోత్రియప్రకరంబు జందెముల్
　　వడకుచు వేదముల్వల్లె వేయ
ఒకమూల శ్రోతల కకలంకముగబుధుల్
　　రాజులరాజ ధోరణులుదెలుప
ఒకవంక భూదేవనికరంబు రెడ్డిగం
　　బులదీర్చివివిధగాథలవచింప
ఒకప్రక్క బందితు లుద్ధతిగావ్య నా
　　టక సత్ప్రసంగంబులొనరజేయ.

గీ. ఒక్కదెస శాస్త్రపాఠంబు లొక్కవైపు
సకలలౌకిక సంబంధ చర్చలొప్ప
సంచడించెడి సత్రంబు సత్రాముగతి
విబుధలోక మహోజ్జ్వమై వెలసియుండె.

అట్టి సత్రమంతయు నెక్కుదేశములనుండి రాబడిన బ్రాహ్మణులచే నావరింపబడియున్నది. బలభద్రుండును నాబ్రాహ్మణ బృందమునకు నమస్కరించి వీరివలన భూలోకవృత్తాంత మంతయు విదితమగునని నిశ్చయించి వారి మాటలు విను తాత్పర్యముతో నాప్రాంత మందొకచోట గూర్చుండియుండెను. అప్పుడందున్న వారిలో అచ్చన్న శాస్త్రి బ్రహ్మావధానియను బ్రాహ్మణులీ రీతి మాట్లాడుకొనిరి

అచ్చన్నశాస్త్రి :- బ్రహ్మావధానిగారూ! మీరు మిగుల వృద్ధులై యింత దూరమెట్లు వచ్చితిరండి? మీకు సంతానమైనను లేదుగదా? హాయిగా యింటియొద్ద గూర్చుండి రామా! కృష్ణా! యని కాలక్షేపము చేసికొనరాదా! మాకనిన గుటుంబభారము బలసినది కావున తిరుగక తప్పదు.

బ్రహ్మావధాని :- అచ్చన్నశాస్త్రిగారా? మిమ్ములను జూచి పెద్ద కాలమైనది. ఈ నడుమ నా యోగక్షేమ మేమియు మీరు తెలిసికొనడములేదు. నాకును ఒక పిల్లకాయ కలిగినాడు. వాని పెండ్లికొరకే యింతదూరము వచ్చితిని.

అచ్చన్న :- ఆలాగునా? తెలియక పలికితిని క్షమించండి.

బ్రహ్మావ :- దానికేమిలెండి. ఇచ్చట రేపు భారసాల జరుగనా? యేదియో యద్దము వచ్చినదని చెప్పుచున్నారేమి? అదృష్టదీప మహారాజుగారికి కుమారుడు గలిగెననియు భారసాలయనియు విని వచ్చితిని. అమ్మహారాజు దానకర్ణుడనియు మా

బుచ్చిగారికి వివాహము జేయుదురను తాత్పర్యముతో ముసలిది చెప్పగా జయలుదేరి వచ్చితిని.

అచ్చన్న :- ఈ వచ్చిన వారందరు నట్టి యభిప్రాయము తోడనే వచ్చినారు కాని యింతలో నేదియో గడబిడ పుట్టినదట అదంతయు రహస్యముగా నున్నది. సూర్యోదయమున నంతయు బేటపడును.

బ్రహ్మన్న :- అయ్యో ! నేను మిగుల కష్టపడి వచ్చితినయ్యా ! దైవము నా యాశ యేమిచేయునో? ఇంతకు నదృష్టదీపమహారాజుగా రిచ్చటనున్న మాట నిజమేనా ?

అచ్చన్న :- ఏమో ! యేసంగతి నాకు బాగా తెలియదు. నేనుగూడ యీ మధ్యాహ్నమునకే వచ్చితిని. ఈ రామసిద్ధాంతిగారు నాలుగు దినముల క్రిందట యిచ్చటికి వచ్చినారట ఈయన కంతయు దెలియగలదు.

బ్రహ్మన్న :- ఏమండీ సిద్ధాంతిగారు ! దాని బూహి మీకేమయినం దెలిసినదేమో చెప్పండి నేను పెద్దవాడను గంపెడాశతో వచ్చితిని.

రామ :- ఇప్పుడు మొదటికే మోసము వచ్చినది. వినుండు. అదృష్టదీపుడు కొన్నినాళ్ళ క్రిందట నీయూరు రహస్యముగా వచ్చి ఈ రాజు కూతురు కాంతిమతి యను దానితో రహస్యముగా క్రీడించెనట. దానికి గర్భమయినది అది గాంధర్వవివాహములో లెక్కించుకొని ఈ రాజుగారు కూతురి నిందింపక సురక్షితముగా గాపాడుచుండ గొన్ని దినముల క్రిందట గుమారుడుదయించెను.

బ్రహ్మన్న :- ఆగాగునా ? తరువాత తరువాత.

రామ :- అంతకుమున్నే యదృష్టదీపుడు తెలియకుండా పారిపోయెను. కావున నీరాజుగారతని చిత్రఫలకము చారులకిచ్చి నాల్గుదిక్కులకుంబుచ్చి వెదకి దీసికొనిరండని పంపిన వారును పోయి యొకని నదృష్టదీపుడే యని తీసికొనివచ్చిరి.

బ్రహ్మన్న :- పిమ్మట ?

రామ :- ఆ వచ్చినవాడు నేనదృష్టదీపుడిని కాననియు నేను హరిదత్తుడను బ్రాహ్మణకుమారుడననియు గాంతిమతి నంతకుమున్నెన్నడును చూచియెరుంగననియు నీకుమారుడు నా కుమారుడు కాడనియు జెప్పుచున్నవాడట. రాజపుత్రిక తాను పూర్వము వరియించిన వాడితడే యనియు నితండెట్టి యభిప్రాయముతోనో యిట్లనుచున్నవాడు కావున నీతనిం బోనీయరాదని నిశ్చయముగా బలికినదట. ఇప్పుడా మీమాంసలోనున్నది.

బ్రహ్మన్న :- ఏదియో స్మరించుకొని కన్నీరువిడచుచు, సిద్ధాంతిగారూ ! ఆ హరిదత్తుడు మా హరిదత్తుడు కాడుగదా ?

రామ :- అదేమిటయ్యో ! మీకొక హరిదత్తుడుండెనా యేమి ?

బ్రహ్మన్న :- అయ్యో ! ఆతనినా దౌర్భాగ్యురాలిమూలముగా నతని నెడ బాసితిని. వినుండి చెప్పెదను. నేను నాడు ప్రొద్దెక్కు సమయమున నొక అరణ్యమార్గమున ముష్టి

మూట నెత్తిమీద బెట్టుకొని వచ్చుచు నెండతాకున నాయాసమువచ్చి యొక చెట్టుక్రింద గొంచెము సేపు విశ్రమించితిని. అప్పుడా చెట్టుమీద శిశురోదనము వినబడుటయు వెఱగుపడి తలపైకెత్తి చూచితిని. ఆ చెట్టుకొమ్మల సందున నొక కోతి చక్కని బిడ్డను నోటిలోబెట్టుకొని ముద్దాడుచుండుటయు, శిశువు కేరుకేరుమని యేడ్చుచుండుటయు గనంబడినది. అప్పుడు నేను ఔరా! ఈ వానరము నక్కలోనికి నరశిశువెట్లు వచ్చెనో? యని యాశ్చర్యమందుచు నాకోతి యాబిడ్డను కొమ్మల సందున బెట్టుట దిలకించి తటాలున దుడ్డుగ్రరతో నా వనచరణమును బెదరించి మెల్లన నా చెట్టు పైకి నెక్కి పదిలముగా నప్పట్టిని యొడిలో బెట్టుకొని చెట్టుదిగి భారముగానున్న బియ్యము మూటను విప్పి యచ్చటనున్న కోతుల కాహారముగా జిమ్మి యా బిడ్డతో నింటికి వచ్చితిని.

రామ :- ఆ ప్రాంతమందు మీకెవ్వరు గనంబడలేదా!

బ్రహ్మ :- దారిలో నొకయాడుడిమ్మాత మెదురుపడినది. దాని నేమియు ఖల్కరించలేదు. నాకప్పుడు సంతానములేదు గనుక బిడ్డ దొరకెనను సంతోషముతో వడివడిగా నింటికి వచ్చి నా భార్యకా వృత్తాంతమంతయుం జెప్పి యక్కాలునిచ్చి వానికి హరిదత్తుడను పేరు పెట్టితిని.

రామ :- అగునగు మంచి పేరే పెట్టితిరి. హరి యనగా కోతియు భగవంతుడును గనుక రెండు విధములచేతను జక్కగానే యున్నది. తరువాత—

బ్రహ్మ :- అద్భుత తేజస్సంపన్నుండగు నాబాలునింజూచి నా భార్యయు మిగుల సంతసించుచు మిక్కలి గారాబముతో గన్నపుత్రుని వలెనే పెనుచుచుండ బది రెండేడుల ప్రాయమువచ్చెను. అప్పు డుపనయన సంస్కారము నిర్వర్తించితిని.

రామ :- తరువాత.

బ్రహ్మ :- వానిని బెంచిన మూలముననే గాబోలు పిమ్మట నాకును నొక కుమారుం డుదయించెను.

రామ :- ఔను. ఆలాగున గలుగుట లోకాచారమున్నది.

బ్రహ్మ :- వాడు గలిగినది మొదలు నా భార్య హరిదత్తుని యందీర్ష్యగలిగి యన్నపానాదుల యందు మరియొక రీతి జరుప దొడంగినది.

రామః- అది స్త్రీజనసామాన్యమే కదా? తరువాత.

బ్రహ్మః- అక్కపటమేను గ్రహించి యా చిన్నవానిని విద్యాభ్యాసమునకు మా ప్రాంతమున నున్న యొక అగ్రహారములో నొక యాచార్యునొద్ద నుంచితిని. హరిదత్తుడు గుణవంతుడును, రూపవంతుడును, బుద్ధిమంతుడునై యున్నవాడు గావున నతని యొద్దనే గొన్నిశాస్త్రము లభ్యసించి చివరకాయన కూతురు కారణమున నెచ్చటికో పారిపోయెనని తెలిసినది. ఇతడు వాడు కాడుగదా? అని యూహ బుట్టుచున్నది.

రామః- అయినంగావచ్చును. రేపుపోయి మీరు చూడండి. గురుతుపట్ట గలరా?

బ్రహ్మ:- ఏమో ! అతనికి నేను జ్ఞాపకముందునా ? వాడు మట్టివాడు కాడు.

రామ :- అఘటనఘటనా సమర్థుడు భగవంతు డేమిచేసినం జేయగలడు. ప్రొద్దున విచారింతము. పరుండుదమిప్పుడు ప్రొద్దుపోయినదని యొండొరులు సంభాషించుకొని నిద్రపోయిరి.

ఆ మాటలన్నియు విని బలభద్రుండు విస్మయము జెందుచు మేలు మేలు. వీరివలన మంచివార్తయే వినబడినది. హరిదత్తుడు రాజసమానుడని తోచుచున్నది. రూపసాదృశ్యమునుబట్టి చూడగా నదృష్టదీపునికి సోదరుండని నిశ్చయింపవచ్చును. సన్యాసి చెప్పినమాట యెప్పుడు నసత్యము కానేరదు. అదృష్టదీపునకు హరిదత్తునందు నిర్హేతుకమైన ప్రేమ జనించినది. అదియే బాంధవ్యమును దెలుపుచున్నది. కాంతిమతి యతని నదృష్టదీపుడని భ్రమజెందుట కేమి యాశ్చర్యము ! నేనుగూడ నతడే అని భ్రమజెందితిని. వీరి యసమానమంతయు దీర్చి హరిదత్తుని ప్రియంవదతో గూర్చెద నిదియే కదా యదృష్టదీపుని యభిలాష నేనిట్టి పని చేసితినేని నా మిత్రుడు నన్ను మిక్కిలి మన్నించునని యనేక ప్రకారముల నాలోచించు సమయంబున నప్పటి కొక మూల బరుండి యా మాటలన్నియు వినుచున్న యొక వృద్ధకాంత మెల్లగా లేచివచ్చి అయ్యా ! తమరెవ్వరు హరిదత్తునికథ చెప్పిన బ్రాహ్మణు డెచ్చట నున్నాడని బలభద్రు నడిగినది.

బలభద్రుడును దానికి తన పేరు చెప్పి నీవెవ్వతెవనియు నాబ్రాహ్మణుని యవసరము నీకేమిటికనియు నీవిచ్చటికేల వచ్చితివనియు నడిగిన నజ్జరఠ యిట్లనియె. అయ్యా ! నా వృత్తాంతమేమని చెప్పుదును. నేను మాళవదేశాధీశ్వరుండయిన ధర్మపాలుని భార్య సునందయొక్క పరిచారికను. నా పేరు రత్నావతి యందురు. మా రాజుగారిని శత్రువులు కోట ముట్టడించి బందీగృహంబున బెట్టుటయు మా యేలికసానియైన సునందను గర్భభరాలసయై యుండ మూడేండ్ల ప్రాయముగల కుమారు నెత్తుకొని నింబవతియను దాది వెంటరాగా బ్రచ్ఛన్నమార్గంబున గోట దాటించి మేమంతరము నొక అరణ్యమార్గంబున బడిపోయితిమి. అగమన వేగంబున నింబవతి యొక మార్గంబునను, నేనును సునందయు నొక మార్గంబునం బడిపోయితిమి. ఆ యరణ్యములో గ్రుమ్మరుచుండ నొకనాఁడుదయంబున సునందకు బ్రసవవేదన యావిర్భవించి చక్కని కుమారునింగనియెను. ఆమెయు నుదకము దీసికొనిరమ్మని నన్ను బంపుటయు నేనటి జలంబునంబోయి యాప్రాంత భాగముల నరసి పర్ణపుటంబున జలంబు బట్టి దీసికొనిపోయితిని. నాకు దారిలో నొక బ్రాహ్మణు డెదురుపడెను. గాని సునందను జూచు తొందరతో బోవుచుంటిని గాన నంత విమర్శించితిని కాను

ఆయన యొడిలో బాలకు డున్నట్లే యున్నది. నేనట్లు పడిగా బోయి చూచువరకు నచ్చట సునంద లేదు. గురుతులు మాత్రమున్నవి అడుగులజాడలబట్టి యా యరణ్యములో గొంతదూరము దిరిగి యామె కొరకు గొంతెత్తి యరచితిని కాని యెందును నా సునందజాడ దెలిసినది కాదు. మరలవచ్చి యచటి యంతయు వెదకి నిరాశ జేసికొని దైవోపహతులమగు మాకు సమాగమ మెట్లు లభించునని యటమొదలు ప్రతి గ్రామము, ప్రతి పట్టణము, ప్రతి పల్లెయు వెదకుచు భూమియంతయు దిరుగుచుంటిని. వారిజాడ యేమియుం దెలియలేదు.

రాజకుమారు నెత్తుకొని పులియొక మార్గమున బోయిన నింబవతిజాడయు దెలిసినది కాదు. ఆ రాజకుమారు డిప్పటికి మంచి ప్రాయములో నుండును. ఇప్పుడీ బ్రాహ్మణుడు చెప్పిన మాటలు నేను వింటిని. హరిదత్తుడు మా రాజపుత్రుడు. వానిని జూచితినేని నా యాత్రమంతయుం బోవును. ఆ బ్రాహ్మణుడెచ్చట నున్నవాడో చెప్పుడు. నేను పెద్దవానను. మీకు మిక్కిలి పుణ్యము వచ్చునని చెప్పగా విని బలభద్రుడు మరియు వెఱగందుచు నిట్లు తలంచెను. అహా! జగంబంతయు దైవాయత్తమై యున్నది. భగవదాజ్ఞ లేక పురుషుడు నిట్టూర్పు నిగుడ్పుటకయినను స్వతంత్రుడు కాడు. నియతిబలము లేక నేకార్యము సమకూడదు. మా మిత్రునకిప్పుడు మంచి దినములు వచ్చుచున్నట్లు తోచుచున్నది. నింబవతి తీసికొనిపోయిన బాలుడు నా మిత్రుడే హరిదత్తుడు సునందకన్న బిడ్డడు అని తోచుచున్నది.

ఇప్పుడు నా మిత్రుడు అదృష్టదీపు డీ మాట వినచో నెంత సంతసించునో అని అనేక ప్రకారముల వితర్కించుచు నా వృద్ధతో నిట్లనియె. అవ్వా! నీవు చింతింపకుము. నీ పాపులతో గొలదికాలములో గలిసికొందువు. నేను మీ రాజుగారి పెద్దకుమారుని మిత్రుడను అతడు కుశలముగా నున్నాడు. నింబవతియను దాది అతని నెత్తుకొని పోయినదని నీవు చెప్పితివి గదా! ఆ దాది యొక యరణ్యములో నా బాలుని పెట్టుకొని చెట్టుక్రింద బరుండియుండగా పాముగరచి మృతినొందెను. పశువుల గాచు పిల్లవాండ్రు, దాని శవముపైకెక్కి రోదనము చేయుచున్న యా చిన్నవాని నెత్తుకొని యా ప్రాంతమందున్న పల్లెకు వచ్చిరి. అపుత్రకుండైన యొక గొల్లవాడు వానిని పెంచి పెద్దవానిని జేసెను.

అతండిప్పుడు మిక్కిలి గౌరవస్థితిలో నున్నవాడు. నీవు చెప్పిన హరిదత్తుడును సత్తమస్థితికి రాగలడు. తల్లిమాత్ర మెచ్చట నున్నదో తెలియవలయు. మీరందరు శీఘ్రకాలములో దంపతులను గలిపించి తమ రాజ్యముగైకొని భూచక్రమంతయు నేలగలరని వక్కాణించుటయు నమృతప్రాయములైన అతనిమాటలు విని యావృద్ధ సంతోషహృదయంబున మునిగి తేలుచుండెను. బలభద్రుడా వృద్ధ కాంతతో సద్గోష్ఠివినోదమున నారాత్రి గడపి యుదయంబున లేచి యా బ్రాహ్మణుని రత్న

వతినింగూడ తాను వచ్చువరకు నచ్చటనే యుండ నియమించి కాంతిమతియొక్క చెలి కత్తె యగు నిపుణిక యింటివీథిని బోయెను.

నిపుణికయు మేడమీదనుండి యతనిం జూచి గురుతుపట్టి వాని దోడితేర నొకపరిచారిణి నంపినది. అదియు నతనిదారి కడ్డము వచ్చి, అయ్యా! మిమ్ము నీయింటి యజమానురాలు నిపుణిక యనునది యొకసారి లోపలకు దయచేయుటకు కోరుచున్న దని వేడగా నతండును సంతోషముతో దానివెంటమేడమీదికి బోయెను. నిపుణికయు నతని కెదురేగి యుచితమర్యాదలు గావించి గద్దియనిడి కూర్చున్న తరువాత మెల్లగా నిట్లనియె. అయ్యా! నీవు నీ మిత్రునితో విడి యెచ్చట నుంటివి? ఇచ్చటికెప్పుడు వచ్చితివి? నీ మిత్రుడు మునుపటిరీతి గాక మాపై గృపదక్కియున్నవాడు వింటివా? అతండెన్నడును మమ్ము జూచి యెఱుగడట. అతని కొఱకు మా నెచ్చెలి పడిన యిడుములన్నియు నీ వెఱింగినవే కదా! ఆ రాత్రి అతం డుద్యానవనములో జిక్కుపడిన తరి నా చెలి పాము గరచెనని యెంత కపట మభినయించినది.

అది యంతయు మరచి మీ రెవ్వరో నేనెఱుగనని దుష్యంతునివలె ద్రోసి వేయుచున్నవాడు. యెంత చెప్పినను నొప్పుకొనడు. అతడు చివర మాకు వ్రాసిన యుత్తరము నీవేకాదా తీసికొని వచ్చితివి? అదియు దానెఱుగడట. తనపేరు సైతము మరియొకరని చెప్పుచున్నాడు. మీరు వెళ్ళినతరువాత గర్భవతియగు కాంతిమతి వృత్తాంతము విని మారాజు మంచి మగని సంపాదించుకొనెను. సంతోషముతో గూతునేమియు ననక పుంసవనసీమంతాది కృత్యములు యథాశాస్త్రముగా జరిపించెను.

కాంతిమతియు బదియవమాసంబున జక్కని పుత్రుం గనినది. మారాజు గారిచే బంపబడిన దూతలు నీస్నేహితుని వెదకి పట్టుకొని తీసికొనివచ్చిరి. కాంతిమతియు సిగ్గు విడచి తన పుత్రుని జూపుచు బోలికబట్టియైనను నమ్ముమని యెంత బ్రతిమాలినను నతండధర్మభీరువువోలె నమ్మకుండినవాడు. ఆ శిశువుగూడ నచ్చుగా నతని పోలికగానుండెను. ఇప్పుడు మా రాజుగారా పిల్లవానికి జాతక కర్మాది సంస్కారములు చేయవలయునని సంతోషముతో నానాదిక్కులకు వర్తమానము చేసెను. పెక్కండ్రు విద్వాంసులు, బ్రాహ్మణులు వచ్చియున్నారు పీటలమీద గూర్చుండుటకు నీ మిత్రుడు సమ్మతింపకున్నవాడు. నీవు సమయమునకు వచ్చితివి. చక్కగా బోధించి యీ కార్యము చక్కపరుపుమని వినయముగా బ్రార్థించిన విని యతండు నవ్వుచు దాని కిట్లనియె. నిపుణికా! ఈశ్వరసృష్టి కడు చిత్రమయినది. పురుషునింబోలిన పురుషుం డుండుట సహజము కదా! అట్టి వైపరీత్య మేదియేని జరిగినదేమో విచారించితివా! యెంత వెఱ్ఱివాడుగాని యూరక నే నెఱుగనని పూర్వపరిచయము గల వనితను నిరసించునా?

అతం డెవ్వడనున్నవాడో చెప్పుము. నేనును బోయి మాటాడి వచ్చెదనని పలుకగా సంతోషింపుచు నతని కతని మేడజూపుటకై తన పరిచారికలలో నొకదాని

నంపుచు నెట్లయినను, గార్యసాఫల్యము చేసికొని రండని పలికినది. బలభద్రుడు హరిదత్తున్న మేడమీదకు బోయెను. అందు నాయనా! మా మాటవినుము. నీ మతి భ్రమించి యిట్లనుచున్నావు. నీ పుత్రకు నెత్తికొనుము. అపుత్రకుడైన యీరాజు రాజ్యభారము వహింపుమని బ్రతిమాలుచున్న మంత్రులతో మీరెన్ని చెప్పినను నాకు సమ్మతికాదు. రాజలోభంబున జేసి పరకాంతను గళత్రముగా స్వీకరించి నరకయాతన నెవ్వరనుభవింపగలరు. నాదారినన్ను బోనీయుడు. నామూలమున నొక పురుషుడు చిక్కులు పడుచుండును. నాకు మతిభ్రమ పుట్టి బందీగృహంబునుండి తప్పించుకొని వచ్చితిని. మీకు బదివేలనమస్కారములు కావించెదను విడువుడు విడువుడు. అని వేడుకొనుచున్న హరిదత్తు మాటలు విని అచ్చటివారెల్లనతనికి బిచ్చియెత్తినదని నిశ్చయించిరి.

అట్టిస్థితిలోనున్న హరిదత్తునింజూచి బలభద్రుడు దాపునకుబోయి, మిత్రమా! నే నెవ్వఁడనో యెఱుంగుదువా? అని యడిగెను. అతండును నిదానించి అయ్యో! నిన్ను మరచిపోవుదునా? నా ప్రాణము గాపాడినవాడవు నీవేకదా? నా మూలమున మీరచ్చట జిక్కులు పడుచున్నవారు కాబోలు. వీరు నన్నిచ్చట నిది నీభార్య వీడు నీపుత్రుడు అని కదలనీయక నిర్బంధింపుచున్నవారు. వీరి నిదివరకు నేను గని విని యెఱుంగను. నీవైనను వీరితోజెప్పి నన్ను విడిపించి తీసికొని పొమ్మని పలుకగా విని యతండును నతని యాకారవిశేషముజూచి అదృష్టదీపునికిని నతనికి నించుకేనియు భేదము లేనందునకు వెరగందుచు నెరగనివారు వీనినతడుగా భావించుట కేమియబ్బురమని యాలోచించి చిఱునవ్వు మొగంబలంకరింప నల్లన యిట్లనియె.

మిత్రమా! నీవు మమ్ము దాకట్టుపెట్టి పారిపోయివచ్చితివి. మమ్ము వారు దరిదీయుటకు సిద్ధపడినంతలో దైవవశమునచే మిత్రగుప్తుడు ప్రియంవద యిచ్చిన ప్రశ్నలకు సమాధానము చెప్పెను. దానంజేసి మా మరణము తప్పినది. నీవు సంతోషముతో నుండుమని చెప్పుచు నీతో కొన్ని రహస్యవచనములు చెప్పవలసి యున్నవి. వివిక్తమునకు రమ్మనికోరిన నచ్చటి వారందరు వేరొక చోటికి బోయిరి. పిమ్మట బలభద్రుండతని జేరదీసికొని కన్నుల నానందబాష్పములు గ్రమ్మ, తమ్ముడా! నీ వృత్తాంతమే నీవెఱుంగకున్నావు. నిన్ను వీరిట్లు నిర్బంధించుటకు వేరొక కారణమున్నది.

ఈ కాంతిమతిని నీ అన్నగారు గాంధర్వంబున గళత్రముగా స్వీకరించెను. అతండు వీరికి దెలియకుండ వేరొక కారణమునం బారిపోయెను. నీకును నీ యన్నకును నింతయేని భేదములేదు. నేను నీ యగ్రజుని మిత్రుడను. నిత్యముజూచుచున్న నేనుగూడ మీ తారతమ్యము గనిపెట్టలేనని చెప్పవచ్చును. నిన్నతనిగా భావించి వీరింతగా నిర్బంధించుచున్నారని పలుకగా నతండు తెల్లపోయి యేమేమీ? నీ మాటలు మఱియు వింతగా నున్నవే! నాకు సోదరుడు లేడే? నీ మాటలెట్లునమ్ముదును? నా దత్తజనకునికి గొన్నిదినములకు మఱియొక కుమారుడు గలిగెను. వాడు నాకు

దమ్ముఁడు. కాని యన్న కాఁడు. వాఁడైనను నా పోలికగాలేఁడు. వీరట్లనుటకు మరియేద్దియేని గారణమున్నదేమోయని పలుకఁగా నవ్వుచు మరల బలభద్రుం డిట్లనియె.

తమ్ముఁడా! దాననేకదా నీ వృత్తాంతము నీ వెఱుంగవని చెప్పుచున్నాను. మంచిది. నీ దత్తజనకుని యింటికి నీవేరీతి వచ్చితివో చెప్పుమని యడుగఁగా నతండు కొంచె మాలోచించి యొకప్పుడు మాతండ్రి యొకరడుగఁగా జెప్పిన మాటలు నేను వింటి. అడవిలో జెట్టుపైఁ బ్రాకుచున్న యొక కోతి యొడిలోనుండఁగా దానిని బెదరించి నన్ను మా తండ్రి తీసికొనివచ్చెనట. ఇదియే నేనెరిగిన కథయని చెప్పెను. తరువాత బలభద్రుఁడతనితో రత్నవతి మాటలును బ్రాహ్మణుఁడు చెప్పిన విశేషములుం జెప్పి యదృష్టదీపుఁడను బ్రసిద్ధిజెందిన పురుషుఁడే నీ యన్న యని చెప్పెను.

అప్పుడు హరిదత్తుని చిత్తంబునం బొడమిన కౌతుక మింతింతని చెప్పుటకు నలవికాదు. అతి సంతోషంబున మాటరాక డగ్గుత్తికతో నొడలు గరపుజెంద బలభద్రుం గౌఁగలించుకొని, తమ్ముఁడా! యిట్టివార్త యెఱింగించినందులకు బారితోషికముగా నీ కిచ్చుటకు నాయొద్ద నేమియును లేకపోయినది. నా ప్రాణమే నీయధీనము చేయుచుంటిని. ఇది మొదలు నేను నీ యిష్టము వచ్చినట్లు నడుచువాఁడనని శపథ పూర్వకముగా బలికెను. యీరీతి వారిరువురు మాట్లాడుకొనుచుండఁగా నింతలో గాంతిమతియు జతురికయు బిడ్డ నెత్తుకొని యచ్చటికి వచ్చినది.

వారి రాక జూచి యచ్చటనున్న జనులందరు నవ్వలకు బోయిరి. వారిం జూచి హరిదత్తుఁడును బలభద్రుఁడును లేచిరి. అప్పుడు దాపుచేరిన తోడనే హరిదత్తుఁడు గాంతిమతి పాదంబులంబడియెను. అది చూచి సంకోచింపుచు గాంతిమతి, చూచితివా? బలభద్రా! నీ మిత్రుఁడేమి చేయుచున్నవాఁడో? యితనికి బిచ్చియెత్తినదేమో యరయుమనుటయు నతండు నవ్వుచు అవ్వనీ! యితనికేమియు బిచ్చియెత్తలేదు. వీని నమస్కారపాత్రునిగా దలంపుము మీరే ప్రభవజెందుచున్నవారు. యితఁడు నీ వల్లభునికి దమ్ముఁడు. రూపసాదృశ్యమునం జేసి యతని నరసిగా భావించుచున్నారు.

ఇతండు నీకు మఱిఁదియని చెప్పిన గాంతిమతియు నించుక సిగ్గు బొప నిదానించి చూచుచు, ఔరా! బ్రహ్మసృష్టి యెంత మోసము చేసినది! ఈతఁడు గుణవంతుఁడుగాన నింతపట్టు నిదానించెను. కాని మఱియొకఁడైనచో నేమిచేయనగు అన్నా! యెంత యాపద దాటినది కటకటా! యూరక నీ మిత్రుని నిందించితిమే! యని పెక్కు తెఱంగుల బశ్చాత్తాప మందుచు మఱఁదిని మన్నించుచు బుత్రకు నెత్తనిచ్చెను. హరిదత్తుఁడు నా పుత్రకు నెత్తుకొని పెక్కుగతుల ముద్దాడుచు ఖండించువ్వుచు జుబుకంబు మూర్కొనుచు గొంతసేపటికి బలభద్రుని కందిచ్చెను. అతండును దగురీతి గారవించి కాంతిమతితో, అమ్మా! మేముపోయి యీ విశేషములన్నియు నీపతి కెఱింగించి అతనింటోడుకొని వచ్చెదము.

మేము నియమించుకొనిన మితియు సమీపించినది. అనుజ్ఞ యిత్తువే? యనుటయు నక్కలకంఠి మెల్లన నిట్లనియె. వత్సా! భవత్సఖునకు మాయందను రాగము కొరంతయైనను బ్రతుకుని దలంచి యైనను జూడరాదగదా! మాకు దయ యందుగల మక్కువ యెఱింగియు నింతకాల మాలసించుట మిక్కిలి యద్భుతముగా నున్నది. ఇక స్వల్పకాలము జాగుచేసిన శ్రీ సాహసము లోకప్రసిద్ధమైనదియే. తరుచు జెప్పవలసినదిలేదు. నీవార్తా శ్రవణమే యాగమనావధియని చెప్పుమని పెక్కు బోధించి పరిదత్తునికి జెప్పురీతి జెప్పి యెట్టకేలకు వారి నచ్చటినుండి పంపెను.

బలభద్రుం డా హరిదత్తునితో గూడి యంతఃపురము వెడలి సత్రంబునకు బోయి యందున్న పత్నీతి బ్రహ్మవర్ధనుల గలసికొని వారితో హరిదత్తుని వృత్తాంత మంతకుమున్నె జెప్పియున్నవాడు కావున వారును నతనిజూచినంత బట్టరాని సంతోషముతో నతనిం గౌగలించుకొని పెద్ద తడవు గారవించిరి. హరిదత్తుడును వారియెడల మిక్కిలి సౌహృదయము జూపుచు దాన్నగజుం గలసికొని వచ్చునందాక నచ్చోట నివసింప నియమించి యెట్టకేలకు వారిచే ననిపించుకొని యచ్చట వెడలి బలభద్రునితో నిట్లనియె. మిత్రమా! నాకిప్పుడు మా యన్నను జూడ మిక్కిలి యాతురముగా నున్నది కాలవ్యవధి సహింపనోప గావున జాగుసేయక వేగము నన్నతని యొద్దకు దీసికొని పొమ్మని పలుకుచు దొందరపెట్టుగా నతడును సంతసించి యతనితో నిట్లనియె.

తమ్ముడా! మేము నియమించుకొన్న సంకేత సమయము మూడుదినము లున్నది. అప్పటికి మనము సులభముగ బోగలము. అతండు నాటిదివసము సాయంకాలమున నచ్చోటునకు రాగలడు రమ్ము పోదమని పలుకుచు గతిపయ ప్రయాణములు బున్నపురికి దీసికొని పోయెను బలభద్రుడు దండొరచోట బసజేసి తానుబోయి అదృష్టదీపుని దీసికొనివత్తుననియు నంతవరకు నీవిచ్చోట నివసించియుండుమనియు హరిదత్తునితో జెప్పి వారు సంకేత మేర్పరచుకొన్న స్థలమునకు బోయెను. ఇంతలో నూరక యింటియొద్ద కూర్చుండనేలయని హరిదత్తుడు చక్కనివేషముతో వింతలం జూచుటకు సంగడికి బోయెను. ఆ దివసము శుక్రవారమగుటచే బ్రియంవద కలహంసికతో గూడ బండియెక్కి విహారశైలమునకు బోవుచుండ దారిలో హరిదత్తు డెదురపడుటయు శకటగవాక్ష రంధ్రంబులనుండి చూచి కలహంసిక గురుతుపట్టి, అక్కా! అదిగో! చూడుము చూడుము నీ ప్రియుం డేగుదెంచినాడని చూపగా జూచి ప్రియంవద యంతకుమున్న విరాళింగుందుచున్నది. కావున మిక్కిలి సంతోషముతో బండి యాపించి కలహంసికను బండి దింపి క్రీడాశైలమున నతని దీసికొని రమ్మనిచెప్పి తాను బండితోలించుకొని యచ్చటికి బోయినది.

కలహంసికయు నతనిని మును తాను జూచిన యదృష్టదీపుండే యనుకొని మెల్లగా జెంతకుబోయి నమస్కరించినది. అతండును తెల్లబోయి లోకాచారప్రకారము దీవించెను. అదియు జిరునగవుతో దేవరవారెప్పుడు దయచేసినారని యడుగగా నీ

దినము ప్రాతఃకాలమున వచ్చితినని యుత్తరము చెప్పెను పిమ్మట నది దేవా! మీ కిన్నిదినము లాలస్యము చేయవచ్చునా? మీ కొరకు మానెచ్చెలి పచ్చవిల్తుని తూపుల రాయిడికిం దాళలేక దినమొకయుగముగా గడపుచున్నది ఇప్పుడే శ్రీశైలమునకు బోయినది. మనమచ్చటికి బోవుదమురండు. నన్ను గురుతుపట్టితిరా? క్రొత్తగా జూచుచున్నవారు! నేను దేవర దాసిని కలహంసికయనుటయు హరిదత్తుడు అద్భుతబంధువార్త శ్రవణంబునంజేసి యగ్రజదిదృక్ష స్వాంతమున నిత్యావృత్తాంతరీతుల నంత నియమిం జేసి పూర్వస్మృతి యించుకయేనియులేక యంతకుమున్ను తానాపట్టణమునకు వచ్చినదియు ప్రియంవదను పెండ్లియాడదలచినదియు, చెఱసాలనుండి తప్పించుకొని పోయినదియు మరచిపోయి యది మఱియొక పట్టణముగా దలంచియున్నవాడు గావున రాజపుత్రులకు దరుచు విస్మృతి సహజమైయుండుటం బట్టియు బంభద్రు దచ్చట జరిగిన చర్యలన్నియు దెల్లముగా జెప్పకపోవుటచేతను విస్మయం బభినయించుచు దాని మొగము నిదానించిచూచి యల్లన నిట్లనియె.

కాంతా! నీ ప్రసంగము చక్కగా నున్నయది. నేనెవ్వడ ననుకొని యిట్లనుచున్నదానవు. నీవు నాతో నింతకుమున్దెన్నడేని మాట్లాడితివా! నీ సఖురా లెవ్వతియ? నా కొరకు విరాళిగుందనేల? నన్ను గురుతుపట్టజాలక యిట్లనుచున్న దానవని పలుకగా గలహంసిక దెల్లబోయి యుల్లము ఝల్లుమన, నౌరా! హరిదత్తా! నన్ను నేను యెరుగననుకొంటివా! నీటక్కరిమాటలకేమిలే. రమ్ము పోదము మన రాకకు వాకోకస్తని వేచియుండునని పలికినది.

అప్పుడతండు మరియు వెరగందుచు భళిరే! ఇది మిక్కిలిచిత్రముగా నున్నది. ఈ చిన్నది నాపేరుగూడ చెప్పుచునే యున్నదే! దీని నేనెప్పుడును జూచిన జ్ఞాపకము లేదు. ఈ యువతి మహిమ యిట్టిది కాబోలునని మనంబునం దలంచి దానితో మానినీ! నీదారిని నీవు పొమ్ము. నేను నీతో వచ్చువాడనుకాను. నీకు నా పేరెవ్వరు చెప్పిరి నన్ను నీవిదివర కెట్లెఱుంగుదువని యడుగగా నది పరిహాసమునకే యిట్లనుచున్నవాడని కాలక్షేపము సహింపక విసుగుకొనుచు నిట్లనియె. ఆర్యా! నన్నిదివరకు నేనెరుగను. ఇప్పుడే చూచితిని. నీవు నాతో నింతకుమున్నెప్పుడును మాట్లాడియుండలేదు. నీపేరు నేను దివ్యజ్ఞానమున దెలిసికొంటిని. నీతో గొంచెము మాకు బనియున్నది. మీ వంటివారు పరోపకారమునకు బాటుపడరా? కావున నొకసారి యాయుద్యానవనమువరకు రండని వేడుచున్న సమయములో ప్రియంవద ఎక్కివచ్చిన స్వారపుబండి అచ్చటికి వచ్చినది

అంతనున్నదాది కలహంసికతో, తరుణీ! భర్తృదారిక మీ కొరకే బండి పంపినది. నీతో నెవ్వరినో తీసికొని రమ్మని చెప్పినదట. వారిని దీసికొని వడిగా రమ్మని చెప్పినది. శ్రీశైల ప్రాంతమందలి యుద్యానవనములో నున్నదని చెప్పెను అప్పుడు హరిదత్తుడు విభ్రాంతస్వాంతుడై దానిమాటలచే నేమియుదోచక తల పై

కెత్తి యాలోచించుచున్న సమయంబున నతనిచేయి పట్టుకొని అది ఆర్యా ! రమ్ము రమ్ము నీవేలాగైనను రాకతప్పదు. నిన్ను విడచి పోవుదానను కానని పలుకుచు బండి లోనికి లాగికొని పోయినది.

అతండు దానితో గూర్చున్న వెంటనే యాబండి తోలించుకొని యాకలహంసిక తన్నటిలో నుద్యానవనములోనికి పోయినది. వారిరాక కెదురు చూచుచున్న ప్రియంవదయు నా బండి చప్పుడు వినినంత సంతోషముతో గొంతదూర మెదురుగా గొందర చెలికత్తెల నంపినది. వారును బుష్పమాలికలు గొని యెదురుగాబోయి కలహంసికతో వచ్చుచున్న అతని మెడలో వైచి పాదంబులుగడిగి తడియొత్తుచు వింజామరల వీచుచు ఛత్రంబు పట్టి వెనుక నడువదొడంగిరి.

అదియంతయు గాంచి అతండు విభ్రాంతుండువోలె జూచుచు అయ్యో ! మీరు నన్నేమిచేయుదురో ? ఇది కలలాగున దోచుచున్నది. లేక యింద్రజాలమో ! నా స్నేహితుడు బలభద్రుడుగూడ మోసగాడు కాడుగదా ? కానిమ్ము దైవమేమి చేయ దలచుకొనియెనో యట్లు కాకమానదుగదాయని అంతలోనే ధైర్యము దెచ్చుకొనుచు సిరితి గొంతసేపు పరితాపంబుల స్వాంతమున దలపోయుచు నాకలహంసికతో నడిచెను. కలహంసికయు నతనిని గ్రమంబున బ్రియంవద యున్న లతాగృహంబునకు దీసికొనిపోయి యందమర్చిన పూవు పాన్పున గూర్చుండబెట్టినది

అతండప్పుడు కలహంసికతో బోటీ ! ఈపాటికి నాతోనున్న పనిచెప్పి నన్ను విడిచిపెట్టుము. నా కొరకు నామిత్రుడు వేచియుండును. మీరందరు నిచ్చటికేల వచ్చితిరి. యింతగా నన్ను గౌరవించుటకు నేను మీకేమి కావలసినవాడను. ఇట్టి యాపదలు యిదివరకొకటి రెండనుభవించితిని. బలభద్రుని మూలమున నవి దాటితిని. ఇప్పుడు మరల దటస్థించినది. వేగమె నన్ను బంపుడని పలుకగా విని కలహంసికతో మాటుగా నిలువంబడి ప్రియంవద యిట్లనియె. చెలీ ! ఆర్యపుత్రునకు మనయందను రాగము తప్పినదా యేమి ? యీయన మాటలు మరియొక రీతి నున్నవే ! యింత కాలము జాగైనందులకు చింతించుచున్న మనల నోదార్పక యెద్దియో పలుకుట యుత్తమ ధర్మమా ? ఘనాగమనం బభిలషించు చాతకమువలె నారి రాక మనము వేచియుండ దిరస్కరింప వలయునా ? తెలిసినది. తమ్ము మొదట అవమాన పరచితి మని కాబోలె పూర్వరాజకన్యల దలంచుకొనిన అది తప్పని తోచదు. శపథ భంగము క్షత్రియ ధర్మము కాదుగదా ? నా యపరాధములన్నియు మన్నింప మ్రొక్కుచున్న దాన రక్షింపుడని పలుకుచు దటాలున జనుదెంచి అతని పాదంబులబడినది.

అప్పుడు మెరపు తీగియవలె దళుక్కుమని మెరయుచున్న యా చిన్నదానిని జూచి మోహపరవశుండయ్యెను. పరకాంతయను వెరపు హృదయంబున నుత్తల పెట్ట నిట్టట్టు దెమల్చుకొని, అయ్యో ! కాంతలారా ! మీరెవరో తెలియకున్నది. పూర్వ పరిచయ మున్నట్లు మాటలాడుచున్నారు. మీ మాటలేమియు నా కర్థమగుటలేదు.

నిజము చెప్పుడు. తరువాత దగు సమాధానము చెప్పెదనని పలుకగా విని అక్కల కంఠి యిట్లనియె. ఆహా! నీ వెరిగియుండియు నిట్లడుగుచున్న మే మేమి చెప్పుదుము. నీవు నాకొరకు మొదటినుండియు నెన్నిపాట్లు పడితివి. బందిగృహవాస మనుభవించితివికదా ? తుదకెట్లో నా ప్రశ్నమునకు సమాధానము చెప్పితివి. అట్టి సమయములో దీక్షాకైతవంబున మిత్రిగోరి యెచ్చటికో బోయితివి. అన్నియు జేసి యిప్పుడు నే నేమియు నెఱుగ ననుచుండ మే మేమి జేయగలవారము నీ పేరు హరిదత్తుడగునా కాదా ? నీవు వ్రాసిన యుత్తరము గూడ గలదు. కావలసిన దెప్పింతెదనని పలికిన నతండొక్కింత ధ్యానించుచు నందులో గొన్ని చర్యలు తాను నడిపించినవే గనుక నిదానించి చివర జరిగిన కృత్యములు గురుతులేనందున మగల యిట్లనియె.

కాంతా ! ఆ వృత్తాంతమేమియు అంతగా జ్ఞాపకములేదు. కొంత కొంత జరిగినట్లే యున్నది. దాన నేమియగు. నీవెవ్వని భార్యవు నీ తల్లిదండ్రులెవ్వరు ? నీ పేరేమి ? అని యడిగిన సమ్మగువయు దెల్లబోవుచు నోహో ! యితండు నిజముగానే యిట్లనుచున్నాడా యేమి ? కలహంసికా ! నాతు మెడలో పూవుదండవైచిన వాడితడే యగునా? బాగుగా గురుతుపట్టితివా? ఇతండిట్లనుటకు గారణమేమని అడిగిన నచ్చేడియ యిట్లనియె.

ఇంతీ ! నేనంత వెర్రిదాననసుకొంటివా యేమి ? యితని నంతకు ముందు నుండియు నెఱుంగుదును. అతండిచ్చిన తాటిపండు ప్రశ్నలకు నీవుత్తరమిచ్చినప్పుడు దోసెడు రత్నములు కానుకగా దెచ్చి యిచ్చినవాడు యితడు కాడా ? మనలను వెర పించుట కిట్లనుచున్నవాడు కాని మఱియొకడు కాడని యా పైదలికి సమాధానము చెప్పినది అప్పుడు ప్రియంవద మరల నతనితో ఆహా ! నీ వచనములన్నియు విప రీతముగా నున్నవి. అయినను నీవడిగితివి కావున జెప్పుచున్నదాన నా పేరు ప్రియం వద. మా తండ్రిపేరు రాజవాహనుడు. నేను హరిదత్తుడను వాని భార్యను. మనో వాక్కాయ కర్మలచే నే నతనిని వరించితిని. యింతకన్న నేమియు నెఱుంగ. అతండు నా యిచ్చిన ప్రశ్నములకు సదుత్తరములిచ్చి నన్ను భార్యగా బడసెను. యీ మాటు దెలిసినదా యని యడుగగా నతండు విస్మయ స్వాంతుడై మరల నిట్లనియె.

మదవతీ ! మొదటి మాటలన్నియు నుచితముగా నున్నవి. కాని చివర మాటలకు నారర్థమైనది కాదు. హరిదత్తుడు నీ ప్రశ్నముల కెట్లు సమాధానము చెప్పెనో తెలియకున్నది. అతడు వ్రాసిన యుత్తరమున్నదని చెప్పితివి దాని నొక సారి తెప్పింపుమని పలుకగా నప్పడతి తల కంపించుచు దిగ్గునలేచి సిగ్గువిడిచి యగ్రం గౌగిలించుకొనుచు నాకిపాటి స్వతంత్రమున్నది. ఇక నీవేమి చేయుదువో చూతములే

యని పలుకుచు అతని మొగము ముద్దుగొనుచు చెక్కుల నొక్కుచు పుష్పశయ్యపై జేర్చినది.

అంత మోహమాపుకొనలేక తటిసరసి స్మరుడును విరితూపుల నిరువురను సరిగా గురిచేసి వేధింపుచుండ నా హరిదత్తుడేమియు మాటడలేక యాకోకస్తని చేయు కృత్యములకు బ్రతికృత్యములు గొన్నిగొన్ని గావించి యించుక నవ్వుచు, ముద్దుబోడి నీ వెంతకైన సాహసికవు. నే నిదివరకు రెండు ప్రమాదములు దప్పించుకొంటిని. గాని యిప్పుడు దాటలేక పోయితిని. నిజముగా నీవు పరకాంతవు కావుగదా ? నీయందు లగ్నమైన నా చిత్తమే కానట్లు చెప్పుచున్నది. అని యమ్ముదితను గారవించు సమయంబున దటాలున లేచి యా చిగురుబోడి అయ్యో ! ప్రమాదము వచ్చినది. నేను శ్రీశైలమునకు బోవుచు మిమ్ము జూచి యా మాట మరచి యీ యుద్యానవనము లోనికి వచ్చితిని. దేవిని సేవింప వేగము బోవలయును. వివాహావధివరకు ప్రతి శుక్ర వారము నిట్లు భువనేశ్వరీదేవి నర్చింపవలయునని మా గురువుగా రానతిచ్చిరి. నాటి నుండియు నియమము తప్పక నేటివరకు సేవించుచుంటిని. వేళ అతిక్రమించు చున్నది. నియమమున కంతరాయముగూడ వచ్చినది. మోహమాపలేక నూతన సమా గమము గనుక విస్మృతి నొందితిని కానిమ్ము. ఇప్పుడైన జ్ఞాపకము వచ్చినది. వేగమే పోయివచ్చెద. ఈ శయ్యయందు విశ్రమించియుండుడు. నా చెలులందరు నుపచార ములు చేయుచుందురు. అని పలుకుచు దటాలున లేచి కలహంసిక నతని సేవార్థము నియమించి మరల బండినెక్కి అతివేగముగా శ్రీశైలమునకు బోయినది.

యథాప్రకారము బండి యాకొండపండదిగి అప్పుడతి వడివడి పూజాద్రవ్య ములుగల సజ్జచేతంబూని యగ్గిరిశిఖరమెక్కి తాను జపము చేసికొను ప్రదేశమునకు బోవు సమయమున బొందరచే నొక చిన్న రాయి కాలికి దగిలి తటాలున నేలం బడినది. అప్పుడు సజ్జలోనున్న పుష్పములు పత్రియు సజ్జ చేయి వీడినందున భూమి మీదంబడినవి. అయ్యిందుముఖియు జయ్యన బంతివలె లఘుగతిలేచి నేలబడియున్న పూవులను పత్రిని మరల సజ్జలోని కెత్తుకొనియెను. గోనా ! వినుమల్లప్పుడద్దృష్ట దీపుడు భువనేశ్వరికి మ్రొక్కుసమయమున నదృశ్యౌషధీలత నేలంబెట్టి మరల వెదకిన గనంబడలేదని చెప్పితినిగదా ? ఆ లత ప్రియంవదపడిన చోటనున్నది. కావున దైవవశ మున నాపూవులతోగూడ నది తనచేతికి దగులుటచే దానినిగూడ నా పూజాపాత్రములోని కెత్తి యాసజ్జ జేతంబట్టుకొని అక్కాంత నడచునంతలో నాచెంత దేవీసౌధము గన్నుల పండువ గావించినది.

అప్పుడప్పుడతి మిక్కిలి వెఱగందుచు నోహో ! ఇదియేమి చిత్రము. ఇంతకాలమునుండి యీ కొండకు నేను వచ్చుచుంటిని. కాని యెన్నడును నాకీమేడ గనంబడలేదే ? ఇది యెవ్వరిది ? ఇవి మిగుల నద్భుతముగా నున్నదే ? ఇందుగం

విశేషము లేవియో చూచివచ్చెదంగాక అని నిశ్చయించుకొని యాసజ్జ చేతంబట్టు
కొనియే యామేడలోనికి బోయినది. అంతదృష్టదీపునికి గనంబడిన విశేషములన్నియు
నా చిన్నదానికి గనంబడినవి. ఆ రత్నములు చూచే తన కతడు తెచ్చియిచ్చిన రత్నము
లిచ్చటవే అని నిశ్చయించి యమ్మచ్చెకంటి విచ్చలవిడి అందుగల వింతలన్నియుం
జూచి యతీశ్వరుడిచ్చిన ప్రశ్నము లీసౌధవిశేషములే అని యూహించుచు నందున్న
భువనేశ్వరీదేవి తన అభీష్టదేవత అని నిశ్చయించి తన సజ్జలోనున్న పూవులచేత
నయ్యమ్మవారిని బ్రత్యక్షముగా నర్చించెను.

అప్పుడు యోషధీంత యప్పూవులతోగూడ నమ్మవారి పాదంబులం బడి
నది. కన్నులు దెరచి చూచినంత నాసౌధము ప్రియంవదకు గనంబడక అదృశ్య
మైనది. ఆ సుందరియు యథాపూర్వకముగానున్న శిఖరమును జూచి యాశ్చర్యమం
దుచు నదియొక యద్భుతమైన యింద్రజాలమని తలంచి యావిశేషములు తనసఖుల
కెఱింగింప నతివేగముగా బోవలయునని తలంచుచున్నంత నదృష్టదీపుడు పూర్వము
బలభద్రునితో జేసిన సంకేతస్థల మదియే కావున నాసమయమున నచ్చటికి వచ్చెను.

అట్లొంటరులు తారసిలినంత నన్నెలంత యతని హరిదత్తుడే అనుకొని
నమస్కరించుచు అన్నా? మీరింతలో నిచ్చటికేల వచ్చితిరి. నేను మీకొరకు వేగము
గానే దేవినర్చించి వచ్చుచుంటిని ఇంతలో నాకొక విచిత్రసౌధము గనంబడినది. అది
యిదివర కెన్నడును జూచినదికాదు. దానిలోనికిబోయి చూచితిని. ఆహాహా! అందలి
విశేషములు చెప్పుటకు శేషుడైనను జాలడు. నవరత్నములకు నదియే యాకరమని
చెప్పవచ్చును. మీరు నా నెచ్చెలికిచ్చిన రత్నము లందలివే యని తోచుచున్నది.
నేనట్టి విశేషము లన్నియు జూచుచు నాసజ్జలోనున్న పూవులచే నమ్మవారి నర్చించితిని.
ఇంతలో నదియంతయు నంతర్థానమై పోయినది.

ఇది యేమిమాయయో తెలియదని చెప్పగా నతడు గ్రహించి యయ్యువతి
చేసిన చెయ్వులన్నియు నెఱిగి తెలిసికొని అచ్చటికిబోయి తానుగూడ నా లతను వెద
కుచు బలభద్రుడు నిదిగా గొందనెక్కుచుండుటయు నతని వెనుక రాజభటులు పోవ
లదు పోవలదు భర్తృదారిక మనోహరునితో విహరించుచున్నదని పలుకుచు వెనుకదరు
మకొని వచ్చుచుండుటయు జూచెను. అప్పుడతండు ఓహో! రానీయుడు, రానీయుడు.
అతడు మా మిత్రుడేయని హస్తసంజ్ఞచే వారిని వారించెను. ఆ సన్న గ్రహించి
యాసన్నవర్తులగు రక్షకపురుషులు వానిని బోనిచ్చిరి.

అంతట బలభద్రుడు వనితా సహాయుండైయున్న యతనిం జూచి
యీతండు హరిదత్తుడా! అదృష్టదీపుడా! అను సందియముతో దాపునకు బోవుటకు
వెరచుచుండగా జూచి అదృష్టదీపుడు మిత్రమా! రమ్ము రమ్ము. దవ్వుగా నిలచితి
వేల? అన నతండు దాపునకు బోయెను. అప్పుడు ప్రియంవద పరపురుషసమాగమ

శంకంజేసి యించుక గొంతుచు నోరగా బోయినది. పిమ్మట బలభద్రుండుజూచి అదృష్ట దీపుడు కౌగలించుకొని తమ్ముడా! హరిదత్తునిజాడ నీకేమైనం దెలిసినదా! నీవు లేక పోవుటచే నాకేమియుం దోచినదికాదు సుమీ! ఇన్నిదినము లేయే చోట్లకు బోయితివి. ఏయే వింతలం జూచితివని అడుగగా నతండు నవ్వుచు అన్నా! నీ బుద్ధికి దైవ సాన్నిధ్యము గలదుసుమీ? నీకు హరిదత్తు నందుగల వాత్సల్యము గలిగినందులకు నేనెంతయో వింతపడితిని. ఇప్పటికి దెలిసినది వినుము. హరిదత్తుడు నీ తమ్ముడు. మీ యిరువురకు రూపంబున నింతయేని భేదము లేదు నేనును గ్రహింపలేక పోయి తిని. కాంతిమంతియు నామె తండ్రియు జతుకికయు నతనింజూచి నీవే యని భ్రమ జెంది అతని బెక్కుచిక్కులం బెట్టిరి. రత్నపుగనిలో సామాన్యపు పాషాణమేల జని యించును. వారెన్నిగతుల నిర్బంధించినను బరకాంతయను వెఱపుతో వారి మాటలకు లోబడకుండె. నంతలో నేను బోయి వారి యనుమానము దీర్చి అతని నిచ్చటికి దోడ్కొని వచ్చితి. నిన్ను జూడ మిగుల వేడుకపడుచున్నవాడని తాను జూచివచ్చిన విశేషములును, స్వప్నములో గనంబడిన బ్రాహ్మణుని చరిత్రము, రత్నవతియను దాది చెప్పిన మాటలును నా మూలచూడముగా వక్కాణించెను.

అప్పుడు అదృష్టదీపుడు మేనంతయు జెమ్మటలుగ్రమ్మ గంపముతో, నేమేమి! నా ముద్దులతమ్ముడు హరిదత్తుడే? ఎంత ప్రియమైన వార్త వింటిని. ఈ దివసం బెంత సుదినము! నేడుదయముననే సుముఖుని మొగము జూచితిని! అత డెచ్చట నున్నాడు. మా తండ్రిని బందీగృహములో బెట్టిన దుర్మార్గుండెవ్వడో మరల జెప్పుము? ఆ రత్నవతి యెచ్చట నున్నది! నా తమ్ముని నుద్ధరించిన విప్రునివెంట దీసికొని రాక అచ్చట విడిచి వచ్చితివేమి? అయ్యయ్యో! మా తల్లి యెచ్చటనున్న దియో కదా! బాల్యంబున మా కెట్టి యిడుములు వచ్చినవి. కటకటా! నా మూల మున నింటవతి ప్రాణములు బోగొట్టుకొనిగదనే అని అనేక ప్రకారముల విచారించు చుండ నతనితో బలభద్రుడు వెండియు నిట్లనియె.

అన్నా! గతమునకు వగచిన నేమి ప్రయోజన మున్నయది. ఇంతకును కాలము గదా మంచిచెడ్డలను గలుగజేయునది! అది యిప్పుడు మన కనుకూలమైనం దున నన్నియు సమంచితముగా నున్నవి. యీ కాంత యెవ్వతె. చిహ్నములంబట్టి ప్రియంవద యని తలంచుచుంటి. ఈ వాల్గంటిని హరిదత్తునకు గూర్తునని యిదివర కను చుంటివే. ఇప్పుడు ఆ మాటలు మరచితివా యేమి అని అడుగగా నతని కతండిట్లనియె. తమ్ముడా! మేరువు చలించినను నేను పట్టిన శపథమును విడుతునా? నేనిచ్చటికి వచ్చునప్పటికి ఆ మచ్చెకంటియు నిచ్చటనే యున్నది. నన్నెట్లు గురుతుపట్టినదో యెరిగినట్లు మాటలాడినది.

మరియు నోషధీలత యీ లతాంగి చేతజిక్కి జారిపోయినది. అది పడిన తావు గురుతు పట్టవచ్చును. దానికొరకు కాలోచింపుచుండగా నింతలో నీవు వచ్చితివి.

అంతియ కాని యీ కాంతను నేను వరింపలేదని చెప్పెను. ఇట్లు వారిరువురు మాట్లాడు కొనుచుండగా నచ్చటికి గలహంసికతో గూడ హరిదత్తుడు వచ్చెను వారిరువురను గాంచి అదృష్టదీపుడును వెఱగంది చూచుచుండెను ప్రియవదయు గలహంసికయు సమానాకారములతో నొప్పుచున్న అన్నదమ్ముల జూచి యించుక భేదముగానక విస్మయలజ్జా సంభ్రమములు మనంబున బెనగొన నేమియు మాటాడక చూచుచుండిరి.

అప్పుడు కలహంసిక ప్రియసంవద యొద్దకు బోయి, అక్కా ! యిక్కాంతు డెవ్వడు. యింత యాలస్యము చేసితివేల ? నీ వాలంపంపగా హరిదత్తుడు పోయెనని తొందర సేయగా నిచ్చటికే తీసికొని వచ్చితిని. అతండును హరిదత్తుని పోలికగానే యున్నవా డెవ్వడని యడుగగా నది యోహో ! ఇంత చిత్రము నేనిదివరకు చూచి యుండలేదు. ఈతడే హరిదత్తుడని నేను నమ్మి మాట్లాడితిని అతండిచ్చటికే వచ్చెను గదా అని జాగు చేయుచున్నదాన నింతలో మీరే వచ్చితిరి. ఈతండెవ్వడో నేనెరుగ నని జెప్పినది అట్టి సమయమున బలభద్రుడు హరిదత్తుని గురుతుపట్టి తమ్ముడా ! ఇచ్చటి కెట్లు వచ్చితివి. ఈ కాంతతో నెట్లు మైత్రి గలసినది మీ అన్నగారిని జూడు మితడే యని చెప్పి అదృష్టదీపునికి గూడ వానిని జూపుచు నితడే నీ తమ్ముడు చూడు మని పలికెను. అప్పుడా యిరువురు నొండొరు లెరింగిన పిమ్మట అత్యంతానురాగ ముతో గౌగలించుకొనుచు బెద్దతడవు మైమరచి కన్నుల నానంద బాష్పములు గార మేనులు పులకరింప నెట్టకేల కెలుంగురాల్చుచు అయ్యో ! తమ్ముడా ! మనమెంత దిక్కు లేని వారమైతిమి. అన్నన్నా ! జన్మ సంప్రత్యక్షమైన దైవను మిక్కిలి దైన్యమనుభ వింపవలసి వచ్చెనే ! అని పలుకుచు దల్లి నిగురించి యాలోచించుచు దండ్రిని గురించి విచారించుచు నీ గీతి కొంతతడవు నూతన సమాగమ క్రియావిశేష కౌతుకం బనుభ వించిరి.

పిమ్మట హరిదత్తుడు బలభద్రునిం జూచి అన్నా ! నీవు నన్నిచ్చట విడచి వచ్చిన తరువాత నూరక గూర్చుండనేల నింతలో బురవిశేషములు చూచి వచ్చెదనని యూహించి అంగడికి బోయితిని. అచ్చట నన్నీ చిన్నది పూర్వమందెప్పుడో యెరింగి నట్లు మాట్లాడి బలాత్కారంబుగా నన్ను బండిలో గూర్చుండబెట్టుకొని యీ ప్రాంత మందున్న యుద్యానవనములోనికి దీసికొని పోయినది. అందీ ప్రియంవద నన్ను ప్రియుడవని పిలుచుచు నేమో కావించినది. ఇంతలో నీ దేవీ పూజ జ్ఞాపకము వచ్చి నందున దటాలున లేచి నన్నందు నిలిపి యిచ్చటికి వచ్చినది.

ఎంతసేపటికి రాకుండుట విసిగి నేను బోయెదనని చెప్పిన నన్నీ కల హంసిక యిచ్చటికి దీసికొని వచ్చినది. యిచ్చట మీరు కనంబడితిరి. ఇదియే నీ వరి గిన తరువాత జరిగిన కథయని చెప్పెను. అదృష్టదీపుండును తన మనంబున దలంచు కొనిన ప్రకారము జరిగినందులకు మిక్కిలి సంతోషింపుచు దైవమును మెచ్చుకొనుచు, బలభద్రా ! మనమిక జాగుచేయరాదు. తమ్ముని వెదకి తీసికొని వచ్చినట్లె తల్లినిం

గూఢ దీసికొనిరమ్ము. ముందుగా ప్రియంవదను దమ్మునికి వివాహము చేయవలయును. తరువాత వైకార్యములు చూచుకొందమని పలికెను. ప్రియంవదయు వారియువురను జూచి యించుకయు భేదముగానక యాశ్చర్యమందుచు, గలహంసికా ! ఇది యేమి చిత్రము! దేవమాయగా దోచుచున్నది. పూర్వము దమయంతిని వరించుటకు వచ్చిన దిక్పాలుర పోలికగా నిందెవ్వరో యిట్టి రూపమున వచ్చినట్లు తోచుచున్నది.

ఇందు నా ప్రశ్నముల కుత్తరము జెప్పిన వాడెవ్వడో నిరూపింపుము. వీరి వృత్తాంత మెట్టిదో చక్కగా దెలిసికొనుమని పలికిన నక్కలహంసికయు వారి దాపునకుబోయి మ్రొక్కుచు నిట్లనియె ఆర్యులారా ! మీరియువురు నొక్కరూపున నున్నవారు. మీరన్నదమ్ములని తోచుచున్నది. మీలో మా మిత్రురాలు కోరిన ప్రియుండెవ్వడు ? దాని ప్రశ్నములకు సదుత్తరములిచ్చిన బుద్ధిశాలిని నిరూపించి చెప్పుడు ! ఇంతకుమున్ను యెఱుగక ప్రియుండని భ్రమజెందిన తప్పు మన్నింపవేడెదనని పలికిన విని యదృష్టదీపుం డిట్లనియె.

కాంతా ! నీవు మమ్మడుగనేల ? నీ నెచ్చెలి యెవ్వరిని వరించినదో వాడే ప్రియుండగుగాని యన్యుండెట్లగును. ఈ మాత్రమే తెలిసికొనలేదా ? ఇటువచ్చి చూచుకొనుమని పలికిన నక్కలికియు గ్రహించి అచ్చటికి వచ్చిన వానిని గురుతు పట్టలేక విస్మయముతో జూచుచుండెను. అప్పుడు బలభద్రుడు అదృష్టదీపునితో, నన్నా ! నీ మాటలలో నాకొక సందియము పుట్టుచున్నది. ఓషధిలత చేయిచిక్కిన వాడే నిధులకధికారి యనియు ప్రియంవదకు ప్రియుండనియు నమ్మవారి గుడిలో వ్రాసియున్నది. కావున నది నీ చేత జిక్కెనుకదా ! ప్రియంవదకు హరిదత్తుడెట్లు ప్రియుండగునని యడిగిన నతండొక్కింత ధ్యానించుచు హరిదత్తుని చేయిపట్టుకొని తమ్ముడా ! రమ్ము ఇచ్చట నొకచెట్టు వెదుకవలయునని పలికి యతని నా దాపునకు దీసికొని పోయి అచ్చట నొకచోటబడియున్న నిర్మాల్య ద్రవ్యములను జూచి గురుతు పట్టి యాపత్రిలో జేయి పెట్టించి వెదకించెను.

అప్పుడా లత హరిదత్తుని చేతికి దగిలినది. దానంజేసి మణిప్రభలతో వెలుగుచున్న యామేడ అతనికిం గనంబడినంత వెఱగందుచు. అన్నా ! యిదియేమి చోద్యము. ఇప్పుడు నా కన్నులకొక వింత భవనము గనంబడుచున్నది. యెచ్చటిదని అడుగగా గ్రహించి అప్పటి కతని చేతిలోనున్న యోషధి నంది పుచ్చుకొని, తమ్ముడా ! యిప్పుడేమి కాన్పించుచున్నదని యడిగెను. అతండిప్పుడేమియు గనంబడుట లేదనియు మొదట గనంబడిన మేడ యదృశ్యమైనదనియు నుత్తరము జెప్పెను. అదృష్టదీపుడయ్యోషధీలతను విడువక దిట్టముగా బట్ట చెరగున మూటగట్టుకొని యందలి విశేషము లందరకును చూపదలంచి బలభద్రునితో, తమ్ముడా ! నీవు చేసిన శంకకు సమాధానము దొరికినది. చివరకీలత హరిదత్తుని చేతనే చిక్కినది. నేను తీసుకొంటిని కాన నయ్యనుమానము వదలినది.

మఱియు మీ కందరకు నమ్మేదలోని విశేషము లన్నియుం చూపెదరంతు. నన్ను బట్టికొని యుందురని అందరికి బోధించి యొకరి వెనక నొకరు బట్టుకొని నడచుచుండ గ్రమంబున నా ప్రాసాదములోనికి దీసికొనిపోయెను అచ్చట నుండు వింతలను చూచుచుండ వారికది స్వర్గమనియు స్వప్నమనియు మాయయనియు దోచుచుండెను. అదృష్టదీపుడందలి వృత్తాంతము కొంత కొంత ప్రియంవదకు దెలిపి యా అమ్మవారి యెదుట హరిదత్తునిచే ప్రియంవద పాణి గ్రహింపజేసి తానుజేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనియెను. అప్పుడు హరిదత్తుడు ప్రియంవద చెయ్యిపట్టుకొని అమ్మవారికిని, అన్నకును నమస్కరించెను.

అదృష్టదీపుడు తమ్ముని దీవించి గారవించుచు, హరిదత్తా! నీవీ మత్త కాశిని కొరకు ప్రాణత్యాగమున కొడంబడితివిగదా? దైవకృపచే నిప్పటికి గృతార్థుడ వైతివి! నా మనము చల్లనైయున్నది. నేడు మన యభీష్టదేవతలు ప్రసన్నులైరని పలుకగా నతండు చిరునగవు మొగంబునను మంతనంబై యొప్పుచుండ నన్నతో నిట్లనియె.

# సత్యవతి కథ

అన్నా! నీవు ప్రియంవదను గాపాడ యత్నించి జూనుకొనలేదు. ఖల స్మరణము పాపమనియు నీరీతి మృతినొందిన నిరయము లేదనియు దలంచియే పూనుకొంటిని. అంత తెలివ యుంచ చేయవలయునంచేని వినుము. నన్ను మా పెంపుడు తండ్రి యింటిలో పోరు పడనేరక విద్యాభ్యాస కైతవంబున నన్నొక అగ్రహారంబున సోమశేఖరుడను పండితుని కప్పగించెను. నేనా యగ్రహారములో మధూకరవృత్తిచే జీవనము చేయుచు నాయనయొద్ద జక్కగా విద్యాభ్యాసము చేయుచుంటిని. నా బుద్ధి కౌశల్యము, గుణసంపత్తియు దెలిసికొని మా యాచార్యుడు కొంచెము స్థితియున్నవాడు కావున గొన్ని దినముల కావృత్తి మానిపించి తన యింటనే భోజన సత్కారము చేయుచు జదువు చెప్పుచుండెను.

ఆయనకు బదియారేడుల ప్రాయముగల యొక కూతురు గలదు. దానిపేరు సత్యవతి. అది రూపంబునను గళాకౌశలంబునను నసన్య సామాన్యయై యున్నది. అట్టి చిన్నదానిభర్త పెండ్లియైన వెంటనే కాశికిబోయి యప్పటివరకు రానందున నా సుందరి పూర్ణయౌవనోదయమున జూచువారికి విచారము గలుగజేయుచుండెను. అట్టి సమయమునందే నచ్చట విద్యాభ్యాసము చేయుచుంటిని. దానికి మొదటనుండియు మంచి జ్ఞానమయే యున్నది ఒకనాడు గురువుగారు రాత్రి భోజనముచేయుచు నెద్దియో పుస్త

కము కావలసి పుస్తకాగారమునకుఁబోయి పుస్తకమును దీసికొని రమ్మని నన్ను నియమించెను.

ఆ గది కొంచెము మారుమూలగా నుండుటచే నేనొక దీపము చేత బుచ్చుకొని దానిలోనికి బోవుచుండగా సత్యవతి కొంతదూరమున కడ్డమువచ్చి నా చేతిలోని దీపము లాగికొని, అయ్యో! నీవు సహాయము లేక చీకటిలో బోయెదవేల? నేనుగూడ వత్తును నడువుమని పలుకుచు నాతోగూడ వచ్చినది. నేనును పుస్తకములన్నట్లు విప్పుచు వెదకుచుంటిని. ఆ సమయముననే యా చిన్నది, హరిదత్తా! నీవు కొక్కోకమను మొదలగు లక్షణగ్రంథము లేమైనం జదివితివా? అని అడిగినది. నేను ప్రసంగమున నడిగినదని తలంచి అక్కా! చదివితినంటిని ఆ గ్రంథమంతయు జక్కగా నావృత్తి యున్నదా అని అడుగగా నున్నదని యుత్తరము చెప్పితిని. అట్లయిన నేను వానిలో గొన్ని శ్లోకము లడిగెదను చదువగలవా? అనిన నేనప్పటికి బరీక్ష కడుగుచున్నదనియే తలంచి అడుగుమంటిని. అప్పుడీ క్రింది శ్లోకములు మొదలందిచ్చినంత నిట్లు చదివితిని.

శ్లో॥ ప్రాయోంగనానా । పురవీసత్ప్రైన్యావాపసాసంపురుషాలంభంతె।
ఇదంతువిజ్ఞాయతథోపచర్యాం యథాద్రివంత్యగ్రితఏవవార్యః॥
అత్యర్పితాబాహ్యర తేనభూయో యాదేశకాలప్రకృతిప్రతీత్య
శ్లథాస్తమన్యాఃప్రిబలానురాగాద్రివంతితుష్యంతిశీఘ్రమేవ॥

శ్లో॥ అంగుష్ఠే పద గుల్ఫ జాను-జఘనే నాభౌచవక్షస్తనె। కక్షా
కంఠకపోలదంతవసనెనేత్రాలికేమూర్ధని । శుక్లాశుక్ల విభాగతోమృ
గదృశామంగేష్వనంగస్థితా హ్యూర్ధ్వా ధోగమనేన వామపదగాః
పక్షద్వయేలక్షయేత్॥

శ్లో ॥ బాలస్యాతీషోడశాబ్దాత్తదుపరితరుణీ త్రింశతిర్యావదూర్ధ్వం
ప్రౌఢాస్యాత్పంచపంచాశదవవరతో వృద్ధతామేతినారీ
బాలా తాంబూల మాలాఫలరససురసాహార సమానహార్యా
ముగ్ధాలంకారప్రముఖ వితరణైరజ్యతె యౌవనస్థా॥
సద్భావారబ్ధగాఢొద్భటరతసుఖతా మధ్యమారాలుబ్ధా
మృద్వాలాపైః ప్రహృష్టాభవతి గతవయాగౌరవేణాతిదూరం॥

అని యామె యందిచ్చిన శ్లోకములెల్ల జదువగా నవ్వుచు నిట్లనియె.

ఆమె-పురుషరత్నమా! నీవు లక్షణగ్రంథములు గట్టిగనే వల్లించితివి. లక్ష్యమెట్లుండునో తెలిసికొనవలయును. కన్యక యెన్ని యేండ్లవరకు బాల యనిపించు కొనును?

నేను-పదియారేండ్లవరకును.

ఆమె-తరువాత——

నేను-ముప్పదియేండ్లవఱకును దరుణియనంబడును.

ఆమె-బాలకేమి ప్రీతి ?

నేను-తాంబూల మాల్యాను లేపనాదులు.

ఆమె-తరుణికో ?

నేను-ఏమియుఁజెప్పక యూరకుంటిని.

ఆమె-సుందరునా ! నావంక చూడుము. నేను బాలనో, తరుణినో చెప్ప గలవా ?

నేను-నాకేమియుం దెలియదు.

అనుటయు నా చిన్నది నగుమొగముతో, హరిదత్తా ? నీవు గ్రంథము చదివితివి కాని అనుభవమేమియు లేదుసుమీ ! అని పలికినది అప్పుడు నేను అక్కా ! ఇది మేమనుభవము కొరకు చదివినది కాదు. కావ్యలక్షణములకై చదివితి మని చెప్పితిని. అప్పుడప్పడతి అగునగు నీకు దాని అనుభవమే యుండెనచో నింత టిక్కని వాడవయ్యె నీ యౌవనమంతయు నూరకపోసితివా ? నీవు కోరిన నీ యూరిలో సమ్మతింపని మూఢకాంతయున్నదా ? అని పలికినది అప్పుడు నేను శివ శివా ! రూపమును. విద్యయును దుష్టకార్యములు చేయుటకేనా ! ఈ రీతి నెన్నడును తలంప గూడదని పలికితిని.

పిమ్మట అమ్మదవతి యీ మాటలకేమిలే ! అప్పిన అందాకనే. నీవింతకును నాచవి చూచిన వాడవు కావు కనుక నిటులనుచున్నావు. మహర్షులు గూడ నీ మోహా ములో బడిరను కథలను జదువలేదా యేమి ? అని పలుకగా అక్కా ! ఆ ప్రసంగ మిప్పుడేల ? పుస్తకమును వెదుక నీదీపము తిన్నగా జూపుము. మీ యమ్మ పిలుచు చున్నటుల నున్నది దీపమందుంచి పొమ్మని బలుకగా అక్కలికి యించుక కోపించి అయ్యో ! పోయెదనులే. నీతో నెన్నియో దినములనుండి యొక విషయము చెప్ప వలయునని తలంచుకొని యుంటిని యెప్పుడును సమయము దొరికినది కాదు నేడు దొరికినది ఆ మాట నితరు లెవరును వినకూడదని పలుకగా నేను భయపడుచు నోహో ! మోసము వచ్చుచున్నదే ? ఈ చిన్నది యిదివరకు నీతిశాలి యనుకొను

నిప్పుడు చెదరినదని తోచుచున్నది. ఇంద్రియములు కడు చంచలములు గదా? ఎట్లైన నీయాపద దాటినఁజాలని తలంచుచు ధైర్యముతో అది యేమో చెప్పుమని పలికితిని.

అంత నన్నెలంత సిగ్గు విడచి నలుమూలలు తిరిగి చూచుచు మేను కంపింప సన్నని యెలుగుతో సుందరుఁడా! నేనొక్కటి చెప్పెద వినుము. భగవంతుడు ప్రజల సృజించుటయు అనయమును లిచ్చుటయు సుఖించుట కొరకే గదా? సుఖమను విషయాభిలాష యింద్రియ వ్యాపారము సర్వజంతు సామాన్యమైనది. దానం జేసి పుణ్యాపుణ్యంబులు గలుగుననుట మనుష్య కల్పితము. తల్లిదండ్రు లెవ్వనికి కట్టిపెట్టినను వానిని దైవముగా జూడవలయుననిగదా శాస్త్రబోధ. అది యెంత యుక్తియుక్తముగా నున్నదియో చింతింపుము. తండ్రులు స్వల్ప బుద్ధులయి అన్యాయము చేయఁబూనినచో గన్య ప్రతుకేమి కావలయును. అది నా మతము గాదు. మదవతి యౌవనంబున మొదట నెవ్వని వాంఛించునో వానిని దైవముగా జూచునది. వానిని విడచిన దోషము వచ్చును. ఇంత యేల? యిప్పుడు నేను పూర్ణ యౌవనములో నుంటిని. నన్ను జిన్నప్పుడే యెవ్వనికో పెండ్లి చేసిరట. అది నే నెరుంగను. ఆ మూఢుడు కాశిలోనుండి విద్యాభ్యాస మేమిటికో చేయుచున్నవాడట!

నేను వానిని దైవముగా భావించి యేమి చేయవలెనది? ఆకలి అగునప్పుడు గదా అన్నము తినవలయును. ఇంద్రియములనాప నెవ్వరితరము? ఇప్పుడు నిన్ను నేను కామించితి ననుకొనుము. తరువాత నిన్ను విడచితినేని యుత్కృష్ట దోషము రాక మానదు. ఇదియే నా యభిప్రాయము నా మతములో నీవేకీభవింతువా లేదా? అని అడుగుచుండగనే గురువుగారు భోజనముచేసి లేచి వాకిటనిలచి, హరిదత్తా! ఇంత యాలస్యము చేసితివేల? పుస్తకము దొరకలేదా యేమి? లేకున్న వచ్చి భోజనము సేయుము రేపు చూచుకొనవచ్చునని పలికెను.

ఆ మాట వినినతోడనే బెదరు గదుర నిదిగో! వచ్చుచున్నవాడనని పలుకుచు దటాలున లేచి అచ్చటికి బోయితిని. మా గురువుగారేమిరా యింత యాలస్యము చేసితివని అడుగగా బొత్తము గనంబడనందున వెదకుచుంటినని యుత్తరము చెప్పితిని. నా వెనుకవచ్చిన యా చిన్నది నేను మరుగుపెట్టి చెప్పినందులకు సంతసించుచు నా మొగము జూచి నవ్వినది. నేను దాని నగుమొగము జూచి గుండె ఝల్లుమనన మ్యో! ఇదియేమి పాపము. నా యభిప్రాయ మీప్రోయాలు గ్రహింపకున్నది. మరల నేకతముగా దొరకినప్పుడు చెప్పెదనని తలంచుకొని యా రాత్రి భోజనముచేసి

యథాపూర్వకముగా సరస్వతీ మందిరములో బయండి రెండుయామములు వరకు పాఠ ములు చదువుకొని నిద్రబోయితిని.

ఆ చిన్నదియు రాత్రి జక్కగా నలంకరించుకొని మనంబున గోరికలూర నేనున్న గదిలోకి వచ్చి దీపమారిపి నా యురముమీద వ్రాలినది. నేను పిశాచమను వెరపుతో నరవబోయి అంతలో దాని మేని సుగంధంబు లావిం జేసి గురుతుపట్టి, అయ్యో! నేనిప్పుడల్లరి చేసినచో గురువుగారి కపకీర్తి వచ్చును, ఈ చిన్నదియు నింద పాల్పడును. కావున మెల్లగా జెప్పి పంపెదనని తలంచి లేచి కూర్చుండి అక్కాంత చేయి పట్టుకొని సంజ్ఞలచే నీ పని మంచిదికాదని చెప్పితిని. అదియు వేరొక అర్థము చేసినది రాత్రులు అందరును నిద్రబోవుచున్న వారు. మన కేమియు భయములేదు ఇష్టము తీర్చుకొనుట కింతకన్న నవసరము దొరకదని చెప్పి నది. ఆ మాటలు విని నేను ఓహో! ఇది యిప్పుడున్న త్తయయియున్నది. దీనికేమి చెప్పినను నాటదు. తప్పించుకొని పోవుటకంటె మంచిమార్గములేదని యూహించుచు నది మీదబడుచు గౌగలించుకొన బోవుచుండ చేతులతో నాపుచు వాకిటకు పోయి చూచి వచ్చెదను సుండుమని దాని చెవిలో మెల్లగా నుడితిని. అది నిజమనకొని నన్ను విడచినది. నేనును చీకటిలో దడుముకొనుచు వాకిటకు బోయినంత మాగురువుగా రచ్చ టికి వచ్చి యెవ్వరని అడుగగా నేనని యుత్తరము జెప్పితిని. నీవకారణముగా నిట్లు వచ్చితివేమి అని అడుగగా నేనును సరస్వతీ మందిరములో దీపమారిపోయినది. వెలి గించుటకు వచ్చితినని చెప్పగ నతండును దీపమిచ్చి మరల బోయి పరుండెను.

అప్పుడా చిన్నది యెట్లు తప్పించుకొని పోయినదో తల్లియున్న యింటి లోనికి బోయినది. అమ్మరునాడుదయమున లేచువరకు నా యొద్దకువచ్చి మొగము గడిగికొనుటకు నీళ్ళు దెచ్చి యిచ్చెను. మఱియు నూరక పలుమారు రాబోడంగినది. దాని చర్యలన్నియు హృదయంబున వెరపుగలుగజేయ దొడంగినవి. మఱియు నాలుగు దినములు గడచిన వెనుక నేను గురునానతి పుస్తకాగారమునకు బోగా దారిలో నడ్డము నిలిచి సుందరుడా మనకు మంచి సమయము దాటినది. ఆ దినము నీవు లేచి చూడబోయితివేని ప్రమాదము వచ్చు సుమీ. ఇప్పుడు మంచి సమయము కాదు. నీ విచ్చటికి వచ్చుట చూచే వచ్చితిని. ఒకసారి చెక్కిలి ముద్దు బెట్టకొని పోయెద గౌగ లింతయైన యియ్యుటలేదు. ఎప్పుడు చూచినను విద్యార్థుల నడుమనే యుండెదవేమి? చాలులే నీ మూలమున నాకు నిద్రాహారములు లేకున్నవని పలుకగా నేను, అక్కా! నా విషయములో నీవట్టి అభిప్రాయము గలిగియుండట తప్పు. నీవు నాకు గురు పుత్రికవు అక్కవగుదువు అదియునుంగాక నేను బరకాంత నంటువాడను కాను. నీవల్లరి

పడియెదనని మెల్లగా జెప్పుచుంటిని. ఇక నిట్టియూహ విడువుమని చెప్పుచుండగా నది తల్లి పిలిచినందున నా మాటలు లెక్కగొనక తటాలున నా చెక్కులు ముద్దుపెట్టుకొని అవతలకు బోయినది. నేను పాపభీతిచే నుల్లము ఝల్లుమన దుడుచు కొనుచు హరి హరీ అని పలుకుచు నా పుస్తకమును గొని మరల గురువునొద్దకు బోయితిని.

ఈరీతి పెక్కుసారులు నాకెదుపడినప్పుడెల్ల తన అభిప్రాయము వెల్లడిచేయు చుండ నేను త్రోసివేయుచుంటినిగాని చివర కొకనాడు మా గురువుగారు గ్రామాంత రము వెళ్ళిరి. ఆ దినమున నా చిన్నది చక్కగా నలంకరించుకొనుట జూచి నేను మిక్కిలి భయపడుచు నేనేమి సాహసము చేయునో అని వెరచుచునే యుంటిని. దైవ సంకల్ప మెవ్వడు తప్పింపగలడు ?

ఆ రాత్రి జివరకు నాకు నొంటరిగానే పరుండుట తటస్థించినది. తల్లికి దానియందు నమ్మకము గనుక నెచ్చటికి బోయినను శంకించునదికాదు. అంతకు బూర్వము దాని నట్టిదానిగానే చెప్పవచ్చును. ఆ రాత్రి నేను బండుకొనిన కొంచెము సేపునకే ఘుమంఘుమితముగా బరిమళము వ్యాపింపగ నా యొద్దకు వచ్చి దీపమును మఱుగుచేయక నన్ను లేపుచు నేనును దల్లడిల్లి లేచినంత దన కౌగిటిలో బిగ్గరగా నదిమిపట్టి యిటునటు గదలనీయక గంతంబులు ముద్దుకొనుచు నీరీతి నల్లరిచేయ మొదలు పెట్టినది. అప్పుడు నేను మనంబు చలింపకుండ భగవంతుని ధ్యానము జేయుచు బ్రాణములఁగ్గబట్టికొని దాని సందిటిలోనుండి తప్పించుకొనవలయునని యెంత ప్రయ త్నము చేసినను దానికెంత బలము వచ్చినదో కదలలేక పోయితిని.

పట్టువిడిచిన జారిపోవుదునని కాబోలు నది యెంత సేపటికిని విడిచినదికాదు. అప్పుడు నేను బాలా ! నీవీ రీతి సతీధర్మమును విడుచుట మంచిదికాదు సుమీ ! నీ తండ్రి యింటికి గళంకము తెచ్చిపెట్టచున్నావు. దీన నేమియు లాభములేదు. నాకును నీకును వాసికాదు. నన్ను విడువుము. నేను నీ యభిలాషకు లోబడువాడను కాను నా వలన నీకేమియు బ్రయోజనములేదు. నిన్ను గుణించియే నేను జింతించుచుంటినని యెన్నియో నీతులును సామ్యములు జెప్పితిని. కాని వానినేమియుం బాటింపక యా పాటలగంధి నా కిట్లనియె.

సుందరుడా ! నాకిప్పుడించుకయు నొడలు దెలియుట లేదు. నీ నీతులేమియు నాచిత్తమున కెక్కవు పెక్కు దినములనుండి యవసరము చిక్కక యెన్నియో చిక్కులు పడితిని. నేటికి నా పురాకృతము ఫలించినది. ఒక్కసారి నీయధరామృతము గ్రోల నిమ్ము. తరువాత నేమి చెప్పినను చేయెదను. బంధువులు వెలిపెట్టినను బెట్టుదురు

గాక తల్లిదండ్రులు పొరుగూరు పోయిరి. ఇట్టిసుఖము విడువనేర్తునే యని యధరరసంబాన నెన్నియో ప్రయత్నములు చేసినది. నేను దొరకనిచ్చితినికాను. నాకు దాని దప్పించు కొనుపాటి సామర్థ్యము గలిగియున్నను పెనంగినచో దాని అవయవములు ముట్టవల యునని యుగ్గబట్టుకొని యుంటిని. అంగస్పర్శ మాత్రమునకే యది సంతసించు చుండెను. నేనప్పుడు కామాహతకుని ప్రభావమును గురించి వే తెరంగుల దలపోయు చుంటిని. అదియు నా పీపు దువ్వించుచు శిరమును బొడుచుచు నీరీతి గొంతసేపు పెనంగి పెనంగి చివరకు నాపలేక తటాలున పట్టువదలినంత నేను మృత్యుముఖంబు నుండియుంబోలె నందుండి తప్పించుకొని పారిపోయితిని.

సత్యవతియు గొంతసేపు మరల నేను వత్తునేమో యని యింటిలో గూర్చుం డెనుగాని యెంతసేపటికి నేను రాకుందున మిగుల కోపముతో నాయిల్లు వెదలి నలు మూలలు వెదకినది. నేను దానికి గనబడకుండ గాదిమూలను డాగియుంటిని. అప్పుడు దానికి మొదట నాయందెంత ప్రేమ గలిగినదో యంత కోపమువచ్చి నిరాస జేసికొని యావాకిటిలో నిలువబడి, దుర్మార్గుడా ! నీ కొరకు నేనెంత ప్రయాసపడివచ్చిన నిర సించితివే ! ఇక నీ పాట్లు చూచుకొనుమని పలుకుచు వస్తువులు పారజిమ్మి తల విరియ బోసికొని మేను జీరికొనుచు అమ్మో ! అని యరచినది ఆ ధ్వని వినినతోడనే దాని తల్లి బరియుచు వాకిటకువచ్చి యేమియని అడిగెను.

అప్పుడా సత్యవతి యేడ్చుచు తల్లితో, అమ్మా ! నేనేమి వక్కాణింతును. నీ మగడు వివేకములేక నిర్భాగ్యుని నింటబెట్టుకొనియెను వాడు నా మీదను మొదటి నుండియు గన్నువైచి యుండెను. నేనది గ్రహించి తప్పించుకొని తిరుగుచుంటిని. ఈ రాత్రి నేను వాకిటికి వచ్చితిని. నీవు నిద్రలో నుంటివని లేపితినికాను. వీడది యెగతి గనపెట్టెనో తానుగూడ వాకిటకివచ్చి నా చేయి పట్టుకొని నిర్బంధింపగా వలదు వల దని నేనెన్నియో నీతులు జెప్పితిని. నా మాటలు లెక్కసేయక బలత్కారముగ నాపై బడి సమ్మతింపనందులకు గోపమువచ్చి మేనంతయు జీరెను. శిరోజములు గ్రహిం చెను. చూడుము నిన్ను బిలిచినంత బారిపోయి యెచ్చటనో దాగియున్నవాడు. నా తండ్రి యింటలేక పోవుటచే నా కిట్టి యాపద వచ్చినది అని బిగ్గరగా నేడువ దొడం గినది.

దాని యేడుపు వాడు చిక్కలేదనియే కాని మరియొకటి కాదు. అప్పుడు తల్లి కూతురినోదార్చుచు, హరిదత్తా ! హరిదత్తా ! అని నన్ను జీరినది. నేనును గాది

మాటున నుండి అచ్చటికిబోయి యేమని అడుగగా నామె నన్ను దిట్టుచు నిన్నింట బెట్టుకొని జదువు చెప్పించుచున్నందులకు మంచిపనియే చేసితివిలే కానిమ్ము. నీ గురువు రానీ అని నన్ను మందలింపుచు నిరుగుపొరుగు వారిని కేకలు వైచినది. అప్పుడు వారు కొందరు వచ్చి అది చెప్పిన మాటలు నమ్మి నన్ను నిందింప బొడంగిరి. అంతకు మున్నది గుణవంతురాలని యెల్లరు చెప్పుకొనుచుందురు. కావున నేనేమి చెప్పినను లాభము లేకపోయినది నేను గాదిమాటున దాగియుండుట దాని మాటలకే యుచిత ముగా నున్నది.

నేనును దప్పుచేసిన వానివలె దలవాల్చుకొని దైవకృత్యమునకు వగచుచు నెట్టకేల కారాత్రి వేగించితిని. ఉదయంబున సోమశేఖరుడు వచ్చినంత నా వృత్తాంత మంతయు భార్య చెప్పినది. అప్పు డతడు దూర్వాసునివలె మండిపడుచు నన్ను జీరి, యోరీ! కృతఘ్నుడా! తృణచ్ఛన్న కూపంబువలె గుణవంతుని పోలికనొప్పుచుంటివే దరిద్ర చూడామణివైన నిన్నింటబెట్టిన నెట్లుసేయుదువు? నీ పోలిక పుస్తకము తీసి కొని రమ్మని చెప్పి యంపినప్పుడును నర్ధరాత్రము బైటకు వచ్చినప్పుడును నసుమానిం చితిని. ఆ సమయములలో సిగ్గుండించితివనిగూడ మా సత్యవతి చెప్పుచున్నది. ఆ సతీతిలకము నీ అందమునకు లోభించు ననుకొంటివి కాబోలనని పెక్కు తెరంగుల నిందించుచు మా యింటినుండి లేచిపొమ్మని దుడ్డుకఱ్ఱ తీసకొని కొట్టవచ్చెను.

అప్పుడు నేను దెబ్బలకు వెఱచి యిల్లు వెడలి పారిపోయితిని. నన్ను జూచిన వారెల్ల నన్నే యన్యాయము చేసినవానిగా భావించి నిందింప బొడంగిరి. అప్పుడు నేను దైవమును దిట్టుచు నిష్కారణము ప్రజలు నన్ను నిందించుచుండ బ్రతికియుండుటకన్న మృతినొందిన యుక్తముగా నుండును. సత్యమునందు భగ వంతు డుండుననుమాట అసత్యమైనది. దైవమును వంచించుటకు సమయుటకన్న వేరొండుపాయములేనని యూహించి చావుకొఱకు పెక్కుమార్గము లూహింపుచు దైవగతి నీయూరజేరి యిందీవృత్తాంతము విని నేనా ప్రశ్నలకుత్తరము జెప్పెదనని పూనుకొంటిని. ఇంతియేకాని ప్రియంవద యందుగల మక్కువచేతగాదు అని చెప్పగా అదృష్టదీపుడును తక్కినవారు అతని చిత్తనైర్మల్యమునకు మిక్కిలి సంతసించిరి.

అదృష్టదీపుడట్లు దేవిసౌధము తనయధీనము చేసికొని దానిలో గొన్ని రత్నములు బంగారము గైకొని అచ్చటనుండి వారితో గొందఱగి బండియెక్కి మిగుల వైభవముతో రాజవాహనుని కోటలోనికి వచ్చెను. రాజవాహనుడును పుత్రికచే నతం

రదృష్టదీపుఁడనియు అతని తమ్ముఁడు సోమదత్తుఁడనియు తెలిసికొని మిక్కిలి సంతసించుచు అతని పాదంబులంబడి తెలియక చేసిన యవజ్ఞను సైరింపుమని వేడుకొనెను. ఆ వార్త అంతలోనే పట్టణమంతయు వ్యాపించినది. అదృష్టదీపుఁడు వచ్చెనని వినినంత యాచకులు బ్రాహ్మణులును వేనవేలు ప్రోగుపడిరి. అదృష్టదీపుఁడప్పుడు గొప్ప శిబిరములను దెప్పించి కేళీశైలమున వేయించి అది నెలవుచేసికొని దేవీభవనమునంగల వస్తువులును, మణులును లోహములు నడుపరకు పనకొరకు దీర్థములవెంబడి తిరుగుచున్న బ్రాహ్మణులకును, దరిద్రులకును దానము చేయదొడంగెను. దేవీసౌధమునంగల ద్రవ్యమంతయు అక్షయమైనది గనుక నతండెంత ద్రవ్యము గరుచుపెట్టినను కొదవ లేకున్నది. అదృష్టదీపుఁడు పుష్పపురిలో తమ్మునకు వివాహము చేయుననువార్త జగంబంతయు వ్యాపించినందున భూమియందుగల విద్వాంసులందరును అచ్చటికి రాదొడంగిరి.

# ప్రియంవదా హరిదత్తుల వివాహము

పద్మినారినగరంబు కుబేరులంజేసి యనుభవించుచుండెను. దానితో నిది యొక రత్న మిచ్చెనేని కోటీశ్వరు లగుచుందురు. తరువాత అదృష్టదీపుఁడు ధర్మపురినుండి రత్నవతిని బ్రహ్మవర్ధనుని పిలిపించి వారివలన మరల నెఱుగనట్లు తమ పూర్వ వృత్తాంతము దెలిసికొని మిక్కిలి విచారించుచు దల్లిదండ్రుల చెఱ విడిపించుటకై ప్రయత్నించి కాంతిమతిని జతురికతోఁగూడ నచ్చటికి రప్పించి యుచిత సంభాషణలచే నోదార్చెను.

మఱియు ధర్మపాలుని భార్యయగు సునందజాడ జెప్పినవారికినిగాని, యామెను దీసికొని వచ్చువారికిగాని నూరుకోట్ల దీనారములు గానుకగా నిత్తుమని ప్రకటించుటయేగాక ప్రతిగ్రామమునందును జాటించునట్లాజ్ఞాపించెను. అదృష్టదీపుఁడు ప్రతిదినము నెచ్చటనున్నను నూరుకోట్ల బంగారము బ్రాహ్మణులకు దానము చేయుచుండుటచే అతని ఖ్యాతి పూర్వముకన్న భూమియంతయు నెక్కువగా వ్యాపించినది.

భూమియందుగల రాజులకందరకును రావలయునని యుత్తరములు వ్రాసెను గాని కోసలేశ్వరుఁడగు వసురక్షితునికి మాత్రము వర్తమానము చేయలేదు. అంతకు

బూర్వమునుండియు నృపతులందరకును అదృష్టదీపుని జూడవలయునని అభిలాష గలిగియున్నది. కావున నా వార్త వినినతోడనే తమకుగల వస్తువాహన సామగ్రితో బయలుదేరి అతనియొద్దజేరిరి. వచ్చిన రాజులకు నుపచారములు జేయుటకు బెక్కండ్ర పరిచారకుల నియమించెను. ప్రతి భూపతియు అగండొక దివసము చేసిన విందు తమ జీవితకాలములో నెరుగమని స్తుతిజేయదొడంగిరి.

వినినదానికన్న అతని యైశ్వర్యమెక్కుడుగా నున్నదనియు నిటువంటిదాత యిక పుట్టబోడనియు ఇతనికింత యైశ్వర్య మెచ్చటిదనియు అతండిచ్చు నొకమణి విలువ మనయైశ్వర్యమంతయు లేదనియు దమకు దోచినరీతిగా భూపతులు పొగడ దొడంగిరి. అదృష్టదీపుడు ప్రకటించిన పదిదినముల కా సునందను వెంటబెట్టుకొని యొక బ్రాహ్మణుడు వారి యాస్థానమునకు వచ్చెను. ఆ వార్త రత్నవతిచే దెలిసికొని అదృష్టదీపుడు హరిదత్తుడును వేగముగా జనుదెంచి యా సునందంగాంచి యిరువురు చెరియొక ప్రక్కను జేరి గౌగలించుకొనిరి. అప్పుడామె పాలిండ్లనుండి పాలు ప్రవాహముగా రాదొడంగినవి. వారిరువురు పుత్రులని తెలిసినప్పు డప్పడతి హృదయంబునం గల యానందము పట్టజాలక మగనిం దలచుకొని గోలుగోలున నేడ్చుచు నాయనలారా! మిమ్ములను గనుటయే కాని మీ బాల్యక్రీడలను నన్మాలాపములను జూచుటకు నాకును, మీ తండ్రికిని యోగము లేకపోయినది.

దైవమీరీతి మనకు వియోగము వ్రాసె నేమి చేయుదుము. కలిగియుండియు బేదలగతి జిక్కులం బడితిరి. అన్నపానాదుల విషయమై సమయమునకు దొరకక యెన్ని చిక్కులంబడితిరో! మీ యాకలి యరసి పెట్టువారెవ్వరు! నేనేమి చేయుదును. దైవ కృపచే జిక్కులంగడచి పెద్దవారైతిరి. నా కన్నులబాపు నేటికి తీరినదని శిరంబులు ముద్దుకొని హృదయం బ్రీతి గన్నుల బాష్పములు గార్చు తల్లినోదార్చుచు అదృష్టదీపుం డిట్లనియె. తల్లీ! నీవు వీరమాతవు సామాన్యకాంతవలె జింతింపదగదు. నీ విన్నిదినము లెవ్వనియింట నుంటివి. యెవ్వడు నిన్ను రక్షించెను. వాని పేర్కొనుము. వాని యిల్లంతయు బంగారము చేయుదును. మరి నీ కెవ్వడేని యవమానము గావించిన వాని హతము గావింతుము. నీ వృత్తాంతము దెలుపుమని యడుగగా అప్పడతియు గద్గదికంఠముగా కొడుకులు, కోడండ్రును, సాప్తులు జుట్టును బరివేష్టించి కొలుచుండ రత్నవతి మొగము జూచుచు నిట్లు చెప్పదొడంగెను.

# సునందకథ

అల్లనాడు నేనరణ్య మధ్యమునలో బుత్రకునిం గని యొడలెఱుంగక దాహము దెమ్మని రత్నవతికిం సంజ్ఞ చేసితిని కదా! రత్నవతి యుదకము దెచ్చుటకై యరిగిన వెనుక నాకు బరితాప మెక్కువైనది. అట్టి సమయమున నొక్కకోతివచ్చి నాయొడిలో నున్న ముద్దుపట్టి నెత్తుకొని పోవుచుండగా గన్నులార జూచుచుండియు వారించుటకు శక్తిలేమింజేసి చేతులు కాళ్ళను కదపలేక చింతించుచు మూర్ఛపోయితిని. ఇంతలో నాదారి నొక వర్తకుడు మణిమంతుడను వాడు అత్తవారి యింటియొద్దనుండి పల్లకీ మీద భార్యను దీసికొని వచ్చుచు దారిలో మూర్ఛమునింగియున్న నన్నుజూచి దయామతి గావున జాలిపడుచు బిలిచి పలుకకున్నంత నన్నుగూడ నయ్యాందోళికమున నెక్కించుకొని తమపురికి దీసికొనిపోయెను.

ఇంటికడ మంచివైద్యుల బిలిపించి తగిన చికిత్స చేయించుటచే నాలుగు దినములకు స్మృతివచ్చినది. క్రమక్రమముగా బలము చేరినత పుత్రకునికై చింతింపుచుండగా నాదంపతులు మిక్కిలి మంచివారు కావున నన్ను నిత్యము నోదార్చుచుండిరి. అని చెప్పినంత అదృష్టదీపుడతని పేరును వ్రాసికొని యప్పుడే యా మణిమంతుని యేనుగపై నెక్కించి తీసికొని వచ్చునట్లు తగిన దూతల నంపెను. సునందయు దరువాయికథ యిట్లు చెప్పందొడంగెను. అట్లు నేనా మణిమంతుని యింటిలో సురక్షితముగా రెండుమూడు సంవత్సరము లుంటిని. అతని భార్య అంబిక అనునది నాయందు గౌరవముంచి నీచకృత్యములకు నియోగింపక సమానప్రతిపత్తిగా జూచుచుండెను.

అంత నొకనాడా యంబిక తమ్మునికి వివాహ మగుచుండ నమ్మహోత్సవమునకు నన్నుగూడ దీసికొని పోయినది. అచ్చటివారెల్ల నన్నామె దాసియని నీచకృత్యములకు నియోగించువారు నేను బెద్దవారు చెప్పుచున్నవారు కదాయని తీసివేయ

లేక యాపిక కొలది చేయుచుంటిని. నే నొకనాడు ఉచ్ఛిష్టపాత్రల నెత్తుచుండ అంబిక నీచఁదు, ఏమే సునందా! దాసీకృత్యములు చేయనేల నన్నుంచుకొనిన నిన్ను మిక్కిలి గౌరవముగా జూతునని పలికెను. ఆ మాటలు విని నేను దలవాల్చుకొని దైవకృత్య మిట్టిదిగదా యని కన్నుల నీరు గార్చుచు నా కృత్యములు చేయుచుంటినని చెప్పు చుండగా బుత్రకు లిరువురు గన్నొనల నశ్రుధారలు గారుచుండ, అమ్మా! వానిం బేర్కొనుము. నాలుక ముక్కలు ముక్కలుగా జీరెదుమని బల్కుచుండ నా సునంద తండ్రులారా! వాని నిందింపనేల? మనకాల మట్టిది నేను నా యవస్థ చెప్పి మిమ్ము సైతము దుఃఖము పాలు సేయుచుంటిని వాని మాటలకు నేనేమియు బలుకక యూర కుండినంత నా మెత్తనము గ్రహించి ప్రతి పురుషుడు అట్లే అడుగ దొడంగిరి. అప్పుడు నేను బోయి అంబికతో నాకథ యంతయుం జెప్పి నీవు వానిని మందలింపని నాడు నేనేమి చేయుదాన బలాత్కారముగా మృతినొందెదనని చెప్పితిని. అప్పుడామె నన్నోదార్చుచు నా బోజగుల నందరిని మందలించినది.

మరికొన్నిదినములు చనినంత మిక్కిలి ధనవంతుడగు వైదేశికుండను వర్తకుడు నన్ను కామించి అంబికను వేడికొనియెను నాబుద్ధి యెరింగినదైనను అయ్యంబిక స్త్రీచాపల్యంబునం జేసి యొకనా డేకాంతముగా నన్నుజేరి అతని గౌరవమును, భాగ్యమును, సౌందర్యమును బొగడుచు నిట్లనియె. సునందా! నీతో నే నొక్కటి చెప్పదలచుకొంటిని. నీవిప్పుడు నడిమి వయస్సులో నుంటివి. అపుత్రలెవ్వరును లేరు. కాలుసేతు లాడినంత సేపుగాని యితరులు పైన బోషింపరు కదా? వైదేశికుడను వర్తకుడు నిన్ను కామించి యున్నవాడు. అతడు కోటీశ్వరుడు. అతనికి భార్య చనిపోయినది. ప్రాయము కొంచెము మిగులుటచే తిరుగ పెండ్లియాడ దిష్టములేదు. సంతానము కలిగియున్నది.

అతని నీవాశ్రయించితివేని నీకు దగిన మర్యాద జరుగును. అతని యింటి కార్యములన్నియు నీవె చక్కబెట్టవచ్చును. అతడు మిగుల మంచివాడు. దీన నీకేమియు గొదవ యుండదు. అట్లుచేయుట నాయభిప్రాయము నేనున్నంతకాలము నీకేమియు లోటులేదు. కాని నా యనంతరము నీవేమి యగుదువో యని చింతించుచున్న దాన అతనిం జేరితివేని నా మనంబు సంతసించును. నీ యభిప్రాయమేమని యడిగినది. అప్పుడు నేను గన్నీరు గార్చుచు, అమ్మా! నీకు సైతము నాయందిష్టము తగ్గినది కాబోలు. నన్నెన్నడు నిట్టిమాట లనియెరుగవు. ఇదియు నా ప్రారబ్ధమే. ప్రాణములు

పోయినను గులము చెడినను నా మనంబెప్పుడును నిట్టిపని కుద్యోగింపదని నమ్ముము. స్త్రీలకెన్ని దుర్గుణములున్నను పరపురుష సంగమము విడచెనేని యుత్తములని చెప్పుదురు.

పుంశ్చలియైన స్త్రీ యెన్ని నియమములు కలదైనను నింద్యురాలిగా జెప్పుదురు. శీలమువీడిన కాంత లోకాంతరములయందు నరకయాతనల ననుభవించును. ఎంతయాపదవచ్చినను శీలము విడువరాదు. శీలసంపన్నులైన చంద్రమతి ద్రౌపదీ ప్రముఖ సాధ్వుల చరిత్రము మనము వినియుండలేదా? నీవు మిగుల యుత్తమురాలవు. నీవిట్టిపనుల కెన్నడును నెవ్వరిని ప్రేరేపింపకుమని యుక్తిపలికితిని. నా మాటలచే నా పాటలగంధి సిగ్గుపడుచు నేమియుం బలుకలేకూరకుండెను. నేనును ఆమె చిన్నవోయి నందుకు లజ్జించుచు మరల నామెకు సంతోషము గలుగుమాటలు పలికి రంజింప జేసితిని.

మరియు నేనారాత్రి పరుండినపోటునకా వైదేశికుడువచ్చి రత్నభూషణము జూపుచు సునందా లెమ్ము నేను వైదేశికుడ. నావార్త అంబిక నీకు జెప్పియేయుండును. నిన్నుత్తమస్థితికి దెచ్చెదనని చెప్పగా నేనా భయపడుచు లేచి, అన్నా! నేనట్టిదానను కాను. అంబికతో నా యభిప్రాయము చెప్పితిని. నీచకృత్యములుచేయుచున్న నన్ను గామించిన నీకేమి లాభమున్నది. మరియొకదానిని గోరుకొనుము. నేను నీకూతురువంటిదానను. నీకుకూడ పుత్రికలు గలిగియుండిరికదా? వారినతత చెరిచినప్పుడు నీకెట్టి విచారము గలుగునో నా విషయము నట్లే తలంపుమని పలుకగా నతనికి గోపమువచ్చి కన్నులెఱ్ఱ జేయుచు నాకిట్లనియె

ఓసిరండా! నీవును నా పుత్రికలకును సామ్యము దెప్పుకొనిచుంటివే. నీవు చేయుకృత్యములు వారుచేయుచున్నారా! నీకును వారికిని హస్తిమశకాంతరముకలదు. మాయింటికి దాదిగావచ్చి పెద్దమాటలు చెప్పుచున్నావే. నీ టక్కులు నాకు దెలియును. నీవు సమ్మతింపనినాడు నిన్నుదన్ని మరియు దీసికొనిపోయెదను. మా మణిమంతుడు వెఱ్ఱివాడు కావున నిన్నూరక మేపుచున్నాడు. దుత్తలాగిన దీని యేమిచేయుదువని పలుకగా రోషముతో నేనిట్లంటి. నీచుడా? నీవు భాగ్యవంతుడవని గర్వపడుచున్నవాడవు. నీ భాగ్యమంతయు నా కాలిగోరు విలువచేయదు. నీ మాటలకు నేను లోబడను నన్నూరక నిందింతువేని పాపము మూటగట్టికొనియెదవని పలుకగా నీసబూని ఛీ ఛీ! రండా! ప్రేలెదవా! నా స్థితియెరుంగక మాట్లాడుచున్నావని కత్తి నెన్నుకొన్నను.

ఆ తాపునకే నోపక నేలబడి మూర్ఛిల్లి యెట్టకే తెలిసి దైవకృత్యమునకు వగచుచుంట నెందియు వాడువచ్చి నిర్బంధించుచు నోటికిరాని కూత లరచెను. మరల బలాత్కారము సేయబోయినంత భీతస్వాంతనై యరచుచు నాప్రాంతమందున్న విప్రగృహమునకు బారిపోయితిని. అతడును నన్ను దరిమికొని వెంటవచ్చెను. నా మొరవిని యాయింటి బ్రాహ్మణుడు లేచి యేమి యేమి యని అడుగగా పాదంబుల బడి రక్షింపుమని వేడుకొంటిని. అతడును భయములేదని చెప్పుచుండగా నా వెనువెంట నా వైదేశికుడువచ్చి బ్రాహ్మణుడా యారండ నిట్లు త్రోసివేయుమని పలికెను.

అతడును తొందరపడకుము ఇదియేమి తప్పుచేసినది ? వైదేశికా ! చెప్పుమని అడుగగా, నోహో ! అదియంతయు నీకేల? నాస్థితి యెరుగుదువా ? పంపకున్న నీపనిసైతము పట్టించెదజూడుమని చెప్పెను. అప్పుడా బ్రాహ్మణుడు వెరచుచు నన్ను విడువదలంచినంతలో నచ్చటనే అరుగుమీద బరుండియున్న రాజకీయోద్యోగస్థుడొకడు నాయార్తి అంతయు నా వలనవిని జాలిపడిలేచి యావైదేశికునిమీద దిరుగబడి యెవ్వడ నీవు ? అర్ధరాత్రమిట్లువచ్చి అల్లరిచేయుచున్నావని బెదరించెను. అతనిని జోరుల నరయుటకై ప్రచ్ఛన్నముగా భటులతో వచ్చిన దండనాయకుడని యెరుంగక సామాన్యుడని యూహించి యా వైదేశికుడు ఓహో ! నీవెవ్వడవు ? కడుజులకనగా మాట్లాడుచున్నవాడవు. నా మర్యాద గుర్తెరింగి పలుకుము. మీరందరు మా దాసిని యింటబెట్టుకొని యెదుర నన్నే బెదరింపుచున్నవారు. చూడుడు మిమ్మందరనిప్పుడు శిక్షింపజేసెదనని పలుకుచు దుడ్డుకర్రతో గొట్టవచ్చెను.

ఆ సమయమున నాయుద్యోగస్థుడు నోటితో నెద్దియో యూదిన యమ కింకరులవంటి రాజభటులు పెక్కండ్రుదువచ్చిరి. వారింజూచి వైదేశికుడు అదిసి పారిపోవదలంచినంతలో వారతనిని బట్టుకొని పాదములకు నిగళములు దగిలించి వాడు చేసిన దుర్మార్గమును నా వలన జెప్పించుకొని యాతని నగరికిం గొనిపోయి బందీగృహంబున వైచిరి. నేనును గొన్నిదినములా బ్రాహ్మణుని యింటనుండి వెండియు వేరొక రాజధాని జేరి యెవ్వరియింటనుండక వెర్రిదానివలె తలవిరియబోసి మేనంతయు ధూళిరాచికొని బిచ్చమెత్తుకొనుచు నా యూరిలో నొకదేవాలయమున రాత్రులు శయనింపుచు మరికొన్నిదినములు దేశయాత్ర నడిపితిని

ఒకనాడు సాయంకాలమున నేనా గుడిలో నుండగా గొందరు బ్రాహ్మణులు వచ్చి యొండొరులిట్లు సంభాషింపదొడంగిరి వెంకటశాస్త్రి ! యీ యూరిలో నేడు వాదిం

చిన విశేషములు వింటివా! ధర్మపాలుని పత్నియైన సునంద నెవ్వరైన దీసికొని వచ్చినచో నూరకోట్ల బంగార మిత్తునని యదృష్టదీపమహారాజుగారు ప్రకటించిరట. ఆమె మనకు దొరకిన మన దరిద్రము దీరునుగదా. అనగా మరియొక బ్రాహ్మణుడు మన కంత మాత్ర మదృష్టము పట్టునా? ఆమె పోలిక యెట్లుండునో చెప్పరా? అన మరియొకడు పేరును బట్టియే యూహింపవలయును. నాకామె గనంబడినచో నీ స్వామికి లక్షపత్రిపూజ జేయింతునని యె. వేరొకడు సత్యనారాయణ వ్రతము. ఇంకొకడు దీపారాధన. ఈ రీతి నందరును మ్రొక్క మొదలుపెట్టె.

ఆ మాటలు నేను విని సంశయమందుచు నాయదృష్టదీపునికి నా యవసరమేల వచ్చె? అతడు నా కొమరుండు కాడుగద? నాకంత యదృష్టము పట్టునా? ఇతరులకు నా పని యేమి? అంత విత్తము కరుచుపెట్టనేల? అని యాలోచింపుచుండ సవ్యబాహావును నేత్రమును దొదయు నదరినది. ఆ శకునములు గ్రహింపుచు సంతోషముతో నుండి యాబ్రాహ్మణుల దీనాలాపములు నాకు సంతాపము గలుగజేయుచుండ నందులో నొక వృద్ధ బ్రాహ్మణుని జీరి యిట్లంటి. అయ్యా! తమరిట్లు సునంద కొరకు బరితాప మొందుచున్నారు. ఆమెతో మీకేమి ప్రయోజనమున్నది. ఆమె యున్న జాడ నేనెఱుంగుదును రేపువచ్చిన జెప్పెద ననుటయు నా మాట విని యందరు చుట్టుకొని చెప్పుము, చెప్పుమని ప్రార్థింప దొడంగిరి.

నేనును రేపు వచ్చిన జెప్పెదనంటిని నన్ను బిచ్చదానిగా గుర్తెఱింగిన వారంచుందుట జేసి యిస్సిరో! ఇది వెఱ్ఱిది దీని మాటలు నమ్మి తిరుగ వచ్చితిమి. రండు పోదమని అందరు నవ్వుచు బోయిరి. ఈ బ్రాహ్మణుడు మాత్రము నన్ను విడువక అమ్మా! నేను మిక్కిలి దరిద్రుడను కుటుంబము పెద్దది. పోషింపలేక కడు చిక్కులు పడుచుంటిని. నన్ను రక్షించి యామె యున్న జాడ జెప్పుమని యారాత్రి యింటికిబోక నన్ను వేడుకొనుచుండెను. అప్పుడు నాకు జాలివొడముటచే నెన్నియో మాటలు సెప్పి చివరకు నేనే సునందనని జెప్పితిని. మొదట నమ్మలేదు కాని యతడు నా చరిత్రమంతయు జెప్పినంత సంతోషింపుచు నెవ్వరికిని జెప్పక యారాత్రియే ప్రయాణము జేసి యిచ్చటికి దీసికొనివచ్చెను. ఇదియే నా వృత్తాంతము. ఈ విప్రునకు మీరిత్తుమన్న ధన మియ్యవలయునని పలుకుచు మగని గురించి విచారింపదొడంగినది.

అప్పు డదృష్టదీపు డామె నోదార్చుచు నాబ్రాహ్మణునికి నూరుకోట్ల ధన మిచ్చి మరియు నాసంతోషముతో ననేక దానములుచేసి మిగుల వేడుకతో నాధినను

గడిపెను. మరునాడు రాజులనందరం బిలచి సభఁజేసి యిప్పుడు మేము చోళదేశప్రభు వైన వసురక్షితుని మీఁదికి యుద్ధమునకుఁ బోవుచుంటిమి. కావున మాకు సహాయ మెవ్వరు వత్తురని అడుగఁగా నందరును ముందే ప్రయాణమైరి. అతఁడు దుర్మార్గుఁ డనియుఁ గపటోపాయములచే శత్రువుల వంచించెననియు నందరు నెరుంగుదురు. కావున నతనిపై దండయాత్రకుఁ బోవుటకు రాజులందరును మిక్కిలి సంతోషించిరి పిమ్మట మంచి సమయమునఁ జతురంగ బలములతో నదృష్టదీపుఁడు చక్రవర్తులందరు సేవింప దాడివెడలి యా దేశమునకుఁబోయి పట్టణము ముట్టడించెను.

వసురక్షితుఁడా వార్త చారుల వలన విని యదృష్టదీపుఁడు ధర్మపాలుని కుమారుఁడగుటచే నతనిం జయించుట గష్టమనియు సంధి కొరఁబడ దనియు నిశ్చయించి పారిపోవఁ బ్రయత్నించెను. కాని యా రహస్యమును దెలిసికొని యదృష్టదీపుఁ డతనిఁ బట్టుకొని తండ్రి యంఘ్రులం దగిలించియున్న సంకెళ్ళు విప్పించి అతని పాదములం గట్టించెను. ఆహా ! కుమారుండన నతండే కదా ! చింతాకుల స్వాంతుఁడై యున్న ధర్మపాలుని యొద్దకు బోయి పుత్రకులిద్దరును పాదంబులఁబడి తమ వృత్తాంత మంతయు జెప్పి అతని కానందము గలుగఁజేసిరి

ధర్మపాలుఁడును పుత్రులఁ గారవింపుచుఁ దన యదృష్టమును గురించి భగ వంతుని స్తుతిఁజేసెను. పిమ్మట నదృష్టదీపుఁడు దుర్వినీతుడును విహారభద్రుఁడు చెఱపట్టనున్నారని విమర్శింపగాఁ దమ రాజధాని యైన కౌశంబి యేలుచున్నారని తెలిసి నది. అప్పుడు మిక్కిలి కోపముతో దండు లేవనెత్తి కతిపయ ప్రయాణములఁ గౌశాం బికిఁ బోయి వారినిద్దరిని బట్టుకొని కారాగృహమునం బెట్టించి సుముహూర్తమునఁ దమ కోటలోఁ బ్రవేశించి పట్టాభిషిక్తుడై సమస్త భూపతులకు వెలలేని రత్నములు గానుకల నిచ్చి నిజనివాసముల కనిపెను. మరియు నతండు వినయకేతుని వెదుకఁబంపి అతనిని రప్పించి అతని బుద్ధికిని సుగుణములకు మెచ్చుకొనుచు మరల నతనికి ప్రధానోద్యోగ మిప్పించెను.

దుర్జనులరక్షించుట లోకమున కపకారమని తలంచి యాకోట ద్వారమందు మంటపము గట్టించి దానిమీఁదఁ నద్దముగా దూలములు వైచి విహారభద్రుని దుర్వినీతుని గొలుసులచేఁ దలక్రిందుగా వ్రేలఁగట్టించి చిత్రవధ చేయించెను.

మరియు వారి శరీరముల మేటో మాంసముల నెండగట్టించి యెద్దియో యౌషధి రాచి చిరకాలము దుర్జనులకు బుద్ధి వచ్చునట్లనే యుండ నియమించిరి.

గోపా! నీవు చూచినవాడు విహారభద్రుఁడును దుర్వినీతుఁడునులే! దానఁ బట్టియే "దుర్జనులకు బుద్ధివచ్చు పని" యని దానిపై వ్రాసిరి. ఇదియే దీని వృత్తాంతమని మణిసిద్ధుఁడు చెప్పి సంతోష పారావారంబునం దేలుచున్న గోపకునితో బయలుదేరి తరువాయి మజిలీ చేరెను.

మాలిని. నిరుపమగుణభూషా! నిత్యసంతోషవేషా!
సురగురమునిపూజా! స్తోత్రసంసక్త తేజా!
నరహరిసదవిఖ్యా, నందితాదిత్యముఖ్యా!
స్థిరతరగుణకీర్తీ! దేవతా చక్రవర్తీ!

గద్య. ఇది శ్రీమద్విశ్వనాథ సదనుకంపాసంపాదితకవితా విచి
త్రాత్రేయమునిసుత్రామగోత్రపవిత్రమధిర కులకలశజల
నిధిరాకాకుముదమిత్ర లక్ష్మీనారాయణపౌత్రకొండ
యార్యపుత్రసోమిదేవీ గర్భశుక్తిముక్తాఫల
విబుధజనాభిరక్షిత సుబ్బనదీక్షితకవి
విరచితంబగు కాశీయాత్రాచరిత్ర
మను మహా ప్రబంధంబున
ద్వితీయ భాగము
సమాప్తము
శ్రీ విశ్వనాథార్పణమస్తు.

ముద్రణ: విజయశ్రీ ప్రింటర్స్, విజయవాడ - 3.

